శాస్త్రనిఘంటువులు : తెలుగు

# ఛందః పదకోశము



శాస్త్ర నిఘంటువులు-3
తెలుగు

# ఛందః పదకోశము


సంగ్రాహకుడు
శ్రీ కోవెల సంపత్కుమారాచార్య, భాషాప్రవీణ, ఎం. ఏ.,
లెక్చరర్, తెలుగు శాఖ, ప్రభుత్వ కళాశాల, వరంగల్లు.

పరిష్కర్త
శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి






తెలుగు అకాడమి
హైదరాబాదు
1977

Chandahpadakoosamu-Compiled by Sri K. Sampatkumaracharya, Scrutiniser: Sri Duvvuri Venkataramana Sastri, First Edition, 1977; pp. x+350.



*First Edition*, 1977

*Copies 1,000*

Published by TELUGU AKADEMI, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price Rs. 11-00

PRINTED IN INDIA
Text at Vemkatram Paper Products (P) Ltd., Hyderabad-500 029
Cover at A.P. Govt. Text Book Press, Hyderabad-500 004
Andhra Pradesh.

# ప్రస్తావన

ఇంటర్మీడియట్, డిగ్రీ స్థాయిలలో పాఠ్య, పఠనీయ గ్రంథాలు ప్రచురించడంతో పాటు, సంప్రదింపు గ్రంథాలు, మోనోగ్రాఫ్‌లు, ప్రామాణిక గ్రంథానువాదాలు, శాస్త్రనిఘంటువుల ప్రచురణంకూడా అకాడమీ చేపట్టింది.

వివిధ శాస్త్రాలకు సంబంధించి నిఘంటువులు ప్రచురించే ప్రణాళికలోనే తెలుగులో కూడా కావ్య, నాటక, అలంకార, వ్యాకరణ పరిభాషా పదకోశాలు, ఆయా శాస్త్రాలకు సంబంధించి సమగ్రమైనవి ప్రచురించడానికి నిర్ణయించడం జరిగింది. తెలుగులో శాస్త్ర నిఘంటువులు మూడు వెలువడుతున్నవి. ఛందము, అలంకార, దృశ్య, శ్రవ్య కావ్య, వ్యాకరణ పరిభాషలకు సంబంధించి మూడు సంపుటాలలో ఇవి వెలువడు తున్నవి.

ఛందఃపదకోశం ఇప్పుడు వెలువడుతున్నది. సుమారు వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో ఛందోలాక్షణిక గ్రంథాలు ఎప్పుడెప్పుడు వెలువడి, ఏయే విషయాలు ప్రతిపా దించినవి, మార్గదేశి ఛందాల వివరాలు, ఛందోవిషయికంగా ఆధునిక కాలంలో కవులు చేసిన ప్రయోగాలు, సర్వసమగ్రంగా ఈ గ్రంథంలో సంగ్రాహకులు పొందుపరచడం జరిగింది.

# ప్రవేశిక

తెలుగులో ఛందోగ్రంథము లెన్నో యున్నవికాని, అచ్చయి యీనాడు ప్రచారమున కెక్కినవి కొన్నిమాత్రమే. వాటిలో కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, చిత్రకవి పెద్దన 'లక్షణసార సంగ్రహము', సులక్షణసారము, అప్పకవీయము, కూచిమంచి తిమ్మన 'లక్షణసారసంగ్రహము' రంగరాట్ఛందము ప్రసిద్ధములు. కావ్యాలంకార చూడామణివంటి కొన్ని అచ్చముగా ఛందోగ్రంథములు కాకున్నను, ఛందోవిషయములను ప్రత్యేకముగా వివరించినవి. ఈ గ్రంథములన్నియు కాలక్రమముగా నొకదానికన్న నొకటి ఏవో కొన్ని విశేషాంశములను తెల్పునవి. కొన్ని యంశములలో పరస్పరము విభేదించునవి. కొన్ని సందర్భములలో ఒకే యంశమును భిన్ననామములతో, భిన్నాంశములను కలిపి ఒకే నామములో పేర్కొన్నవి. ఇట్లు పలువిధములుగానున్న ఛందోగ్రంథములందలి అన్ని యంశములును ఈ 'ఛందఃపద కోశము' నందు కూర్చుట జరిగినది. ఛందోగ్రంథములందాయా విషయములలోని ఏకత్వ, భిన్నత్వములు ప్రదర్శితములైనవి. ఇంకను ఆధునికముగా సాగిన ఛందోవిషయ విమర్శల వలన స్పష్టమయిన అంశములుగూడ ఇందు చేర్చుట చూడవచ్చును. ఈ యంశములన్నియు చర్చాసహములే.

ఈ కోశమునకు పైన పేర్కొన్న ఛందోగ్రంథములే ప్రధానములయినవి. అయితే, ముద్రితాముద్రితములైన మరికొన్ని ఛందోగ్రంథములందలి కొన్ని యంశములు, అవశ్యకత ననుసరించి సంస్కృత కర్ణాట చ్ఛందోగ్రంథములందలి కొన్ని యంశములు గ్రహించుట జరిగినది.

వివిధాంశముల లక్షణములు వివరించు పట్ల సామాన్య జిజ్ఞాసువులకును సులభగ్రాహ్యమగునట్లు, సాధ్యమయినంతలో నాతివిస్తరముగా ఆయా అంశములకు సంబంధించిన వివరములు తెలియునట్లు రచించుటలో శాస్త్రీయ సాంకేతిక, వ్యాకరణ నియమముల పాటింపు కచ్చితముగా సర్వత్ర పాటింపబడలేదు. లక్ష్యములు కేవలము లక్షణ గ్రంథములలో చూపబడిన లాక్షణికుల రచనలేకాక, సాధ్యమయినంతవరకు వివిధ కావ్యములనుండి గ్రహించుట జరిగినది. అలభ్యమగు కొన్నిచోట్ల లక్ష్యములు కల్పితములు.

లక్షణ గ్రంథములందు లేకున్నను ఆధునికముగా ప్రసిద్ధములై ప్రచారములో నున్న ముత్యాలసరము, గేయము, వచనపద్యము ఇందుచేర్చుట జరిగినది. అచ్చముగా ఛందస్సుతో మాత్రమే సంబంధము లేకున్నను లక్షణ గ్రంథములందున్నవి. ప్రసిద్ధములైన చిత్ర, బంధ, గర్భకవితలు, ఉదాహరణ కావ్యము గూర్చి ఈగ్రంథమున చేర్చుట జరిగినది. జిజ్ఞాసువులకు కొంత శాస్త్ర పరంపర తెలియుటకు ప్రసిద్ధులయిన ఛందోలాక్షణి

కులను గూర్చి, ఛందోగ్రంథములను గూర్చిన సమాచారము క్లుప్తముగా ప్రసక్తమైనది. ఈ విధముగా కోశమునకు సమగ్రత కల్గించు ప్రయత్నము జరిగినది.

ఛందో విషయముల నొక క్రమ పద్ధతిలో తెలుసుకొనుటకు వీలుగా విషయ విభాగ పూర్వకముగా నీ గ్రంథమున్నను, ఆధునిక నిఘంటువుగా ఉపయోగించునట్లు వివిధాంశములకు సంబంధించిన ఆరోపము లన్నియు గ్రంథాంతమున అక్షరక్రమములో (పుటాక్షరములతో) 'ఛందఃపద సూచి' లో కూర్చబడినవి. ఈ 'కోశము' రెండు విధములుగా ఉపయోగపడవలయునన్న ఉద్దేశ్యముతో ఈ పద్ధతి అనుసరించబడినది.

'కోశ' రచనలో ఉపయుక్త గ్రంథకర్తలకు, వ్యాసకర్తలకు హార్దిక కృతజ్ఞతలు.

ఎంత లోపరహితముగా, సమగ్రముగా రూపొందించుటకు ప్రయత్నించినను ఇందు ఎక్కడో కొన్ని లోపములు, లోపాభాసము లుండకపోవు. సహృదయులు సహృదయత్వముతో వాటిని సూచించి సవరించుకొనుటకు అవకాశము కల్గింపవలెనని కోరుచున్నాము.

# అనుక్రమణిక

# గ్రంథ సంకేత సూచి

| | | |
|---|---|---|
| అ. క. | : అప్పకవీయము | : అప్పకవి |
| అచ్చ. రామా. | : అచ్చతెలుగు రామాయణము | : కూచిమంచి తిమ్మన |
| అనం. ఛం. | : అనంతుని ఛందము | : అనంతుడు |
| అహల్యా. | : అహల్యా సంక్రందనము | : సముఖము వేంకటకృష్ణప్ప |
| ఆం. భా. ఛం. | : ఆంధ్ర మహాభారతము : ఛందఃశిల్పము | : డా॥ పాటిబండ మాధవశర్మ |
| ఆం. శ. చిం. | : ఆంధ్ర శబ్దచింతామణి | : నన్నయ |
| ఆము. | : ఆముక్తమాల్యద | : కృష్ణదేవరాయలు |
| ఉషా. | : ఉషాకల్యాణము | |
| క. క. ర. | : కవికర్ణరసాయనము | : సంకుసాల నృసింహకవి |
| క. జ. | : కవిజనాశ్రయము | : వేములవాడ భీమన |
| కళా. | : కళాపూర్ణోదయము | : పింగళి సూరన |
| కా. చూ. | : కావ్యాలంకార చూడామణి | : విన్నకోట పెద్దన |
| కాశీ. | : కాశీఖండము | : శ్రీనాథుడు |
| కుమా. | : కుమారసంభవము | : నన్నెచోడుడు |
| ఛం. శా. | : ఛందోనుశాసనము | : హేమచంద్రుడు |
| ఛం. హం. | : ఛందోహంసి | : బుర్రా కమలాదేవి |
| ఛం. హం. (మ.మ.) | : ఛందోహంసి (మలుమలయిక) | ,, |
| తె.భా.ఛం.రీ. | : తెలుగుభాషలో ఛందోరీతులు | : రావూరి దొరసామిశర్మ |
| నా. శా. | : నాట్యశాస్త్రము | : (అను.) డా॥ పి. యస్. ఆర్. అప్పారావు |
| నృసిం. | : నృసింహ పురాణము | : ఎఱ్ఱన |
| పల. చరి. | : పలనాటి వీరచరిత్ర | : శ్రీనాథుడు (సంపా.) అక్కిరాజు ఉమాకాన్తమ్ |
| ప్రభా. | : ప్రభావతీ ప్రద్యుమ్నము | : పింగళి సూరన |
| ప్ర.రా.నా.ప్ర. | : ప్రసన్న రాఘవ నాట్యప్రబంధము | : బొడ్డుచెర్ల చినతిమ్మయ |
| పాండు. | : పాండురంగ మాహాత్మ్యము | : తెనాలి రామకృష్ణుడు |
| పారి. | : పారిజాతాపహరణము | : నంది తిమ్మన |

| | | |
|---|---|---|
| పిం. | : పింగళచ్ఛందము | : పింగళుడు |
| భార. | : భారతము | : కవిత్రయము |
| భా. రా | : భాస్కరరామాయణము | : భాస్కరాదులు |
| భాగ. | : భాగవతము | : పోతనాదులు |
| మను. | : మనుచరిత్ర | : అల్లసాని పెద్దన |
| రంగ. ఛంద. | : రంగరాట్ఛందము | : కస్తూరి రంగకవి |
| రాజ. చరి. | : రాజశేఖరచరిత్ర | |
| రా. శే. వి. | : రాజశేఖర విలాసము | : కూచిమంచి తిమ్మన |
| రామా. కల్ప. | : రామాయణ కల్పవృక్షము | : విశ్వనాథ సత్యనారాయణ |
| రావూరి | : రావూరి దొరసామిశర్మ | |
| రుక్మాం. | : రుక్మాంగద చరిత్ర | : ప్రౌఢకవి మల్లన |
| ల. సా. సం. | : లక్షణసార సంగ్రహము | : చిత్రకవి పెద్దన |
| వసు. | : వసుచరిత్ర | : రామరాజభూషణుడు |
| వాశి. రామా. | : వాశిష్టరామాయణము (ద్విపద) | : తరిగొండ వేంకమాంబ |
| విజయ. | : విజయవిలాసము | : చేమకూర వేంకటకవి |
| విక్ర. చరి. | : విక్రమార్క చరిత్ర | : జక్కన |
| శి. రా. మా. | : శివరాత్రి మాహాత్మ్యము | : శ్రీనాథుడు |
| శృం. నైష. | : శృంగార నైషధము | : శ్రీనాథుడు |
| శృం. శాకుం. | : శృంగార శాకుంతలము | : పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు |
| శ్రీకాళ.మాహా. | : శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యము | : ధూర్జటి |
| సాంబ. | : సాంబోపాఖ్యానము | |
| సాంబ. వి. | : సాంబవిలాసము | |
| సారం. చరి. | : సారంగధర చరిత్ర | : చేమకూర వేంకటకవి |
| సుద. పరి. | : సుదక్షిణా పరిణయము | : తెనాలి అన్నయ |
| సులక్ష. | : సులక్షణసారము | : లింగమగుంట తిమ్మన |
| హంస. | : హంసవింశతి | : అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| హర. | : హరవిలాసము | : శ్రీనాథుడు |

# సంకేత వర్ణ సూచి

| | | |
|---|---|---|
| కూ. | : | కూచిమంచి |
| చి. | : | చిత్రకవి |
| చూ. | : | చూడుడు |
| ప. అ. స. వృ. | : | పరస్థానార్థ సమవృత్తములు |
| ప. వి. వృ. | : | పరస్థాన విషమవృత్తములు |
| మొ. | : | మొదలగునవి |
| లిం. | : | లింగమగుంట |
| వి. | : | విన్నకోట |
| స. ప. వి. వృ. | : | సర్వపరస్థాన విషమవృత్తములు |
| స్వ. అ. స. వృ. | : | స్వస్థానార్థ సమవృత్తములు |
| స్వ. వి. వృ. | : | స్వస్థాన విషమవృత్తము |
| సూ. | : | సూత్రము |

# 1

# పరిభాషలు

**లఘువు**

ఏకమాత్రాకాలమునందు ఉచ్చరింపబడు (చూ. మాత్ర) వర్ణమునకు 'లఘువు' అనిపేరు. హ్రస్వములైన అక్షరములు ఏకమాత్రాకాలమున ఉచ్చరింపబడునవి కావున, అవి (హ్రస్వములు) ద్విత్వములుగానున్నను, సంయుక్తములుగానున్నను లఘువులుగానే పరిగణించబడును. ఒకప్పుడు లఘువునకు గురుత్వము పాక్షికముగా కలుగవచ్చును (చూ. గురువు).

లఘువునకు ఛందశ్శాస్త్రమున 'ల' అని సంకేతము. వ్రాతలో ఒక నిలువుగీత (।) లఘువుకు సంకేతము. (కొన్నిచోట్ల ఒక అడ్డగీటును (-) గూడ లఘుసంకేతముగా భావించుట కలదు). ఇది ఉత్తరాది సంప్రదాయము. కిట్టెల్ ఈ అడ్డగీటును గురుచిహ్నముగా భావించినట్లు కన్నడ 'ఛందోంబుధి'లో కన్పించును. తెలుగునాట నిలువుగీతయే లఘుసంకేతముగా ప్రసిద్ధము. 'ల' యన్నచో ఒక లఘువని, 'లా' యని దీర్ఘీకరించినచో రెండు లఘువులని తాత్పర్యము.

**గురువు**

ద్విమాత్రాకాలమున (చూ. మాత్ర) ఉచ్చరింపబడు నక్షరమునకు 'గురువు' అని పేరు. గురువున కిది సామాన్య లక్షణము. ఒకప్పుడు ఒకటిన్నర మాత్రల కాలము, లేదా రెండున్నర మాత్రల కాలము ఉచ్చరించుటకు పట్టు వర్ణ (సముదాయ) మునకును గురువనియే పేరు. 'కమ్' అనుచోట 'క' ఏక మాత్రాకాలికము. 'మ్' అర్ధమాత్రాకాలికము. కాగా 'కమ్' సార్ధమాత్రా కాలికము. ఇట్లే 'తాన్' అనుచోట 'తా' అను దీర్ఘాక్షరము ద్విమాత్రాకాలికము. 'న్' అర్ధమాత్రాకాలికము. కాగా 'తాన్' సార్ధద్విమాత్రాకాలికము. ఈ రెండు విధములును ఛందశ్శాస్త్రమున గురువులనియే వ్యవహరింపబడును. (ఛందశ్శాస్త్రమున కేవల వ్యంజనము-పొల్లక్షరము-నకు, పూర్ణబిందు, విసర్గలకు ప్రత్యేక పరిగణనము లేదు. అక్షరముల లెక్కింపులో వీటిని ప్రత్యేకాక్షరములుగా గణించక తత్పూర్వాక్షర సంబంధి భాగములుగా గణింతురు. త్రిమాత్రాకాలికమైన ప్లుతోచ్చారణమునకును ఛందశ్శాస్త్రమున పరిగణనము లేదు. ప్లుతాక్షరమునకును 'గురు' వ్యవహారమే.) ఈవిధమైన దృష్టితో ఈ క్రిందివిధముగా నున్న అక్షరములు గురువులుగా భావింపబడును.

1. దీర్ఘాక్షరములు :-(శ్రీ), ధీ, ఖా, మా, భూ, మై, గ్లౌ మొ.
2. పూర్ణబిందువుతో గూడిన అక్షరములు :-మంత్రం.
3. పొల్లులతో గూడిన అక్షరములు :-విన్, కన్, సమ్ మొ.
4. సంయుక్తాక్షరమునకు ముందున్న అక్షరములు :-చక్ర, వర్తి, విద్యు, పర్జన్య మొ
5. ద్విత్వాక్షరమునకు ముందున్న అక్షరములు:-విత్తనము, అచ్చెరువు, పొత్తము, వన్నె, అమ్మ మొ.
6. విసర్గతో గూడిన యక్షరములు :-స్వఃకాంత, దుఃఖము మొ.

పై విధములన్నియు 'గురు'వర్ణములు. పూర్ణబింద్వాదులతో కూడిన, ద్విత్వ, సంయుక్తములకన్న ముందున్న హ్రస్వములే గురువులు. దీర్ఘము లెట్లును గురువులే. బింద్వాదులతో కూడుటవలనగాని, సంయుక్త ద్విత్వాదుల ముందు ఉండుటవలనగాని వాటికి కలుగు విశేషము లేదు. గురుత్వము పై స్థితులలో హ్రస్వములకు కలుగుటే విశేషము.

సంయుక్త-ద్విత్వములకు ముందుండు లఘువు గురువగుటనుగూర్చి ఒకటి రెండు విశేషాంశములు గమనించవలసియున్నది.

ఏకపదమందు సంయుక్త ద్విత్వములకు ముందున్న లఘువు సర్వత్ర గురువే యగును. పద్యము. సాంస్కృతిక సిద్ధసమాసమందు పరపదాదియందు ద్విత్వ-సంయుక్తములున్నచో పూర్వపదాంత లఘువు గురువగును. ఉదా: శంఖధ్వానము. సాంస్కృతిక సాధ్యసమాసమందు మిశ్రసమాసమందు పై స్థితిలో పూర్వపదాంత లఘువు పాక్షికముగా గురువగును. ఉదా : యదుపతిస్తవము (సాం. సా. స.). ముదుసలి వ్యాఘ్రము (మి. స.). పై రెండింటిలో పూర్వపదాంత లఘువులు (తి, లి) పాక్షికముగా గురువులు. అనగా వాటిని తేల్చి పల్కి లఘువులుగా, ఊది పలికి గురువులుగా కూడ ప్రయోగించవచ్చును. ఆచ్ఛిక సమాసములందు గురుత్వము కలుగదు (ఇంటిప్రక్కన). అసమాస స్థితిలో ద్విత్వ సంయుక్తములకు ముందున్న పూర్వపదాంత లఘువు గురుత్వమును పొందదు. ఉదా : 'అవసరజ్ఞుండయి వ్యాసుఁడేతెంచి' 'వ్యా' పరము కాగా పూర్వపదాంత మందలి 'యి' గురువు కాలేదు.

సిద్ధసమాసములందును, భిన్నపదస్థితియందును రేఫసంయుక్తము పరమైనచో పూర్వపదాంత లఘువు పాక్షికముగా గురుత్వమందును ఉదా : 'శతతాళదఘ్నహ్రదము'. హ్ర పరము కాగా 'ఘ్న' గురుత్వ మందలేదు. ఈ రేఫకు

సంబంధించిన యంశము సంస్కృతాంధ్రములకు, మిగిలినవి ఒక్క తెలుగుకు మాత్రము సంబంధించినవి.

గురువునకు ఛందశ్శాస్త్రమున 'గ' అని సంకేతము. వ్రాతలో 'అర్థ చంద్రాకారము' (◡) గురువుకు సంకేతము. (కొన్నిచోట్ల 'ఽ' అన్నది సంకేత ముగా భావించుట గలదు. కిట్టెల్ 'ఛందోంబుధి' యందు ఒక అడ్డగీటును (-) గురుచిహ్నముగా భావించినట్లు కన్పించును. తెలుగుదేశమున గురుచిహ్నముగా అర్ధచంద్రాకారమే ప్రసిద్ధము.)

'గ' అన్నచో ఒక గురువని, 'గా' యని దీర్ఘీకరించినచో రెండు గురువులని తాత్పర్యము.

**మాత్ర**

నిమేషాదులవలె 'మాత్ర' యన్నది ఒక కాలమానము. 'నిమేషోన్మే షాభ్యామన్యతరేణ తులితః కాలః మాత్రా' అని ఛందశ్శాస్త్రమున మాత్రాకాల పరిగణనము. (మాత్ర' యనగా రెప్పపాటు కాలమని తాత్పర్యము.) హ్రస్వాక్ష రములన్నియు ఏకమాత్రాకాలికోచ్చారణము గలవి. దీర్ఘములు ద్విమాత్రాకాలి కోచ్చారణము కలవి. పొల్లక్షరములు అర్ధమాత్రాకాలికోచ్చారణము కలవి.

'మాత్ర' యన్నది కాలైకదేశమునకు సంజ్ఞయైనను తత్కాలోచ్చా రణముగల వర్ణమునకును 'మాత్ర' యన్న వ్యవహారమున్నది. నాలుగు మాత్ర లనగా నాలుగు మాత్రల కాలమున ఉచ్చరింపబడు వర్ణసముదాయమని తాత్ప ర్యము. జాత్యుపజాతి పద్యములందు లఘువు కొక మాత్రగా, గురువుకు రెండు మాత్రలుగా లెక్కింపు జరుగును. త్రిమాత్రాగణ మనగా ఒక లఘువు+ఒక గురువు, లేదా ఒక గురువు+ఒక లఘువు, లేదా మూడు లఘువులు అని తాత్ప ర్యము. (కాగా లగ, గల, నగణములు త్రిమాత్రాగణములు. చూ. గణములు.)

**గణములు**

పద్యముల లక్షణములు చెప్పునప్పుడు, ఆయా పాదములందుండ వలసిన గురు లఘువర్ణముల క్రమస్థితిని సులభరీతిలో సూచించుటకు 'గణము'లు రూపొందింపబడినవి. మూడక్షరముల మొత్తమునకు 'గణము' అని పేరు. (గణ మనగా 'గుంపు' అని సామాన్యార్థము. కాని ఛందశ్శాస్త్రమునందు అక్షరముల గుంపునకే గణమని వ్యవహారము. ఆ అక్షరములు కూడా మూడే గుంపుగా నుండవలెను.) ఈ మూడక్షరములలో అన్నియు లఘువులే కావచ్చును లేదా గురువులే కావచ్చును, కాదా గురులఘువుల కలగలుపుగూడ కావచ్చును.

సామాన్యముగా మూడక్షరముల మొత్తమునకే 'గణ' మని పేరయి నను, రెండు, నాల్గు, అయిదు, ఆరక్షరముల మొత్తములకుగూడ గణమను వ్యవ హారము ఛందశ్శాస్త్రమందున్నది.

ప్రధానముగా నీ గణములు రెండు వర్గములుగా విభజింపబడినవి.

i. అక్షరగణములు; ii. మాత్రాగణములు.

ఈ గణముల పద్ధతిని మొదట సంస్కృత ఛందశ్శాస్త్రమున రూపొందింపబడినది. పింగళుడు ఈ పద్ధతిని రూపొందించినాడు. అయితే, ఈయన రూపొందించిన పద్ధతికి భిన్నముగా తరువాతి లాక్షణికులు జనాశ్రయి కర్త మొదలగు కొందరు గణములను రూపొందించినారు. కాని పింగళుడు నిరూపించిన రీతియే సులభము, సుప్రసిద్ధము. సర్వత్ర అదే పద్ధతి పాటించబడుచున్నది.

### అక్షరగణములు

గణమందలి యక్షరముల గురు లఘుత్వములను ప్రధానీకరించి రూపొందింపబడినవి. 'అక్షరగణములు' (చూ. గణములు). అక్షరగణములలో మూడక్షరముల గణములే ప్రధానములు. అయితే, రెండక్షరములు గలవిగూడ కొన్ని యున్నవి. ఆ గణములు, వాటియందుండవలసిన గురు లఘుక్రమము, వాటి పేర్లు ఈ క్రిందివిధముగా నున్నవి.

| పేరు | గురు లఘుక్రమము | ఉదాహరణము |
|---|---|---|
| 1. మ గణము | గ+గ+గ (U U U) | శ్రీనాథా |
| 2. భ గణము | గ+ల+ల (U I I) | విష్ణుఁడు |
| 3. జ గణము | ల+గ+ల (I U I) | మురారి |
| 4. స గణము | ల+ల+గ (I I U) | వరదా |
| 5. య గణము | ల+గ+గ (I U U) | ముకుందా |
| 6. ర గణము | గ+ల+గ (U I U) | మాధవా |
| 7. త గణము | గ+గ+ల (U U I) | వైకుంఠ |
| 8. న గణము | ల+ల+ల (I I I) | విభుఁడు |

-ఇవి మూడక్షర గణములు (8).

| | | |
|---|---|---|
| 1. గగము | గ+గ (U U) | కృష్ణా |
| 2. హ గణము (గలము) | గ+ల (U I) | శౌరి |
| 3. వ గణము (లగము) | ల+గ (I U) | హరీ |
| 4. లలము | ల+ల (I I) | హరి |

-ఇవి రెండక్షరముల గణములు (4).

మూడు గురువులను ప్రస్తరించగా ఏర్పడిన 8 విధములు త్రివర్ణాత్మక గణములైనవి. వాటి గుర్తింపునకు 'మ', 'భ' ఇత్యాది వర్ణములు సంకేతింపబడినవి. గణ సంకేతవర్ణముల దీర్ఘీకరించినచో రెండు గణములని భావింపవలెను. మా=2 మ గణములు, నా=2 న గణములు మొ.

## మాత్రాగణములు

గణమందుండు నక్షరముల సంఖ్యకు ప్రాధాన్యములేకుండ రూపొందినవి 'మాత్రాగణములు'. ఈ గణములందు మాత్రాసంఖ్యయు భేదించుచుండును. రెండు మొదలుకొని అయిదువరకు ఈ గణములం దక్షరములుండును. అట్లే మూడు మొదలుకొని ఎనిమిదివరకు మాత్రలుండును.

ఈ మాత్రాగణములు రెండు వర్గములుగా విభజింపబడినవి.

i. మాత్రాగణములు, ii. మాత్రాసంఖ్యాగణములు.

మాత్రాగణములందుండవలసిన యక్షరముల (గురులఘుత్వములను) బట్టి క్రమస్థితి నిర్దేశింపబడినది. ఈ నిర్దేశము ననుసరించి మాత్రాగణములు మరల మూడు వర్గములుగా విభజింపబడినవి.

i. సూర్యగణములు
ii. ఇంద్రగణములు
iii. చంద్రగణములు.

(వీటి స్వరూపములకు చూ. సూర్యగణములు; ఇంద్రగణములు; చంద్రగణములు.)

గణములందుండవలసిన మాత్రాసంఖ్యనుబట్టి రూపొందినవి మాత్రాసంఖ్యాగణములు. మాత్రాసంఖ్యాసూచనతో నా గణములు పేర్కొనబడును. త్రిమాత్రాగణములనగా మూడుమాత్రలుగల గణములని, చతుర్మాత్రాగణములనగా నాల్గుమాత్రలుగల గణములని యర్థము. ఇట్లే మాత్రాసంఖ్యతో నివి సూచింపబడును. నగణము, గలము, లగము అను మూడును త్రిమాత్రా గణములే. (లఘువున కొక మాత్రగా, గురువునకు రెండుమాత్రలుగా లెక్కించుట ఛందస్సంప్రదాయము.) ఇట్లే మిగిలినవి గమనించవలెను.

## సూర్యగణములు

సూర్యగణములు మాత్రాగణములు. (చూ. మాత్రాగణములు.) ఇవి మొత్తము నాల్గు. మూడు నాల్గుమాత్రలుగల గణములు వీటిలో నున్నవి. ఆ నాల్గుగణము లివి :

| పేరు | గురు లఘుక్రమము | ఉదాహరణము |
|---|---|---|
| i. గగము | U U | కాంతా |
| ii. సగణము | I I U | నవలా |
| iii. గలము | U I | ఇంతి |
| iv. నగణము | I I I | మగువ |

ఈ నాల్గింటిని 'సూర్య'గణములని భీమన, వి. పెద్దనలు చెప్పినారు. కాని అనంతుడు పై నాల్గింటిలో మొదటి రెండింటిని (గగ, సగణములను) వదిలి మిగిలిన రెండింటి (గల; నగణముల) నే 'సూర్య'గణములుగా నిర్ధారించినాడు. తరువాతి లాక్షణికులు అతనినే అనుసరించినారు. ప్రస్తుతము అనంతుని మతమే వ్యవహారమున నున్నది.

అనంతాదుల పద్ధతిలో పై నాల్గింటియందు సూర్యగణములైన గల; నగణములను మాత్రమే ఉద్దేశించినపుడు భీమన, వి. పెద్దనలు ఈ రెండింటిలోనే యొకదానినో, లేక రెండింటిని కలిపియో (సందర్భము ననుసరించి) పేర్కొన్నారు. నాల్గింటిని ఉద్దేశించినపుడు మాత్రమే 'సూర్యగణము' లన్నారు. మరియు ఈ తను మతమందలి సూర్యగణములను (నాల్గింటిని) అక్కరజాతి పద్యములలోనే ఉపయోగింపవగినవిగా భావించినారు. (చూ. అక్కరజాతి పద్యములు.) మిగిలిన పద్యములలో గల, నగణములనే చెప్పినారు. అనంతాదులు మాత్రము అన్నివిధములైన తెలుగు జాత్యుపజాతి పద్యములలో గల, నగణము లను మాత్రమే ఉపయోగించవలయునని భావించినారు.

భీమనాదుల దృష్ట్యా సూర్యగణములు సమమాత్రాసంఖ్య కలవికావు. (గగ, సగణములు నాల్గుమాత్రల గణములు; గల, నగణములు మూడుమాత్రల గణములు.). అనంతాదుల దృష్ట్యా సమమాత్రాసంఖ్యాగణములు.

రెండు గురువులను ప్రస్తరించగా (చూ. ప్రస్తారము), ఏర్పడిన నాల్గు గణములలో లఘ్వాది గణములముందు అదనముగా ఒక లఘువు చేర్చగా పైన చూపబడిన నాల్గుగణములు రూపొందినవి.

ఈ సూర్యగణములు తెలుగులోని జాత్యుపజాతులకే ఉపయోగించును.

ఈ గణములను చెప్పవలసినప్పుడు ఒక్క 'సూర్య' పదమునే గాక సూర్యపర్యాయ వాచకపదములనుగూడ లాక్షణికు లుపయోగించినారు.

ఈ సూర్యగణములను కన్నడ లాక్షణికులు 'బ్రహ్మ'గణములన్నారు. భీమనాదుల మతము 'బ్రహ్మ' గణముల ననుసరించినది. బ్రహ్మగణములు నాల్గే కాని రెండుకావు.

## ఇంద్రగణములు

ఇంద్రగణములు మాత్రాగణములు (చూ. మాత్రాగణములు.) ఇవి మొత్తమెనిమిది. వీటిలో నాల్గు, ఐదు, ఆరు మాత్రలుగల గణములున్నవి. ఆ యెనిమిది యివి.

| పేరు | గురు లఘు క్రమము | ఉదాహరణము |
|---|---|---|
| i. మగణము | U U U | శ్రీనాథా |
| ii. సగము | I I U U | వరదాతా |
| iii. రగణము | U I U | మాధవా |
| iv. నగము | I I I U | నరహరీ |
| v. తగణము | U U I | వైకుంఠ |
| vi. సలము | I I U I | నరసింహ |
| vii. భగణము | U I I | విష్ణుఁడు |
| viii. నలము | I I I I | నరహరి |

(సగము అనగా సగణము గురువు అని భావము. ఇట్లే మిగిలినచోట్ల గమనించవలెను.)

ఈ ఎనిమిదింటిని 'ఇంద్రగణము'లని భీమన, వి. పెద్దనలు పేర్కొన్నారు. కాని అనంతుడు వీటిలో మొదటి రెండింటిని (మగణ, సగ) వదలి మిగిలిన ఆరింటినే 'ఇంద్రగణము'లని నిర్ధారించినాడు. తరువాతి లాక్షణికులు ఆతనినే అనుసరించినారు. ప్రస్తుతము అనంతాదుల మతమే వ్యవహారమున నున్నది.

అనంతాదుల పద్ధతిలో పై ఎనిమిదింటియందు ఇంద్రగణములైన చివరి ఆరింటిని మాత్రమే ఉద్దేశించినపుడు భీమన, వి. పెద్దనలు వాటిని 'నల నామక' గణములని పేర్కొన్నారు. ఎనిమిదింటిని ఉద్దేశించినప్పుడుమాత్రమే ఇంద్రగణములని పేర్కొన్నారు. భీమన, పెద్దనలు ఇంద్రగణము లెనిమిదింటిని అక్కరజాతి పద్యములలో నుపయోగింపదగినవిగా భావించినారు. (చూ. అక్కర జాతి పద్యములు.) అనంతాదులు అన్నివిధములైన తెలుగు జాత్యుపజాతి పద్యములలో తమ మతములోని ఇంద్రగణములారింటినే ఉపయోగింపదగినవాటినిగా భావించినారు.

భీమనాదులదృష్ట్యా ఇంద్రగణములలో నాలుగు, ఐదు, ఆరుమాత్రల గణములుండగా (మ-సగ ఆరుమాత్రలవి; ర-నగ-త-సల-ములు ఐదుమాత్రలవి; భ-నల-ములు నాలుగుమాత్రలవి), అనంతాదులదృష్ట్యా అయిదు, నాలుగు మాత్రల గణములే యుండును.

మూడు గురువులను ప్రస్తరించగా (చూ. ప్రస్తారము) ఏర్పడు నెనిమిది గణములలో లఘ్వాదిగణములముందు అదనముగా నొక లఘువును చేర్పగా పైన చూపబడిన ఎనిమిది గణములు రూపొందినవి.

ఈ ఇంద్రగణములు తెలుగులోని జాత్యుపజాతులకే ఉపయోగించును.

ఈ గణములను చెప్పవలసినప్పుడు ఒక్క 'ఇంద్ర' పదమునే గాక, ఇంద్ర పర్యాయవాచకపదములనుగూడ లాక్షణికు లుపయోగించినారు.

ఈ ఇంద్రగణములను కన్నడ లాక్షణికులు 'విష్ణు' గణములన్నారు. భీమనాదుల మతము 'విష్ణు' గణముల ననుసరించినది. విష్ణుగణము లెనిమిదే గాని ఆరు కావు.

### చంద్రగణములు

చంద్రగణములు మాత్రాగణములు. (చూ. మాత్రాగణములు.) ఇవి మొత్తము పదునారు. వీటిలో ఐదు ఆరు, ఏడు మాత్రలుగల గణములున్నవి. ఆ పదునారు గణము లివి :

| | పేరు | గురు లఘు క్రమము | ఉదాహరణము |
|---|---|---|---|
| i. | మగము | U U U U | సత్యానాథా |
| ii. | సగగము | \| \| U U U | అసురారాతీ |
| iii. | రగము | U \| U U | దేవరాజా |
| iv. | నగగము | \| \| \| U U | కమలనాథా |
| v. | తగము | U U \| U | పద్మాపతీ |
| vi. | సలగము | \| \| U \| U | భువనేశ్వరా |
| vii. | భగురువు | U \| \| U | భద్రయశా |
| viii. | నలగము | \| \| \| \| U | గజవరదా |
| ix. | మలఘువు | U U U \| | అంభోజాక్ష |
| x. | సగలము | \| \| U U \| | అఘువిద్వేషి |
| xi. | రలము | U \| U \| | కైటభారి |
| xii. | నగలము | \| \| \| U \| | కమఠరూప |
| xiii. | తలము | U U \| \| | పీతాంబర |
| xiv. | సలలము | \| \| U \| \| | అసురాంతక |
| xv. | భలము | U \| \| \| | అద్రిధర |
| xvi. | నలలము | \| \| \| \| \| | అహిశయన |

(మగము అనగా మగణము+గురువు అని భావము. ఇట్లే మిగిలినవానిని గమనించవలెను.

ఈ పదునారింటిని 'చంద్రగణము'లని భీమన, వి. పెద్దనలు చెప్పినారు. కాని అనంతుడు వీటిలో మొదటి రెంటిని (మగ, సగ-ములను) వదిలి మిగిలిన పదునాల్గింటినే 'చంద్రగణము'లని నిర్ధారించినాడు. తరువాతి లాక్షణికులు అతని మతమునే అనుసరించినారు. ప్రస్తుతము అనంతాదుల మతమే వ్యవహారమున నున్నది.

అనంతాదుల పద్ధతిలో పై పదునారింటియందు చంద్రగణములైన పదునాల్గింటిని మాత్రమే ఉద్దేశించి చెప్పవలసిన యవసరము భీమనాదులకు లేక

పోయినది. సూర్యేంద్ర గణములనుగూడ వారు అక్కరజాతి పద్యములకే ఉపయోగ పడునవిగా భావించినారు. (చూ. సూర్యగణములు; ఇంద్రగణములు; అక్కరజాతి పద్యములు.) తెలుగులో అక్కరజాతి పద్యములందు తప్ప ఇతర జాత్యుపజాతులయందు చంద్రగణముల కుపయోగము లేదు. కావున అనంతాదుల పద్ధతిలోని పదునాల్గు గణములను పేర్కొనునవసరము వారికి లేకపోయినది. అనంతాదులు సూర్య (4 గణములు) ఇంద్ర (8 గణములు) గణములలో మొదటి రెండింటిని వదిలినట్లే చంద్రగణములందును వదిలినారు. అయితే వారి చంద్ర గణములకును అక్కర జాతీతరములైన జాత్యుపజాతులలో నుపయోగములేదు.

భీమనాదుల దృష్ట్యా ఇంద్రగణములలో 5, 6, 7, 8 మాత్రల గణములు ఉండగా (భల-నలల=5 మాత్రలవి; రల-తల-భగురు-సలల-నలగ-నగల-ములు=6 మాత్రలవి; నగగ-మలఘు-సలగ-తగ-రగ-సగల-ములు=7 మాత్రలవి; మగ-సగగ-ములు=8 మాత్రలవి). అనంతాదుల దృష్ట్యా 5, 6, 7 మాత్రల గణములే యుండును.

నాలుగు గురువులను ప్రస్తరించగా (చూ. ప్రస్తారము) ఏర్పడు పదునారు గణములలో లఘ్వాదిగణముల ముందు అదనముగా నొక లఘువును చేర్చగా పైన చూపబడిన పదునారు గణములు రూపొందును.

ఈ గణములను చెప్పవలసినప్పుడు 'చంద్ర' పదమునేగాక, చంద్ర పర్యాయవాచక పదములనుగూడ లాక్షణికులు ఉపయోగించినారు.

ఈ చంద్రగణములను కన్నడ లాక్షణికులు 'రుద్ర' గణము లన్నారు. భీమనాదుల మతము 'రుద్ర' గణముల ననుసరించినది. రుద్రగణములు పదునారే గాని పదునాల్గు కావు.

## పాదము

కొన్ని అక్షరములచేత, లేదా అక్షరగణములచేతగాని, కొన్ని మాత్రల, లేదా మాత్రాగణములచేతగాని నియతమైన ఒక పంక్తికి ఛందశ్శాస్త్రమున 'పాద'మని వ్యవహారము. ఉదాహరణకు :

'ఇందూ నందుని మందనుండి గద నీ వేతెంచుటల్ రాకలన్'.

ఇదియొక పాదము. (శార్దూల విక్రీడిత పద్యమునకు చెందినదిది.) పందొమ్మిది యక్షరములు లేదా ఆరు గణములు+1 అక్షరము దీని అక్షర, లేదా అక్షరగణ సంఖ్యానియతి. (చూ. అక్షరగణములు; శార్దూల విక్రీడితము)

'సుతుల విద్యాప్రవీణతఁ జూచువేడ్క'.

ఇదియొక పాదము. (తేటగీతి పద్యమునకు చెందినదిది). అయిదు మాత్రాగణములు దీని మాత్రాగణనియతి. (చూ. మాత్రాగణములు; తేటగీతి.)

వివిధ పద్యములందు గణాదుల సంఖ్యానియతి పాదములకు భేదించును,

'పాదః చతుర్థభాగః' (పిం. సూ. 410) పద్యమున నాల్గు పాదము లుండుట నియత మనుకొనుటవలన పాదము నాల్గవ భాగమైనది. 'పాదోఽక్షర మాత్రా నియమోదితః పిండః' (ఛం. శా. 1-25) అని జయకీర్తి చెప్పిన లక్షణము సరిగా కన్పించును.

## పద్యము

నాల్గు పాదముల మొత్తము పద్యమని ఛందశ్శాస్త్రమున వ్యవహరింపబడును. (చూ. పాదము.) కాగా పద్యమందు నాల్గు పాదములుండుట నియతము. 'పాద'మన్న పదమునకు నాల్గవ భాగమని యర్థమున్నది. పద్యమందు నాల్గు పాదములుండును గావున 'పాద'మునకా అర్థము వచ్చియుండును. లేక 'పాద'మునకు సహజముగనే ఆ యర్థమున్నదనుకొన్నచో, నాల్గుభాగము లున్నప్పుడే పూర్ణత్వ మేర్పడునను భావముతో, పద్యమునందు నాల్గు పాదము లుండవలయునన్న నియమ మేర్పడి యుండవచ్చును. ఏదెట్లయినను పద్యము నాల్గుపాదముల సమాహారమగుట నియతము.

అయితే తెలుగునందు పాదసంఖ్యతో నిమిత్తము లేకుండ ద్విపద, త్రిపద, షట్పదాదులందును 'పద్య'మన్న వ్యవహారమున్నది. ఆ యా పద్యమందు పాదసంఖ్య నాల్గుకన్న తక్కువగానో, ఎక్కువగానో ఉన్నట్లు ఆయా పద్యముల పేర్లే చెప్పుచున్నవి. నాల్గు పాదములున్నదే పద్యమను దృష్టితో ద్విపదాదులు పద్యములు కాకపోవుచున్నవి. కాగా, 'పాదబద్ధమైనది పద్యము' అని చెప్పినచో అన్నివిధములయిన పద్యములు సమీకరింపబడుటకు వీలయిన లక్షణమగును.

పద్యమునకు సంస్కృతమున 'శ్లోక' మనియు వ్యవహారము కలదు. (చూ. శ్లోకము.) తెలుగున నిట్టి వ్యవహారములేదు.

పద్యములు మూడు విధములు: i. వృత్తములు, ii. జాతులు, iii. ఉపజాతులు. (చూ. వృత్తము. మొ.)

## గద్యము

పాదవిభాగముగాని, గణనియమముగాని లేని పదముల సముదాయము గద్యము. ఓజోగుణము, సమాసభూయస్త్వము గద్యమునకు ప్రధానమని దండి చెప్పినాడు, ఈ గద్యమును మూడు విధములుగా సంస్కృతాలంకారికులు పేర్కొన్నారు.

i. వృత్తగంధి :—వివిధ పద్యముల పాదభాగములతో కూడి యున్నది వృత్తగంధి గద్యము.

ii. చూర్ణము :—అల్పసమాసములతో, లలితపదములతో కూర్పబడినది చూర్ణగద్యము.

iii. ఉత్కలికాప్రాయము :—దీర్ఘ సమాసములతో, ఉద్ధతపదములతో కూర్చబడినది ఉత్కలికాప్రాయ గద్యము.

కొందరు లాక్షణికులు ప్రధానమైన ఈ మూడు భేదముల నాశ్రయించుకొని ముక్తకము, చిత్రము, ఖండము మొదలగు మరికొన్ని విభాగములు పేర్కొన్నారు. 'పద్యగంధి' 'జాతిగంధి' యను భేదములను 'వృత్తగంధి'తో బాటు భోజుడు పేర్కొన్నాడు.

తెలుగు లాక్షణికు లిన్ని విభాగములు చేయలేదు. పాదరహితమైనది గద్యమని మాత్రము చెప్పినారు. దండకముగూడ తెలుగున పాదరహితముగానే మిక్కిలి ప్రచారమున నున్నది. (వివరములకు చూ. దండకములు.) అందువలన గణనియమము లేనిదనియు చెప్పవలసియుండును.

తెలుగు కావ్యములందు గద్యము 'వచన' మనబడునన్నారు, కాని తెలుగుకావ్యములలో ఆశ్వాసాంతములందున్నవి 'గద్య ల'ని, మిగిలినవి 'వచనము' లని ప్రసిద్ధి. 'వాక్యబంధురము' వచనమని జయకీర్తి ఛందోఽనుశాసనమున చెప్పినాడు.

## వచనములు

'గద్యము'నే తెలుగు కావ్యములందు 'వచనము' లందురని అనంతుడు చెప్పినాడు. 'వాక్యబంధురము వచన'మని జయకీర్తి అన్నాడు. (చూ. గద్యము). తెలుగు కావ్యములందు ఆశ్వాసాంతములలో సమాసభూయిష్ఠముగల భాగములను గద్యములని, మిగిలిన 'అపాదపదవిన్యాసము'గల భాగములను 'వచనము' లనుట ప్రసిద్ధము. కాగా పద్యములందలి పదముల కూర్పురీతి, దీర్ఘ సమాసత్వము గద్యములకు లక్షణముగా, సామాన్యరీతిలో వాక్యవిన్యాసము వచన లక్షణముగా భావించవచ్చును.

తెలుగులో 'వచనములు' అను నొక రచనవిభాగ మున్నది. సింహగిరి వచనములు, వేంకటేశ్వర వచనములు మొదలగునవి ఇట్టివాటిలో ప్రసిద్ధములు. ఇవి శతకపద్యధోరణిలో వచనఖండములుగా కూర్చబడును. శతకమందలి యొక పద్యము 'వచనము'లందలి యొక వచనము సమానము.

ఇట్టి 'వచనముల'ను గూర్చి లాక్షణికులు కావ్యభేదములందు చెప్పినట్లు కానరాదు. ఛందస్సుకు వీటితో నేరుగా సంబంధము కన్పించదు. అయినను ఇట్టి రచనలుండుటచే వీటినిగూర్చి ప్రస్తావించుట జరిగినది,

# 2

# యతి - ప్రాసలు

**యతి**

'యతి' యనునది ఛందశ్శాస్త్రమున నొక పారిభాషిక పదము. దీనికి విచ్ఛేదమని యర్థము. విచ్ఛేదమనగా ఏ పదమున కాపదము విడిపోవుట యని తాత్పర్యము. పద్యపాదమునందు యతి స్థానము చెప్పబడును. ఈ యతి స్థానములు భిన్న పద్యములకు భిన్న భిన్నముగా నుండును. ఆ చెప్పబడిన స్థానము లోని అక్షరముతో పదము పూర్తిఅయి, ఉత్తరాక్షరముతో మరొక పదము ప్రారంభము కావలయును. ఉదాహరణమునకు :

'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో - వక్షోముఖాంగేషుయే'

అనునది శార్దూల విక్రీడిత పద్యపాదము. ఈ పద్యమునకు 12 వ అక్షరము యతి చెప్పబడినది. (చూ. శార్దూల విక్రీడితము.) కాగా 12 వ అక్షరముతో పూర్వ పదము పూర్తిఅయి, 13 వ అక్షరముతో ఉత్తరపదము ప్రారంభము కావలెను. పై పాదమునందీ యంశము గమనించవచ్చును.

అన్ని పద్యములకు పాదాంతమందు యతి నియతము. అనగా పాదాంతముతో పదముగూడ పూర్తి కావలెను. ఒకే పదము కొంతభాగము ఒక పాద మున, మరికొంత భాగము మరొక పాదమున వ్యాపించి యుండరాదు. కొన్ని పద్యములకు పాద మధ్యమందు ఒకటికి మించి యతి స్థానములు చెప్పబడును. (ఉదా॥ చూ. స్రగ్ధర.) ఎన్ని యతి స్థానములు చెప్పబడినవో అన్నిచోట్ల పద విచ్ఛేదము జరుగవలెను. పాదాంత యతి సర్వపద్య సామాన్యముగాన, పద్య లక్షణము చెప్పునపుడు పాదాంత యతి చెప్పబడదు. పాద మధ్య యతిస్థానములే చెప్పబడును. ఈ విచ్ఛేదరూప 'యతి' సంస్కృత చ్ఛందస్సుకు సంబంధించినది.

విరతి, విశ్రాంతి, విశ్రమ, విశ్రామ, విరామ, విరమ, విరమణము లన్నవి 'యతి'కి పర్యాయపదములు.

తెలుగు ఛందశ్శాస్త్రమందలి 'యతి' స్వరూపము పై జెప్పిన సంస్కృతచ్ఛందస్సులోని 'యతి' స్వరూపముకన్న భిన్నమైనది. తెలుగు 'యతి' పదవిచ్ఛేదరూపముకాదు. పాదమందు యతి నిర్దేశింపబడిన స్థానమున, ఆ పాదముయొక్క మొదటనున్న అజ్విశిష్టవ్యంజనాక్షరము, లేదా దానితో

'మైత్రి' గల యక్షరము మరల నుపయోగింపబడవలయును. ఇట్లు 'మరల నుపయోగింపబడుట'ను 'యతిచెల్లుట' అని వ్యవహరింతురు. ఉదా:

'నలదమయంతు లిద్దఱు మ-నఃప్రభవానలదహ్యమానులై ...'

ఇది 'చంపకమాలా' పద్యపాదము. ఈ పద్యమునకు పదింట యతి చెప్పబడినది. (చూ. చంపకమాల.) కాగా 11 వ అక్షరము యతి చెల్లవలెను. పై పాదమున పాదాదియందున్న 'న' తిరిగి 11వ అక్షరముగా ప్రయోగింపబడినది. సంస్కృత యతి పద్ధతి ననుసరించి 10 వ అక్షరముతో పదము పూర్తిఅయి, 11 వ అక్షరముతో మరొక పదము ప్రారంభము కావలసియుండగా, తెలుగు యతి ననుసరించి పాదాదియందలి అజ్ఝ్విశిష్టాక్షరము ప్రయుక్తమైనది. పదవిచ్ఛేదము జరుగ లేదు. అయితే పదవిచ్ఛేదము కాగూడదని తెలుగున నియమ మేదియు లేదు. ఉదా:

'కడిదివరంబువారిరుహ-గర్భుని చేఁగొనినాఁడు వాఁడు మీ'...

ఇందు పదచ్ఛేదముకూడ జరిగినది. అయితే పాదమధ్య, పాదాంతములయందును యతి స్థానములలో పదవిచ్ఛేదము తెలుగునందు ఐచ్ఛికమే. కాగా సంస్కృత యతిని 'విచ్ఛేదరూపయతి' అని, తెలుగు యతిని 'సరూపాక్షర యతి' యని సామాన్యముగా వ్యవహరింతురు. తెలుగున యతి యనగా సరూపాక్షర యతి యనియే తాత్పర్యము. పాదాద్యక్షరమునకు సరూపము యతిస్థానమున చెల్లింపబడునుగాన తెలుగు యతి సరూపాక్షర యతి యైనది. తెలుగున సర్వత్ర యతి యనగా సరూపాక్షరమనియే తాత్పర్యము. తెలుగున రచింపబడు సర్వపద్యములందును యతి తెలుగుపద్ధతిలోనే చెల్లింపబడును. మరియు తెలుగున ఈ విధమైన యతి నియమములేని పద్యము లేదనవచ్చును. (వృత్తములందు మాత్రము 9 వ చ్ఛందమువరకు పద్యములకు తెలుగున యతినియమము చెప్పబడలేదు. సంస్కృతమందును చెప్పబడలేదు. 10 వ ఛందమునుండియే యతినియమము. కాగా యతివిషయమున 9 వ ఛందమువరకున్న పద్యము లపవాదములు. కాని తెలుగు లాక్షణికులు 'విద్యున్మాల' వంటి పద్యము లొకటి రెండింట యతి చెప్పుట విశేషము.) ప్రాచీన లాక్షణికులు జాతిపద్యములకు కొన్నింటికి యతి నిర్దేశింపకున్నను తరువాతివారు నిర్దేశించినారు.

సంస్కృత చ్ఛందస్సులోని 'యతి' పర్యాయపదములన్నియు తెలుగు ఛందస్సునందును 'యతి'కి పర్యాయపదములే. అయితే తెలుగు ఛందస్సులో 'యతి' కున్న యర్థమే ఈ పర్యాయపదము లన్నింటికి నర్థము. ఇవిగాక 'వడి' యన్న తెలుగు పదముకూడ మరొక 'యతి' పర్యాయపదము. (చూ. వడి.)

## వడి

తెలుగు ఛందస్సులో 'యతి'కి పర్యాయపదముగా 'వడి' యను పదము ఉపయోగింపబడుచున్నది. పాదాద్యక్షరము 'వడి' యని — అనగా వడి

యను పేరు పాదాద్యక్షరమునకు చెల్లునని — తెలుగు లాక్షణికు లందరును చెప్పినారు. పాద్యమధ్యము (ల) యందు పాదాద్యక్షరమును (అజ్విశిష్టముగా) తిరిగి ఉపయోగించుటను 'వడి చెల్లించుట' యని వ్యవహరింతురు. (విశేషము లకు చూ. యతి.)

భీమన, వి. పెద్దనల దృష్ట్యా 'వడి' 'యతి' పదములు భిన్నార్థకము లుగా కన్పించును. పాదాద్యక్షరము 'వడి' యని, పాదమధ్యమందు నియత స్థానమున ప్రయుక్తమైన వడి 'యతి' యని వారు భావించినట్లు కన్పించును. కాని, పాదాద్యక్షరమును పాదమధ్యమున తిరిగి ఉపయోగించుట యన్నది లేక పోయినచో పాదాద్యక్షరమునకు (వడియని) యొక పేరు ప్రత్యేకము నుండ నక్కరలేదు. పాదమధ్యమున చెల్లింపబడుదానికిని అదే పేరున్నప్పుడు మొదటి యక్షరమునకు పేరు పెట్టుటలో ప్రయోజన ముండును. అందువలన తరువాతి లాక్షణికులు యతి-వడి యనునవి భిన్నార్థములనికాక, పర్యాయపదములేయని భావించి, ఆ రెండు పదములను స్వేచ్ఛగా ప్రయోగించినట్లు కన్పించును. సంస్కృత చ్ఛందస్సులో పాదాద్యక్షరమునకు ప్రత్యేకముగా పేరులేదు. ఉండ నవసరముకూడలేదు. కాని తెలుగు ఛందస్సులో పాదాద్యక్షరము (అజ్విశిష్టముగా) పాదమధ్యమున 'చెల్లింప'బడును గాన, పాదాద్యక్షరమున కొక పేరు పెట్టవలసిన యవసరము కలిగినది. వడియని పేరు పెట్టబడినది. అది పాదమధ్యమున తిరిగి ఉపయోగింపబడునుగాన వడి చెల్లింపు అయినది. చెల్లింపబడినదియు పాదాద్య క్షరమే కాన, చెల్లింపబడినదియు 'వడి'యే.

తెలుగు ఛందస్సులో చెప్పబడిన యర్థమిట్లుండగా, 'వడి' యన్న పదమున కర్థమేమిటన్నదానిపై భిన్నాభిప్రాయములు విమర్శకులు వెలువరించి నారు. 'వడు' అను తమిళపదమునకు 'మార్గ'మని అర్థము. పద్యపాదము యతి స్థానము ననుసరించి పూర్వోత్తరార్థములుకాగా, ఉత్తరార్థమునకు తత్పాదాద్య క్షరము దారిచూపుచు తిరిగి ప్రయుక్తము కావటమువలన దానికి 'వడి' యను పేరు వచ్చినదని శ్రీ గిడుగు సీతాపతిగారు అభిప్రాయపడినారు. (చూ. తెలుగులో ఛందోరీతులు. పు. 315) కాని లాక్షణికులందరు పాదప్రథమాద్యక్షరమునకే వడి యని పేరుపెట్టినారన్నది ఇక్కడ గమనించవలసిన యంశము. ఇక 'అను ప్రాసము' అను సంస్కృతశబ్దమునకు 'వళియెదుగై' అని తమిళమునఁ బేరు గలదు. ('అనుప్రాసమెన్నుమ్ వడమొళియై వళియెదుగై ఎన్బదు తమిళ్ పటుక్కు' యప్పరుంగలక్కారిక.) ఈ వళి (ళి) ఎదుగై శబ్దములోని 'వళి'నే తెలుగువారు గ్రహించియుందురేమో' అని శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు అభిప్రాయపడినారు ('తెలుగు భాషలో ఛందోరీతులు' పు. 219.) తమిళమున ఆద్యక్షరమైత్రిని చెప్పు 'మోనై' పదము సిద్ధముగా నుండగా అనుప్రాసార్థక మైన 'వళియెదుగై నుండి వడిని తెలుగువారు స్వీకరించినారన్నది విచార్యమే.

'వడి' యను పదమునకు 'అక్షర'మను నర్థములో తెలుగున కొన్ని సందర్భములందు వ్యవహారము కన్పించును. క్యావడి, క్రావడి ఇత్యాదులందలి 'వడి' అక్షరమను నర్థము కలది. క్యావడి యనగా యకారమని, క్రావడి యనగా రేఫాక్షరమని అర్థము. ఈ వడిని తెలుగు లాక్షణికులు పాదాద్యక్షరమునకు పేరుగా నిర్ణయించినారు. పాదమధ్యమున సంస్కృత లాక్షణికులు నిర్ణయించిన యతిస్థానములనే సామాన్యముగా తెలుగులాక్షణికులును గ్రహించినారు. తెలుగు పద్ధతిలో సరూపాక్షర మా నిర్ణీతస్థానములందే చెల్లుటచే వడి, యతి చెల్లుట యైనది. అనగా పాదాద్యక్షరము పాదమధ్యమున నిర్ణీతస్థానము(ల)యందు చెల్లుట. పాదమధ్య విషయికముగా సంస్కృత (యతి) పదమునుగాక తెలుగు పదమునే చెప్పినచో 'వడిచెల్లుట' యగును. నిజమునకు విచ్ఛేదసంజ్ఞకమై సంస్కృతచ్ఛందస్సున ప్రసిద్ధమైన 'యతి' యనుపదము తెలుగు 'వడిచెల్లుట'ను వ్యక్తీకరించదు. కాని ఆ యతియు నీ వడిచెల్లుటయు పాదమధ్యవిధులేకాన పర్యాయపదములైనవి. ఈవిధముగా అక్షరార్థకమైన 'వడి' ఛందస్సులో పాదాద్యక్షరార్థకముగా నొక పారిభాషికపదముగా నిలిచినది.

'వడి'కి వళి యనునది పర్యాయపదము. (చూ. వళి)

## వళి

'వళి' యనునది 'వడి'కి పర్యాయపదము. (చూ. వడి.)ళ-డల యభేదము ననుసరించి వడియే వళిగా, లేక వళియే వడిగా రూపాంతర మందిన దని కొందరి తాత్పర్యము. కొందరు వళియను సంస్కృత పదమునుండి వడి రూపొందిన దందురు. కాని వళి-వడి పదముల యర్థముల కెక్కడను పోలిక లేదు. కావున వడియొక్క రూపాంతరమే వళియని, సంస్కృత పదమగు 'వళి'కిని దీనికిని సంబంధము లేదని పరిశీలకుల యభిప్రాయము. 'ఆద్యోవళిః' (అం. శ. చిం. 1-37) 'చరణాద్యక్షరమే వడి' (క. జ. సంజ్ఞ. 61) అనువానిని చూచినచో 'వళి' తెలుగు పారిభాషిక పదమే యని స్పష్టమగును.

## యతి భేదములు

పాద ప్రథమాక్షరమే ఏ మార్పు లేకుండ పాద మధ్యమందు ఒక నిర్ణీతస్థానమున మరల ఉపయోగించుటయే యతి చెల్లుట. ఇది అతి ప్రాచీన మయిన పద్ధతి. కాని కాలక్రమమున అచ్చముగా పాదాద్యక్షరమునుకాక, దానితో సమానత్వము లేదా మైత్రిగల అక్షరమును పాదమధ్యమున నిర్ణీత స్థానమున ఉపయోగించినను యతి చెల్లినట్లే భావించబడినది. ఈ మైత్రి, సమానత్వము అనునది ఉచ్చారణములోని సామ్యము, వర్ణోత్పత్తిస్థాన సామ్యము, శబ్దశాస్త్రమూలముగా, భాషలో శబ్దముల రూపముల పరిణామరీతి కారణముగా, ... ఇట్లే మరికొన్ని కారణములుగా అంగీకరించబడినది. లాక్షణికులు ఈ వివిధములైన మైత్రీరీతులను గమనించి, వర్గీకరించి యతి భేదములను చెప్పినారు.

కవుల ప్రయోగములను ఆధారముచేసికొని ఈ యతిభేద నిర్ణయము చాలావరకు జరిగినది. కొందరు లాక్షణికులు కొన్ని ప్రయోగముల నంగీకరించగా, కొందరంగీకరించలేదు. ప్రాచీనులు చెప్పినివి అర్వాచీనులు కొందరు చెప్పినారు. కొందరు ఒక పేరుతో నొకభేదమును పేర్కొనగా మరికొందరు మరొక పేరుతో పేర్కొన్నారు. కొందరు రెండు మూడంశములను కలిపి ఒకే యతి భేదముగా చెప్పగా మరికొందరు విడివిడిగా చెప్పినారు. ఈ విధముగా చాలా యతిభేదము లేర్పడినవి. వీటినన్నిటిని ప్రధానమైన మూడు వర్గములుగా అప్పకవి విభజించినాడు.

i. స్వర యతులు. ii. వ్యంజన యతులు. iii. ఉభయ యతులు. (వివరములకు: చూ. 'స్వర యతులు' మొ॥). ప్రాస యతి యని నాల్గవ వర్గమును గూడ పేర్కొన్నాడు. కాని ఆ వర్గమున అది ఏకైకమే.

## స్వర యతులు

స్వరమనగా అచ్చు. అచ్చులకు పరస్పరము యతి చెల్లించుటలో అనుసరించదగిన స్వరమైత్రిని నిరూపించునవి స్వరయతులు.

1. స్వరప్రధానయతి.
2. స్వరయతి.
3. గూఢస్వరయతి.
4. లుప్తవిసర్గకస్వరయతి.
5. ఋయతి.
6. ఌయతి.
7. ఋత్వసంబంధయతి
8. ఋత్వసామ్యయతి.
9. వృద్ధియతి.
10. ఌకారయతి.

## స్వరప్రధానయతి

పదములకు సంధి జరిగినప్పుడు ఉత్తరపదాద్యచ్చునే యతి చెల్లించవలెను. ఇట్లు చెల్లించుటను స్వరప్రధానయతి యని అప్పకవి చెప్పినాడు. ఇది అచ్చముగా నొక యతిభేదముకాదు. యతి చెల్లించునప్పుడు సామాన్యముగా పాటింపవలసిన ఒకానొక నియమమిది. (ఉభయ యతులందీ నియమము చెల్లదు. (చూ. ఉభయయతులు.)

ఉదా :-

చ. అరదమునెక్కి కేతన పటాంచల చంచలమైన తాల్మితో...'

-పారి. 1-104.

(పట+అంచల=పటాంచల.)

## స్వరయతి

i. అ = ఆ = ఐ = ఔ

ii. ఇ = ఈ = ఋ = ౠ = ఎ = ఏ

iii. ఉ = ఊ = ఒ = ఓ

పై మూడు వర్గములలో, ఆయా వర్గములందలి అచ్చులతో వరస్ప రము యతి చెల్లినచో 'స్వరయతి' యగును.

ఉదా :-

i. అబ్జపత్రనేత్ర - ఆర్తావన చరిత్ర
ఆతతాయిజైత్ర - ఐంద్రమిత్ర
ఐందవప్రగోత్ర - ఔర్వశేయస్తోత్ర

ii. ఇందువంశసోమ - ఈశ్వరీనుతనామ
ఈడితాంగధామ - ఋషభ భీమ
ఋతుజాభిరామ - ఎటులైన మాభామ
ఎడఁ గటాక్షముంచి - ఏలుమనఁగ.

ii. ఉరగ రాజశాయి - ఊర్ధ్వవిష్టపదాయి
ఊర్జితోరుకీర్తి - ఒడలికార్తి
ఒదవకుండఁ బ్రోచి - ఓలిదాసునిఁ గాంచి

— అ. క. 3- 12, 13, 14.

## గూఢ స్వరయతి

అన్యోన్య, పరోక్ష మొదలగు పదములందు గూఢముగా నున్న పర పదము మొదటి అకారము మాత్రమే యతి చెల్లినపుడు 'గూఢ స్వరయతి' యగును.

ఉదా :-

దైన్యముదక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతివేఁడెడు నన్నలోక సా

మాన్య విధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్య విరుద్ధభాషణము-లాడినఁ దత్ఫల మాతఁడందెడున్.

— భారత. ఉద్యోగ. 1-32.

అన్య + అన్య, పర + అక్ష అనుచోట పాణినీయ విధుల ననుసరించి ఓత్వము వచ్చి అన్యోన్య, పరోక్ష అను రూపము లేర్పడినవి. దీనిలో లుప్త విసర్గ యతిగాకూడ అంతర్భవించును. (చూ. లుప్త విసర్గిక స్వరయతి.)

**లుప్త విసర్గిక స్వరయతి**

అకారము తరువాతి విసర్గకు అకారము పరమైనపుడు జరుగు సంధి కార్యములో విసర్గ మరియు దాని వెనుక ముందుల నున్న అకారములకు మొత్తముగా 'ఓ' కారము ఆదేశమగును. ఉదా. దాసః-అహమ్=దాసోహమ్. కింకరః-అహమ్=కింకరోహమ్. ఈ సంస్కృత సంధిలో స్పష్టముగా కనిపించు ఓకార విశిష్టమైన హల్లునకు కాక లోపించిన ఉత్తరపదాది యందలి అకారమునకు యతి చెల్లింపవచ్చును. అట్లు చెల్లించినచో అది 'లుప్త విసర్గక స్వరయతి' యగును.

ఉదా :-

శా. తా సైరింప కపర్ణయుండఁగ భవద్గర్భంబునందాల్చి తే
జో సహ్యున్ శరజన్ముఁ గాంచి యలనీ-హారక్షమాభృత్కుమా
రీ సాపత్న్యముఁగన్న మోహాపుఁ బురంధ్రీరత్నము నీవ కా
దే సర్వజ్ఞుఁడు నిన్ను నేల తలపైనెక్కించుకో జాహ్నవీ.

— విజయ. 1-114.

(తేజః+అసహ్య=తేజోసహ్య)

గూఢ స్వరయతి, లుప్త విసర్గక స్వరయతి ఒకటే యన్నట్లుగా 'అన్యోన్య, దాసోఽహం' వంటి రెండు విధములకును లుప్త విసర్గక స్వరయతిలోనే లక్ష్యములు అనంతాప్పకవులు చూపినారు. లుప్త విసర్గక స్వరయతి 'దాసోహం' వంటి వాటినే సమీకరించును గాని, గూఢ స్వరయతి రెండు విధములను సమీకరించును. గూఢ స్వరయతిలో లుప్త విసర్గక స్వరయతి అంతర్భవించును గాని ఇందులో అది అంతర్భవించదు. అన్యోన్యాదులు లుప్త విసర్గకోత్వములు కావు.

**ఋ యతి**

ఇ, ఈ, ఎ, ఏ లతో గూడిన రేఫలు (రి, రీ, రె, రే) ఋకారముతో యతి చెల్లును. ఇట్లు చెల్లించినచో అది ఋ యతి యగును. ఈ యతినే చిత్ర కవి పెద్దన 'రి యతి' అని పేర్కొన్నాడు.

ఉదా :-

సీ.పా. ఋత్విజుండని విచారించి పూజించితే

ద్వైపాయనుండుండ ధర్మయుక్తి

— భారత. ఆది. 2-11.

### ఙ యతి

చూ, ఋ యతి.

### ఋత్వ సంబంధ యతి

ఒక హల్లుతో కూడియున్న ఋకారమునకు (ఉదా. కృ, పృ మొ.) ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ, అచ్చులు, మరియు ఈ అచ్చులతో కూడియున్న యకార, హకారములు గూడ యతి చెల్లును. (కృ= ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ, హి, యి మొ.) ఇట్లు చెల్లుట 'ఋత్వసంబంధ యతి' యగును.

ఉదా :-

ఇన తనూభవుండు - పృషదశ్వసుతునేసె
ఋభునదీసుతుండు - కృష్ణునేసె
నేమిసెప్ప నపుడు - దృఢశక్తి శల్యుండు
హీనబలునిఁజేసె - వృష్ణికులుని.

— అ. క. 3-27.

### ఋత్వసామ్య యతి

ఋకారముతో కూడియున్న భిన్న హల్లులు పరస్పరము యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'ఋత్వసామ్య యతి' యగును (గృ=శృ మొ.)

ఉదా :

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాత పత్రధృతియో ద్రాగ్దీపికారోపమో
నృహరీవాదము లేల లేరెయితరు ల్నీలీలకుం బాత్రముల్.

— ఆము. 2-91

**వృద్ధియతి**

వృద్ధి సంధిలో ఉత్తర పదాద్యచ్చునకు ఎట్లును యతి చెల్లును. (చూ. స్వరప్రధానయతి.) అట్లుగాక ఆదేశముగా వచ్చిన అచ్చుకును యతి చెల్లింప వచ్చును. ఇట్లు చెల్లినచో అది 'వృద్ధి యతి' యగును.

ఉదా :

ఉ. ఆ కమలాక్షి రూప విభవాతిశయంబు మనోహరంబు, భో
గైక పతాయణుల్ పురుషు - లంగజుఁడ ప్రతిమాన చేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ జేటు పురంబున వారి కెమ్మెయిన్
గా కెటులుండు నిట్టి యనగాధపుఁ బొత్తుమనంగవచ్చునే.

— భారత. విరాట. 3-32

(భోగ+ఏక=భోగైక. ఐ కారము ఏకాదేశముగా వచ్చినది. ఇది వృద్ధి సంధి.)

**ఌ కార యతి**

ఌ కారమునకు 'ళి' తో యతి చెల్లింపవచ్చును. ఇట్లు చెల్లినచో 'ఌకార యతి' యగును. దీనిని అనంతుడు చెప్పినాడు. ఋకారమున రి, రీ, రె, రే లతో యతి చెల్లినరీతిలో నిదియున్నది. (చూ. ఋ యతి.) ఌకారము నకు ప్రత్యేకస్థితి లేకపోవుటచే నది ఏదో ఒక హల్లు నాశ్రయించియేయుండును. ఌకారముతోగూడిన హల్లులుగల పదములుకూడ, నే యొకటి రెండో తప్ప, లేవు.

ఉదా :

గీ. పా. క్లృప్తిలేదు శౌరి గుణావళికి ననంగ.

— అనం. ఛంద. 1-89

**వ్యంజన యతులు**

వ్యంజనమనగా హల్లు. హల్లులకు పరస్పరము యతి చెల్లించుటలో అనుసరింపదగిన మైత్రిని నిరూపించునవి వ్యంజన యతులు. వ్యంజన యతులందు వ్యంజన మైత్రితోపాటు వాటి మీదనుండు స్వరముల మైత్రినికూడ పాటించ వలెను.

1. ప్రాణి యతి
2. వర్గ యతి
3. బిందు యతి

4. అనుస్వార యతి
5. అనుస్వార సంబంధయతి
6. అనునాసికాక్షర యతి
7. తద్భవవ్యాజ యతి
8. జ్ఞాయతి
9. ప్రాకృతాదేశ యతి
10. విశేష యతి
11. మువిభక్తి యతి
12. పోలిక వడి
13. ముకార యతి
14. చక్కటి యతి
15. మవర్ణ యతి
16. ఋజు యతి
17. ప్రత్యేక యతి
18. భిన్న యతి
19. ఎక్కటి యతి
20. ఏకతర యతి
21. అభేద యతి
22. అభేదవర్గ యతి
23. ఊష్మ యతి
24. సరస యతి
25. సంయుక్త యతి
26. అంత్యోష్మసంధి యతి
27. వికల్ప యతి
28. యుక్తవికల్ప యతి
29. రేఫయుత యతి
30. యాయతి
31. తాయతి

## ప్రాణి యతి

అచ్చులకు ప్రాణములని వ్యవహారము. హల్లులు అచ్చులతో కలిసి యుండును గాన హల్లులకు ప్రాణులని వ్యవహారము.

హల్లులు తమలో తాము యతి చెల్లునపుడు, ఆ హల్లులు మైత్రికలవి కావలయును. అంతేకాదు, వాటి నంటియున్న అచ్చులకును మైత్రి (స్వర

యతుల ననుసరించి) యుండవలెను. అప్పుడే హల్లులు యతి చెల్లును. ప్రాణు (హల్లు) లకు యతి చెల్లురీతి చెప్పబడినదిగాన ఇది 'ప్రాణి యతి' యైనది.

ఉదా :

సీ. పా. కలశాబ్ధి గంభీర - కాంచనాచలధీర

కాళియోరగవైరి - కైటభారి...

— అ. క. 3-47

నిజమున కిదియొక యతిభేదము కాదు. ఒక హల్లుకు మరొక హల్లును యతి చెల్లింపవలసినపుడు సామాన్యముగా పాటింపబడు నొక యంశము మాత్రమే. కాని అప్పకవి దీనినొక యతిభేదముగా పరిగణించి చెప్పినాడు. మిగిలినవా రెవరును చెప్పలేదు.

## వర్గ యతి

క-చ-ట-త-ప వర్గములైదు. ఒక్కొక్క వర్గమునందు ఐదేసి అక్షరము లుండును. (క వర్గము=క, ఖ, గ, ఘ, ఙ. ఇట్లే మిగిలిన వర్గములందును చూచుకొనవలెను.) ప్రతి వర్గమందలి ఐదవ అక్షరము అనునాసికాక్షరము. ఏ వర్గమునందా వర్గాక్షరములు మొదటి నాల్గు (అనునాసికమును వదిలి) తమలో తాము యతి చెల్లును. ఇట్లు చెల్లుట వర్గ యతి యగును. (అనునాసికముతో నీ నాల్గక్షరములు యతి చెల్లుటనుగూర్చి చూ. బిందు యతి.)

ఉదా :

ఆ. వె. కంధి మధ్యగేహ - ఖండితారి సమూహ

ఖంజనాక్షదేహ - గానమోహ

గరుడపక్షి వాహ - ఘనవాహజస్నేహ...

— అ. క. 3-50

## బిందు యతి :-

క-చ-ట-త-ప వర్గములైదు. ప్రతి వర్గమునందు ఐదేసి అక్షరము లుండును. ప్రతి వర్గమునందలి మొదటి నాల్గక్షరములు బిందుపూర్వకములయి తమ తమ వర్గముల పంచమా (అనునాసికా) క్షరములతో యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'బిందుయతి' యగును. బిందువనగా అనుస్వారము. (వర్గములోని మొదటి నాల్గక్షరములు పరస్పరము యతి చెల్లుటను గూర్చి చూ. వర్గయతి.)

1. ంక iv = జ
2. ంచ iv = ఝ
3. ంట iv = ణ
4. ంత iv = న
5. ంప iv = మ

(ంక iv అనగా బిందు పూర్వకములైన క, ఖ, గ, ఘ లని తాత్పర్యము. ఇట్లే మిగిలినవాటిని గమనించవలెను.)

ఈ యతినే 'అనుస్వార యతి' యని అనంతుడు, చి. పెద్దన పేర్కొన్నారు.

ఉదా :-

జాకు వడి చెల్లు రత్నకం - కణ యనంగ
ఝాకు వడి చెల్లు బర్హిపిం - ఛంబనంగ
ణాకు వడి చెల్లుఁ గనకమం - డపమనంగ
నాకు వడి చెల్లు దివ్యగం - ధం బనంగ
మాకు వడి చెల్లు విజితశం - బరుఁడనంగ.

— క. జ. సంజ్ఞా. ౭౪.

## అనుస్వార యతి

చూ. బిందుయతి.

## అనుస్వార సంబంధయతి

బిందు (అనుస్వార) పూర్వకములైన టవర్గములోని మొదటి నాల్గక్షరములు (ంట, ంఠ, ండ, ంఢ), అట్లే బిందుపూర్వకములయిన తవర్గములోని మొదటి నాల్గక్షరములకు (ంత, ంథ, ంద, ంధ) క్రమ నిరపేక్షముగా యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'అనుస్వార సంబంధయతి' యగును.

ఉదా :-

శా. శీలంబుంగుణముల్ శమంబు దమముం జెల్వంబు లేఁబ్రాయముం
బోలంజూచి యితండు పాత్రుఁడని యేభూపాలుఁడీ వచ్చిన
న్నాలగ్రామము మున్నగాఁగొనఁడు, మాన్యక్షేత్రముల్ పెక్కుచం
దాలం బండు, నొకప్పుడుండరుగదిం-టంబాడియున్ బంటయున్.

— మను. 1-55.

**అనునాసికాక్షర యతి**

ట, వర్గములోని మొదటి నాల్గక్షరములు బిందుపూర్వకములై (ంట, ంఠ, ండ, ంఢ) నకారమునకు, అట్లే త వర్గములోని మొదటి నాలుగు అక్షరములు బిందుపూర్వకములై (ంత, ంథ, ంద, ంధ) ణకారమునకు యతి చెల్లును. ఇట్లు చెల్లినచో 'అనునాసికాక్షర యతి' యగును.

ఉదా :-

క. మనుసంతతి మండన ఖం
డన నిర్జిత కార్తవీర్య - నరనాయక ఖం
డన పఙ్క్తి స్యందన నం
దన చందన చక్రవార - ణల సత్కీర్తీ.

— అ. క. 3-63.

**తద్భవ వ్యాజయతి**

జ్ఞకారము తద్భవములందు 'న' కారముగా మారును. ఉదా. ఆజ్ఞ = ఆన. ఈ వ్యాజమును పురస్కరించుకొని జ్ఞకారమునకు నకారముతో యతి చెల్లును. సరసయతి ననుసరించి 'న-ణ' లు పరస్పరము యతి చెల్లును (చూ సరసయతి). కావున జ్ఞ-ణలకును పరస్పరము యతి చెల్లును. ఇట్లు చెల్లుట జ్ఞ=న, ణ.) 'తద్భవవ్యాజయతి' యగును. ఈ యతినే 'జ్ఞా యతి' యని చి. పెద్దన. కూ. తిమ్మన పేర్కొనగా, క. రంగకవి ప్రాకృతాదేశయతి యన్నాడు.

(జ్ఞకారము సంయుక్తాక్షరము. ఇందలి జకారమును బట్టి జ్ఞ-జ లకు యతి చెల్లునని అనంతుడన్నాడు, కాని ఈయంశము 'సంయుక్తయతి' యందం తర్భవించును. చూ. సంయుక్త యతి).

ఉదా :-

గీ. పా. 'జ్ఞాని చేతోంబుజాత శో - ణ కరయనంగ
జ్ఞాతి విద్వేషి నృపనాశ - న కరయనఁగ'

— అ. క. 3-54.

**జ్ఞా యతి**

చూ. తద్భవవ్యాజ యతి.

## ప్రాకృతాదేశ యతి

చూ. తద్భవవ్యాజ యతి.

## విశేష యతి

జకారమునకు క, ఖ, గ, ఘ లు యతి చెల్లవచ్చు ననియు, ఇట్లు చెల్లుట 'విశేషయతి' యగునని అప్పకవి యొక్కఁడే చెప్పినాడు. నిజమునకు కకారాదులు నాలుగు బిందుపూర్వకము లైనప్పుడే 'బిందుయతి' ప్రకారము (చూ. బిందుయతి.) జకారముతో యతి చెల్లును. కాని ఈ విశేషయతి ప్రకారము బిందుపూర్వకము కాకుండనే కకారాదులు జకారమునకు యతి చెల్లును. ఈ యతిభేదము నప్పకవి చెప్పుటకు తిక్కనగారి ప్రయోగము ప్రమాణమైనది.

ఉదా :-

క. జ్ఞానము కేవల కృప న
జ్ఞానికి నుపదేశవిధిఁ బ్ర-కాశము సేయం
గా నది సకల ధరిత్రీ
దానంబున కంటె నధికతర ఫలదమగున్.

— భార. శాంతి. 4-255.

బిందుయతి పద్ధతికి భిన్నముగా విశేష ప్రయోగదృష్ట్యా ఈ యతి భేదము రూపొందుటచే నిది 'విశేషయతి' యైనది.

## ము విభక్తి యతి

ప్రథమావిభక్తి ప్రత్యయమైన 'ము'కారమునకు ఉత్వముతోను, ఒత్వముతోను కూడియున్న ప-ఫ-బ-భ (పు-పూ-పొ-పో మొ.) లకు పరస్పరము యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'ముువిభక్తియతి' యగును. ఈ యతినే వి. పెద్దన 'ముకారయతి' యని, అప్పకవి తప్ప మిగిలినవారు 'పోలికవడి' యని పేర్కొన్నారు. 'ముువిభక్తియతి' యన్నది అప్పకవి స్పష్టప్రతిపత్తిగా పెట్టిన పేరు.

(విభక్తి ముకారమునకు ప్రాచీనరూపము 'బు'. ఉదా : నాగబు. ఈ 'బు' పోలికనుబట్టి విభక్తిముకారమునకు ఉత్వ, ఒత్వములతోడి పఫబభలు యతి చెల్లుటవలన 'పోలికవడి' యైనది. నన్నయాదుల రచనలందిట్టి యతి ప్రయోగమే యున్నది. కాని కాలాంతరమున (దాదాపు శ్రీనాథాదులనుండి) విభక్తితర ముకారమునకును ఉత్వోత్వ విశిష్ట పఫబభలు యతి చెల్లింపబడుట మొదలైనది. అంతేకాదు ఉత్వోత్వ విశిష్ట మకారమునకును అట్టి పఫబభలకును యతి చెల్లుట జరిగినది. లాక్షణికులు భాషాసంప్రదాయముదృష్ట్యా విభక్తి,

విభక్తీతర ముకారములకు విడివిడిగా యతిభేదములనేర్పరంచినారు. (చూ. ముకార యతి.) ఇంతకుమించి మువిభక్తి, ముకారయతులు వేరువేరుగా రూపొందుటకు కారణము కన్పించదు.)

ఉదా :

క. ఎట్టి విశేషకులంబునఁ
బుట్టిన సదసద్వివేక-ములు గలిగినఁ దా
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్

— భార. ఆది. 5-58.

**పోలిక వడి**

చూ. మువిభక్తి యతి.

**ముకార యతి**

ప్రథమావిభక్తి ప్రత్యయము కానట్టి 'ము'కారమునకు ఉత్వముతోను, ఒత్వముతోను కూడిన ప-ఫ-బ-భ (పు-పూ-పొ-పో మొ.) లు యతి చెల్లుట 'ముకార యతి' యగును. చి. పెద్దన, కూ. తిమ్మన, క. రంగకవి ఈ యతినే 'చక్కటి యతి' యని పేర్కొన్నారు. 'ము విభక్తి యతి'లో భేదము స్పష్టమగునట్లు అప్పకవి 'ముకార యతి' అని పేర్కొన్నాడు.

(వి. పెద్దన 'ముకార యతి' యన్నది ఈ యతినికాదు. మువిభక్తి యతిని. విశేషములకు చూ. మువిభక్తి యతి.)

ఉదా :-

'పొడఁగాంచి తాను తమ్ములు నెదురేగి...'

'ముందు మీ రెఱిగిన - భూతలాధీశు.'

హరిశ్చంద్రోపాఖ్యానము. పంక్తి. 73, 85 (గౌరన)

**చక్కటి యతి**

చూ. ముకార యతి.

**మవర్ణ యతి**

బిందుపూర్వకములైన అంతఃస్థము (య-ర-ల-వ) లు, ఊష్మము (శ-ష-స-హ) లు మకారముతో యతి చెల్లును. ఇట్లు చెల్లినచో 'మ వర్ణయతి' యగును.

ఉదా :-

సీ. మర్దితదైత్య సం-యమి మనోజ్ఞాదిత్య
మహితమేఘాభ సం-రక్షితేశ
మాయాప్రవర్తి సం-లబ్ధ నిర్మలకీర్తి
మణిహార సురవశం-వదవిహార
మందర ధైర్య వం-శ నినాద చాతుర్య
మా భూప యువతి పుం-షండరూప
మంజులస్వాంత కం-స ధరావర కృతాంత
స్మరహారారాధ్య సిం-హనిభమధ్య

గీ. యనుచుఁ జరమాను నాసికంబునకు నిట్లు
ప్రాలుఁగృతుల మవర్ణ విరామములన
దండిసున్నలు దాపల నుండెనేని
వెలుచ నంతఃస్థములు నూష్మములును గృష్ణ.

— అ. క. 3-76

ఋజు యతి

యకారమునకు, హకారమునకు పరస్పరము యతి చెల్లును. ఇట్లు చెల్లినచో 'ఋజు యతి' యగును. ఈ యతిని అప్పకవి చెప్పినాడు. మిగిలిన లాక్షణికులు ఋజు యతిని 'సరస యతి' యందే కలిపి చెప్పినారు. అప్పకవి సరస యతి చెప్పియు 'య-హా'ల యతిని ప్రత్యేకముగా మరల చెప్పినట్లయినది. (చూ. సరస యతి.)

ఉదా :-

ఉ. 'హాయను ధర్మరాజ తన-యా యను నన్నెడఁబాయనీకు...'

భార. ద్రోణ. 2-242

ప్రత్యేకయతి

ఒక పదములో 'అది' అను పదమునకు జరుగుసంధి వికల్పము. సంధి (వృత్తి) యందు అది, అవి లోని అకారములు లోపించును. లోపించని యప్పుడు యకార మాగమ మగును. ఉదా :- చేతి+అది=చేతిది, చేతియది. ఇట్టి ఉభయ రూపములలో రెండవ (యకార మాగమముగా వచ్చిన) రూపమునందు 'య'

కారమునకే యతి చెల్లును. ఇట్లు యతి చెల్లినచో 'ప్రత్యేకయతి' యగునని అప్పకవి చెప్పినాడు. ('చేతిది' యన్నప్పుడు లోపించిన అకారమునకు యతి-గూఢ స్వరయతి యందువలె చెల్లించరాదని, తికారమునకే యతి చెల్లించవలెనని అప్పకవి భావించినట్లు కన్పించును. (చూ. తెలుగుభాషలో ఛందోరీతులు, పు. 251, చూ. గూఢ స్వరయతి.) అనంతుడు ఈ అంశమును భిన్నయతి యందు కలిపి చెప్పినాడు. ఈ ఇద్దరుతప్ప నీయంశమును మఱెవరును చెప్పినట్లు కన్పించదు.

ఉదా :-

గీ. పా. 'అరయ శార్ఙంబు హరిచేతి-యది యనంగ
దివ్యచాపంబు శూలిచే-తిది యనంగ'

— అ. క. 3-80.

## భిన్న యతి

'ధరించు, ధరియించు' వంటి ఉభయ రూపములలో, మొదటి రూప మందలి 'రి'కి యతి చెల్లింపవలెను. 'ధరియించు'లో 'యి'కి యతి చెల్లించ వలెను. ఇట్లు 'యి'కి యతి చెల్లుట భిన్న యతి యగును. ఇది 'భిన్న యతి' యగుటకు 'ఇత్వంబు విరళమై పూని' యుండుట కారణమని చి. పెద్దన (ల. సా. సం 1-12) చెప్పినాడు. ఈ యతి ననుసరించి 'ధరించు' అను రూపములోని 'ఇ' కారమునకు యతి చెల్లదు. అనంతుడు 'ప్రత్యేక యతి'ని ఈ భిన్న యతిలో కలిపి చెప్పినాడు. చూ. ప్రత్యేక యతి.

ఉదా :-

ఉ. చిత్తజుఁడగ్గి తూపుమొన చేసినఁ చేయఁగనిమ్ము పై ధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము వచి-యించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరలాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్.

— విజయ. 3-15

## ఎక్కటియతి

'మ-ర-అ-త-వ' అను నీ యైదింటిలో నే యక్షరమున కా యక్షరమే యతిచెల్లుట 'ఎక్కటియతి' యగును. అయితే ఇన్ని యక్షరముల కీయతి నొప్పు కొనక అప్పకవి విడిగా 'ఏకతరయతి' చెప్పినాడు. చూ. ఏకతరయతి.

ఉదా :

ఆ. వె. మరునితండ్రి లోక-మహితుండు యాదవ

రాజసింహమూర్తి-రక్షకుండు

ఱాఁగనేలుననఁగ-అంపిల్లునెక్కటి

వల్లునాఁగనిట్లు-వనజనేత్ర.

-అనం. ఛంద. 1-118.

క. '..............వే

ల రమాధిప రెండునుంగ-లసి వర్తించున్.

-అనం. ఛంద. 1-117.

## ఏకతర యతి

రేఫము (ర) నకు రేఫమే, శకటరేఫ (ఱ) మునకు శకటరేఫమే యతి చెల్లినచో ఏకతర యతి యగును. ఇతర లాక్షణికులు 'ఎక్కటి యతి' యనుపేర రేఫ, శకట రేఫలతోపాటు మ-ల-వ లనుగూడ కలిపి చెప్పగా (చూ. ఎక్కటి యతి.) వాటిని అంగీకరించని అప్పకవి ఈ 'ఏకతర యతి' చెప్పినాడు. ఎక్కటి యన్నను, ఏకతెర యన్నను ఉద్దేశ్యమొక్కటే. ఒక ప్రత్యేక వర్ణము నకు అదే వర్ణముతప్ప మరియొక వర్ణము యతి చెల్లదని ఈ యతి చెప్పుటలోని తాత్పర్యము. అయితే 'ఎక్కటి యతి' పేర చెప్పబడిన వర్ణములలో, మకారము బిందుపూర్వకములగు ప వర్గములోని మొదటి నాల్గక్షరములతో యతి చెల్లును. (చూ. బిందు యతి.) లకారము శకారముతో, వకారము ప వర్గములోని మొదటి నాల్గక్షరములతో యతి చెల్లును. (చూ. అభేద యతి; అభేదవర్గ యతి.) కాగా పలు లాక్షణికుల మతమున రేఫ, శకటరేఫములే యే ఇతర వర్ణముతోను యతి చెల్లనివి. (ర-ల యతి అందరొప్పినది కాదు. ఇ-ఈ-ఎ-ఏ లతో గూడినప్పుడు మాత్రమే రేఫ ఋకారముతో చెల్లును. సర్వత్ర చెల్లదు - అనగా ఇతరాచ్చులతో కూడియున్నప్పుడు. కాగా రేఫ స్వేతర వర్ణములకు యతి చెల్లుట యన్నది పాక్షికమే. మరియు ర-ఱ లకు యతి నెవరు నంగీకరించలేదు.) అందువలన అప్పకవి 'ఎక్కటి యతి'లో చెప్పబడిన మ-ల-వ లను వదిలి కేవల రేఫ, శకట రేఫములకే ఈ యతి చెప్పినాడు.

ఉదా :-

ఆ. వె. రార బాలకృష్ణ - రచ్చలగమిఁగూడి

ఱాఁగయనుచు నిన్ను - ఱవ్వఁబెట్టు...*

— అ. క. 3-95

**అభేదయతి**

i. వ-బ, ii. ల-డ

iii. ల-ళ, iv. ళ-డ

పై నాల్గు వర్గములలో ఆయా వర్గములందలి యక్షరములు పరస్పరము యతిచెల్లును. ఇట్లు చెల్లినచో అది 'అభేదయతి' యగును. (నాల్గు వర్గముల యతి చెల్లింపులకును పేరు 'అభేదయతి యనియే.) 'వబయో ్రభేదః' అని యుండుటయు, మిగిలినవాటికి నట్లే యభేదముండుటయు నీ 'అభేదయతి'కి మూలము.

ఉదా :

ఆ. వె. వసుమతీకళత్ర-బకజైత్రగానక
లాలసత్కలాప-డంభగోప
లలితదేహపింగ-ళపుర దక్షిణగేహా...

-అ. క. 3-88.

క. కాకుస్వరయతియగునితఁ
డే కదలక జలధిఁబవ్వ-ళించె ననఁగ...'

-అనం. ఛంద. 1-95.

'అభేదయతి' పేర అనంతుడు, చి. పెద్దన పై రీతికి కొంతభిన్నముగా చెప్పినారు. చూ. అభేదవర్గయతి.

ర-ల; ద-డ అనువాటికిని పరస్పరము యతిచెల్లుటయు అభేదయతియే యగునని కూ. వేంకటరాయడు చెప్పినాడు. ఇక్కడ 'ర' అనగా రేఫ, శకట రేఫలు రెండునని చెప్పినాడు. అనగా ర-ల; ఱ-ల అనువిధముగా యతిచెల్లును. **ళ-డ లకు అతడు యతి నంగీకరించలేదు.**

ఉదా : ర-ల లకు

శా. హాలాపానమొనర్చి యిద్దరును నన్యోన్యంబు మత్తిల్లి రా
కేలీనృత్తవినోదకందుకమణిక్రీడావిహారక్రియా
లీలాహాస్యకలాప్రసంగములను-ద్రేకించి వర్తింతు రె
క్కాలంబున్ ఘటజన్మకాశినడుమన్ గర్వించి యద్దేవతల్.

-కాశీ. 6-210

ద-డ లకు

సీ. పా. 'పిండిపీచంబుగాఁ బృథివీభరంబుల
దంతునే కాలదం-డముననభవ...'

కాశీ. 7-80

ర-ల యతినిగాని, ప్రాసమునుగాని పలువురు లాక్షణికులు అంగీకరించ లేదు. కాని కవిప్రయోగములనుబట్టి ఇవి గ్రాహ్యములేయని వేంకటరాయని మతము.

## అభేదవర్గయతి

వకారమునకు ప-ఫ-బ-భ లతో యతిచెల్లినచో, అది అభేదవర్గయతి యగును. వ-బల కున్న అభేదమును (వబయోరభేదః) పురస్కరించుకొని బకారమునకు యతిచెల్లు ప-ఫ-భ లకు కూడ వకారము యతిచెల్లుటచే నిది అభేదవర్గ యతి యైనది. 'వబయోరభేదః' అనికాక, 'వపయోరభేదః' అని పేర్కొని, వకారమునకు పవర్గము మొదటి నాల్గక్షరములతో యతిచెల్లుట 'అభేదయతి' యని చి. పెద్దన చెప్పినాడు. ప-వ లకు మాత్రమే పరస్పరము యతి చెల్లినచో 'అభేదయతి' యగునని అనంతుడు చెప్పినాడు.

ఉదా :

ఉ. ప్రల్లదుఁడై నయొక్కకులపాంసనుచేసినదానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము, కావుననన్మహీ
వల్లభ తక్షకాధము నె-పంబున సర్పములెల్ల నగ్నిలోఁ
ద్రెళ్లఁగ సర్పయాగమతిధీయుత సేయుము విప్రసన్నిధిన్.

-భార. ఆది. 1-126.

## ఊష్మ యతి

శ-ష-స అనునవి ఊష్మములలోని మొదటి మూడు అక్షరములు. ఈ మూడింటిలో పరస్పరము యతి చెల్లినచో 'ఉష్మ యతి' యగును. ఊష్మాక్షరములకు సంబంధించిన యతి కావున నిది 'ఊష్మ యతి' యైనది. (శ ష స హ లు ఊష్మములు. పై యతిలో ఊష్మమైనను హకారము వదిలివేయ బడినది: ఋజు యతి ననుసరించి హకారము యకారముతో యతి చెల్లును. (చూ. ఋజు యతి.)

ఉదా :-

గీ. ...'శతమఘోపల భూషాను-షంగ యనఁగ

షడ్జయుత వేణునాద ప్ర-సంగయనఁగ.'

— అ. క. 3-104

## సరస యతి

i. అ—ఐ—ఔ = హ—య.

ii. చ—ఛ—జ—ఝ = శ—ష—స.

iii. న—ణ.

పై మూడు వర్గములలో, ఆయా వర్గములలోని వర్ణములు పరస్పరము యతి చెల్లును. ఈ మూడు వర్గములకు చెందిన యతి చెల్లింపులన్నియు 'సరస యతి' అని వ్యవహరింపబడును.

ఉదా :-

i. 'హరిహయాది సురాధ్యక్ష—అంబుజాక్ష

యతిజన మనోంబుజవిహార—అఘవిదూర...

ii. 'శకట దానవసంహార—చక్రధారి

షట్పద శ్యామమూర్తి స్వే—చ్ఛాప్రవర్తి

స్వర్ణపట పరిధాయి భు—జంగశాయి...

iii. 'నరక దైత్యవిరోధి ఘృ—ణాపయోధి...'

— అ. క. 3-106, 107

## సంయుక్త యతి

భిన్న హల్లుల సంయోగము సంయుక్తాక్షరమగును. సంయుక్త మందున్న భిన్న హల్లులలో దేనికైనను యతి చెల్లించవచ్చును. (యతి చెల్లింప వలసిన స్థానమున యతి చెల్లింపవలసిన హల్లుగల సంయుక్తాక్షరమును ప్రయోగించినను యతి చెల్లినట్లగును.) ఇట్లు యతి చెల్లుట 'సంయుక్త యతి' యగును.

ఒక పాదమందు యతి చెల్లింపవలసిన స్థానములు ఒకటికి మించి యున్నప్పుడు, సంయుక్తమునందున్న హల్లులలో నేయొక హల్లునుమాత్రమే గ్రహించి అన్నిచోట్ల యతి చెల్లింపవలెనుగాని, మొదట సంయుక్తమందలి యొక హల్లుకు, తరువాత మరియొక హల్లుకు యతి చెల్లించగూడదు. ఉదాహరణమునకు -

'శ్రీలీలాగాఢ కాంతి-స్మిత వదనరుచి-స్ఫీతు నాగేంద్రకేతున్.'

ఇది స్రగ్ధరాపాదము ఇందు 8, 15 వ అక్షరములు యతి చెల్లవలెను. ఉదాహరణమున 'శ్రీ' సంయుక్తము. 8, 15 అక్షరములు సకార సంయుక్తములు. కాగా శ్రీలోని 'శ' కారమునకే (ఊష్మయతి) యతి చెల్లినది. ఇట్లుకాక ఒకచో 'శ'కారమునకు, మరొకచో రేఫకు యతి చెల్లగూడదు.

నిజమునకు ఇదియొక యతిభేదముకాదు. సంయుక్తాక్షర మున్నప్పుడు యతి చెల్లించుటలో పాటింపవలసిన సామాన్య నియమమిది. ఏ హల్లుకు యతి చెల్లినచో ఆ హల్లుల మైత్రినిబట్టి భిన్నభిన్న యతు లగును. ఉదాహృతపాదమున శ-స లు యతి చెల్లుటచే ఊష్మ యతి. రేఫకు యతి చెల్లినచో ఎక్కటి లేదా ఏకతర యతి యయ్యెడిది. అప్పుడు సంయుక్త యతికి ఉనికి యుండదు. కాని, లాక్షణికులు దీని నొక యతిభేదముగా చెప్పినారు.

## అంత్యోష్మసంధి యతి

సంధియందు హల్లులకు క చ ట త ప లకు హకారము పరమైనచో ఆ హకారమునకు ఆయా వర్గముల చతుర్థాక్షరములు ఆదేశములగును. (పాణినీయ సూత్రము: 'ఝయోహోऽన్యతరస్యామ్'.). ఈ ఆదేశము వికల్పముగా నగును. ఉదా: వాక్+హరిః=(జశ్త్వసంధి) వాగ్+హరిః=వాగ్ఘరిః. వాగ్హరిః.

'వాగ్ఘరి' యను సంధి జరిగిన రూపమునందు గ (ఘ) కారమునకు కాక హ కారమునకు (అది ఘ కారాదేశమువలన లోపించినను) యతి చెల్లింపవచ్చును. ఇట్లు చెల్లించుట 'అంత్యోష్మసంధి యతి' యగును. ఊష్మములలో హ కారము చివరిది. దానికి సంబంధించిన సంధిని పురస్కరించుకొని ఈ యతి చెల్లుటచే నిది 'అంత్యోష్మసంధి యతి' అయినది.

ఉదా:

'కైరవకాముడు - ఘ్ఘరవాహ కవికుంద
హైరణ్యగర్భ వా-ఘ్ఘరి సబృంద...'

— అ. క. 3-115

(వాగ్ఘరిలోని గ కారమునకు యతి చెల్లుట వర్గయతి. చూ. వర్గయతి. పై ఉదాహరణమున మొదట వర్గయతి, తరువాత అంత్యోష్మసంధి యతి చెల్లినవి.)

ఈ యతినే అనంతుడు 'వికల్ప యతి' యన్నాడు. (రెండు విధము లందును వ్యంజనమునకే యతి చెల్లుటవలన నీ యతి భేదము వ్యంజన యతులలో చేరినది.)

**వికల్ప యతి**

అనునాసిక సంధిలో పూర్వపదాంత హల్లుకు ఆదేశముగా (వికల్పముగా) వచ్చిన అనునాసికాక్షరమునకు యతి చెల్లినచో 'వికల్ప యతి' యగును. (అనునాసికాక్షరము పరమైనపుడు పొల్లులగు క చ ట త ప లకు ఆయా వర్గముల అనునాసికాక్షరములు వికల్పముగా ఆదేశములగుట అనునాసికసంధి. ఉదా: వాక్+మూర్తి (జశ్త్వ సంధి)=వాగ్+మూర్తి=వాఙ్మూర్తి. ఉత్+మాది=ఉన్మాది, మొ॥. 'మయట్' పరమైనపుడు అనునాసికాదేశము నిత్యము. ఉదా: వాక్+మయమ్=వాఙ్మయమ్. వికల్పరూపములందు ఆదేశముగా వచ్చిన అనునాసికాక్షరమునకు యతి చెల్లినప్పుడే వికల్ప సంధి. అనునాసికమునకు స్థానియగు కకారాదులకు యతి చెల్లినచో వర్గయతి యగును వాఙ్మయమ్ ఇత్యాది నిత్యరూపములందు స్థానియగు వర్ణమునకు యతి చెల్లింపగూడదు. వికల్ప సంధి రూపములకే సంబంధించినది గావున ఈ యతి 'వికల్ప యతి' యైనది.)

ఉదా:

మ. అకలంకౌపథ సత్త్వముం దెలియ మాయాద్వారకావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగములనే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచు కొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

— మను. 2-16

(బిందుపూర్వక డకారమునకు 'ఉన్మాదుల్'లో ఆదేశముగా వచ్చిన నకారము యతి చెల్లినది.) ఈ యతిని వి. పెద్దన, అనంతుడు 'యుక్తవికల్ప యతి' యన్నారు. అనంతుడు వికల్ప యతి యన్నది 'అంత్యోష్మసంధి యతి'ని.

**యుక్తవికల్ప యతి**

చూ. వికల్ప యతి.

**రేఫయుత యతి**

తెలుగు పదములలో ఋత్వముండదు. క్రుక్కు, క్రుమ్ము, మ్రుచ్చిమి ఇత్యాది పదములందున్నవి రేఫ ఉత్వములే తప్ప ఋ ( ృ ) త్వము కాదు. కావున నిట్టిచోట్ల రేఫకు ఋత్వమును (రు - ఋ) యతి చెల్లించరాదు. పద స్వరూపమునకు సంబంధించిన ఈ యంశమును స్పష్టపరచుటకై అనంతు డొక్కడే ఈ యతిని చెప్పినాడు. దీనికి అతని ఉదాహరణలు ;

గీ. ఆంధ్రమునఁ జొన్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణుని వెన్న - ముచ్చియనఁగ
స్రుక్కఁడతఁడాజి నెట్టి వి-రోధి నైనఁ
గ్రుమ్మనన రేఫయుత యతి - గూడఁగాన.

— అనం. ఛంద. 1-114

ఇందు మ్రు, స్రు, క్రు అను వాటికి వరుసగా క్రొ (రొ), రో, గూ అనునవి యతి చెల్లినవిగాని మృ, సృ, కృ లు యతి చెల్లలేదు.) అప్పకవిగూడ ఈ యంశమును ప్రాసలు చెప్పునప్పుడు రేఫయుత ప్రాసమువద్ద చెప్పినాడు. చూ. రేఫయుత ప్రాస.

నిజమున కిదియొక యతిభేదము కాదు. స్రుక్కు మొదలగు తెలుగు పదములందు ఋత్వభ్రాంతి నివారణమే ఈ యతి చెప్పుటలోని ప్రయోజనము.

**యాయతి**

తాయెతు, ఉయ్యెల, పయ్యెద అను పదములలోని యకారముపై ఎత్వమే యున్నదికాని అత్వము లేదని, కావున ఎత్వమునుబట్టియే యతి చెల్లింపవలెనుగాని తాయతు, ఉయ్యాల, పయ్యాద అని యున్నవనుకొని అత్వమునుబట్టి యతి చెల్లించరాదని ఈ 'యా యతి' చెప్పుటలోని తాత్పర్యము. ఈ యతిని లింగముగుంట తిమ్మకవి మాత్రమే చెప్పినాడు.

ఉదా :

క. వలనొప్పఁగ నపుడాయు
య్యెల లోపల బాలుననిచి - యిందునిభాస్యల్
కలకంఠ నాదమాధురిఁ
బలుమఱు చెలరేఁగి జోలబాడిరి ప్రేమన్.

— విక్ర. చరి

లిం. తిమ్మన ఇట్లు చెప్పినను, తాయెతు మొదలగు పదములు అకారహిత యకారము (తాయతు) కలవని కూ. తిమ్మన, కూ. వేంకటరాయకవి పలు ప్రయోగములు చూపినారు. ఉదాహరణకు :

సీ. గీ... 'అబ్జనాభుని తూగుటుయ్యాలలు కంటె'...

— భీమ. 3-52

(చూ. కూ. తిమ్మనకవి ల. సా. సం. ఆశ్వా. 1-318, 321) కావున నీ యతి నిలువదు. కాగా లిం. తిమ్మకవి పై రూపముల నంగీకరించడని స్పష్టమగును.)

నిజమున కిదియొక యతిభేదము కాదు. తాయెత మొదలగు పద స్వరూపమును ప్రయత్నించుటయే దీని ప్రయోజనము.

**ఱాయతి**

రేఫమునకు శకటరేఫమునకు (ర - ఱ) పరస్పరము యతి చెల్లవచ్చునని, అట్లు చెల్లినచో 'ఱా యతి' యగునని లిం. తిమ్మకవి చెప్పినాడు. రేఫ - శకటరేఫలకు యతి చెల్లుననుట పలు లాక్షణికు లంగీకరించలేదు. దీనికొరకై రేఫలు, శకటరేఫలు గల పదములను తాళ్లపాక పెదతిరుమలయ్య మొదలగువారు పలువురు పరిగణించినారు. ఈ రెంటికి యతి చెల్లించుట మహాదోషముగా అప్పకవి, కూ. తిమ్మకవ్యాదులు భావించినారు. అప్పకవి ఏకతర యతి ప్రత్యేకముగా నిందుకోసమే చెప్పినాడు. (చూ. ఏకతర యతి.). కాని తాతంభట్టు, లిం. తిమ్మకవి, వార్తాకవి రఘునాథుడు ర-అ ల యతి నంగీకరించినారు. రేఫ అకారములు గల పదముల నిర్ణయములోని అనిశ్చితత్వమును, ఉభయ రేఫలు గల పదముల (ఒకే పదము రేఫతో, శకటరేఫతోగూడ నుండవచ్చునను పదముల) ఉనికినిబట్టి వీరు ఈ యతి నంగీకరించినట్లు కన్పించును.

ఉదా :

క. తెంపును బెంపును గదుర ని
లింపులు వెఱగందిచూడ రిపుసైన్యములుం
గంపింపఁ దన బలంబులు
అంపిలి బిట్టార్వ సింధు - రాజుం దాకెన్.

(ఈ లక్ష్యము భారతములోనిదని లిం. తిమ్మకవి తన సులక్షణసారమున చూపినాడు. కాని దీనిని పరిష్కరించిన శ్రీ రావూరువారు అధోజ్ఞాపికలో 'ఈ పద్యము భారతమునఁ గానరాదు. రెండవ పాదమువ ర-ల ల కభేదయతియు గలదు' అని వ్రాసినారు. చూ. వావిళ్ల ప్రచురణ. 1966. పు. 110.) అయితే రేఫ - అకారములకు యతి ప్రాసలు చెల్లిన ప్రయోగములు చాలా ఉన్నవి. అప్పకవి, కూ. తిమ్మకవి మొదలగువారు ఈ పలు ప్రయోగములు ప్రదర్శించి యతి ప్రాసలు చెల్లింపులో రేఫ - అకారముల విషయమున మహాకవులకే పరిశీలన లేకపోయినదను భావము వెలువరించినారు.

ఉదా :

శా. 'క్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బకులు...'

— మను. 3-12

క. గ్రక్కునఁ జని వ్రాలుడునో
ఱెక్కలు గట్టుకొని దివిజ - రిపుమేడలపై ...

— ప్రభా. 4-86

(ఇవి కూ. తిమ్మకవి చూపిన ప్రయోగములు.)

తాతంభట్టు ర-ఱ లకు యతి చెల్లిన చెల్లునుగాని ప్రాస మాత్రము చెల్లదన్నాడు. అయితే యతి నంగీకరించి ప్రాస నంగీకరించకపోవుటలో సామంజస్యము లేదు.

మొత్తముమీద పలువురు ప్రసిద్ధ లాక్షణికులు ర-ఱ లకు యతి, ప్రాసల నంగీకరించలేదు.

**ఉభయ యతులు**

వేద+అండ=వేదండ అని అగును. ఇది పరరూప సంధివలన ఏర్పడిన రూపము. ఇట్టిచోట ఉత్తర పదమందలి అచ్చుకే యతి చెల్లవలెను. కాని ఆ అచ్చుతోకూడిన హల్లు (దకారము) నకుగూడ యతి కవులు చెల్లించినారు. కావున వేదండ వంటి పదములలో అచ్చుకు, హల్లుకుకూడ యతి చెల్లించవచ్చునని లాక్షణికు లంగీకరించినారు. అచ్చుకు, హల్లుకు - అనగా ఉభయమునకు యతి చెల్లించుటకు వీలైనది. 'ఉభయ యతి' అని లాక్షణికులు పేర్కొన్నారు. సంధి సందర్భము, ప్లుతోచ్చారణము, శబ్దశాస్త్రమునుబట్టి కలిగిన దీర్ఘత్వము (అచ్చునకు) కలిగిన కొన్ని కొన్ని తావులను లాక్షణికులు ఉభయ యతికి అంగీకరించినారు. ఇట్టివి ఉభయ యతులు.

ఉభయ యతులందు అచ్చుకు స్వరయతుల ననుసరించి, హల్లుకు వ్యంజన యతుల ననుసరించి యతి చెల్లును. అయినను దానిని స్వరయతిగా లేదా వ్యంజన యతిగా చెప్పక, ఉభయమునకు అవకాశమున్నదిగాన ఉభయ యతి భేదముగానే పరిగణించవలెను.

1. అఖండ యతి
2. యుష్మదస్మచ్ఛబ్ద యతి
3. పరరూప యతి
4. శకంధు యతి
5. ప్రాది యతి
6. ఆదేశ యతి
7. నిత్యసమాస యతి
8. దేశ్య నిత్యసమాస యతి
9. దేశీయ యతి
10. నిత్య యతి
11. నిత్యసంధి యతి
12. రాగమ యతి
13. విభాగ యతి
14. సామాఖండ యతి
15. ప్రభునామ యతి
16. ప్రభునామాంత యతి

17. ప్రభునామాఖండ యతి
18. చతుర్థీవిభక్తి యతి
19. పంచమీవిభక్తి యతి
20. కాకుస్వర యతి
21. ప్లుత యతి
22. ప్లుతయుగ యతి
23. స్వరయుగ యతి
24. నఞ్సమాస యతి
25. నసమాస యతి
26. ఘఞ్ యతి
27. సౌభాగ్య యతి

పై యతులలో కొన్ని కేవలము (కొన్ని యతుల) నామాంతరములని ఆయా చోట్ల గమనించవచ్చును.

**అఖండ యతి**

యతి చెల్లించవలసిన స్థానమున (పద్యమున పాదాదుల యందును) అచ్ సంధి యున్నచో పరపదాది యందలి అచ్చునే (అచ్చునకే) యతి చెల్లించుట సామాన్య యతి నియమము. (చూ. స్వరప్రధాన యతి.). అట్లుకాక పరపదాద్యచ్చుతో కూడియున్న హల్లునకును యతి చెల్లించవచ్చును. ఇట్లు యతి చెల్లినచో, అది 'అఖండ యతి' యగును. సంధి జరిగినపిదప పూర్వోత్తర పదఖండములుగా విభజించి ఉత్తర పదాద్యచ్చుకుకాక, అఖండముగా భావించి సంధిలో కన్పించు హల్లుకు యతి చెల్లుటవలన నిది 'అఖండ యతి' యైనది.

ఈ అఖండ యతిని మొట్టమొదట భీమనయే చెప్పినట్లు కవిజనాశ్రయమున నున్నది. అందీ యతికి లక్ష్యమిది :

'భాను సహస్రభాసి వృష-భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై...'

ఇందు 'వృషభాదిప' యన్నప్పుడు 'వృషభ+అధిప' అని పదములు విరుగును. కాగా ఉత్తరపదాద్యచ్చుకాక, దానితో కూడియున్న భకారము పాదాది భకారమునకు యతి చెల్లినది. అయితే అఖండ యతికి లక్ష్యలక్షణములుగానున్న పద్యము క. జ. లో ప్రక్షిప్తమని కొందరి భావము. (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్‌వారి తృతీయ ముద్రణ పీఠిక — శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి)

అనంతుడు 'నిత్యసమాస యతి'నే కొంద రఖండ యతి యందురన్నాడు. అనంతుడు, అప్పకవి మొదలగువారు క. జ లో కన్పించురీతిలో 'అఖండ యతి' నంగీకరించలేదు. 'ఉభయ యతు'లని పేర్కొనబడిన తావులలో మాత్రమే అఖండ యతి రీతిని అంగీకరించి, ఇతరత్ర అంగీకరించక 'అఖండ యతి' పరిధిని కుదించినారు. కాని ముద్దరాజు రామన్న మొదల్గగు పలువురు అఖి

విస్తృతరీతిలో అఖండ యతి నంగీకరించినారు. ఏవో కొన్ని సంధులయందని గాక హల్లు-అచ్చు కలిసియున్న ప్రతిచోట ఈ అఖండ యతి చెల్లింపవచ్చును. కూ. వేంకటరాయుడు తన 'కవిజన రంజనము' నందు భారతాద్యనేక గ్రంథములు నుండి 64 ప్రయోగములు అఖండ యతికి చూపించినాడు.

'అఖండ యతి' యేదోయొక యతిభేదము కాదు. అచ్చుకు యతి చెల్లవలసియుండగా, అట్టితావున హల్లుకు యతి చెల్లినపుడే 'అఖండ యతి' యగును. ఈ 'అఖండ యతి' యతి చెల్లించుటలో నొకపద్ధతి. ఈ పద్ధతిలో వ్యంజనయతు లన్నియు చెల్లును. పై 'భానుసహస్ర...' పాదమున అఖండయతి పద్ధతిలో వర్గయతి చెల్లినది. ఇట్లే యే వ్యంజన యతి యైన చెల్లవచ్చును.

**యుష్మదస్మచ్ఛబ్ద యతి**

యుష్మత్, అస్మత్ పదములకు చివర అజాది పదముల నదికినపుడు పరపదాద్యచ్చుకుగాక, ఆ అచ్చుతోకూడిన దకారమునకు (జశ్త్వసంధి ప్రకారము తకారము దకారమగును. యుష్మత్+ఆజ్ఞ=యుష్మదాజ్ఞ; అస్మత్+ఆదులు= అస్మదాదులు.) యతి చెల్లినచో, అది 'యుష్మదస్మచ్ఛబ్ద యతి' యగును. ఈ యతినే చి. పెద్దన 'ఉభయ యతి' అనుపేర చెప్పినాడు. ఈ యతి రీతిని చి. పెద్దన, అప్పకవి మాత్రమే చెప్పినారు. 'యుష్మదస్మచ్ఛబ్ద యతి' యన్న పేరు అప్పకవి పెట్టినది.

ఉదా :

i. 'ధర్మతనయ యుష్మ-దాజ్ఞానిగళని
బద్ధమగుచుఁ జిక్కువడియె కాక...'

— అధర్వణ భారతము

ii. 'ప్రస్తుత ఫణిసత్రభయ
త్రస్తాత్ములమైన యస్మ-దాదుల కెల్లన్...'

— భార. ఆది. 2-219

ఈ పద్ధతిలోనే త్వత్, భవత్ మొదలగువాటికి యతి చెల్లవచ్చును.

ఉదా ;

'...మా, తంగము నెక్కి యింద్రుఁడు త-దాశ్రమవీధి...'

— అహల్యా. 2-119

'తావక సేవకుండ భవ-దంఘ్రుల నేనిటఁ గొల్చివచ్చెదన్.'

— భా. రా. అయోధ్యా. 143

కాని ఈ పదములు అప్పకవి పెట్టిన పేర సంగ్రహింపబడవు.

**పరరూప యతి**

శకంధ్వాదులయందు జరుగునది పరరూప సంధి. ఉదా : శక+అంధుః=శకంధుః; వేద+అండః=వేదండః; మనస్+ఈషా=మనీషా; పతత్+అంజలిః=పతంజలిః మొ.

ఇట్టి సంధిరూపములలో ఉత్తర పదాద్యచ్చుకుకాక, ఆ అచ్చుతోకూడిన హల్లుకును యతి చెల్లును. ఇట్లు చెల్లినచో అది 'పరరూప యతి' యగును.

ఈ యతిని క. రంగకవి 'శకంధు యతి' యని పేర్కొన్నాడు.

ఉదా :

ఉ. పాండునృపాలనందనులు పావని ముందుగఁ దాకనట్లు భీ
ష్ముండు గడంకమై నడచుచోటికిఁ జక్కటిగాఁగఁద్రోచి యొం
డొండగడంగిసేనతమ యుబ్బునకుబ్బఁగ నన్యసైన్యవే
దండముఖాంగము ల్తృణవి-తానముగాఁగొని నిర్వికారులై.

—భార. భీష్మ. 1-234.

**శకంధు యతి**

చూ. పరరూపయతి.

**ప్రాదియతి**

ప్ర-పరా మొదలగు ఉపసర్గలతో అజాదిపదములకు సంధి జరిగినపుడు ఉత్తరపదాద్యచ్చుకు మాత్రమేకాక, ఆ అచ్చుతోకూడిన హల్లుకుగూడ యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'ప్రాదియతి' యగును.

ప్ర-పరా-అప-సమ్-అను-అవ-నిస్-నిర్-దుస్-దుర్-వి-ఆఙ్-ని-అధి-అపి-అతి-సు-ఉత్-అభి-ప్రతి-పరి-ఉప అనునవి ప్రాద్యుపసర్గలు.

ఉదా :

సీ. ప్రమదాజనేక్షణ-ప్రార్థితసౌందర్య
యాచకసంతతి-ప్రార్థనీయ
పృథివీసురప్రజా-భీష్టసంధాయక
యిభముఖ్యసైన్యకా-భీష్టయాత్ర
పరమధర్మక్రియో-పాయసంచితకీర్తి
యరిదుర్గసాధనో-పాయవేది
వివిధశాస్త్రాగమ-వీక్షణతాత్పర్య
యిందిరాసత్కృపా-వీక్షణీయ

గీ. ప్రబలతరగుణా ని-రంతరవైభవ
యష్టసిద్ధిబలనిరంతరాయ
పరగుచుండు నివియ ప్రాడులయతులన
విద్వదంబుజాత ! విక్రమార్క.

—విక్ర. చరి. 4-210

సీసపాద పూర్వోత్తరార్థములు వరుసగా హల్లునకు, అచ్చునకు; గీత ప్రథమ ద్వితీయపాదములును హల్లుకు అచ్చుకు లక్ష్యములు.

**ఆదేశ యతి**

ద్వీప, ప్రేప, సమీప, ప్రతీప, అంతరీపాది పదములయందు 'ద్వ్యంత రుప సర్గేభ్యః స్యాత్-ఉదనోద్దేశే' అను పాణినీయ సూత్రములవలన ద్వి, ప్ర ఇత్యాదులకు పరమైన 'అప' అను పదమునకు ఈప, ఊప అనునవి ఆదేశము అగును. ద్వి+అపః=ద్వి+ఈపః (సవర్ణ దీర్ఘసంధి), ప్ర+అపః=ప్ర+ఈపః (గుణ సంధి)=ప్రేపః; న+అపః=న+ఊపః=(నఞ్)=అనూపః (అవర్ణాంతములైన ఉపసర్గములకు పరమైన అప శబ్దమునందలి అకారమునకు ఈత్వము వికల్పము కాన 'ప్రేపః' అను రూపముతోపాటు 'ప్రాపః' అను రూపముగూడ నుండును. ఇట్లే పరేపః, పరాపః అనియు.). ఇట్టి సంధిరూపములందు ఆదేశములుగా వచ్చిన ఈకార ఊకారములకు మరియు వాటితోకూడిన హల్లులకును యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'ఆదేశ యతి' యగును. ఆదేశముగావచ్చిన అచ్చులకు యతి చెల్లుటచే ఇది 'ఆదేశ యతి' యైనది. వి. పెద్దన, క. రంగకవి ఈ యతిలో 'నాక' పదముగూడ చెప్పినారుగాని కూ. తిమ్మన, కూ. వేంకటరాయడు 'నస మాస యతి!'గా చెప్పినారు. (చూ. నసమాస యతి.)

ఉదా :

ఉ. ద్వీపులఁజంపి విశ్వజగ-తీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు-నిమ్ముగఁ జేయుటయుం బ్రసన్నమై
గోపతి ధేను వవ్విభునకుందనవైభవ మిచ్చెఁగాక యే
భూపతులీ వదాన్యగుణ బుద్ధిఁ బ్రసిద్ధివహించి రుర్వరన్.

— కా. చూ. 7-65

(మొదటి పాదమున హల్లు, రెండవ పాదమున అచ్చు యతి చెల్లినది.) అప్పకవి ఇట్టివి నిత్యసమాసములుగానే భావించి 'నిత్యసమాస యతి' యందే చెప్పినాడు.

**నిత్యసమాస యతి**

పదములు విభజించి విగ్రహావాక్యము చెప్పుటకు వీలుకానివి, ఇతర పదములసాయమున విగ్రహా వాక్యము చెప్పబడునవియు నిత్యసమాసములు,

('అవిగ్రహో, అస్వపద విగ్రహోవా నిత్యసమాసః') కర్ణాట, జనార్దన, రామాయణ మొ॥ అట్టి నిత్యసమాసములు. ఇట్టి నిత్యసమాసములందు జరుగు స్వర సంధిలో పరాచ్చునకును, లేక దానితో కూడియున్న హల్లునకును యతి చెల్లించ వచ్చును. ఇట్టి చెల్లింపు నిత్యసమాస యతి యగును 'ఈ నిత్యసమాసమునే రఖండ యతి యని అనంతుడు, అప్పకవి యన్నారు. అనగా వీరు అఖండ యతి యొక్క పరిధిని కుదించినట్లయినది. విస్తృత పరిధిలో అఖండ యతిని అంగీకరించని వారిట్లు చెప్పుదురు. కాని అఖండ యతి నిత్యసమాసములవరకు మాత్రమే పరిమితము కాదు. (చూ. అఖండ యతి.) వి. పెద్దన ఆదేశ యతిని, నఙ్ సమాస యతిని, అనంతుడు దేశ్య నిత్యసమాస యతిని ఈ నిత్యసమాస యతిలో కలిపి చెప్పినారు,

నిత్యసమాస యతిలో హల్లుకు

ఉదా :

చ. నగనగియేనియున్ వినుజ-నార్దన యెన్నడు బొంకవల్కను
త్యగణిత విక్రమోరుబల ధైర్యసమగ్రుల మట్లుగాక కా
లగతి దొలంగc ద్రోపcగ దలంబగునే యగుcగాక నీకు మె
చ్చగ నిదె ప్రాణమిచ్చెదము గ్రుక్కము చావున కాత్మనేమియున్.

— భార. అరణ్య. 4-397

అచ్చుకు :

చ. శరధి సుతాకళత్ర నవసారసనేత్ర బలాంతకారి ని
ర్జరనుతనామ పాతక విరామ విహంగమయాన చారుక
ర్బుర పరిధాన పాండవవిరోధి విభంజన నిర్మలాత్మకా
య రుచిరతాభ్రఖంజన జనార్దన కైటభదైత్యమర్దనా.

— సాం. వి.

## దేశ్య నిత్యసమాస యతి

రూపటు (రూపు+అటు), పెంపటు (పెంపు+అటు) మొదలగునవి నిత్యసమాసములుగా భావింపబడినవి. ఇవి దేశ్యపదములుగాన, దేశ్య నిత్యసమాసము లగును. ఇట్టి సమాసములందు ఉత్తర పదాద్యచ్చుకేకాక, ఆ అచ్చుతో కూడియున్న హల్లుకుకూడ యతి చెల్లును. ఇట్లు చెల్లినచో 'దేశ్య నిత్యసమాస యతి' యగును వి. పెద్దన, చి. పెద్దన, క. రంగకవి ఈ యతినే 'దేశీయ' (దేశ్య యతి యని పేర్కొన్నారు. అనంతుడు ఈ దేశ్య నిత్యసమాసములను 'నిత్యసమాస యతి' యందే కలిపి చెప్పినాడు. (చూ. నిత్యసమాస యతి.) రూపటు, పెంపటు, క్రిక్కిఱియు, క్రచ్చఱ, చూపటు, చిచ్చఱ మొదలగు నాటికి దేశ్య నిత్యసమాసములని వ్యవహారము,

ఉదా ; హల్లుకు

చ. చిఱునగవొప్ప గాండివముఁ జెచ్చెర సజ్యముఁ జేసి సేనలు
క్కఱ రభసంబుమైనడర - కవ్వడి ద్రౌణియు నీడవోక య
త్తఱిఁ దరుమంగ నస్త్రములు దండడిమార్కొని మండుచుండెఁ జి
చ్చఱ పిడుగుల్ వడిందొఱఁగఁ జాడ్పున నంబరవీధి నుగ్రమై.

— భార. విరాట. 5-143

చ. తఱియగునంతకున్ రిపునుదగ్రతసై చుటనీతి నీవు నా
కఱపినయట్లు సేయుము తగంజని యాతనిఁగాంచి నన్ను నే
తెఱఁగునసైనఁ బొందఁగ మదిం దలపోతయ కగ్గెనేనిఁ గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడ - వై చనుదెమ్మను మంతఁదీరెడున్.

— భార. ఉద్యోగ. 1-176

**దేశీయ యతి**

చూ. దేశ్య నిత్యసమాస యతి.

**నిత్యయతి**

'ఏని' అనునది ఒకపదము చేరినప్పుడు (కలిగెన్+ఏని=కలిగెనేని; ఎన్నడున్+ఏని=ఎన్నడునేని మొ.) ఉత్తరపదాద్యచ్చు (ఏ) కే కాక, పూర్వ పదాంత హల్లునకును యతి చెల్లును. ఇట్లు చెల్లుట 'నిత్యయతి' యగును.

ఉదా : హల్లుకు

మత్త. మానితంబగు నాతపోమహిమం ద్రిలోకపరాభవం
బేను జేయఁగఁబూని చేసితి నిట్టిదొక్క ప్రతిజ్ఞమున్
దీని నెట్టులఁ గ్రమ్మరింతు మదీయభాషిత మెన్నడు
న్నేనిమోఘముగాదు దిగ్ధర-నీరవీందులెఱుంగఁగాన్.

—భార. ఆది. 7-142.

అచ్చుకు

గీ. ఎట్టియపరాధమొనరించె-నేని తల్లి
కొడుకు శపియింపదిబ్బంగిఁ గ్రూరబుద్ధి
నతివపత్యంబుచెప్పుమెవ్వ తెవునీవు
నావుడునుశాపభీతినన్నలినసేత్ర.

—కాశీ. 4-269.

**నిత్యసంధియతి**

ఉత్+లాసమ్, స్ఫురత్+లీలా ఇత్యాదులయందు 'తోర్లి' అను పాణినీయ సూత్రమువలన పూర్వపదాంతమందలి తకారమునకు పరసవర్ణము (లకారము) వచ్చును. ఇది నిత్యసంధి. ఇట్లే 'స్తోశ్చునాశ్చుః' 'స్తోష్టునాష్టుః' అను సూత్రములచేత సచ్చిత్ (సత్+చిత్), ఉజ్జ్వలమ్ (ఉత్+జ్వలం), తట్టీకా (తత్+టీకా) ఇత్యాది నిత్యసంధిరూపములేర్పడును. ఇట్టి సంధిరూపములలో సంధికారణముగా ద్విత్వమై కనిపించు హల్లుకేకాక పూర్వపదాంతమందలి తకారము (పరసవర్ణస్థాని) నకుకూడ యతిచెల్లును. ఇట్లు చెల్లినయతి 'నిత్యసంధి యతి' యగునని కూ. వేంకటరాయడు చెప్పినాడు. ఈ సంధి నిత్యముగాన ఇది 'నిత్యసంధియతి' యైనది.

ఉదా : 'ఉల్లాస'ములో లకారమునకు

మ. అలినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధుసంగరంబునకు ను-ల్లాసంబు కల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాలఘు
ర్మలవంబుల్ దొలగింపఁ బూనురటియై రంజిల్లు నిచ్చాగతిన్.

—పారి. 1-60

'విస్ఫురల్లీల'లో తకారమునకు

శా. నీలాంభోధరమధ్యసంస్థిత తటిన్నికాశమై విస్ఫుర
ల్లీలన్ నివ్వరిముంటిచందమున నెం-తే పచ్చనై సూక్ష్మమై
చాలాభాసిలుతేజు నీవయనుచున్ స్వాంతంబునం దెన్నుదు
ర్వ్యాలెంబున్ ఘనులైన తాపసులు భర్గా! పార్వతీవల్లభా!

—కూ. తిమ్మకవి 'భర్గశతకము'

**రాగమయతి**

బీద+ఆలు, జవ+ఆలు వంటిచోట రేఫాగమము వచ్చి, బీదరాలు, జవరాలు ఇత్యాదిగా సంధిరూపము లేర్పడును. ఇట్టి రాగమసంధి రూపములలో ఉత్తరపదాద్యచ్చుకేకాక ఆగమముగానున్న రేఫకుకూడ యతిచెల్లును. ఇట్లు చెల్లినచో 'రాగమయతి' యగును.

ఉదా : హల్లుకు

క. ఈ లలన వేలుపుం జవ
రాలో యచ్చరయొ కిన్న-రవధూమణియో
వ్యాలాంగవయో కాకీ
భూలోకస్త్రీలకిట్టి పొంకము గలదే.

—చారుదేష్ణ చరిత్ర

అచ్చుకు

ఉ. ఇంతలుకన్నులుండఁ దెరువెవ్వరివేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవ-రాండ్రఁ బెనంగ పల్కరించు లా
గింతియెకాక నీవెఱుఁగవే మునువచ్చినత్రోవ చొప్పు నీ
కింత భయంబులేకడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్.

—మను. 2-41

విభాగయతి

పరిమాణార్థకమైన 'ఏసి' యనునది ఒక పదముచివర చేరినపుడు (గంపెడు+ఏసి=గంపెడేసి మొ.) ఉత్తరపదాద్యచ్చు (ఏ) కే కాక, అచ్చుతో కూడియున్న హల్లుకుకూడ యతిచెల్లును. ఇట్లు చెల్లుట 'విభాగయతి' యగును 'ఏసి' యనునది రాశినుండి విభజించుటను చెప్పునదిగాన, దానికి సంబంధించి ఇది 'విభాగయతి' యైనది.

ఉదా :

సంఖ్యకుం బరిమాణ సంజ్ఞకుఁ దనరు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించినప్పుడు యతులు రెం-డేసి యగు, ను
పేంద్రుఁడిచ్చునర్థము మూ-పె-డేసి యనఁగ

—అనం. ఛంద. 1-120

(మూడవపాదము హల్లుకు, నాల్గవపాదము అచ్చుకు లక్ష్యములు.)

నామాఖండయతి

అన్న, అయ్య, అమ్మ, అప్ప, ఆయి మొదలగునవి వ్యక్తినామముల చివర తెలుగున చేరును. ఉదా : కొమ్మ+అన్న=కొమ్మన్న; రామ+అయ్య= రామయ్య; సీత+అమ్మ=సీతమ్మ; వెంక+అప్ప=వెంకప్ప; సీత+ఆయి=సీతాయి. (అన్న, అమ్మ మొదలగువాటిలోని ద్విత్వాక్షరములందొక హల్లు లోపించి అన, అమ ఇత్యాదిగా కూడ నిలుచును. కొమ్మన, సీతమ మొ.) ఇట్టిచోట్ల ఉత్తరపదాద్యచ్చు కేకాక, ఆ అచ్చుతోకూడిన హల్లుకుగూడ యతిచెల్లును. ఇట్లు చెల్లుట 'నామాఖండయతి' యగును. వ్యక్తినామముల చివర చేరు అన్నాది పదముల పురస్కరించికొని యేర్పడుటచే నిది 'నామాఖండయతి' యైనది. ఈ యతినే 'ప్రభునామాంతయతి' అని అనంతుడు, 'ప్రభునామయతి' యని చి. పెద్దన, 'ప్రభునామాఖండయతి' యని కూ. తిమ్మన, రంగకవి-పేర్కొన్నారు. ఇక్కడ ప్రభుపదము స్త్రీ, పురుష వ్యక్తిబోధకమని కూ. వేంకటరాయడు చెప్పినాడు.

ఉదా :

గీ. మహినయోధ్యకురాజు రా-మన యనంగ
నతని పట్టపుదేవి సీ-తమ యనంగ.

—అనం. ఛంద. 1-119.

(మొదట హల్లుకు, తరువాత అచ్చుకు యతి చెల్లినది.)

**ప్రభునామయతి**

చూ. నామాఖండయతి.

**ప్రభునామాంతయతి**

చూ. నామాఖండయతి.

**ప్రభునామాఖండయతి**

చూ. నామాఖండయతి.

**చతుర్థీవిభక్తియతి**

తెలుగులో పదములచివర చతుర్థీవిభక్తిలో 'కై' (కు+ఐ) అనునది చేరినప్పుడు ఐ అను అచ్చు కేకాక, దానితోగూడియున్న హల్లు (క) కు గూడ యతి చెల్లును. ఇట్లు యతిచెల్లినచో 'చతుర్థీవిభక్తియతి' యగునని కూ. వేంకటరాయడు చెప్పినాడు.

ఉదా : అచ్చుకు

గీ. అరణినగ్ని పొడముకరణి దేవకియందు
విప్రయజ్ఞకర్మ వేదగుప్తి
కై జనించెనెవ్వఁ-డవ్వసుదేవనం
దను భజింతు నేకతానిరూఢి.

—భార. శాంతి. 2-23.

హల్లుకు

ఉ. అంతయు నాత్మలో నరసి యల్లన నవ్వుచు నాన్నృపాలకుం
డింతికి సర్వముం దెలిపి యెల్లరకుం గతజన్మవాసనా
క్రాంతినిఁ బాపపుణ్యముల కై వశమౌనది నట్లుగాన నే
కాంత శివార్చనానిరతి కైకొనుమంచు వచించె నేర్పడన్.

—బ్రహ్మోత్తరఖండము.

**పంచమీవిభక్తియతి**

తెలుగులో పదములచివర పంచమీవిభక్తిలో 'అన్నన్, అంటెన్' అనునవి చేరినపుడు, వీటి ఆద్యచ్చు కేకాక, ఆ అచ్చుతో కూడిన హల్లు (క) కు

కూడ యతిచెల్లును (రామునికన్నన్, రామునికంటెన్). ఇట్లు యతిచెల్లినచో పంచమీవిభక్తియతి యగునని అప్పకవి చెప్పినాడు.

ఉదా :

క. నిన్నుఁ జెఱఁగొన్న హైహయు
కన్నన్ దోర్వీర్యమెక్కు-డగు భార్గవులీ
ల న్నిర్జించిన రాముని
కన్నన్ శూరుండు ముజ్జ-గంబులఁ గలఁడే.

—చమత్కార రామాయణము

(2 వ పాదాన అచ్చుకు, 4 వ పాదాన హల్లుకు యతి చెల్లినది.)

**కాకుస్వరయతి**

శోకభయాదులవలన కలిగెడు ధ్వనివికారము కాకువని యమర నిఘంటువునందు చెప్పబడినది. ('కాకుఃస్త్రియాం వికారోయః, శోకభీత్యాది భిర్ధ్వనేః'). పదాంతమందలి అచ్చును ఉచ్చరించెడు రీతిలో నీ భయాదులు స్ఫురించును. ఆ అచ్చు దీర్ఘముగానుండి ప్లుతోచ్చారణ కలిగియుండును. దీర్ఘము ద్విమాత్రాకాలికోచ్చారణము కలది. ప్లుతము త్రిమాత్రాకాలికోచ్చారణము కలది. ఈ అచ్చుకును, అచ్చుతోగూడిన హల్లునకును యతిచెల్లును. ఇట్లు చెల్లినచో 'కాకుస్వరయతి' యగును. దీనినే ప్లుతయతి యనియు నందురని అప్పకవి చెప్పినాడు. కాని కొందరు లాక్షణికులు కొన్నికొన్ని భావములు స్ఫురించునప్పుడు మాత్రమే కాకుస్వరయతి యగునని, మఱికొన్ని స్ఫురించినపుడు 'ప్లుతయతి' యగునని విడివిడిగా చెప్పినారు. ఈ భావములను స్పష్టముగా వివరించిన లాక్షణికుడు కూ. వేంకటరాయడు. కాకుస్వరము లనేకవిధములని ఇరువదియైదింటిని చెప్పినాడు. అవి ఈ క్రిందివిధముగా నున్నవి.

| | | |
|---|---|---|
| 1. అమితము | 10. అనునయము | 19. విచారము |
| 2. నిబోధనము | 11. ప్రశ్నము | 20. ప్రాగల్భ్యము |
| 3. వ్యంగ్యము | 12. ప్రార్థన | 21. భీతి |
| 4. నింద | 13. ఆశ్చర్యము | 22. శంక |
| 5. నిశ్చయము | 14. పరిహాసము | 23. అంగీకరణము |
| 6. వ్యర్థత | 15. తర్కము | 24. పృచ్ఛ |
| 7. ఆక్షేపము | 16. బోధకత | 25. శ్లాఘ |
| 8. ఆనందము | 17. అనుతాపము | |
| 9. ఉద్ధతత్వము | 18. వ్యాజస్తుతి | |

ఈ 25 భావములు స్ఫురించునట్లు పదాంతాచ్చుయొక్క ఉచ్చారణ కాకువని ఆతని నిర్ణయము. ఇన్నింటికిని పలులక్ష్యములు చూపినాడు. ఒక కాకువునకు ఉదాహరణ :

నిబోధమునకు :

సీ. 'మేలవించినవి సు-మ్మీ దీనిమెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి
మిన్నేటిజలము సు-మ్మీ తోలంకెడునని
డాచేతమణికమండలువొసంగి
ఇది జపోచితముసు-మ్మీ జతనంబని
వలచేతఁ బద్మాక్షవలయమిచ్చి
ఈశానుఁడిచ్చెసు-మ్మీ మాకు నిదియని
శార్దూలచర్మంబుఁ జంకఁజొనిపి
గీ. పొమ్ముపొమ్మనియొకకొంత పోవఁబనిచి
రమ్మురమ్మని యొకకొంత రాగఁబిలిచి
కపటనటనాపరుండైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులుగొనియె.

పారి. 5-86.

('సుమ్మీ' అనుచోట నిబోధనము (చెప్పుట). సీసపు మొదటి రెండుపాదముల పూర్వార్థములందు హల్లుకు (మకారమునకు), చివరి రెండుపాదముల పూర్వార్థములందు అచ్చుకు (ఈకారమునకు) యతి చెల్లినది.) ఇట్లే మిగిలినవాటికి ఉదాహరణములు కావ్యములందు చూచుకోవలెను.

## ప్లుతయతి

పదాంతమందలి అచ్చుయొక్క ప్లుతోచ్చారణమువలన దూరాహ్వానము, రోదనము, గానము, సంశయము స్ఫురించునప్పుడు, ఆ ప్లుతాచ్చునకును, ఆ అచ్చుతోకూడిన హల్లుకును యతిచెల్లును. ఇట్లు చెల్లుట 'ప్లుతయతి' యగును. ఈ యతిని కొందరు చెప్పినారు. వారిలో నింత స్పష్టముగా చెప్పిన లాక్షణికుడు కూ. వేంకటరాయడు. (విశేషములకు చూ. కాకుస్వరయతి.) పై నాల్గింటికి అతడు పలు ఉదాహరణములు చూపినాడు. ఒకవిధమైన ప్లుతయతికి ఉదాహరణము :

గానప్లుతము : అచ్చుకు

శా. ఏయేదేశములం జరించితిరి మీరేయే గిరుల్ సూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా

రేయే పుణ్యవనాళిఁ గ్రుమ్మరితి రేయేతోయధుల్ సూచినా
రాయాచోటులఁగల్గు వింతలు మహా-త్మా నాకెఱింగింపవే.

—మను. 1-68

హల్లుకు :

క. వ్యాకరణధర్మశాస్త్రవి
వేకములుఁబురాణజాతవేదిత్వము బ్ర
హ్మైకత్వబోధనము నధి
పా కలిగినవారు పం_క్తి-పావనులు గడున్.

—భార. అనుశాసనిక 3-180

(భక్తి, గౌరవము, వాత్సల్యము, అనురాగము-ఈ మొదలైనవాటిచేత, అనగా, తద్ధర్మప్రతిపాదకశబ్దములచేత సంబోధనమాత్రమున 'గానప్లుతము' అని కూ. వేంకటరాయని నిర్వచనము.)

ప్లుతయుగయతి

కాకుస్వర, ప్లుతయతులకు చెందిన పదాంతాచ్చులు పరస్పరము యతి చెల్లినను, అచ్చులతో కూడిన హల్లులు పరస్పరము యతిచెల్లినను 'ప్లుతయుగ యతి' యగును. ఉభయత్ర ఉండునది ప్లుతమేకాన ఇది ప్లుతయుగయతి యైనది. దీనినే కూ. వేంకటరాయడు 'స్వరయుగయతి' అని పేర్కొన్నాడు. కాకు 'స్వర'-ప్లుత'స్వర'ములకుగాని, రెండు కాకుస్వరములకుగాని, రెండు ప్లుతస్వరము లకుగాని యతి చెల్లునుగాన 'స్వరయుగయతి' అన్నాడు.

ఉదా :

క. మాయరవియేలఁగ్రుంకడో
కో యను నిశ్లోలఁదడసె-నో యమ్మఁగ్రుంకం
బోయెడుఁబొమ్మిప్పుడయను
దాయవలచెనను మనోజతాపము పేర్మిన్

—భార. విరాట. 2-312

స్వరయుగయతి

చూ. ప్లుతయుగయతి.

నఞ్సమాసయతి

అనంత, అనేక-మొదలగునవి (న+అంత=అనంత, న+ఏక=అనేక) నఞ్సమాసములు. ఇట్టి సమాసములలో ఉత్తరపదాద్యచ్చుకేగాక, దానితో కూడియున్న హల్లుకూడ యతి చెల్లును. ఇట్టి చెల్లింపు 'నఞ్సమాసయతి' యగు నని కూ. తిమ్మన, క. రంగకవి చెప్పినారు.

ఉదా : హల్లుకు

ఉ. మ్రొగ్గెడువాహనంబులును మోములు ద్రెవ్వఁగఁ బాఱువాఱులుం
డిగ్గితొలంగునై నికుల-నేకులు కష్టపుపాటుచొప్పడన్
మ్రగ్గుసిడంబులుంగులము మాటికినెంచి యెదిర్చి యొంటినై
మ్రగ్గెడువారునై కురుధరావరుసైన్యము రూపుమాయఁగన్.
—భార. కర్ణ. 2-355

అచ్చుకు

ఉ. ఆశ్రితపోషణంబున న-నంతవిలాసమునన్మనీషి వి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁడాదిరాజనిభుఁడత్యకలంకచరిత్రసంపదన్.
—భార. ఆది. 1-6

నసమానయతి

చూ. ఆదేశయతి.

ఘఞ్యతి

'ఆలాప' శబ్దమధ్యమునగల లకారమునకేగాక, దానిపైనున్న అచ్చుకు గూడ యతిచెల్లును. ఇట్లు యతిచెల్లుట 'ఘఞ్యతి' యగునని క. రంగకవి చెప్పినాడు. నిజమునకు 'ఆలాప' శబ్దములో లకారముపై నచ్చు విరుగదు. లప్ ధాతువుకు భావార్థకమయిన ఘఞ్ ప్రత్యయము (ఈ ప్రత్యయమున మిగిలి యుండునది 'అ'.) పరమైనపుడు, లప్ అకారోపధముకావున, ఆ ఉపధాచ్చుకు దీర్ఘమగును. (పదమున చివరి అక్షరమునకు పూర్వాక్షరము ఉపధ యనబడును.) లప్ ధాతువులో పకారమునకు పూర్వముననున్న అకారము ఉపధ. దానికి దీర్ఘమగును. కాగా 'లాప' అని ఏర్పడగా ఆఙ్ ఉపసర్గతో 'ఆలాప' యని రూపొందినది. కావున లకారముమీది అచ్చుకు యతి చెల్లగూడదు. కాని కొన్ని ప్రయోగము లుండుటచే రంగకవి ఈ యతిని చెప్పినట్లున్నది.

ఉదా : అచ్చుకు

ఉ. గోపురకందరాళికడకున్ శశిపుష్కరిణీకణార్ద్రి సం
తాపహరానిలంబులు పతాకరణన్మణికింకిణీకలా
లాపములన్ సుఖంబడుగ-నాటిటఁజొచ్చియకాండగావహా
చాపలకృన్మరుద్గణముఁజందుడుబోలెడులోనివాకిటన్.
—ఆము. 7-31

అచ్చుకు, హల్లుకు :

క. శ్రీపరిఢవిల్ల సత్యా
లాప విలాసియగు కృష్ణు-నటువలె రంగ
క్ష్మాపతి శ్రీకరసత్యా
లాపవిలాసములఁ బ్రజల-లాలనసేయున్.

రంగ. ఛంద. 3-233

## సౌభాగ్యయతి

ఉభయయతులు చెల్లుటకు వీలైన పదములలో నొకపదమునకు మరి యొక పదము యతిచెల్లినచో 'సౌభాగ్యయతి' యగునని లింగముగుంట తిమ్మ కవి చెప్పినాఁడు.

ఉదా :

'ప్రాంచితామరవినుత వే-దండవరద'

'ప్రాంచిత' (ప్ర+అంచిత) అనునది ఉపసర్గయతి ప్రకారము ఉభయయతి చెల్లు పదము 'వేదండ' (వేద+అండ) అనునది పరరూపయతిప్రకారము ఉభయయతి చెల్లు పదము. ప్రాంచితలోని ఉత్తరపదాద్యచ్చుకు 'వేదండ'లోని ఉత్తరపదా ద్యచ్చు యతి చెల్లినది. ఇట్లే హల్లులకును యతి చెల్లవచ్చును.

ఉదా :

'నాకరిపుశిక్షు శౌరి య-నంత యనఁగ'

'నాక' ఆదేశయతిప్రకారము, 'అనంత' నఞ్సమాసయతి ప్రకారము ఉభయ యతులు చెల్లు పదములు. ఈ రెంటిలో హల్లు యతిచెల్లినది.

## ప్రాసయతి

యతి చెల్లింపవలసిన స్థానమున ప్రాస చెల్లించినచో 'ప్రాసయతి' యగును. ప్రాసయతి యనగా యతిచెల్లుటకుబదులు, ప్రాసచెల్లుట. ప్రాసచెల్లుట నిజమునకు యతిచెల్లుటకాదు. అందువలన ప్రత్యేకముగా 'ప్రాసయతి' చెప్ప వలసివచ్చినది. యతిస్థానమున ప్రాస చెల్లునప్పుడు ప్రాసకు సంబంధించిన నియ మములన్నియు పాటింపబడవలెను. మరియు ప్రాసభేదములెన్నో అన్నివిధముల నీ యతిస్థానమున చెల్లు ప్రాసయు నుండును. (చూ. ప్రాస; ప్రాసభేదములు.) తెలుగులో 'ఉపజాతి' పద్యములందే ఈ ప్రాసయతి చెల్లును (చూ. ఉపజాతులు).

ఉదా :

గీ. వెలఁది పుత్త్రోదయారంభ-వేళయందు
నిన్ను నెన్నడు చూతునో-కన్నులార'

—శివ. రా. మాహా. 2-26.

(మొదటిపాదమున యతి, రెండవపాదమున ప్రాసయతి చెల్లినది గీతపద్యమున చతుర్థగణాదియందు యతిచెల్లును. రెండవపాదమున నిన్ను-కన్ను అని ప్రాస చెల్లినది. కాగా ఇది ప్రాసయతి.)

యతియు, ప్రాసయతియు రెండును ఒకేచోట చెల్లినచో, అక్కడ యతిచెల్లినట్లేతప్ప ప్రాసయతి చెల్లినట్లు భావించగూడదని **'లక్షణచూడామణి'** యందు చెప్పబడినట్లు లిం. తిమ్మన ఒకపద్య ముదహరించినాడు. (చూ. సులక్ష. యతి 200).

ఉదా :

'చారుతరహాసకీర్తిప్ర-చారుఁడనగ'

ఇక్కడ వర్గయతితోబాటు ప్రాసయతియు చెల్లినది. కాని వర్గయతి చెల్లినట్లే భావింపవలెనుతప్ప ప్రాసయతి చెల్లినట్లు కాదని అభిప్రాయము కాని, ప్రాస యతి నియమముగా చెల్లించవలసినచోట్ల ప్రాసయతితోబాటు యతియు చెల్లిన కవిప్రయోగము లనేకములున్నవి.

ఉదా :

'...సుమనోభా
రమ్ముల నశోకనిక-రమ్ములును జంపకచ
యమ్ములు గింశుకవ-నమ్ములును నొప్పెన్.

—భార. ఆది. 5-138

ఇది 'లయగ్రాహి' పద్యపాదము. ఇందు ప్రాసయతి నియతము. పైపాదమున 'రమ్మ-రమ్మ' అని ప్రాసయతితోబాటు (ఎక్కటి) యతియు చెల్లినది. ఇది ఎక్కటియతియేగాని ప్రాసయతి కాదన్నచో యతిభంగమైనట్లు. కావున లక్షణ చూడామణి మతము కవిప్రయోగములకు భిన్నమనవలయును. (నన్నయగారి ప్రాసయతి నియతిగల సీస, గీతములందు పలుచోట్ల ఇట్టి ప్రయోగములున్నవి.)

## ప్రాసము

పద్యపాదమందలి రెండవ అక్షరమునకు 'ప్రాస'మని పేరు. అనగా పాదమున ప్రథమ ద్వితీయాచ్చుల నడుమనున్న వ్యంజనము, లేదా వ్యంజన సమూహము (-ఉన్నచో పూర్ణ, అర్ధబిందుపూర్వకముగా-) ప్రాసమనబడును. ఉదా: 1. రాముఁడు, 2. కృష్ణుఁడు, 3. గంధము, 4. వాఁడు. రాముఁడులో రేఫమీది 'ఆ' మొదటిఅచ్చు. మకారముమీది ఉకారము రెండవఅచ్చు. ఈ రెం డచ్చుల నడుమ మకారమున్నది. ఆ మకారము ప్రాసము. రెండవదానిలో షకారణకార సంయుక్తము (తమ్ముఁడు వంటిచోట్ల మకారద్విత్వము), మూడవ దానిలో పూర్ణబిందుపూర్వక ధకారము, నాల్గవదానిలో అర్ధబిందుపూర్వక డకారము ప్రాసాక్షరములు. ఈ యంశమునే చెప్పుటకు సామాన్యముగా ద్వితీ

యూక్షరము ప్రాసమని వ్యవహారము. ఈ ప్రాసాక్షరము నాలుగుపాదములందు ఒకటే అయిఉండవలెను. మొదటిపాదమున ప్రాసము 'ష్ణ'కారమైనచో అన్ని పాదములందును ష్ణకారమే యుండవలెను. ఇట్లున్నచో పద్యమున ప్రాస చెల్లి నట్లగును. 'ప్రాసనియమమున్నది' అనగా ఇట్లు నాల్గుపాదములందు ప్రాసాక్షర మొకటే అయియుండవలెనని తాత్పర్యము.

ప్రాస చెల్లించుటలో హల్లునకేతప్ప అచ్చునకు ప్రాధాన్యములేదు. పై ప్రాసస్వరూప వివరణమునుబట్టి ప్రాసాక్షరముమీది అచ్చుతో ప్రాసాక్షరము నకు సంబంధము లేదని స్పష్టము. కాగా మొదటిపాదమున ప్రాసాక్షరముమీద ఉకారమున్నచో (రాముఁడు) సర్వత్ర ఉకారమే ఉండనక్కరలేదు. అకారాదిగా నే అచ్చైనను (కోమలి, కామిని మొ.) ఉండవచ్చును. 'వికృతి'వంటి పదము లందు ప్రాసాక్షరముమీద ఋత్వము (వట్రువసుడి) ఉన్నది. ఋకారము అచ్చే కావున 'వికృతి-సకలము' అనువిధముగా ప్రాసచెల్లును. (స్పష్టతకొరకీ యంశము చెప్పబడినది.)

ప్రాసపూర్వాక్షరము మొదటిపాదమున గురువైనచో మిగిలినపాదము లందును గురువే కావలయును. లఘువైనచో లఘువే కావలయును. ఇక్కడ హ్రస్వత్వ దీర్ఘత్వములతో పనిలేదు. గురుత్వ-లఘుత్వములే కావలయును. (వింత-కాంతి. అయినప్పుడు ప్రాసపూర్వాక్షరము మొదట హ్రస్వము, తరువాత దీర్ఘము కావచ్చునుకాని పూర్ణబిందువు కారణముగా రెండును గురువులే. ఇట్లే సర్వత్ర గమనించవలెను.)

ప్రాసమనగా వ్యంజనమేగాని స్వరముకాదని స్పష్టము. కాని చమ త్కారముకొరకు ఎక్కడైనను పాదాద్యచ్చు తరువాత అచ్చునే నిలిపి, దానిని రెండవవర్ణముగా-కావున ప్రాసాక్షరముగా గ్రహించి నాల్గుపాదములలో అచ్చులే ప్రాస చెల్లించవచ్చును. అయితే-ఇట్టిచోట్ల ప్రథమపాదమున ప్రాసస్థానమందున్న అచ్చే అన్నిపాదములందు చెల్లనక్కరలేదు. ఏ అచ్చైనను ప్రాస చెల్లును.

ఉదా :

క. 'ఉ ఉమాపతి రి రమాపతి
రి ఆత్మభూరేషనైషధేశ్వర ఇతి భూ
య ఉదాహరంతి విబుధాః
ఖ ఆత్మచరితం నృపాలక శ్రుణు' యనుచున్.

—ఉత్తరనైషధము
(మల్లమపల్లి వీరేశ్వరశర్మ)

ఇట్టి రచన చిత్రరచనయే యనవలయును. కాని తెలుగున ప్రాసాక్షరముగా అచ్చు నిలువదు. సంధి జరుగుటయో, యడాగమము కల్గుటయో ద్రుతము(న్)

ఉన్నచో పై అచ్చుతో కలియుటయో తప్పదు. అందువలన ఏ లాక్షణికుడును ప్రాసగా అచ్చు నిలుచుటనుగూర్చి ప్రస్తావించనుగూడలేదు. కవిజనాశ్రయమున

క. అఆలై ఔలకు మరి
ఇఈలు ఋకారసహితమె ఏలకు నౌ
ఉ ఊ ల్తమలో నొడఁబడి
ఒ ఓ లకు వళ్లగున్ నయోన్నతచరితా

అని ప్రాసగా అచ్చును నిలిపినట్లు పద్యమున్నదిగాని, ఇది అసహజము (లేదా మిక్కిలి అరుదు) కావున క. జ. యందెక్కడను దీని ప్రస్తావన లేదు.

సంస్కృతచ్ఛందశ్శాస్త్రమున 'ప్రాస'ము లేదు. కన్నడమం దున్నది. తమిళమున నున్నది. అందు ప్రాసమును 'ఎదుగై' అందరు.

ప్రకృష్టవర్ణవిన్యాసము ప్రాసము. (ప్రకృష్టో వర్ణవిన్యాసః ప్రాసః) సంస్కృతసాహిత్యమున ప్రాసమనునది లేదుకాని అనుప్రాసమను శబ్దాలంకార మున్నది. అలంకారముగాన అది యొక నియమముగాదు. ఐచ్ఛికము. కాని తెలుగునందు పద్యమునకు ఒక ప్రత్యేక నియమము.

తెలుగున వృత్తములకు, జాతులకు ప్రాసనియతము. ఉపజాతులకు అనియతము. (చూ. వృత్తములు; జాతులు; ఉపజాతులు.)

ప్రాసములకు లక్ష్యములను లాక్షణికులు 'ప్రాసయతు'ల రూపమున సామాన్యముగా చూపింతురు ప్రాసభేదములన్నియు ప్రాసయతులందు దుపయో గించవచ్చును. (చూ. ప్రాసయతి.)

**ప్రాసభేదములు**

ప్రథమపాదమందలి ప్రాసాక్షరమునే మిగిలినపాదములందును హల్వి షయకమయిన ఏ మార్పును లేకుండ చెల్లించవలెను. కాని వర్ణోచ్చారణాది సామ్యములు, కవుల ప్రయోగముల ననుసరించి కొన్ని ప్రాసభేదములను లాక్ష ణికులు గుర్తించి నిరూపించినారు. యతిభేదము లంతగా ఎక్కువ సంఖ్యలో నీ ప్రాసభేదములు ఉండుటకు వీలులేకున్నను కొన్ని భేదము లేర్పడినవి.

1. సమప్రాసము
2. పూర్ణబిందుప్రాసము
3. అర్ధబిందుప్రాసము-1
4. సంయుతాక్షరప్రాసము
5. అర్ధబిందుప్రాసము-2
6. ఖండాఖండప్రాసము
7. త్రిప్రాసము-1
8. ఉభయప్రాసము-1
9. సంయుతాసంయుతప్రాసము

10. సంయుతప్రాసము
11. రేఫయుతప్రాసము
12. సమలఘుప్రాసము
13. లఘుద్విత్వప్రాసము
14. వికల్పప్రాసము
15. ప్రాదిప్రాసము
16. ఉభయప్రాసము-2
17. అనునాసికప్రాసము
18. ప్రాసమైత్రిప్రాసము-1
19. స్వవర్గజప్రాసము
20. వర్గప్రాసము
21. ఋప్రాసము
22. లఘుయకారప్రాసము
23. ప్రాసమైత్రిప్రాసము-2
24. అభేదప్రాసము
25. సంధిగతప్రాసము
26. బిందుప్రాసము
27. శప్రాసము
28. ప్రాసవైరము

ఇవికాక శబ్దాలంకారప్రాయములైన ప్రాసములను ఆరింటిని లాక్ష ణికులు చెప్పినారు. (చూ. షడ్విధప్రాసములు)

## సమప్రాసము

పద్య ప్రథమపాదమున ప్రాసాక్షరము అర్ధబిందుపూర్వకమైనచో మిగిలిన పాదములందును అర్ధబిందుపూర్వకమే కావలయును. పూర్ణబిందు పూర్వకమైనచో పూర్ణబిందుపూర్వకమే కావలయును. అట్లే సంయుత (సంయుక్తముగాని, ద్విత్వముగాని) మయినచో మిగిలిన పాదములందును సంయుతమే కావలయును అనగా ప్రథమపాదమున ఏహల్లులు కలసిన సంయుత ముండునో అదే మిగిలిన పాదముల నుండవలెను

ఈ మూడంశములను అప్పకవి మూడు ప్రత్యేక ప్రాసములుగా చెప్పినాడు. (ఉదాహరణములకు చూ. అర్ధబిందుప్రాసము; పూర్ణబిందు ప్రాసము; సంయుతాక్షర ప్రాసము.)

నిజమున కీ యంశములు ప్రత్యేక ప్రాసభేదము లనుటకు వీలులేనివి. ప్రాస చెల్లించునప్పుడు సామాన్యముగా సర్వత్ర పాటింపబడు నంశములివి,

### పూర్ణబిందుప్రాసము

ప్రథమపాదమున ప్రాసాక్షరము పూర్ణబిందుపూర్వకమయినచో మిగిలిన పాదములందును పూర్ణబిందుపూర్వకమే కావలయును. అట్లగుచో 'పూర్ణబిందుప్రాస'మగునని అప్పకవి చెప్పినాడు. ఇది సమప్రాసమందే యంతర్భవించినది. (చూ. సమప్రాసము.)

ఉదా :

క. ఇందుగలఁడందు లేఁడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే గలఁడు దానవాగ్రణి వింటే.

—భాగ. 7

### అర్ధబిందుప్రాసము-1

పద్యప్రథమపాదమున ప్రాసాక్షరము అర్ధబిందుపూర్వకమైయున్నచో మిగిలిన పాదములందును అట్లే ఉండవలయును. ఇట్లుండుట అర్ధబిందుప్రాసమని అప్పకవి చెప్పినాడు. (నిజమున కిది ప్రాస చెల్లించుటలో పాటించు సామాన్య నియమమేగాని ప్రత్యేక ప్రాసముగా చెప్పుటకు వీలైనంతదిగాదు. (చూ. సమ ప్రాస.)

అనంతుడు చెప్పిన అర్ధబిందుప్రాసమున కిది భిన్నము. దాని నప్పకవి ఖండాఖండప్రాసమన్నాడు. (గూ అర్ధబిందుప్రాసము-2; ఖండాఖండ ప్రాసము.)

ఉదా :

వీఁకఁబం క్తిముఖుని-దాఁకికోసలవల్ల
భుఁడు బలాసురాంత-కుఁడు సెలంగ
నవనిఁగూల్చెననుట నర్ధబిందుప్రాస
మిట్లు గూర్పవలయు నెల్లకడల.

—అ. క. 3-౭00

### సంయుతాక్షరప్రాసము

సంయుతాక్షరమనగా ద్విత్వాక్షరము కావచ్చును, సంయుక్తాక్షరము కూడ కావచ్చును. ప్రథమపాదమున ప్రాసాక్షరము ద్విత్వమైనచో మిగిలిన పాదములందుగూడ ద్విత్వమే కావలెను. సంయుక్తమైనచో మిగిలినచోట్లగూడ సంయుక్తమే కావలయును. ఇట్లగుచో 'సంయుతాక్షరప్రాస'మగునని అప్పకవి

చెప్పినాడు. (ఈ యంశము 'సమప్రాస'మందే యంతర్భవించును. (చూ. సమప్రాసము.)

ఉదా :

i. క. ఎయ్యెడకుఁ జనినఁ బురుషుం
డియ్యెడకును మగుడకుండు నెక్కాలము, నే
నయ్యుత్తమపదవికినై
యెయ్యెనువుననైన నుత్సహించెద బుద్ధిన్.

—భార. అరణ్య. 6-140

ii. క. దుర్మతులను దుర్జనులను
ధర్మస్థితినోర్వఁ దగునె ధరణీశ్వర డు
ష్కర్ములగు ధార్తరాష్ట్రుల
పేర్మియడఁగింపఁగడఁగు పృథుభుజశక్తిన్.

—భార. అరణ్య. 1-289

## అర్ధబిందుప్రాసము-2

అర్ధబిందుపూర్వకములైన ప, ట వర్ణములకు అర్ధబిందుపూర్వకములు కాని, కేవల ప, ట వర్ణముల ప్రాస చెల్లవచ్చును అనంతుడు కేవల ప, ట లకే ఈరీతి చెప్పగా, మిగిలిన లాక్షణికులు ఇతర హల్లులకును వర్తించునని భావించినారు. కాగా సార్ధబిందుక, నిర్బిందుక వర్ణములకు ప్రాస చెల్లవచ్చును.

ఈ ప్రాసమునే అప్పకవి 'ఖండాఖండ' ప్రాసమని పేర్కొన్నాడు.

అర్ధబిందుప్రాసమన్నను, ఖండాఖండప్రాసమన్నను పై వివరణము స్ఫురించదు. 'సార్ధబిందుక నిర్బిందుక ప్రాసయని పేరు పెట్టవచ్చు'నని శ్రీ రావూరివా రన్నారు. (చూ. తె. భా. ఛం. రీ. పు. 327)

అప్పకవి అర్ధబిందుప్రాసమను పేర చెప్పిన ప్రాసభేదము దీనికన్న భిన్నము. (చూ. అర్ధబిందుప్రాస-1.)

ఉదా :

'...పీఁపు మూఁపులు మఱి తల-మోపులయ్యె
మాఁటులేఁటికి మేటి తా-బేటికనఁగ'

—అనం. ఛం. 1-52

**ఖండాఖండప్రాసము**

చూ. అర్ధబిందుప్రాసము.

**త్రిప్రాసము-1**

సంఖ్యావాచకమయిన 'త్రి'కారము రేఫసంయుక్తము. దీనికి రేఫ సంయుక్తము కానట్టి తకారప్రాసము చెల్లునని, అది 'త్రిప్రాసమ'గునని అనంతుడు చెప్పినాడు.

ఉదా :

ఆ త్రివిక్రముఁడభయప్ర-దాత యనఁగ.

—అనం. ఛం. 1-45

అయితే ఇది కేవల సంఖ్యావాచకమగు 'త్రి'వర్ణమునకేకాక సంఖ్యా వాచకములుకాని ఇతరవర్ణములును రేఫయుతములై, అయుతములకు ప్రాస చెల్లునని ఇతర లాక్షణికులు భావించినారు. (చూ. సంయుతాసంయుతప్రాసము.)

షడ్విధప్రాసములలోని 'త్రిప్రాస'మునకు దీనికి సంబంధములేదు. (చూ. త్రిప్రాసము-2)

**ఉభయప్రాసము-1**

రేఫముతోగాని, లకారముతోగాని శ్లిష్టమైన 'డ'కారమునకు, ఆ విధముగా శ్లిష్టముకానట్టి కేవల డకారము ప్రాస చెల్లినచో 'ఉభయప్రాసమ'గునని అనంతుడు చెప్పినాడు. దీనినే 'రలయుతాయుతప్రాస' మనియు అన్నాడు. (చూ. అనం. ఛంద. 1-54) అయితే ఈ 'రలయుతాయుత ప్రాసమార్గముఁ దలంచి' లకార శ్లిష్టడకారమునకు-రేఫశ్లిష్ట డకారమునకు ('వాండ్లలేఁజూపు మోములఁదీంద్రమారె అనువిధముగా) ప్రాసము చెల్లించగూడదని చెప్పినాడు. ఇట్లు చెప్పుటకు కారణము ర-ల ప్రాసమును (యతినిగూడ) అంగీకరించక పోవుటయే. (చూ. అభేదయతి.)

రేఫ శ్లిష్టాశ్లిష్టములకు, అట్లే లకార శ్లిష్టాశ్లిష్టములకు ప్రాస చెల్లుట ఒక్క డకారవిషయమునసేగాక అన్ని హల్లులవిషయమునను వర్తించునని మిగిలిన లాక్షణికులు భావించినారు ఇట్టి ప్రాసమును అప్పకవి 'సంయుతాసంయుత' ప్రాసమని పేర్కొన్నాడు. (చూ. సంయుతాసంయుతప్రాసము.)

i. క. 'పాండిమరఁగి బ్రతుకు-వాండ్రిల వ్రేతలు
వాండ్ర వెన్న లేల-తండ్రి నీకు
పండ్లుకొఱకు వింత-యిండ్లకుఁబోకు కృ
ష్ణుండ నీకు బ్రాతె-పండ్లు నిచట.

అనం. ఛంద. 1-58

'ఉభయప్రాసము' అను పేర అప్పకవి ప్రాదిప్రాసమును చెప్పినాడు. (చూ. ప్రాదిప్రాసము )

**సంయుతాసంయుతప్రాసము**

రేఫశ్లిష్టమునకు-అశ్లిష్టమునకు. లకారశ్లిష్టమునకు-అశ్లిష్టమునకు ప్రాస చెల్లును. ఇట్లు చెల్లినచో 'సంయుతాసంయుతప్రాసమ'గునని అప్పకవి చెప్పి నాడు.

ఉదా :

క. శ్రీకరచక్రాంకితులును
లోకులు శుద్ధులును బుణ్యులును నగుదురు వా
రీ క్రియలు లేకయుండిన
ప్రాకృతులనఁబతితులనఁ గఁబడుదురు జగతిన్.

—పద్మపురాణము (అ. క. 3-321)

క. ఓ పద్మనేత్ర దమయం
తీ పౌరుషమూర్తిపుణ్యనిష్ఠామతియౌ
నీ ప్లక్షద్వీపాధిపు
నీ పుణ్యశ్లోకుఁజూడవే ప్రియదృష్టిన్.

—కల్పితము

**సంయుతప్రాసము**

ఈ ప్రాసములో రెండంశములు చెప్పబడినవి.

i. పాడు, ఊరు, ప్రోలు-ఇత్యాదుల చివరనున్న డు, రు, లు లోని హల్లు (డకార, రేఫ, లకారము) లకు బహువచన ప్రత్యయమగు 'లు' పరమైనపుడు ళకారమాదేశమగును. కాగా పాళ్లు, ఊళ్లు, ప్రోళ్లు-ఇత్యాది రూపము లేర్పడును. అంతేకాని పాడ్లు-ఊర్లు-ప్రోల్లు-ఇత్యాదిగా నేర్పడవు. కావున బహువచనాంతములైన ఇట్టి పదముల 'ళ్ల'కారమునకు 'ళ్ల'కారములే ప్రాసములు చెల్లును.

ii. పదాదియందలి రేఫశ్లిష్టవర్ణములు తేల్చిపల్కబడునపుడు వాటివలె తేల్చబడు రేఫశ్లిష్టములే ప్రాస చెల్లును. (ఈ రేఫశ్లిష్టవర్ణము పదమధ్యమందును కొన్నిట తేల్చిపల్కబడును.)

-ఈ రెంటిని కలిపి అనంతుడు 'సంయుతప్రాస'మని చెప్పగా, రెండవ అంశమును మాత్రము 'రేఫయుతప్రాస'మని అప్పకవి చెప్పినాడు.

నిజమున కివి ప్రాసభేదములనుటకు వీలైనవికావు. కొన్ని తెలుగు పదముల స్వరూపమును నిర్ణయించుటయే జరిగినది.

ఉదా :

i. పాళ్లమనుజులెక్క-నూళ్లుగాఁదొడఁగె న
యాఁళ్లు మిగులఁబలసెఁ-బ్రోళ్లుగాఁగ...

ii. ఈ క్రిందటి రేఫలు సమ
మై క్రాలుచుఁ దేలి ప్రాసమగు సంయుక్తం
బా క్రూరనక్రభయమున
వాక్రువ్వదె జగము భక్తవత్సలుఁడనఁగన్.

—అనం. ఛంద. 1-56, 58

**రేఫయుతప్రాసము**

చూ. సంయుతప్రాసము.

**సమలఘుప్రాసము**

రేఫ సంయుక్తమయ్యును ఊదబడకనుండెడు 'అద్రుచు, విద్రుచు' వంటి పదములు తెలుగులో నున్నవి. ఈ పదములకు పరస్పరము ప్రాస చెల్లును. ఇట్లు చెల్లుట 'సమలఘుప్రాస'మగును. దీనినే 'లఘుద్విత్వప్రాస'మని అప్పకవి పేర్కొన్నాడు.

ఉదా :

'విద్రిచె వినతాత్మజుఁడు దిక్కు-లద్రువనఁగ'

—అ. క 3-326

(అద్రుచు-విద్రుచు మొదలగువాటియందు రేఫసంయుక్తము 'ద్రు' పరమైనను తత్పూర్వమందున్న 'అ', 'వి' మొదలగునవి గురువులుకావు. రేఫసంయుక్తమును తేల్చి పల్కుట దీనికి కారణము. చూ. గురువు.)

**లఘుద్విత్వప్రాసము**

చూ. సమలఘుప్రాసము.

**వికల్పప్రాసము**

అనునాసికాక్షరములు పరమైనపుడు పొల్లులైన క-చ-ట-త-ప (మొదట జశ్త్వసంధి జరిగి ఇవి గ-జ-డ-ద-బ లగును) లకు వరుసగా ఙ, ఞ్, ణ్, న్, మ్, అను అనునాసికములు ఆదేశములగును. ఇట్లగుట 'అనునాసికసంధి'. ఈసంధి వికల్పము. కాగా ప్రాక్+నగము=(జశ్త్వసంధి) ప్రాగ్+నగము=

ప్రాఙ్నగము, ప్రాగ్నగము అని రెండురూపములేర్పడును. (సామాన్యముగా ఆదేశము వచ్చిన 'ప్రాఙ్నగము' వంటి రూపములే వ్యవహారమున నున్నవి.) ఇట్టిచోట్ల ఙ్న మొదలగువాటికి 'గ్న' మొదలగు సంయుక్తములు ప్రాస చెల్లి నచో 'వికల్పప్రాసము' అగును.

ఉదా :

'ప్రాఙ్నగంబుపైరవిదోచె-నగ్నియనఁగ
ప్రాఙ్ముఖుండై నుతించె నీ-వాగ్మియనఁగ

—అనం. ఛం. 1-50

(ప్రాఙ్నగ, ప్రాగ్నగ అని రెండురూపము లుండవచ్చుగాన పై ఉదాహరణమున 'ప్రాగ్నగ, ప్రాగ్ముఖుండు' అని యుండినదన్నను సరిపోవును. కాని ఈ అను నాసికసంధియే 'మయట్' పరమగునపుడు నిత్యము. చిత్+మయము=చిన్మయము అనియే అగునుగాని 'చిద్మయము' అని ఉండదు. కావున 'పద్మనేత్రుండు దేవుండు-చిన్మయుండు' అని ప్రాస చెల్లించవచ్చును. కాని లాక్షణికులు వికల్ప సంధిగల రూపములే లక్ష్యముచూపి, ప్రాసమును 'వికల్పప్రాసమ'నియే పేర్కొ నుటవలన మయట్ పరమైనప్పటి రూపములు ఈ ప్రాస పరిధికి రానట్లు కన్పించును.)

## ప్రాదిప్రాసము

పాణినీయవిధుల ననుసరించి 'ప్ర+అన, వి+సమ' మొదలగుచోట్ల నకార, సకారములకు క్రమముగా ణకార, షకారము లాదేశములై 'ప్రాణ, విషమ' మొదలగురూపము లేర్పడును. ఇట్టి ఆదేశ ణకారమునకు సహజ న, ణలు ప్రాస చెల్లినచో 'ప్రాదిప్రాస'మగునని అనంతుడు చెప్పినాడు. దీనితోపాటు, ఆదేశ షకారమునకు సహజ స, షలు ప్రాస చెల్లినచో 'ఉభయప్రాస'మగునని అప్పకవి చెప్పినాడు. అనంతుడు చెప్పిన ఉభయప్రాసమున కిది భిన్నము. (చూ. ఉభయప్రాసము-1). వీరి లక్ష్యలక్షణములబట్టి సహజ న-ణ లకు పరస్పరము ప్రాస చెల్లదు. (కాని కవిప్రయోగము లిట్టివున్నవి.)

ఉదా : i. నణ లకు

'క్షోణిధరుఁడైత్తె నేనుఁగు-ప్రాణమనఁగ
దానవారాతిప్రేతల-ప్రాణమనఁగ'

—అనం. ఛంద. 1-48

ii. సష లకు

'...తమో, విసతాంబుజమిత్రునకు
న్విషమ శిలీముఖసహస్రనిభగాత్రునకున్.

—సాం. వి.

'...జామా, త్రిషునకు ఋషిపూజితునకు
విషమాతున కింద్రముఖ దివిజపతునకున్'

—త్రైశంక.

(ఆదేశ ణ, ష లకు ఆదేశ ణ, ష లు ప్రాస యెట్లును చెల్లును.)

iii. సహజ న ణ లకు

సీ. గీ. 'అణచునది దంభముజ్జగించునది యీర్ష్య
యుడుగునది రాగలోభగర్వోదయముల...'

కాశీ. 7-120

**ఉభయప్రాసము-2**

చూ. ప్రాదిప్రాసము.

**అనునాసికప్రాసము**

బిందుపూర్వక నకారము - ద్విత్వనకారము; మరియు బిందుపూర్వక మకారము - ద్విత్వమకారము ప్రాస చెల్లును. ఇట్లు చెల్లినచో అనునాసిక ప్రాస మగును.

i. మిన్నేఱు పాదమున ధా
తన్నాభినిఁగుసుమశరు నెదంగాంచిన నీ
సాంనిధ్యము దొరకుటకై
సంనుతి సేయుదురు నిన్ను సనకాదులజా !

ii. తమ్ములను మల్లికా కుసు
మమ్ముల మరువాది పత్రమాలికలను భ
క్తిమ్మరహరు పూజలు
సంమదమున సలుపగలుగు సకలార్థంబుల్.

— అ. క. 3-341, 342

## ప్రాసమైత్రిప్రాసము-1

బిందుపూర్వక బకారమునకు-ద్విత్వమకారమునకు (ంబ-మ్మ) ప్రాస చెల్లును. ఇట్లు చెల్లినచో ప్రాస మైత్రిప్రాస మగునని అప్పకవి చెప్పినాడు. అనంతుడు ఈ పేర ఈ ప్రాసరీతి చెప్పినాడుగాని ద్విత్వ మకారమునకు బదులు బిందుపూర్వక మకారమని చెప్పినాడు. చూ. ప్రాస మైత్రిప్రాసము-2. (తెలుగున బిందుపూర్వక మకారము అసహజముగాన అప్పకవి పై రీతిగా చెప్పి యుండును.)

ఉదా :

'కమ్మతావుల వెదజల్లు - నంబుజములు
శంబరారాతి చేతి చక్రమ్మనంగ'

— అ. క. 3-348.

స్వవర్గజప్రాసము

క-చ-ట-త-ప వర్గములయందలి ప్రథమ-తృతీయ వర్ణములకు, (క-చ-ట-త-ప లకు వరుసగా గ-జ-డ-ద-బ లు) ద్వితీయ-చతుర్థ వర్ణములకు (ఖ-ఛ-ఠ-థ-ఫ లకు వరుసగా ఘ-ఝ-ఢ-ధ-భ లు) తృతీయ-చతుర్థ వర్ణములకు (గ-జ-డ-ద-బ లకు వరుసగా ఘ-ఝ-ఢ-ధ-భ లు) ప్రాస చెల్లవచ్చునని, అట్లు చెల్లుట 'స్వవర్గజప్రాస'మగునని కూ. వేంకటరాయడు చెప్పినాడు. కాని లక్ష్యములు త వర్గమున కెక్కువగా, ట వర్గమునకు తక్కువగా లభించును. మిగిలిన వర్గములకు కన్పించవు. వేంకటరాయనికన్న పూర్వులగు అప్పకవ్యాదులు ఈ రెండువర్గములనే ఉద్దేశించి ఈ ప్రాసము చెప్పినారు.

ఉదా : ప్రథమ తృతీయ వర్ణములకు

చ. పెటిలి సువర్ణపర్వతము పెక్కు తెఱంగుల వ్రయ్యునట్టుల
ప్పుడు వివిధప్రకారముల భూరిశిఖావళి ఖాండవంబు న
గ్లడఁగడుఁబర్వఁగాఁ బెరసి కాల్పఁదొడంగె హుతాశనుండు చే
ట్పడఁగ వనంబులోని మృగపక్షిభుజంగమ భూతసంఘముల్.

—భార. ఆది. 8-259

ద్వితీయ చతుర్థవర్ణములకు

క. సింధురము మహోద్రేకమ
దాంధంబై వచ్చునోజ నాచార్యునిపై
గంధవహసుతుఁడు గవయగ
మంథరగతి నెవ్వఁడాగు మన యోధులలోన్.

—భార. ద్రోణ. 1-88

తృతీయ-చతుర్థవర్ణములకు

ఉ. కాదన కిట్టిపాటి యపకారము తత్కుఁడేకవిప్రసం
బోధనఁజేసి చేసె నృపపుంగవ నీవు ననేక భూసురా

పాదీత సర్పయాగమున భస్మముసేయుము తక్షకాది కా
కోదర సంహతిన్ హుతమహోగ్రసమగ్రశిఖాచయంబులన్.

—భార. ఆది. 2-201

(మొదటిపద్యమున మొదటిపాదమున వర్గప్రథమాక్షరము. మిగిలిన పాదములలో తృతీయాక్షరము. రెండవపద్యమున నాల్గవపాదమున వర్గద్వితీయాక్షరము. పై మూడింట చతుర్థాక్షరము. మూడవపద్యమున రెండవపాదమున వర్గచతుర్థాక్షరము, మిగిలిన పాదములలో తృతీయాక్షరము. మొదటిపద్యము భారత ముద్రిత ప్రతులందు 'పెడిలి' అని ప్రారంభమయినట్లు (వర్గతృతీయాక్షరముతో) ఉన్నది. కూ. తిమ్మన, వేంకటరాయడు 'పెటిలి' అని ఉదాహరించినారు.)

ఈ ప్రాసమునే క. రంగకవి 'వర్గప్రాస'మని పేర్కొన్నాడు.

ఒకే వర్గములోని భిన్నాక్షరములు ప్రాస చెల్లుటవలన ఇది స్వవర్గజ ప్రాసమైనది.

**వర్గప్రాసము**

చూ. స్వవర్గజ ప్రాసము.

**ఋ ప్రాసము**

ఋకారము స్వరము. రేఫ వ్యంజనము. ఈ రెంటికి ప్రాస చెల్లును. అట్లు ప్రాస చెల్లినచో 'ఋ' ప్రాసమగును.

ఉదా :

క. ఆ ఋషికుమారు గట్టిన
చీరలు మృదులములు కడు విచిత్రములు మనో
హారము లతని బృహత్కటి
భారము నందొక్క కనకపట్టము ప్రేలున్.

— భార. అరణ్య. 3-104

**లఘుయకారప్రాసము**

'సంధిలేనిచోట స్వరంబునకుం బరంబైన స్వరంబునకు యడాగమం బగు'.

ఈవిధముగా ఆగమమైన యకారమునకు, పదమునందు సహజముగా నున్న యకారమునకు ప్రాస చెల్లినచో, అది 'లఘుయకారప్రాస'మగునని అప్ప కవి చెప్పినాడు.

ఉదా :

క. మాయందు లేనిగుణములు
మీ యనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్
మీ యనుగతి మాకు నభి
ప్రాయము, వనవాసదుఃఖభర మోపుదు రే.

—భార. అరణ్యా. 1-8.

(మొదటి మూడుపాదములందు ఆగమయకారము. నాల్గవపాదమున సహజ యకారము.)

ప్రాసమైత్రిప్రాసము-2

ఈ ప్రాసము మూడువిధములుగా చెప్పబడినది.

i. ల-ళ లకు పరస్పరము ప్రాస చెల్లును.

ii. బిందుపూర్వక బ-మ లు (ంబ-ంమ) పరస్పరము ప్రాసచెల్లును.

iii. ఋత్వసహిత, విరహిత హల్లులు (కృ-క మొ.) పరస్పరము ప్రాస చెల్లును.

ఈ మూడంశములను కలిపి 'ప్రాసమైత్రి' పేర అనంతుడు చెప్పినాడు. (ఇందలి రెండవ అంశమును మాత్రమే అప్పకవి ప్రాసమైత్రిపేర చెప్పినాడుగాని కొంత భేదమున్నది. (చూ. ప్రాసమైత్రిప్రాసము-1.) పై వాటిలో మొదటి అంశమును 'అభేదప్రాసము'నందు అప్పకవి కలిపి చెప్పినాడు. మూడవ అంశమును ప్రాసభేదములు చెప్పుటకుముందు 'ప్రాసాక్షరమైత్రి' వివరించుచు సామాన్యప్రాస నియమముగా చెప్పినాడు.)

ఉదా :

ఆ. వె. నీలవర్ణగర్భ-గోళంబునందు లో
కంబులెల్లనుండు-నెంమితోడ
శ్రీకి నొడయఁడుజ్జ్వ-లాకృతి యితఁడనఁ
బ్రాసమైత్రి యిట్లు-పరఁగు కృష్ణ.

—అనం. ఛంద. 1-41.

(మొదటి మూడుపాదములు వరుసగా పై మూడంశములకు లక్ష్యములు.)

**అభేదప్రాసము**

ల-ళ లకు, ల-ళ-డ లకు పరస్పరము ప్రాస చెల్లినచో 'అభేదప్రాసము'గునని అప్పకవి చెప్పినాడు. (అయితే కూ. తిమ్మన ల-డ ప్రాసము నంగీక

రించలేదు. అతని ననుసరించి కూ. వేంకటరాయడును సమ్మతించలేదు. డ-ల ప్రాసలు కన్పించుచోట్ల డ-ల లతో రూపద్వైవిధ్యము (వ్రీళ-వ్రీడ, మొసలి-మొసడి, వెడలు-వెలలు, చూపించినారు.)

ఉదా :

i. ఉ. కేళికాంచనసౌధవీధికలచక్కిందొట్లలోఁ బెట్టి యో
ప్రాలేయాచలకన్యకాధవకృపాపారంగతా నిద్రవో
వే లావణ్యపయోనిధీ యనుచు నావిర్భూతమోదంబుతో
జోలల్పాడుదురక్కుమారకునకున్ శుద్ధాంతకాంతామణుల్.

—రాజ. చరి. 2-4.

ii. క. జలనిధియను తెరమఱుగటు
వెడలి నిలిచినట్టి యాటవెలఁదియపోలెన్
గడునింపులుగులుకుచు దన
రెడు నీపురలక్ష్మి యవధరించితె యధిపా !

—ప్రభా. 1-57.

సంధిగతప్రాసము

ప్రథమమీఁది పరుషములకు గసడదవ లాదేశములగును. ఇది గసడద వాదేశ సంధి. ఈ సంధిలో పకారమునకు వకార మాదేశమగును. ఉదా : వాడు+పలికెను=వాఁడువలికెను. ఇట్లు ఆదేశమై వచ్చిన వకారమునకు సహజవకారమునకు ప్రాసచెల్లును. అది 'సంధిగతప్రాసము' అగునన్నాడు. ('సంధిజనితరూప విశేషప్రాసమనఁగఁబరఁగు'నని అనంతుడీ ప్రాసమును పేర్కొన్నాడు. కాని 'సంధిగతప్రాస'మని వ్యవహరింపబడుచున్నది.)

అయితే, ఈ రీతి కేవల గసడదవాదేశసంధికే, మరియు నందలి పకారమునకే పరిమితముకాక అన్ని సంధులయందును ఆదేశములుగా వచ్చినవాటికి ఈ రీతి వర్తించునని మిగిలిన లాక్షణికులు భావించినారు.

ఉదా :

i. శా. ఆ వాలుంగనుదోయి యా నగుమొగంబాగుబ్బపాలిండ్ల పెం
పా వేణీభరమా తనూవిలసనం-బా యొప్పులేఁ జెప్పినన్
కై వారంబగుగాదె కేవల శిరఃకంపంబు గల్పించి యా
హా పుట్టింపదె యిక్షుధన్వునకు నయ్యబ్జాక్షి వీక్షించినన్.

—శృం. శాకుం. 2-188.

ii. శా. సింగంబాఁకటితో గుహాంతరమునన్ జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జంగాంతారనివాసఖిన్నమతినస్మత్సేనపై వీఁడె వ
చ్చెంగుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

—భార. విరాట 4-95

(మొదటిపద్యమున నాల్గవపాదమందు గసడదవాదేశసంధి. రెండవపద్యమున మూడవ, నాల్గవ పాదములందు ద్రుతసంధి.)

బిందుప్రాసము

ద్రుతసంధియందు ద్రుతము పూర్ణబిందువుకాగా పరమందలి ధకారము (పూర్ణ) బిందుపూర్వక ధకారమగును. ఇట్టి పూర్ణబిందుపూర్వక ధకారమునకు సహజబిందుపూర్వక ధకారము ప్రాస చెల్లినచో 'బిందుప్రాస' మగునని అనంతుడు చెప్పినాడు. అనగా ద్రుతము చెడి ఏర్పడిన పూర్ణబిందుపూర్వకత, సహజబిందుపూర్వకతగల ధకారము ప్రాస చెల్లునని తాత్పర్యము. చి. పెద్దన ఈ రీతి యొక్క ధకారమునకేగాక మిగిలినవాటికిని వర్తించునని లక్ష్యముద్వారా సూచించినాడు.

ఉదా : i. "........................ప్రాస
బంధమగుఁ గృష్ణుఁడుదయించి-నంధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యెననఁగ.

అనం. ఛంద. 1-51.

ii. బిందువై పొల్లినాఁ జెందు సంధులను గ
నందగుఁ బ్రాసంబు-బిందువగుచు.

—ల. సా. సం. 1-65.

నకారసంయుక్తము, బిందుపూర్వకము అయిన హల్లులు పరస్పరము యతి చెల్లునని కూ. వేంకటరాయడు చెప్పి-

క. కన్దోయి చల్లఁగా నిడు
కన్దోయి నృపాల లెస్సగా నిక నొకమా
టందలముందల నీవని
చిందలవందలల గుట్టుచిట్టాడంగన్.

సారం. చరి. 3-15.

అను లక్ష్యము చూపినాడు.

**శప్రాసము**

శకారమునకు సకారము ప్రాస చెల్లవచ్చును. ఈ విధముగా ప్రాస చెల్లినచో అది 'శప్రాస' మగునని క. రంగకవి చెప్పినాడు.

ఉదా :

ఉ. ప్రేసియుఁజీరియుంబొడిచివ్రేచియుఁగ్రుచ్చియుఁజించిత్రుంచి బి
ట్టేసియుఁగూల్చియుంబగుల నెమ్ములు రాల్చియుఁ గ్రుచ్చి నుగ్గుగా
జేసియుఁ గంఠముల్ దునిమి చిందఱవందఱగాఁగ మోదినన్
గీశులు భీతిఁజెంది దమకించుచు రాఘవు మర్వఁజొచ్చినన్.

—భా. రా. యుద్ధ.

**ప్రాసవైరము**

రేఫ-శకటరేఫలు (ర-ఱ) పరస్పరము ప్రాసము చెల్లకూడదు అను అంశమున అప్పకవి 'ప్రాసవైరము' అనునొక ప్రాసభేదముగా చెప్పినాడు. (ర-ఱ లకు యతి చెల్లదని 'ఏకతరయతి' చెప్పినాడు. చూ. 'ఏకతరయతి'.). నిజమున కిది యొక ప్రాసభేదముకాదు. నిషేధనియమముమాత్రమే. అయితే రేఫ-ఱకారములకు పలుమంది మహాకవులు యతి చెల్లించినట్లే ప్రాసము చెల్లించినారు.

ఉదా :

'తరులోలిఁదప్పక-నఱుకంగఁ జిక్కె'.

హరి. పూ. భా. 6-5.

'...కోఱకుగదా పుణ్య-పురుష మఱియు'

—భాగ. 3-774.

పదములందు రేఫఱకారముల స్థితి కాలక్రమమున అనిశ్చితమగుటచే ఈ ప్రాస పలుకవు లంగీకరించినారు.

**షడ్విధప్రాసములు**

ఇవి ఆరువిధములైన ప్రాసములు.

i. సుకరప్రాసము
ii. దుష్కరప్రాసము
iii. ద్విప్రాసము
iv. త్రిప్రాసము
v. అనుప్రాసము
vi. అంత్యప్రాసము

ఈ ఆరింటిలో సుకరప్రాసమును వదిలి అనంతుడు, చి. పెద్దన చతుష్ప్రాసము చేర్చినారు. అప్పకవ్యాదులు సుకరప్రాసను, చతుష్ప్రాసమునుగూడ

గ్రహించి సప్తవిధప్రాసములు చెప్పినారు. క. రంగకవి అనుప్రాసమును వదలి షట్సంఖ్య నిలిపినాడు. అనంతాదులు చెప్పిన షడ్విధములు ప్రసిద్ధములు.

నిజమున కివి ప్రాసభేదములు కావు. (చూ. ప్రాస.). వీటిని అనంతుడు 'శబ్దాలంకారవిశేషంబులు ప్రాసంబులు' అని, అప్పకవి 'శబ్దాలంకారంబులగు విశేషప్రాసంబులు' అని చెప్పి వీటిని ప్రాసభేదములనుండి విభేదింపజేసినారు.

## సుకరప్రాసము

'సులభాక్షరంబులు ప్రాసంబడి చెప్పునది' సుకరప్రాసమగునని భీమన చెప్పినాడు. సులభాక్షరములనగా భాషలో మిక్కిలి విరివిగా ఉపయోగింపబడు నక్షరములని తాత్పర్యము.

ఉదా :

క. పరమోపకార ధరణీ
సురవర సురభూజ సుగుణ సుందర తరుణీ
స్మరనిభ సుకర ప్రాసం
బరుదుగఁ గృతులందు నొప్పు నభినుతచరితా.

క. జ. సంజ్ఞా. 78.

## దుష్కరప్రాసము

'విషమాక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది' దుష్కరప్రాసమగునని భీమన చెప్పినాడు. విషమాక్షరంబులనగా భాషలో తక్కువగా నుపయోగింప బడు నక్షరములు, క్లిష్టములైన సంయుతాక్షరములు, విసర్గపూర్వకములు మొద లైనవని తాత్పర్యము.

ఉదా :

'స్వఃకాంతాసమయోషిదు
రః కృతరతిచిహ్న దుష్కరప్రాసం బా
విః కృతమగు నిట్లు సుపు
త్రః కులదీపక యనంగఁదగుచు మహాత్మా.

—క. జ. సంజ్ఞా. 80.

(విసర్గపూర్వకముగా నుండుటచే దుష్కరమైనదని తాత్పర్యము.)

## ద్విప్రాసము

ప్రాసాక్షరముతోఁబాటు దాని తరువాతి యక్షరమునుగూడ ప్రాసగా నుపయోగించినచో ద్విప్రాసమగును. ('రెండక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది' ద్విప్రాసమని భీమన చెప్పినాడు.)

ఉదా :

క. అకటా నన్నిఁతఁ డేలిన
నొకటా నచ్చికములేకయుండఁగవచ్చున్
నికటామృతధారలు మరు
ని కటారిమెఱుంగు లీతని కటాక్షంబుల్.

విజయ 1-132.

దీనిని అనంతాదులు ద్వంద్వప్రాసమన్నారు.

**ద్వంద్వప్రాసము**

చూ. ద్విప్రాసము,

**త్రిప్రాసము-2**

ప్రాసాక్షరముతోపాటు మరి రెండక్షరములు తరువాతివిగూడా ప్రాసగా చెల్లించిన 'త్రిప్రాస'మగును. ('మూడక్షరంబులు ప్రాసంబిడి చెప్పునది త్రిప్రాస'మని భీమన.)

ఉదా :

క. యాచనక వినుత వనితా
సేచనక మనోహరాంగ శృంగారకళా
సూచనక్రమ కవితా
లోచనకందళితహర్ష లోలుపహృదయా.

విజయ. 1-226.

(ప్రాసభేదములలోని 'త్రిప్రాసము'న కిది భిన్నము. చూ. త్రిప్రాసము-1)

**చతుష్ప్రాసము**

ప్రాసాక్షరముతోపాటు మరి మూడక్షరములు తరువాతివి (అనగా మొత్తము నాల్గక్షరములు వరుసగా) కూడ ప్రాసముగా చెల్లినచో చతుష్ప్రాస మగును.

ఉదా :

క. వారణవరదనిశాట వి
దారణవీరావతార ధరణీవలయో
ద్ధారణవిరచిత సత్యవ
ధారణవీరయనఁదగి చతుష్ప్రాసమగున్.

అనం. ఛంద. 1-73.

**అనుప్రాసము**

వర్ణసామ్య మనుప్రాసము. ప్రాసాక్షరముతో సమానాక్షరములను పద్యమున విరివిగా ఉపయోగించినచో అనుప్రాసమగును. అనుప్రాసమను శబ్దాలంకారమున ఏ అక్షరమునైనను ఇట్లు ఉపయోగించవచ్చును. కాని షడ్విధ ప్రాసములలోని అనుప్రాసమున ప్రాసాక్షరమునే ఉపయోగించవలెను. ఈ రెండింటి భేదమిది.

ఉదా :

క. విత్రస్తాఘపవిత్రచ
రిత్ర జితత్రిదశవరధరిత్రీసుత స
న్మిత్రాంబుజమిత్రగుణా
మత్ర 'యనుప్రాస'మిదియ మల్లియరేచా

—క. జ. సంజ్ఞా. 86.

(పై పద్యమున ప్రాసాక్షరమైన 'త్ర' విరివిగా ఉపయుక్తమైనది.)

**అంత్యప్రాసము**

పాదాదియందు ప్రాసమును పాటించినట్లే పాదాంతమున పాటించినచో అది-పాదాంతమున పాటింపబడుచున్నదిగాన-అంత్యప్రాసమగును. పాదాంతాక్షరము అంత్యప్రాసములో ప్రాసాక్షరమగును. ప్రాసపూర్వాక్షరనియమము పాదాదియందువలెనే అంత్యప్రాసమందును పాటింపబడును. (పాదాదిప్రాసాక్షరమే అంత్యప్రాసమందును ప్రాసాక్షరము కావలెనను నియమము లేదు.)

ఉదా :

తోటక. మానసుబోధనమంజులనిత్యా
నూనయశోధన యుజ్జ్వలకృత్యా
దానసుబోధన ధర్మతకృత్యా
దీనమహోధన దీపితసత్యా

—కళా. 4-219.

# 3

# వృత్తములు

**వృత్తము**

అక్షరసంఖ్యచేగాని, అక్షరగణములచేగాని నియతములగు పాదములు గల పద్యమునకు ఛందశ్శాస్త్రమున 'వృత్త'మని వ్యవహారము (చూ. పాదము; పద్యము). ఈ వృత్తములు ఉక్తాదులగు నిరువదియారు ఛందములందు నిష్పన్నములగును. (చూ. ఛందములు; ప్రస్తారము; వృత్తసంఖ్య.) 'గాయత్ర్యా'ది ఛందములందివి వర్తించుట (ఉండుట) వలన నివి 'వృత్తముల'ని వ్యుత్పత్తి చెప్పబడుచున్నది. ఈదృష్ట్యా గాయత్రీఛందమునకు ముందున్న ఉక్తాదులగు నైదు ఛందములందు నిష్పన్నములగు పద్యములకు, 26 ఛందములకు మించిన యక్షరసంఖ్యగల 'ఉద్ధురమాలా'దులకు 'వృత్త'మను వ్యవహారము లేకపోవలసి వచ్చును. పింగళుడు, భరతుడు మొదటి అయిదు (ఉక్తాదులు) ఛందములందు పద్యములను చెప్పలేదు. ఆరవఛందమునుండియే చెప్పినారు. అట్లే లయగ్రాహ్యాదులగు ఉద్ధురమాలలను చెప్పలేదు. కాని తరువాతివారు మొదటి అయిదు ఛందములందును పద్యములు చెప్పినారు. కాగా 'గాయత్ర్యా'ది యనిగాక సామాన్యముగా ఛందములందు నిష్పన్నములైన పద్యములు 'వృత్తము'లన్నచో అన్నియు సమీకృతమగును.

వృత్తములు i. సమ, ii. అర్ధసమ, iii. విషమభేదముచే మూడు విధములు. (చూ. 'సమవృత్తములు' మొ.).

ఉద్ధురమాలాపద్యములకును 'వృత్త'మన్న వ్యవహారమున్నను, ఉ. మా. వృత్తములలోనిదిగానే చెప్పబడిన దండకములను 'దండకవృత్తము' లని లాక్షణికులన్నను, వ్యవహారమునందవి వృత్తములుగా ప్రసిద్ధి పొందలేదు.

**ఛందములు**

అక్షరగణనిబద్ధమైన పద్యముల పాదములందుండు అక్షరసంఖ్యనుబట్టి ఛందమేర్పడినది. పాదమునకు పదియక్షరములున్నచో అట్టిపాదములతో నేర్పడు పద్యము పదవఛందములోనిదని యర్థము. పాదమున పదియక్షరము లున్నవనగా ఆ పదియు గురువులే కావచ్చును. లేదా లఘువులే కావచ్చును. లేదా గురు లఘువుల కలగలుపు కావచ్చును. ఈ గురులఘువుల క్రమస్థితిలో సాధ్యమయినన్ని

మార్పులు చేయగా (సర్వగురు, సర్వలఘుభేదములతో కలసి) 1024 భేదము లేర్పడును. (చూ. ప్రస్తారము; వృత్తసంఖ్య.). ఈ మొత్తము భేదములలో ప్రతి దియు 10 అక్షరములు కలదే. కాగా పదియక్షరములుగల వృత్తముల వర్గమునకు 10 వ ఛందమని వ్యవహారము. ఇట్లు ఛందము పాదమందలి అక్షరసంఖ్యాసూచక మగుచుండును. లాక్షణికులు మొత్తము ఛందము లిరువదియారు చెప్పినారు. ఈ ఇరువదియారింటికి ఈక్రిందివిధముగా పేర్లు పెట్టబడినవి.

| ఛ.సం. పేరు | ఛ.సం. పేరు | ఛ.సం. పేరు |
|---|---|---|
| 1. ఉక్త | 10. పంక్తి | 19. అతిధృతి |
| 2. అత్యుక్త | 11. త్రిష్టుప్ | 20. కృతి |
| 3. మధ్య | 12. జగతి | 21. ప్రకృతి |
| 4. ప్రతిష్ఠ | 13. అతిజగతి | 22. ఆకృతి |
| 5. సుప్రతిష్ఠ | 14. శక్వరి | 23. వికృతి |
| 6. గాయత్రి | 15. అతిశక్వరి | 24. సంకృతి |
| 7. ఉష్ణికి | 16. అష్టి | 25. అభికృతి |
| 8. అనుష్టుప్ | 17. అత్యష్టి | 26. ఉత్కృతి |
| 9. బృహతి | 18. ధృతి | |

ఈ 26 ఛందములు నాలుగు భాగములుగా వర్గీకరింపబడినవి :

i. అనాదిష్టచ్ఛందములు=ఉక్తనుండి సుప్రతిష్ఠవరకున్న 5 ఛందములు.
ii. బ్రాహచ్ఛందములు =గాయత్రినుండి జగతివరకున్న 7 ఛందములు.
iii. అతిచ్ఛందములు =అతిజగతినుండి అతిధృతివరకున్న 7 ఛందములు.
iv. కృతిచ్ఛందములు =కృతినుండి ఉత్కృతివరకున్న 7 ఛందములు.

26 అక్షరములకు మించిన పాదములకు సంబంధించిన ఛందములను లాక్షణికులు పేర్కొనలేదు. కాని ఇంతకుమించియుండు ఛందములను ఒక మొత్తముగా 'ప్రచితిచ్ఛందము'లని పేర్కొన్నారు. ఈ ప్రచితిచ్ఛందములుగా పొత్తపి వేంకటరమణకవి తన లక్షణశిరోమణియందు :

i. భూః, ii. భువః, iii. సువః, iv. మహః, v. జనః,
vi. తపః, vii. సత్య, viii. భూర్భువః, ix. స్వరః, x. విరాట్

అని ఛందములను పేర్కొని కొన్ని వృత్తములను చెప్పినాడు. (చూ. ఉద్ధుర మాలా వృత్తములు.)

పై 26 ఛందములకు అగ్న్యాదులు దైవతములని నాట్యశాస్త్రమున భరతుడు చెప్పినాడుకాని ఏ యే ఛ్ఛందమున కే యే దేవతయో వివరించలేదు. బ్రాహచ్ఛందములేడింటికి వరుసగా-అగ్ని, సవిత, సోముడు, బృహస్పతి, మిత్రా

వరుణులు, శక్రుడు, విశ్వదేవులు దేవతలని, సిత, సారంగ, పింగళ, కృష్ణ, నీల లోహిత, గౌరములు వర్ణములని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పినారు (చూ. నా. శా. పు 400, అను. డా. పి. యస్. ఆర్. అప్పారావు.)

బృహచ్ఛందములు దివ్యములని, అతిచ్ఛందములు మానుషములని, కృతిచ్ఛందములు దివ్యమానుషములనియు చెప్పబడినది.

### సమవృత్తములు

వృత్తమునందలి పాదములన్నియు సమాన లక్షణముతో నున్నచో, అవి సమవృత్తమనబడును. మొత్తమిరువదియారు ఛందములలో పదమూడుకోట్ల నలువదిరెండు లక్షల పదునేడువేల ఏడువందల ఇరువదారు వృత్తములు నిష్పన్నములగునని ప్రస్తారమువలన తెలియును. లాక్షణికులు ప్రతిచ్ఛందమున నిష్పన్నమైన ఏవో కొన్నికొన్ని వృత్తములను మాత్రమే లక్ష్యలక్షణ పూర్వకముగా ప్రదర్శించినారు. పింగళుడు, భరతుడు మొదటి అయిదు ఛందములందు నిష్పన్నమైన వృత్తముల నసలే ప్రదర్శించలేదు. మిక్కిలి తక్కువ అక్షరములు గల పాదములతోడి పద్యములకు పద్యత్వము భాసించదనియో, ప్రయోగము లేదనియో వారట్లు చేసియుందురు. కాని తరువాతివారు ఆ అయిదింటిలోని వృత్తములుగూడ కొన్ని ప్రదర్శించినారు. లాక్షణికులందరును 11వ, 12వ ఛందములందు ఎక్కువ వృత్తములను ప్రదర్శించుట లక్షణగ్రంథములందు కన్పించును. 11వ ఛందమువరకు ప్రదర్శిత వృత్తముల సంఖ్య క్రమముగా పెరిగి 13వ ఛందమునుండి క్రమముగా తగ్గుట గమనించవచ్చును. సంస్కృత సాహిత్యమున ఈ ఛందములందు నిష్పన్నమైన వృత్తములకే మిక్కిలి ప్రచారము. అందువల్ల ప్రాంతీయ భాషాలాక్షణికులును ఆ ఛందములందే ఎక్కువ చెప్పినారు. తెలుగులో కవిజనాశ్రయము, కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, అప్పకవీయము, సులక్షణసారము, రంగరాట్ఛందములందు ప్రదర్శింపబడిన వృత్తములతోబాటు ప్రబంధములం దక్కడక్కడ కన్పించిన కొన్ని వృత్తములు ఇక్కడ చూపబడుచున్నవి.

### 1. ఉక్తాఛందము

శ్రీ-1

### 2. అత్యుక్తాఛందము

స్త్రీ-1

### 3. మధ్యాఛందము

మృగి

నారి

## 4. ప్రతిష్ఠాఛందము

సుకాంతి
క్రీడ
బింబ
కన్య

## 5. సుప్రతిష్ఠాఛందము

సుందరి
సతి
ప్రీతి
ప్రగుణ
పంక్తి-1
నంద
అంబుజ
వలమురి

## 6. గాయత్రీ ఛందము

శశివదన
విచిత్ర
వసుమతి
వసుధ
తనుమధ్యా
చంద్రవదన
సావిత్రి

## 7. ఉష్ణిక్ ఛందము

సురుచిర-1
హంసమాల
విభూతి
లోల
మధుమతి
మదరేఖ
మదనవిలసిత
కుమారలలిత-1
కుమారలలిత-2
ప్రసవశర

## 8. అనుష్టుప్ ఛందము

హంసరుత
సింహరేఖ
సమాని
విమాన
విద్యున్మాల
వితాన
మాణవక
ప్రమాణి
నారాచ
నాగర
చిత్రపద

## 9. బృహచ్ఛందము

హాలముఖి
భుజగశిశురుత
భుజంగశిశురుత
భద్రక-1
ఉత్సుక
కిశోర

## 10. పంక్తిచ్ఛందము

శుద్ధవిరాటి
రసాలి
మయూరసారి
మనోరమ
మత్త
మణిరంగ
భోగివిలసిత
పణవ
పంక్తి-2
నందిని
చంపకమాలి
రుగ్మవతి
కౌముది
కోమల

## 11. త్రిష్టుప్ ఛందము

స్వాగత
శ్యేని
శాలిని-1
వృత్త
వృంత
వాతోర్మి
రథోద్ధత
మౌక్తికమాల
భ్రమరవిలసిత
భద్రిక-1
పృథివి
దోదక
చంద్రిక-1
కలికాంత
ఏకరూప
ఉపేంద్రవజ్ర
ఉపస్థిత-1
ఉపస్థిత-2
ఇంద్రవజ్ర
సుముఖి
మందారదామ

## 12. జగతిచ్ఛందము

స్రగ్విణి
విశ్వదేవి
జలధరమాల
చంద్రవర్త్మ
కుసుమవిచిత్ర
ఉజ్జ్వల
ఇంద్రవంశ
నవమాలిని
వంశస్థ
లలిత-1
మేఘవిలసిత
మణిమాల-1
భుజంగప్రయాత
ప్రియంవద
ప్రహేయ
ప్రమితాక్షర
ప్రభ
పదమాలి
ద్రుతవిలంబిత
తోదక-2
తోటక-2
జలోద్ధతగతి

## 13. అతిజగతిచ్ఛందము

సుమంగలి
రుచిర
మత్తహంసిని
మత్తమయూర
మంజుభాషిణి
ప్రహర్షిణి
ప్రభాత-2
చంచరీకావలి-1
జలద
క్షప
చంచరీకావలి-2
బంభరగాన
లత

## 14. శక్వరీఛందము

వసంతతిలక
వనమయూర
భూనుత-1
భూనుత-2
ప్రహరణకలిత
నవనందిని
కమలవిలసిత
అసంబాధ
అపరాజిత

## 15. అతిశక్వరీఛందము

సుగంధి
సుకేసర
మాలిని
మనోజ్ఞ
మణిభూషణ
మణిగణనికర
నలిని
చంద్రరేఖ
ఇల
అలసగతి
గజరాజ
లలితగతి
సరసాంక

## 16. అష్టిచ్ఛందము

ప్రియకాంత
పంచచామర
పద్మక
చంద్రశ్రీ
గజవిలసిత
అశ్వగతి
ఫలసదన
మేదిని
మదనదర్పణ
చంద్రభాను

## 17. అత్యష్టిచ్ఛందము

హరిణి
శిఖరిణి
వంశపత్త్రపతిత
మందాక్రాంత
పృథ్వీ-2
పాలాశదళ
నర్కుటి
చంపకకేసరి

**18. ధృతిచ్ఛందము**

హారనర్తన
మత్తకోకిల
నిశ
త్వరితపదగతి
ఝ్యాహార
కుసుమితలతావేల్లిత
అతివినయ
దేవరాజ
తరలి

**19. అతిధృతిచ్ఛందము**

శార్దూలవిక్రీడిత
మేఘవిస్ఫూర్జిత
భూతిలక
తరళ
చంద్రకళ
కవికంఠవిభూషణ
శుభిక
శంభు

**20. కృతిచ్ఛందము**

మత్తేభవిక్రీడిత
ప్రభాకలిత
ఖచరప్లుత
ఉత్పలమాల
అంబురుహ
కలిత
భుజగ

**21. ప్రకృతిచ్ఛందము**

చంపకమాల
స్రగ్ధర
వనమంజరి
లాటీవిట
మణిమాల-2
కరిబృంహిత
కనకలత
సురభూజరాజ
నరేంద్ర

**22. ఆకృతిచ్ఛందము**

విచికిలిత
మానిని
మహాస్రగ్ధర
మద్రక
భద్రక-3
తురగ
హంసి

**23. వికృతిచ్ఛందము**

మత్తాక్రీడ
పద్మనాభ
కవిరాజవిరాజిత
అశ్వలలిత
కుసుమ

## 24. సంకృతిచ్ఛందము

| | |
|---|---|
| సరసిజ | శృంగార |
| తన్వి | దుర్మిల |
| క్రౌంచపద | కిరీట |
| అష్టమూర్తి | |

## 25. అతికృతిచ్ఛందము

| | |
|---|---|
| బంధుర | సురుచి |
| భాస్కరవిలసిత | విజయ |
| ధరణిధరగతి | చారుమతి |
| వనరుహా | సాధ్వి |

## 26. ఉత్కృతిచ్ఛందము

| | |
|---|---|
| వరాహా | ప్రభు |
| భుజంగవిజృంభిత | మలయజ |
| అపవాహా | మంగళమహాశ్రీ |

వీటిలో కొన్నింటికి నామాంతరములున్నవి. పై వృత్తములకు విడి విడిగా లక్షణలక్ష్యములు వ్రాయబడినవి. అక్కడ ఈ యంశము గమనించవలెను. పై పట్టికలో కొన్నింటి ప్రక్క 1, 2 మొ॥ అంకెలు అదేపేరుతో మరొకటిరెండు పద్యములున్నవని సూచించును.

## శ్రీ-1

శ్రీ యనునది ఉక్తా (1 వ) ఛందమందలి మొదటి వృత్తము. పాదమున కొకే గురువర్ణ ముండును. ఇది ఏకాక్షర వృత్తము 11 వ ఛందమున నున్న 'శ్రీ' వృత్తమునకు దీనికి సంబంధము లేదు.

ఉదా :

శ్రీ
శ్రీన్
జే
యున్

—క. జ. వృత్తా. 5.

## స్త్రీ - 1

స్త్రీ యనునది అత్యుక్తా (2 వ) ఛందమందలి మొదటి వృత్తము. ఇందు పాదమునకు రెండు గురువులుండును. ప్రాస నియమ మున్నది. యతి

నియమము లేదు. భీమన, చి. పెద్దన లీ వృత్తమునే 'శ్రీపెంపు' అని పేర్కొన్నారు. 11 వ ఛందమందున్న 'స్త్రీ' వృత్తమునకు, దీనికి ఏ సంబంధము లేదు.

ఉదా :

స్త్రీరూ । పారున్ । ఘోరా । ఘోరీ.

—అనం. ఛంద. 2-12.

**శ్రీపెంపు**

చూ. స్త్రీ.

**మృగి**

'మృగి' యనునది మధ్యా (లెవ) ఛందమందలి మూడవ వృత్తము. ఇందు ప్రతి పాదమున నొక ర గణముండును. ప్రాసనియమమున్నది. యతి నియమము లేదు.

ఉదా :

విన్మరే । షన్మృగీ
మున్మగాఁ । జిన్మయా.

—క. జ. వృత్తా. 8.

**నారి**

నారి యనునది మధ్యా (లెవ) ఛందమందలి మొదటి వృత్తము. ఇందు ప్రతి పాదమున ఒక మగణముండును. ప్రాసనియమమున్నది. యతి నియమము లేదు.

ఉదా :

నారీలో । కారాధ్యా
సారస్యా । ధారాధ్యా

—ఛం. హం. 3.

**వినయ**

వినయ మనునది మధ్యా (లెవ) ఛందమందలి నాల్గవ వృత్తము. ఇందు ప్రతి పాదమున ఒక సగణముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

వినయం । బొనరిం
తు నసం । తునకున్.

—అనం. ఛంద. 2-13.

**సుకాంతి**

సుకాంతి యనునది ప్రతిష్ఠా (4వ) ఛందమందలి ఆరవ వృత్తము. ఇందు ప్రతి పాదమున జ+గ (2 లగము) లుండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

అగున్ సుకాం। త గూర్చఁగా
జగంబులన్ । జగత్పతీ

—అనం. ఛంద. 2-15.

**ప్రీడ**

ప్రీడ యనునది ప్రతిష్ఠా (4వ) ఛందమందలి రెండవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'య+గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

'సురారాతి । స్ఫురత్తైన్యం
బురోఽస్పృగ్ధా । రరాదీయన్'

—రామా. కల్పా. అరణ్యా. పంచ. 202.

ఈ వృత్తమునే చి. పెద్దన 'ప్రీళ' యని పేర్కొన్నాడు.

**ప్రీళ**

చూ. ప్రీడ.

**బింబ**

బింబము అనునది ప్రతిష్ఠా (4వ) ఛందమునందలి యేడవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భగణము+గురువు' ఉండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

పంచిభకా । రంబుగకా
రంబునుగా । బింబమగున్.

—క. జ. వృత్తా. 10.

**కన్య**

కన్యయనునది ప్రతిష్ఠా (4వ) ఛందమందలి మొదటి వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-గ' (4 గురువులు) అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఘో త్రైగాగా । ప త్తింగన్యా
వృ త్తంబయ్యెన్ । జి త్తంబారన్.

—క. జ. వృత్తా. 12.

**సుందరి**

సుందరి యనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమందలి ఏడవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు. ఈ వృత్తమునకే 'పంక్తి' యని మరొక పేరున్నది. 10 వ ఛందమందున్న 'పంక్తి వృత్తమునకు దీనికి సంబంధము లేదు. చూ. పంక్తి-2.

ఉదా ;

చెంది భకారం । బొందగగంబుల్
సుందరి యన్పె । రందురు సూరుల్.

—క. జ. వృత్తా. 13.

**సతి**

సతి యనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమునందలి ఆరవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ+గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

సతీత్వధర్మ । ప్రతిష్ఠనార్యా
సతీవిశిష్టా । త్మతత్వమెంతున్.

—ఛం. హం. 12.

**ప్రీతి**

ప్రీతి యనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమునందలి మూడవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర+గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ప్రీతిమై చేత । స్వాతతోస్మేషన్
ద్యోతమౌశాంతిన్ । పూతభావాప్తిన్.

—ఛం. హం. 10.

**ప్రగుణ**

ప్రగుణ మనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమునందలి నాల్గవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స+గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ప్రగుణాన్వితున్ । సగుణోపాస్తిన్
స్వగతిన్ గొల్తున్ । ప్రగతిం జెందన్.

—ఛం. హం. 11.

పంక్తి-1

చూ. సుందరి. పంక్తియనుపేర 10 వ ఛందమున నొక వృత్తము చెప్పబడినది. అది దీనికన్న భిన్నము. చూ. పంక్తి-2.

నంద

నంద యనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమునందలి 13 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త+లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

వందింతును నే । నందాత్మజు నా
నందంబున స్వ । చ్ఛంద ప్రణతిన్.

—ఛం. హం. 14.

**అంబుజ**

అంబుజ మనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమునందలి 15 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ+లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఇంబుల భకా । రంబును లగం
బుం బొనరఁగా । నంబుజమగున్.

—క. జ. వృత్తా. 15.

**వలమురి**

వలమురి యనునది సుప్రతిష్ఠా (5వ) ఛందమందలి 16 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

'నలగపదం । బలవడఁగా
వలమురియౌ । జలదనిభా'

—రంగ. ఛంద. 4-102.

**శశివదన**

శశివదన యనునది గాయత్రీ (6వ) ఛందమందలి 16 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-య' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

శశివదనాథన్ । శశధరుఁడోటన్
దశఁజెడిజూటన్ । విశయమునందెన్.

—ఛం. హం. 20.

ఈ వృత్తమునే 'సురలత' అనుపేర అప్పకవి మరొకసారి చెప్పినాడు.

**సురలత**

చూ. శశివదన.

**విచిత్ర**

విచిత్ర యనునది గాయత్రీ (6 వ) ఛందమునందలి పదవ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'రెండు యగణములు' (య-య) అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఖరప్రౌఢచాప
స్ఫురద్బాణధారన్
ధరాకన్యకారా
ట్మరాసంబువిగ్రెన్.

—రామా. కల్ప. అరణ్య. పంచ. 428.

**వసుమతి**

వసుమతి యనునది గాయత్రీ (6వ) ఛందమునందలి 29 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'త-స' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ధాత్రిన్ వసుమతిన్ । నేత్రోత్సవముగా
క్షేత్రజ్ఞునెఱుకన్ । జిత్రింప మనసా

—ఛం. హం. 23.

**వసుధ**

వసుధ యనునది గాయత్రీ (6వ) ఛందమందలి 28 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-స' (రెండు సగణములు) అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

వసుధాపతియా । వసుదేవసుతున్
బసుకాపరిగా । నసిఁబిల్తురిలన్.

—ఛం. హం. 22.

ఈ వృత్తమునే కస్తూరి రంగకవి 'కిసలయ' మని పేర్కొన్నాడు.

**కిసలయ**

చూ. వసుధ.

**తనుమధ్య**

తనుమధ్య యనునది గాయత్రీ (6వ) ఛందమునందలి 13వ వృత్తము. ఇందు ప్రతి పాదమున **'త-య'** అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

గౌరీతనుమధ్యన్ । స్వారింగొని సింహం
బారాధనలందున్ । క్రూరాగ్రియమయ్యెన్.

—ఛం. హం. 18.

**చంద్రవదన**

చంద్రవదన యనునది గాయత్రీ (6వ) ఛందమునందలి 15 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-య' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

చంద్రవదనన్ వ । ద్రేంద్ర మణిభూషా
సాంద్రలలితాంగిన్ । మంద్రనుతిఁగొల్తున్.

—ఛ. హం. 19.

**సావిత్రి**

సావిత్రి యనునది గాయత్రీ (6వ) ఛందమందలి మొదటి వృత్తము. ఇందు ప్రతి పాదమున 'రెండు మగణము' లుండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

సావిత్రీ ధ్యానంబా । భావప్రాప్తోద్యానన్
జీవాత్మైక్యం బెంచన్ । ధీవిస్రబ్ధప్రాప్తిన్.

—ఛ. హం. 16.

**సురుచిర-1**

సురుచిర మనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 31 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-స-గ' అను గణక్రమముండును ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

భాసుర భసగల్ రే
చా సురుచిరమయ్యెన్

—క. జ. వృత్తా. 23.

14 వ ఛందమున 'సురుచిర' మనుపేర నొక వృత్తమున్నది. ఇది దానికన్న భిన్నము. చూ. సురుచిర-2.

**హంసమాల**

హంసమాల యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 20వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

నరగంబు ప్రలచింపన్ । బరఁగున్ హంసమాలా
నరసింహావతారా । సురవిద్విడ్విహారా.

—అ. క. 4 ఆశ్వా.

**విభూతి**

విభూతి యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 43 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఆయెడన్ మునీశ్వరుం
డీయెడన్ రఘూత్తముం
డాయెడన్ రఘూత్తముం
డీయెడన్ మునీంద్రుడున్.

—రామా. కల్ప. అరణ్యా. శబరి. 374.

**లోల**

లోల యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 10 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'య-య-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

'యయ్యల్గంబులో లాఖ్యన్'

—అ. సా. సం. 1. 7వ ఛం.

**మధుమతి**

మధుమతి యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 56 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

వగరుపిందెలతోఁ । జిగురుటాకులతోఁ
దొగరువన్నెలతో । మిగిలె మావితరుల్'

—రామా. కల్ప. బాల. అవతార. 184.

ఇదే ఛందమందలి 'మదనవిలసితము'ను అనంతుడు 'మధుమతి' యని పేర్కొన్నాడు. అది దీనికి భిన్నము. (చూ. మదనవిలసిత.)

**మదరేఖ**

మదరేఖ యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 25 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

కోదండాగతరజ్జుల్
పాదాంతమ్మునయందున్
మోదించెన్ హరిణంబున్
నాదూకున్ బదిబారల్.

—రామా. కల్ప. అరణ్య. మారీచ. 355-

**మదనవిలసిత**

మదనవిలసిత యనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 64వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు. (ఈ వృత్తమునే అనంతుడు 'మధుమతి' యని పేర్కొన్నాడు. ఈ ఛందమందే 'మధుమతి' యనుపేర భిన్నలక్షణముతో మరొక వృత్తమున్నది. (చూ. మధుమతి.)

ఉదా :

పదపడిననగల్ । గదిసి వెలసినన్
మదనవిలసితం । బదియదు తిలకా,

—అ. క. 4. ఆ.

### కుమారలలిత-1

కుమారలలిత యనునది ఉష్ణిక్ (7వ) ఛందమందలి 30 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు. (భిన్నగణక్రమముతో నిదేపేర వి. పెద్దన ఒక వృత్తము చెప్పినాడు. చూ. కుమారలలిత-2.)

ఉదా :

కుమారలలితాఖ్యా । తమోపలనిసుశ్రే
క్రమాన్య మురుగేశున్ । సమీకరణనెంతున్.

—ఛ. హం. 27.

### కుమారలలిత-2

కుమారలలిత యనునది ఉష్ణిక్ (7వ) ఛందమందలి 62 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-న-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది యతినియమము లేదు. (ఇదే ఛందమున ఇదే పేర భిన్నలక్షణముతో మరొక వృత్తమున్నది. చూ. కుమారలలిత-1 )

ఉదా :

కుమారలలితకున్
సమగ్రజనగముల్.

కా. చూ. 7 ఆ.

### ప్రసవశర

ప్రసవశరమనునది ఉష్ణిక్ (7వ) ఛందమునందలి 32 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఎసఁగఁబదమందున్ । నసగనులుచెందన్
బ్రసవశరమయ్యెన్ । బిసరుహదళాక్షా.

సులక్షణ. 4-50.

### హంసరుత

హంసరుత మనునది అనుష్టుప్ (8వ) ఛందమందలి 57 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

'శ్రీసంపాదితములై య । వ్యాసంబొప్పఁగ సరోజా
వాసంబై మధురవంబై । కూసెన్ మత్తకలహంసల్'

—రామా. కల్ప. బాల. అవతార. 165.

**సింహరేఖ**

సింహరేఖ యనునది అనుష్టుప్ (8వ) ఛందమందలి 43 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

శ్రీరజంబుపై గగంబుల్
చేర సింహరేఖ యయ్యెన్.

—క. జ. వృత్తా. 30.

**సమాని**

సమాని యనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 107వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు. (ఈ వృత్తమునే చి. పెద్దన 'సమానిక' అని పేర్కొన్నాడు.)

ఉదా :

ఇంబుగా రజంబు వకా
రంబుగా సమాని యగున్.

—క. జ. వృత్తా. 29.

**సమానిక**

చూ. సమాని.

**విమాన**

విమాన మనునది అనుష్టుప్ (8వ) ఛందమందలి 38 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-త-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు,

ఉదా :

'అమేఘమాకాశమందున్
గమించి విద్యుత్తు పొందున్
సమేతములౌ ప్రపాతం
బమేయమై పొల్చె నెల్లన్.

—రామా. కల్ప. అరణ్యా. పంచ. 308.

**విద్యున్మాల**

విద్యున్మాల యనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి మొదటి వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-మ-గగ' (8 గురువులు) అను గణక్రమ్ము

ముండును. ప్రాసనియమమున్నది. ఈ పద్యమున యతిచెల్లింపు నేలాక్షణికుడును చెప్పలేదుకాని లక్ష్యమునందు ప్రతి లాక్షణికుడును ఐదవ యక్షరమును ప్రతి పాదమున యతి చెల్లించినాడు. నిజమునకు 10 వ ఛందమునుండి యతినియతి మొదలగును. ఈ పద్య మెనిమిదవ ఛందములోనిదికాన యతినియతి యక్కర లేదు. కాని లాక్షణిక లక్ష్యములం దన్నింట యతి చెల్లించుటచే నీ పద్య మొక విలక్షణమైనది.

ఉదా :

'ఉద్యన్మాగా-యుక్తంబైనన్ । విద్యున్మాలా-వృత్తంబయ్యెన్'.

—క. జ. వృత్తా. 25.

**వితాన**

వితాన మనునది అనుష్టుప్ (8వ) ఛందమందలి ఆరవవృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-మ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఇతండు బుద్ధోద్యత్సేనా
ప్రతాన కోటింద్రుంచేచున్
జితారిధూమ్రుండాదిత్య
స్తుతప్రభావుండెందైనన్.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 23.

**మాణవక**

మాణవక మనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 103వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-త-లగ' అను గణ కణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

మాణవకాఖ్యంబగు న
క్షీణభతంబుల్లగముల్.

—క. జ. వృత్తా. 27.

**ప్రమాణి**

ప్రమాణి యనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 86వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-ర-లగ' (4 లగములు) అను గణక్రమముండును, ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

'శ్వమాంసభోక్తలై చవన్
సముల్ సహస్రముల్ చనుం
డమందదర్పులై వృథా
భ్రమన్ మనుష్యపాళిలో'.

—రామా. కల్ప. బాల. ధనుస్. 171.

**నారాచ**

నారాచ మనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 85వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-ర-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు. (ఈ వృత్తమునే 'నారాచక' మని చి. పెద్దన పేర్కొన్నాడు.)

ఉదా :

ఈతండు రాఘవాగజుం
డేతెంచు శత్రునిం గరా
ఘాతంబుచే వధించు ని
ర్ఘాతంబు నామహాజిలో

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 29.

**నారాచక**

చూ. నారాచ.

**నాగర**

నాగరమనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 87 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-ర-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు. (ఈ వృత్తమునే 'నాగరక' మని చి. పెద్దన పేర్కొన్నాడు.)

ఉదా :

ఈతని పేరు వహ్ని సం
జాత రుషాచ్ఛటాప్రచం
డాతపనేత్ర వహ్ని వి
ద్యోతిత శౌర్యవార్ధియై.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 42.

**నాగరక**

చూ. నాగర.

**చిత్రపద**

చిత్రపద మనునది అనుష్టుప్ (8వ) ఛందమునందలి 55 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమము లేదు.

ఉదా :

'కూడియు మున్నుఁగఁదోచున్
వాఁడిశరంబున దూయన్
బోడి నియతునయందున్
లేడియ కన్పడకుండున్.

—రామా. కల్పా. అరణ్యా. మారీచ. 356.

**హాలముఖి**

హాలముఖి యనునది బృహతి (9వ) చ్ఛందమందలి 251 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-స' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది యతినియమము లేదు.

ఉదా :

'ఎంతలేసి కుటిలులు రా
వింతలైన వలపులు రా
జంతలింక తెలియును లే
స్వాంతమందు శిఖులెగయన్'.

—రామా. కల్పా. అరణ్యా. పంచ. 201.

**భుజగశిశురుత**

భుజగశిశురుత మనునది బృహతి (9వ) చ్ఛందమందలి 64వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-మ' యను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. యతినియమములేదు. ('భుజంగశిశురుత' మను పేర భిన్నలక్షణముతో నిదే ఛందమున నొక వృత్తము చెప్పబడినది. 'భుజగ-భుజంగ' యన్నదే పేర్ల లోని భేదము.)

ఉదా :

'భుజగశిశురుతన్నామల్'

—ల. సా. సం. 1. 9వ ఛం.

**భుజంగశిశురుత**

భుజంగశిశురుత మనునది బృహతి (9వ) చ్ఛందమందలి 128 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-య' అను గణక్రమము ఉండును,

ప్రాసనియమమున్నది యతినియమము లేదు. ('భుజగశిశురుత' మనుపేర భిన్న లక్షణముతో నొక వృత్తమీ ఛందమందే చెప్పబడినది. భుజంగ-భుజగ మన్నదే పేర్లలోని భేదము.)

ఉదా :

తొలిదెస కలతయయ్యెన్ । మలుదెస నలతయయ్యెన్
వెలిదెస మలతయయ్యెన్ । నలుదెస విలయమయ్యెన్.

—రామా. కల్ప. అర. జటా. 261.

## భద్రక-1

భద్రక మనునది బృహతి (9వ) చ్ఛందమందలి 187 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు. (15, 22వ ఛందముల నిదేపేర వృత్తములున్నవి. చూ. భద్రక-2, భద్రక-3.)

ఉదా :

హానివేదియిది చూడవే
దీనఁబుష్పతతి వాడవే
మానినాడువిడి యేగెనే
సూనకాంతి యిటు సాగెనే.

—రామా. కల్ప. అర. శబ. 369.

## ఉత్సుక

ఉత్సుక మనునది బృహతి (9వ) చ్ఛందమందలి 183 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా :

ఉత్సుకమొప్ప రచింతు శ్రీ
వత్స శుభాంకితు నిత్యనూ
త్నోత్సవ కల్పిత దివ్యసే
వోత్సము హృద్యవచస్స్ఫ్రితిన్.

—ఛ. హం. 44.

## కిశోర

కిశోర మనునది బృహతి (9వ) చ్ఛందమందలి 184 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. యతినియమము లేదు.

ఉదా:

'సునఖరాప్తికిశోరమిం
పెనయురంగమహీపతీ'.

—రంగ. ఛంద. 4-111.

ఈ పద్యము 9వ ఛందములోనిదిగాన యతినియమముండదు. కాని ఈ వృత్తమును చెప్పిన క. రంగకవి పై లక్ష్యమున ఏడవ యక్షరము యతి చెల్లించుట గమనింపదగినది.

**శుద్ధవిరాటి**

శుద్ధవిరాటి యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 345వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-స-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 6వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ఉల్లంబ్రియ-మొందఁగ్రొత్తసం

ధిల్లన్నెవ్వగ-దీనవక్త్రుఁడై

యొల్లంబోవుచు-నుచ్చె నవ్విభుం

డల్లంగౌఁగిట-నాన్నృపాలకున్.

—భార. స్త్రీ. 1-125.

**రసాలి**

రసాలి యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 187 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 7 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

తృప్తశైల దుహి-తృప్రియా ధీ

సుప్తసంవిదతి-శుద్ధతత్త్వ

దీప్తతైజసన-దీక్రియాని

ర్లిప్తభావవిమ-లీకృతత్వా.

—రామా. కల్ప. అయో. ముని. 528.

**మయూరసారి**

మయూరసారి యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 171 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-ర-గ' అను గణక్రమముండును. ప్రాస

నియమమున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే అనంతుడు, చి. పెద్దనలు 'మయూరభాషిణి' యను నామాంతరము తెల్పినారు.)

ఉదా :

చూతమాయశోద-సూనునంచున్

వ్రేతపల్కు-తర్క-విభ్రమంబుల్

భాతిగా రజంబు-పైరగంబుల్

జాతిగా మయూర-సారి చెప్పన్.

—అనం. ఛం. 2-29

**మయూరభాషిణి**

చూ. మయూరసారి.

**మనోరమ**

మనోరమ యనునది పంక్తి (10వ) ఛందమందలి 344 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-ర-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 7వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పునికి రమ్యమౌ-మనోరమా

ర్చనలు నిత్యధ-ర్మమై మనో

జ్ఞ నలినీవిశి-ష్ట జీవము

ల్లనిశము క్తి న-భ్యసించఁగన్.

—ఛం. హం. 56.

**మత్త**

మత్త యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 241 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-భ-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే చి. పెద్దన, అప్పకవి 'హంసశ్రేణి' యను నామాంతరము చెప్పినారు.)

ఉదా :

మొత్తంబారున్మథ-ములు నిత్యో

దాత్తంబై సత్పురి-తగకారా

యత్తంబై షణ్మిత-యతినొందున్
మత్తావృత్తంబగు-మహిఁగృష్ణా.

—అనం. ఛం. 2-27.

**హంసశ్రేణి**

చూ. మత్త.

**మణిరంగ**

మణిరంగ మనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 219వ వృత్తము ఇందు ప్రతి పాదమున 'ర-స-గ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 6వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

చెంగనాలుగ-చిత్రగతుల్గా
దొంగయేణము-తోచును దూరో
త్తుంగ ధారుణి-దూర్వను మేయన్
వంగినట్టులు-పాతరలాడున్.

—రామా. కల్ప. అర. మారీచ. 357.

**భోగివిలసిత**

భోగివిలసిత మనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 351వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-స-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'వీరవిలసి తోర్వి' అని పేర్కొనగా, అప్పకవి దీనికే 'విలసిత'మను నామాంతరము చెప్పి నాడు.)

ఉదా :

భోగివిలసిత-స్ఫుటప్రభా
భోగలసితు శం-భుఁగొల్తునే
నాగమనుతుఁబు-ణ్యకీర్తనన్
నాగమటుల మం-త్రముగ్ధనై

—ఛం. హం. 55.

**వీరవిలసితోర్వి**

చూ. భోగివిలసిత.

**విలసిత**

చూ. భోగివిలసిత.

**పణవ**

పణవ మనునది పం_క్తి (10వ) చ్ఛందమందలి 121 వ వృ_త్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-య-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఆరవ యతురము యతి చెల్లును. (ఈ వృ_త్తమునే 'ప్రణవ' మని అనంతుడు, చి. పెద్దనలు పేర్కొన్నారు.)

ఉదా :

నీయుల్లంబొక-నియతింగార్యం

బాయ_త్తంబుగ-ననుసంధింపం

జేయంజాలవు-చెడు తెర్వుంబో

బాయంద్రోవవు-బలిమింబుత్రున్.

—భార. స్త్రీ. 1-145.

**ప్రణవ**

చూ. పణవ.

**పం_క్తి-2**

పం_క్తి యనునది పం_క్తి (10వ) చ్ఛందమందలి 439 వ వృ_త్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-భ-గ' (3 భ+1 గ) అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. ఏడవ యతురము యతి చెల్లును. (5వ ఛందమున 'పం_క్తి' యనుపేర నొక వృ_త్తమున్నది. అది దీనికి భిన్నము. చూ. పం_క్తి-1.)

ఉదా :

దుర్ముఖుఁడీతఁడు-తూగి సమి

త్కర్మప్రచండుఁడు-కావళిరా

నోర్మి చలద్రవుఁ-డత్తఋజా

కర్మఠుఁడావవ-కాలుఁడయా.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 37.

**నందిని**

నందిని యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 359 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-త-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఆరవ యక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'నంది' యని పేర్కొన్నాడు.)

ఉదా :

ధేనువుగా నం-దిని నాత్మకా
మ్యానుగతశ్రీ-లమరన్ శుభ
జ్ఞానపయోవాం-ఛనుగొల్తు న
వ్యానిశపుష్టిన్-హరిఁ జేరఁగన్.

—ఛం. హం. 58.

**నంది**

చూ. నందిని.

**చంపకమాలి**

చంపకమాలి యనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 199 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-మ-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును. (ఇదే ఛందమందలి 'రుగ్మవతి'కిని, ఈ 'చంపకమాలి'కిని గణక్రమములో భేదములేదు. కాని రుగ్మవతియందు ఆరవ యక్షరము యతి చెల్లును.)

ఉదా :

చంపకమాలిన్ గ్రొ-ష్ణముకారిన్
సొంపుగ గాంచన్ హృ-చ్ఛుభవీధిన్
మంపిలువాంఛాళి-స్మయమిందన్
బెంపదె నిర్వృత్త-స్ఫిరదృష్టిన్.

—ఛం. హం. 51.

**రుగ్మవతి**

చూ. చంపకమాలి. 'చంపకమాలి'కిని 'రుగ్మవతి'కిని గణక్రమమున భేదము లేదు. కాని యతి చెల్లు స్థానమున భేదమున్నది. చంపకమాలియందు

ఏడవ యక్షరము యతి చెల్లగా రుగ్మవతియందు ఆరవ యక్షరము యతిచెల్లును. (ఈ 'రుగ్మవతి'నే క. రంగకవి 'వాగ్మి' యని పేర్కొన్నాడు.)

ఉదా :

ఆర్తిమహాంభో-ధ్యాకులఘోరా
వర్తవిభుగ్న-వ్యాధుతనౌకా
నర్తనకేళీ-నర్థనునాప
ద్ధూర్తతరూపై-తోచెదు సీతన్.

—రామా. కల్ప. అర. జటా. 358.

**వాగ్మి**

చూ: రుగ్మవతి; చంపకమాలి.

**కౌముది**

కౌముది యనునది పంక్తి (10) చ్ఛందమందలి 296 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-త-త-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఆరవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

తొడిరుమణ్వం-తుడీతండు నె
క్కుడు రిపుశ్రీ-కుజోన్మీలనో
గ్రుఁడు భుజోద్య-ద్రుమాస్ఫోటనో
గ్రుఁడు సమిద్ధీ-రుఁడు శ్రీపతీ.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 31.

**కోమల**

కోమల మనునది పంక్తి (10వ) చ్ఛందమందలి 55 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-మ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 7వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

భామగురుప్రతి-భన్ బెరపొందన్
గోమలవృత్తము-గ్రున్ రంగేంద్రా.

—రంగ. ఛంద. 4-112.

## స్వాగత

స్వాగత మనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 443 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-భ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

రాజరాజగుణ-రాజితరాజ
తేజరాజకుల-దీపవిశిష్టాం
భోజమిత్రనృప-పూజిత పాదాం
భోజభూవినుత-పుణ్యావరేణ్యా.

—భార. ఆది. 7-290.

## శ్యేని

శ్యేని యనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 68 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-ర-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే 'సేని' యని చి. పెద్దన పేర్కొన్నాడు.)

ఉదా :

మింటడేగపిండు-మేలిచక్రముల్
వెంటవెంటతిర్గి-వేగవ్రాలుచున్
మంటలేచువట్టి-మాంసఖండమున్
గెంటుకొంచుఁబోవుఁ-గీర్ణధాత్రిగా.

—రామా. కల్ప. అరణ్యా. పంచ. 398.

## సేని

చూ. శ్యేని.

## శాలిని-1

శాలిని యనునది త్రిష్టుప్ (11వ) ఛందమునందలి 289 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-త-త-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. ఏడవ యక్షరము యతిచెల్లును. (15వ ఛందమందలి 'సుగంధి' వృత్తమునకును 'శాలిని' యను నామాంతరమున్నది. చూ. సుగంధి.)

ఉదా :

భావశ్రీగమ్యప్ర-భాశాలినిన్ స్వే
చ్ఛావిర్భూతాత్మస్వ-యంభాసినిన్ బ్ర
హ్మావైదగ్ధ్యవ్యక్త-సర్వాంతరాత్మన్
శ్రీవిద్యోపాస్యన్ భ-జింతున్ భవానిన్.

—ఛం. హం. 71.

## వృత్త

వృత్తమనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 288 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-స-త-గగ' అను గణక్రమముండును ప్రాసనియమ మున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

అనిలజునివృ-త్తాంతంబపేక్షన్
విని మదిని ని-ర్వృత్తార్థుఁడౌ రా
ముని మనికి శ్రీ-పుంభావనష్టిన్
దనిమమున వృ-త్తస్ఫూర్తినుండెన్.

—ఛం. హం. 74.

## వృంత

వృంత మనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 256 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-స-గగ' అను గణక్రమముండును. తొమ్మిదవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

ఇతఁడు శరభుఁడు న-హిప్రౌఢిన్
పృతన మొగదలఁ జ-రించున్ సం
గత ప్రళయసమయ-కాలుండై
వితతభుజపరిఘ-వీలుండై.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 40.

**వాతోర్మి**

వాతోర్మి యనునది త్రిష్టుప్ (11వ) ఛందమునందలి 817 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-భ-త-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

అంతన్ దైత్యేశ్వరుఁ-డాకాశగతిన్
కాంతారోదధ్వని-కప్పంగ దిశల్
క్రాంతమ్మై దక్షిణ-గాఢోగ్రకకు
ప్ప్రాంతమ్మై కేరగ-ప్రాణమ్ములొగిన్.

—రామా. కల్ప. అరణ్య. జటాయు. 315.

**రథోద్ధత**

రథోద్ధత మనునది త్రిష్టుప్ (11) వ ఛందమందలి 699 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-ర-లగ' అను గణ క్రమ ముండును. ప్రాసనియమ మున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే అప్పకవి 'పరాంతిక' మను నామాంతరము చెప్పినాడు. వైతాళీయ భేదములలో 'పరాంతిక' మను జాతివర్గపు పద్యమున్నది. దానికి దీనికి సంబంధము లేదు.)

ఉదా :

హార హీర ధవ - ళాంశు నిర్మలో
దార కీర్తి రణ - దర్ప సద్గుణా
వైరి వీర రస - వైద్య మన్మథా
కార ధీర పర - గండ భైరవా

భార. సభా. 2-320.

**పరాంతిక :**

చూ. రథోద్ధతము. (వైతాళీయ భేదములలో 'పరాంతిక' మను పద్య మొకటి-జాతి వర్గమునకు చెందినది-ఉన్నది. దానికిని దీనికిని సంబంధము లేదు ఇది సమవృత్తము.)

**మౌక్తికమాల :**

మౌక్తిక మాల యనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 487 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-త-న-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

మౌక్తిక మాలావి - మల సుకాంతన్
వ్యక్తమగున్ స్వాతి - పథ విముక్త
ప్రాక్తన జీవార్ణ - వశుభ తత్త్వం
బుక్తిని శ్రీసూక్త - మొదవు శోభన్

ఛం. హం. 77.

**భ్రమర విలసిత :**

భ్రమర విలసిత మనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 1009 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-భ-న-లగ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. ఆరవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

మాకందోద్యత్సు - మమధురఝరిణీ
సేకంబై త్రావి - సివము లెసఁగన్
సాకూతంబొప్ప - సరస సరఘూ
నీ కంబుల్ ఝుమ్మ - ని రొదలురలెన్.

రామా. కల్ప. బాల. అవతార. 186.

**భద్రిక :**

భద్రిక యనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 704 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-ర-లగ' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును. ('భద్రిక' అను పేర చి. పెద్దన ఇదే గణ క్రమములో, యతిస్థాన భేదముతో చెప్పినాడు. చూ. భద్రిక-2, చంద్రిక.)

ఉదా :

ఇతఁడు నలుఁడ - హీన మూర్తియా
యతన మఖల - మైన శూరక
ర్మతతికి సరి - రాదు వీనికిన్
క్షితి శతశత - సేన రైనేనన్.

రామా. కల్ప. కిష్కిం. సమీ. 39.

**పృథివి**

పృథివి యనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 896 వ వృత్తము ఇందు ప్రతి పాదమున 'న-న-జ-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే అప్పకవి 'పృథ్వి' యని పేర్కొన్నాడు. 17వ ఛందమందలి పృథ్వీవృత్తమునకును దీనికిని భేదమున్నది. చూ. పృథ్వి-2.)

ఉదా :

విరళవిలసిత-పృథ్విగనన్
స్థిరమతినగన-దీవితతిన్
నెరవగు పలుకు-నిండురస
స్ఫురసుమమధుర-వృత్తిమదిన్.

—ఛం. హం. 75.

**పృథ్వి-1**

చూ. పృథివి. (17వ ఛందమందలి పృథ్వికిని దీనికిని భేదమున్నది. చూ. పృథ్వి-2.)

**దోదక**

దోదక మనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 439 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-భ-గగ' (3భ+2గ) అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే తోధక, తోదక, తోటక మను నామాంతరములున్నవి. అయితే 12 వ ఛందమందలి తోదక, తోటకములు వీటికి భిన్నములు.)

ఉదా :

తోరపు వేడుకం-దోదకవృత్తా
కారముగాం బ్రిథ-కారగగంబుల్
నీరజనాభుని-నెమ్మినుతింపన్
జారువిరామము-షణ్మితినొందున్.

—అనం. ఛంద. 2-32.

**తోధక**

చూ. దోదక.

## తోటక-1

చూ. దోదక. (12 వ ఛందమందలి తోటకమునకు ఇది భిన్నము. చూ. తోటక-2.)

## తోదక-1

చూ. దోదక. (12వ ఛందమందలి తోదకమున కిది భిన్నము. చూ. తోదక-2.)

## చంద్రిక-1

చంద్రిక యనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 704వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-ర-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 9 వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే 'భద్రిక' అని చి. పెద్దన పేర్కొన్నాడు. 'భద్రిక' అను పేర అప్పకవి ఇదే గణక్రమముతో, యతిస్థానభేదముతో చెప్పినాడు. చూ. భద్రిక-1. మరియు 12 వ ఛందమం దున్న చంద్రికకు ఈ చంద్రికకు సంబంధము లేదు. చూ. చంద్రిక-2.)

ఉదా:

అగవరధరసార-వాన్వితం
బుగఁగృతులను జెప్పఁ-బొందికై
తగవిధివిరమంబు-తాకగా
జగతిని నెగడొందుఁ-జంద్రికన్.

—అ. క. 4. 11వ ఛం.

## భద్రిక-2

చూ. చంద్రిక. (ఇదే ఛందమున భద్రిక యను మరొక వృత్త మున్నది. ఈ రెంటికి యతిస్థానమందు మాత్రమే భేదము. చూ. భద్రిక-1.)

## కలితాంత

కలితాంత యనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 877వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-జ-జ-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతిచెల్లును. (ఈ వృత్తమునే భీమన 'కాంత' అని, అనంతుడు 'గీతాలంబన'మని పేర్కొన్నారు. చి. పెద్దన, అప్పకవి 'గీతాలంబ నము' నామాంతరమన్నారు మరియు 'కాంతి' యనుపేర 'కలితాంతము'నే మరల చెప్పినారు.)

ఉదా :

ధారాధరవాహన-ధైర్యకృతీ

క్షీరాబ్ధిశిఖీశ్వర-శీతలరు

గ్దారాధరకల్పక-కామగవీ

తారాధిపసన్నిభ-దాననిధీ.

—విక్ర. చరి. 5-229.

**గీతాలంబన**

చూ. కలితాంత.

**కాంత**

చూ. కలితాంత.

**కాంతి**

చూ. కలితాంత.

**ఏకరూప**

ఏకరూప యనునది త్రిష్టుప్ (11 వ) ఛదమందలి 396 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-భ-జ-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ యక్షరము యతి చెల్లును.

ఉదా :

స్తోకంబై తోకలును - జూలు నిప్పుల్

జాకొన్నన్ హేషలుగ - దౌడులొప్పన్

జీకాకై మంటలకె - చేరు గుఱ్ఱా

లేకొనల్ లేనవల - మేదు చోటుల్.

రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర 238.

**ఉపేంద్ర వజ్ర :**

ఉపేంద్ర వజ్ర యనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 358 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-త-జ-గగ' అను గణ క్రమ ముండును, ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పురారి ముఖ్యామర - పూజనీయున్

సరోజనాభున్ జత - జద్విగో క్తిన్

దిరంబుగా నద్రియ - తిన్నుతింపన్

ఇరానుప్రాణేశు ను- పేంద్ర వజ్రన్

అనం. ఛంద. 2-45.

**ఉపస్థిత-1**

ఉపస్థిత యనునదీ త్రిష్టుప్ (11 వ) ఛ దమందలి 365 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-జ-జ-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును. (ఈ ఛందమందే ఉపస్థితమను మరొక వృత్తము భిన్నలక్షణముతో నున్నది. చూ. ఉపస్థిత 2.)

ఉదా :

భక్తుల్ హరిమీందను - పస్థితం బా

సక్తిన్ విరతుల్కరి - సంఖ్య సాగన్

సూక్తుల్గొని చెప్పెడు - చో దజాగా

యుక్తంబగుచుం జెలు - వొందు చుండున్.

అ. క. 4-11 వ ఛం.

**ఉపస్థిత-2**

ఉపస్థిత మనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 286 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-స-త-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 7 వ అక్షరము యతి చెల్లును. (దీనికే చి. పెద్దన 'శ్రీ' అని, అప్పకవి 'శిఖండి విరుత', 'స్త్రీ' యని నామాంతరములు చెప్పినారు.)

ఉదా :

ఉపస్థితము చే - యున్ జస్త గాప్తిన్

అ. సా. సం. 1-11 వ ఛం.

**శ్రీ-2**

చూ. ఉపస్థిత-2. (ఒకటవ ఛందమందలి 'శ్రీ' వృత్తమునకు దీనికి సంబంధము లేదు. చూ. శ్రీ-1.)

**శిఖండి విరుత**

చూ. ఉపస్థిత-2.

**స్త్రీ 2**

చూ. ఉపస్థిత-2. (రెండవ ఛందమందలి 'స్త్రీ' వృత్తమునకు దీనికి సంబంధము లేదు. చూ. స్త్రీ-2.)

**ఇంద్ర వజ్ర**

ఇంద్ర వజ్ర యనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 357 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-త-జ-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

సామర్థ్యలీలన్ దత - జ ద్విగంబుల్
భూమిధ్ర విక్రాంతులఁ - బొంది యొప్పన్
ప్రేమంబుతో నైంఁదవ - బింబ వక్త్రిన్
హేమాంబరుం జూడుడు - రింద్ర వజ్రన్

అనం. ఛంద. 2-33.

**సుముఖి**

సుముఖి యనునది త్రిష్టుప్ (11వ) ఛందమందలి 880 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-జ-లగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 7 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

వెడలి విచిత్ర - విచిత్ర గతుల్
కడవఁగడంగి - కడంగి రథుల్
నడపఁగ దూలి - నవాజి తతుల్
కడచిచనున్ ము - ఖక్షత్తకళల్

రామా. కల్ప బాల. ధనుస్. 356

**మందారదామ**

'మందారదామ' మనునది త్రిష్టుప్ (11 వ) ఛందమందలి 293 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '3త+2గ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 7 వ అక్షరము యతి చెల్లును. (లాక్షణికులు చెప్పనిది, జక్కన విక్రమార్క చరిత్రాదులందు ప్రయుక్తమైనది.)

ఉదా :

శృంగార రేఖావి - శేష స్వరూపా
రంగజ్జనానీక - రక్షాదిలీపా
సంగీత సాహిత్య - సారస్యలోలా
అంగీకృతాంగీ కృ - తాచారశీలా.

విక్ర. చరి. 6-147.

## స్రగ్విణి

స్రగ్విణి యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1171వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'నాల్గు రగణము' లుండును ప్రాస నియమమున్నది. ఏడవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

అండజా ధీశవా - హా జగద్దేహ దో
ర్దండ చండారిని - ర్దారితారీ నతా
ఖండలా గండరిం - ఖన్మణీ కుండలా
పుండరీకేక్షణా - ప్రోవునన్ సుక్షణా

పాండు. 2-69.

## విశ్వదేవి

విశ్వదేవి యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 577 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-మ-య-య' (2 మ - 2 య) అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అంభారావోత్సృష్టంబు - లై పక్షవోగ్రో
జ్జృంభమ్మౌల్ సైన్యంబుల్ ధు - రీణంబులంతన్
భుంభుంధ్వానంబుల్గాగఁ - బుట్టెన్ ధరాభృ
ద్గంభీరానీకంబున్ వి - ఘాతంబు చేసెన్.

రామా. కల్ప. బాల. ధనుస్. ౯౬.

**జలధర మాల**

జలధరమాల యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 241వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-భ-స-మ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 9 వ యక్షరము యతి చెల్లును.

ఉదా :

ఆకాశంబందు నగరు - దాక్షోదంబై

యేకోనల్పోయితిమట - నేదిక్కేదోఁ

కాకుండం గన్నులు జతు - కావర్ణంబై

యేకోనల్తోచవు మది - కేదో క్షితిన్

రామా. కల్ప. కిష్కిం. అన్వే. 311.

**చంద్రవర్త్మ**

చంద్రవర్త్మ యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1979 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-భ-స' అను గణక్రమ ముండును. 7 వ అక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

ఉర్వియెల్ల నొక - యుండవలె మహా

ఖర్వ మూర్తి కన - గాను వెలసెఁ దా

మూర్విఁ బెద్ద నదు - లూచకొనియెనా

దూర్వ కాడలనఁ - దోచె నచటికిన్

రామా. కల్ప. కిష్కిం. అన్వే. 312.

**కుసుమ విచిత్ర**

కుసుమ విచిత్ర యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 976 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-య-న-య' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 7 వ అక్షరము యతి చెల్లును.

ఉదా ;

శకయ వనాళుల్ - సకల ధరిత్రిన్

వికట గతింద్రె - వ్విన నరపాలుం

డ కుటిలబుద్ధిఁ - హతులను జేసెన్
శకచముపుల్ భా - స్వరశర వహ్నిన్

రామా. కల్ప. బాల. ధనుస్. 88

**ఉజ్జ్వల**

ఉజ్జ్వల యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1472 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-భ-ర' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

న నభరలమరు - న్మహితోజ్జ్వలన్

ల. సా. సం. 1.12 వ ఛం.

**ఇంద్ర వంశ**

ఇంద్రవంశ యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1381 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-త-జ-ర' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ఆకాశమందైనఁ గ - టా చనందరం
గాకీర్ణ ఘోరాకృతి - యాడనీయకే
రేకైన ఱెక్కన్విని - కృత్తశక్తియై
కాకంబు విష్ణ్వాశపా - కారిపోవఁగా

రామా. కల్ప. అరణ్య. అన. 98.

**నవమాలిని**

నవమాలిని యనునది జగతి (12వ) చ్ఛందమందలి 948వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-భ-య' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'నలి నవమాలినిన్ న జ భయల్ విన్'

ల. సా. సం. 1-12 వ ఛం.

**వంశస్థ**

వంశస్థ మనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1382 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-త-జ-ర' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

లతాంగు లానంద వి - లాసమూర్తులై
నితాంత గర్భంబులు - నిక్కిముండటన్
పతంగ రాట్పంచువు - భాతి శార్ఙ్గ స
ద్వ్రతాధురావైఖరి - నద్భుతంబుగాన్

రామా. కల్ప. బాల. అవతార. 181.

**లలిత-1**

లలిత యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1407 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-భ-జ-ర' అను గణక్రమ ముండును. ప్రాస నియమ మున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

తాల్చున్న భాశిలలితన్ - తభల్ జరల్

ల. సా. సం. 1-12 వ ఛం.

**మేఘ విలసిత**

మేఘ విలసిత యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 2041 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-న-స' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. ఆరవ యక్షరము యతి చెల్లును.

ఉదా :

ప్రాంతోన్మీలిత - పలితసరసిజా
క్రాంతాక్షిస్ఫుట - కరుణరసధునీ
కాంతోపస్నిత - కమలన వద్రుశా
కాంతార్ధీకృతి - ఘటిత తనుఘృణీ

రామా. కల్ప. యుద్ధ. సంశయ. 403.

**మణిమాల-1**

మణిమాల యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 781 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-య-త-య' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. ఏడవ అక్షరము యతి చెల్లును. (21 వ ఛందమున నొక 'మణిమాల' యున్నది. చూ. మణిమాల-2.)

ఉదా :

శృంగామలచూడా - బాణాసురహేడా
శృంగార విరామా - నృత్యాహితకామా
సంగేతర వృత్తీ - సంవ్యానితకృత్తీ
సాంగాగమమూర్తీ - సాయుజ్యదకీర్తీ

రామా. కల్ప. అయో. అనసూ. 207.

**భుజంగప్రయాత**

భుజంగప్రయాత మనునది జగతి (12వ) చ్ఛందమందలి 586 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'నాల్గు యగణము' లుండును. ప్రాసనియమమున్నది 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అభద్రాంధకారోద-యద్భానుభావా
శుభైకాశ్రయీభూత-శుద్ధస్వభావా
అభక్తావళీదృష్ట్య-హః కాలతారా
స్వభక్తాగ్రభూపారి-జాతావతారా.

—క. క. ర. 3-283.

**ప్రియంవద**

ప్రియంవద యనునది జగతి (12 వ) చ్ఛందమందలి 1400 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-భ-జ-ర' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతిచెల్లును.

ఉదా :

దివిషదీశ్వరుఁడు-తేపమానులున్
గవురుగప్పుచుపొ-గల్ వెలార్పఁగా

నవుదపస్సుల మ-హాగ్ని రేగఁగా
నవురయచ్చరల-నంపునంటఁగా

రామా. కల్ప. బాల. ఇష్టి. 165.

## ప్రహేయ

ప్రహేయ మనునది జగతి (12వ) చ్ఛందమందలి 576 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-మ-య' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరను యతి చెల్లును.

ఉదా :

అమరపతిసుత-ప్రాలంబబాహు
భ్రమణచటులధూః-పాతంబు(తోడన్)
కమలవిమలసూ-కాయంబు గ్లానిన్
చెమరిచికలఁగెన్-జేతంబుతూలన్.

రామా. కల్ప. కిష్కిం. నియమ. 113.

## ప్రమితాక్షర

ప్రమితాక్షర యనునది జగతి (12వ) చ్ఛందమందలి 1772 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'స-జ-స-స' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 9వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ప్రమితాక్షరప్రణవ-రాజితమౌ
ప్రమథాధిపప్రథిత-తోధనసనా
మములాత్మనేమశుభ-మంత్రములై
విమలాత్మబుద్ధిసమ-పీతములన్.

—ఛం. హం. 90.

## ప్రభ

ప్రభ యనునది జగతి (12వ) చ్ఛందమందలి 1216 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-ర-ర' (2న-2ర) అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'ప్రముదితవదన' యను పేర మరల చెప్పి 'ప్రభాత' మను నామాంతరముగూడ తెల్పినాడు.)

ఉదా :

'స్వరయతిననరా-ల్ప్రభాఖ్యందగున్'.

—ల. సా. సం. 1-12 వ ఛం.

ప్రముదితవదన

చూ. ప్రభ.

ప్రభాత-1

చూ. ప్రభ. (13 వ ఛందముననున్న 'ప్రభాత' మను వృత్తము నకును దీనికిని సంబంధము లేదు. చూ. ప్రభాత-2.)

పదమాలి

పదమాలి యనునది జగతి (12వ) చ్ఛందమందలి 1392 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-జ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'నజజరలీపదమాలి-నాదగున్'

—ల. సా. సం. 1-12 వ ఛం.

ద్రుతవిలంబిత

ద్రుతవిలంబిత మనునది జగతి (12వ) చ్ఛందమందలి 1464 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-భ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 7వ అక్షరము యతిచెల్లును.

ఉదా :

త్రిభువనాంకుశ-దీప్తనిధీ సమ
స్త భువనాశ్రయ-ధర్మధురంధరా
శుభయశః పరి-శోభితపూర్వది
క్ప్రభువిలాసకృ-పారసబంధురా.

—భార. ఆది. 4-275.

తోదక-2

తోదక మనునది జగతి (12వ) చ్ఛందమందలి 880 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-జ-జ-య' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతిచెల్లును. (ఈ వృత్తమునే 'తోవక'మని అనంతుడు,

'దోధక'మని చి. పెద్దన చెప్పినారు. వీరితోపాటు 'తామరస'మను నామాంతరము నప్పకవియు చెప్పినాడు. క. రంగకవి ఈ పద్యమునే 'కలరవ' మని పేర్కొన్నాడు.)

ఉదా :

తమతమతప్పులు-దారెరియంగా
విమలమతీ యిటు-వీరికినైశో
కమున దహింపఁగఁ-గాదు మనంబున్
సముచితమిత్తఱి-శాంతమునుమ్మీ.

—భార. స్త్రీ. 1-81.

**తోవక**

చూ. తోదక.

**దోధక**

చూ. తోదక

**తామరస**

చూ. తోదక.

**కలరవ**

చూ. తోదక

**తోటక-2**

తోటక మనునది జగతి (12వ) చ్ఛందమందలి 1756 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'నాలుగు సగణములు' ఉండును. ప్రాసనియమమున్నది. 9వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అలకాధిపతీ సుగు-ణాభిరతీ
మలయోద్భవచంద్రస-మానయశా
కులపావనయూరుజ-గోత్రవరా
లలనాజనతారుషమ-లక్ష్మనిభా.

హర. 2-146.

**జలోద్ధతగతి**

జలోద్ధతగతి యనునది జగతి (12వ) చ్ఛందమందలి 1886 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-స-జ-స' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది 8వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పయోధులివి యేడు-పాలితమునీం
ద్రయాగపరిరక్ష-ణార్థము సదా
వయశ్లథశరీరు-వాంఛనుబడిన్
ప్రయాతములు మౌని-రాజవసతిన్.

—రామా. కల్ప. అరణ్యా. శబరి. 370.

సుమంగలి

సుమంగలి యనునది అతిజగతి (13 వ) చ్ఛందమందలి 1772 వ వృత్తము ఇందు ప్రతి పాదమున 'స-జ-స-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

శుభదాయకంబగు-సుమంగలినెన్నన్
విభవోత్కరంబగు-పృథూత్సవ కల్యా
ణ భృశాత్మయౌ లల-నగా వరగౌరీ
నిభపూజనీయగ-నివాళులఁగొల్వన్.

—ఛం. హం. 108.

రుచిర

రుచిర మనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 2806 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-భ-స-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అనంగ కోటివిలస-దంగవైభవున్
మనంబులో నిలిపిన-మానునాపదల్

అనన్ జథంబులుసజ-గానుసంగతిన్

దనర్చు నీరుచిరకు-దంతిరాడ్యతిన్.

—అనం. ఛం. 2-61.

**మత్తహంసిని**

మత్తహంసిని యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 2790 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'జ-త-స-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'మత్తహాసిని' అని పేర్కొన్నాడు.)

ఉదా :

స్ఫిరాచితంబయ్యో-సితమత్తహంసినీ

పరస్పరోక్తుల్ భ-వ విధాతృసంస్తుతిన్

స్థిరావలంబ ప్ర-తిక్రమాత్మశోభిత

స్వరాక్షరంబై య పరశారదోక్తిగాన్.

—ఛ. హం. 107.

**మత్తహాసిని**

చూ. మత్తహంసిని.

**మత్తమయూర**

మత్తమయూర మనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 1633 వ వృత్తను. ఇందు ప్రతి పాదమున 'మ-త-య-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

నానాభూషామంజుల-నారీచయమంతన్

రానుంబోనున్ నూపుర-రావంబులు కాంచీ

స్థానాలోలత్కింకిణి-సంరావముగాగన్

గానంగానై నంగని-కన్నుల్ చలితంబై.

—రామా, కల్ప. కిష్కిం. నియమ. 132.

**మంజుభాషిణి**

మంజుభాషిణి యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 2796 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-స-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ధనమంతయుంబొలియ-దారుణంబుగా
దనయప్రజంబు దెగ-దైన్యమారఁగాఁ
దనబంధులందఱు మృ-తంబుఁబొంద నె
వ్వనినైన శోకమను-వహ్ని గాల్పదే.

—భార. స్త్రీ. 1-63.

**ప్రహర్షిణి**

ప్రహర్షిణి యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 1401 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-జ-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ము_క్తి శ్రీకరుభవ-మోచను న్మురారున్
భ_క్తిం బ్రోడజనులు-ప్రస్తుతింపనొప్పున్
వ్య_క్తగ్రావయతిఁబ్ర-హర్షిణి సమాఖ్యన్
యు_క్తంబై మనజర-గోజ్జ్వలద్గణాప్తిన్.

—అనం. ఛం. 2-59.

**ప్రభాత-2**

ప్రభాత మనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 1392వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-జ-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8వ అక్షరము యతి చెల్లును. (12వ ఛందమున ప్రభాతమను పేర నొక వృత్తమున్నది. దానికి భిన్నము. చూ. ప్రభాత-1.)

ఉదా :

తొలివెలుఁగయ్యెని-దోయి యోయియోకో
సలసుతసుప్రజ-సాధు రామచంద్రా

తొలివెలుఁగయ్యెని-దోయి కౌసలేయా
మెలకువ వచ్చెనె-మీకు రామభద్రా.

—రామా. కల్ప. బాల. అహల్యా. 92.

**చంచరీకావలి-1**

చంచరీకావలి యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 1153 వ వృత్తము. దీనికి ప్రతి పాదమున 'మ-మ-ర-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 7వ అక్షరము యతి చెల్లును. (దీనినే చి. పెద్దన 'చంచరీకాతతి' యన్నాడు. ఇదే ఛందమున మరొక 'చంచరీకావలి' భిన్నలక్షణముతో నున్నది. చూ. చంచరీకావలి-2.)

ఉదా :

జ్వాలాలీఢం బౌచున్-జానశాలల్సెలంగన్
హేలంబానీయంబై-యేపుమీఱెన్మహోగ్నుల్
క్రాలుంగత్తుల్ నిప్పుల్-గ్రౌణమౌవృత్తిమున్నై
యేలెన్ వాచ్యత్వంబే-యిప్పుడీకల్లుబానన్.

—రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర. 229.

**చంచరీకాతతి**

చూ. చంచరీకావలి-1.

**జలద**

జలద మనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 3543 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-ర-న-భ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

నీపలుకెల్ల నిక్కమయ-నింద్యగుణా
యీపురుషార్థహానిసుతు-లీల్గుటకుం
దాపముఁబొంది తాల్మిఁదిగ-ద్రావి మహా
కోపుఁడనైనఁబాటిలెఁద-గుంగినియన్.

—భార. స్త్రీ. 1-148.

### క్షప

క్షప యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 2368 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-త-త-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే చి. పెద్దన 'చంద్రిక', 'క్షమ' అని; అప్పకవి 'క్షమ' అని నామాంతరములు చెప్పినారు.)

ఉదా :

ఇతఁడు శతసహ-స్రేడితానీకినీ
పతిసురపతిసా-పత్యభోగుండునున్
శతవలి యనఁగా - శౌర్యనారాయణుం
డితఁడు హరిచమూ - హీర మార్యోత్తమా.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 17.

### చంద్రిక-2

చూ. క్ష ప. (11 వ) ఛందమందలి చంద్రికకు దీనికి సంబంధము లేదు. చూ. చంద్రిక-1.)

### క్షమ

చూ. క్ష ప.

### చంచరీకావలి_2

చంచరీకావలి యనునది అతిజగతి (13 వ) చ్ఛందమందలి 5250 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'య-మ-ర-ర-గ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 6 వ అక్షరము యతి చెల్లును. (ఇదే ఛందమందున్న మరొక చంచరీకావలి భిన్న లక్షణము కలది. చూ. చంచరీకావలి 1).

ఉదా :

యమ్రాగల్పో - ల్పొ చంచరీకావళింపై

—ల. సా. సం. 1-13 వ ఛం.

### బంభరగాన

బంభరగాన యనునది అతిజగతి (13 వ) చ్ఛందమందలి 3520 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-న-భ-భ-గ' అను గణక్రమముండును, ప్రాస నియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ప్రజిత వినుత బంభర గానమగున్

గ జయతి ననభా గల రంగ నృపా!.

—రంగ. ఛంద. 4-130.

**లత**

లత యనునది అతిజగతి (13వ) చ్ఛందమందలి 4048వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-య-న-న-గ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'సతవడిరంగే-శ్వర నయననగో

న్నతినిలతావృ-త్తము చెలువమరున్.

—రంగ. ఛంద. 4-131.

**వసంతతిలక**

వసంతతిలక మనునది శక్వరి (14వ)చ్ఛందమందలి 2933వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'త-భ-జ-జ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే సింహోన్నత, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి-అను నామాంతములు చి. పెద్దన, అప్పకవి చెప్పినారు.)

ఉదా :

శ్రీరమ్యరాజకుల-శేఖరరాజరాజా

భూరిప్రతాపపరి-భూతవిరోధివర్గా

హారామృతాబ్జహార-హాసతుషారకుంద

స్ఫారద్యశఃప్రసర-పాండుకృతత్రిలోకా.

—భార. అర. 3-399.

**సింహోన్నత**

చూ. వసంతతిలక.

**ఔద్ధర్షిణి**

చూ. వసంతతిలక.

**మధుమాధవి**

చూ. వసంతతిలక.

**శోభావతి**

చూ. వసంతతిలక.

**వనమయూర**

వనమయూర మనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 3823 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-జ-స-న-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది 9వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే అనంతుడు, చి. పెద్దన 'ఇందువదన' అను మరొక పేరు చెప్పినారు.)

ఉదా :

రాజకులశేఖరప-రంతప వివేక
భ్రాజిత జగద్వలయ-భాసురసముద్య
త్తేజనిరవద్యయువ-తీమదనవీరో
గ్రాజివిజయాత్రిభువ-నాంకుశనరేంద్రా.

—భార. ఆది. 5-261.

**ఇందువదన**

చూ. వనమయూరము.

**భూనుత-1**

భూనుత మనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 3515 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-భ-భ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 10 వ అక్షరము యతిచెల్లును. (ఈ ఛందమందే మరొక 'భూనుత' మున్నది. వీటి లక్షణమున భేదమున్నది. చూ. భూనుత-2.

ఉదా :

ఆఁకలేకయయ్యుపాంపతి-నైనను దాటున్
దోఁకచిచ్చనఁగ రక్కసి-తుంగదహించున్
వీఁక యీదృశములోకము-వీరులకెల్లన్
జోఁక యీతనికి నంజని-సూనునకెందున్.

—రామా. కల్ప. బాల. అవ. 72.

**భూనుత-2**

భూనుత మనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 3579 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-న-భ-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. పదవ అక్షరము యతి చెల్లును (ఇదే ఛందమందున్న మరొక 'భూనుత'మునకు దీనికి గణక్రమమున భేదమున్నది. చూ. భూనుత-1.)

ఉదా :

అందమైరననభతతి - నందిగగంబుల్

పొందఁగాఁబదగతిగని-భూనుతమయ్యెన్.

—కా. చూ. 8. 14 వ ఛం.

**ప్రహరణకలిత**

ప్రహరణకలిత యనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 8128 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-భ-న-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ఇది యిటులగుట-ల్లెఱిఁగి పలికె నా

విదురుఁడు సభఁగో-విదులు వొగడఁగా

నదివినియును నే-నడపనదురితం

బొదవెఁగలక సే-టొలయకుడుగునే.

—భార. స్త్రీ. 1-185.

**నవనందిని**

నవనందిని యనునది శక్వరీ (14 వ) చ్ఛందమందలి 3820 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-స-న-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

కనుమూసికన్దెఱచులోఁ-గడువశిష్ఠుం

డనె భీతిలేదు పదఁడా-యనుచు గాధే

యుని నీవులేవుకుటిలా-యుదరుపాటా

మునిపల్లెమంటనిడెదో-ములుచ యంచున్.

—రామా. కల్ప. బాల ధనుస్. 98.

**కమలవిలసిత**

కమలవిలసిత మనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 4096 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '4 నగణములు+2 గురువులు' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 9వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే క. రంగకవి 'సురుచిర'మని పేర్కొన్నాడు. చూ. సురుచిర-2.)

ఉదా :

నగణమునగణము-ననణముఁ జేరన్
నగణము గగము నొ-నర నటమీఁదన్
దిగి భ విరమణము-దిరమగునేనిన్
దగుఁగమలవిలసి-తము కమలాక్షా.

—అనం. ఛం. 2-69.

**సురుచిర-2**

చూ. కమలవిలసిత. (7వ ఛందమందున్న 'సురుచిర'కు దీనికి సంబంధము లేదు. చూ. సురుచిర-1.)

**అసంబాధ**

అసంబాధ మనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 2017వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-త-న-స-గగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 12వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

కోటుల్ లక్షల్ దానవబలములు-క్షోదింపన్
నీటుల్ గోటుల్ సాగవుపొసగదు-నిల్వంగన్
దాటీఘోటీఘట్టనశకలిత-దర్పంబౌ
నాటోపంబున్ జూపఁగ వెలఁదుక-యన్నట్లా.

—రామా. కల్ప. అరణ్య. పంచ. 200.

**అపరాజిత**

అపరాజిత యనునది శక్వరీ (14వ) చ్ఛందమందలి 5824వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-ర-స-ల-గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే భీమన 'పరాజిత' యని పేర్కొన్నాడు.)

ఉదా :

ననరసలగముల్ పెం-నంగిన సద్యశో

ధనవినుమపరాజి-తంబగు రేచనా.

—క. జ. వృత్తా. 70.

**పరాజిత**

చూ. అపరాజిత.

**సుగంధి**

సుగంధి యనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 10923 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-జ-ర-జ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునకే శాలిని, చామర, ప్రశాంతి యను నామాంతరములను చి. పెద్దన, అప్పకవులు చెప్పినారు.)

ఉదా :

ఓరి నీదుమాయరూప-మున్నదున్నయట్లుగాఁ

గోరిపట్టుకోఁదలంపఁ-గూడిరావు దుర్మతీ

యోర చావుమంచు స్వామి-యగ్నిబాణసంధిగా

నూరితాటకేయుమేన-నొల్కొనన్విదిర్చినన్.

—రామా. కల్ప. అరణ్యా. మారీచ. 367.

**చామర**

చూ. సుగంధి.

**ప్రశాంతి**

చూ. సుగంధి.

**శాలిని-2**

చూ. సుగంధి. (11వ ఛందమందలి 'శాలిని'కి దీనికి సంబంధము లేదు. చూ. శాలిని-1.)

**సుకేసర**

సుకేసర మనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 11184 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-భ-జ-ర' అను గణక్రమముండును.

ప్రాసనియమమున్నది. 11వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'ప్రభద్రక'మని, అప్పకవి 'భద్రక'మని పేర్కొన్నారు.)

ఉదా :

ననలు చివుళ్లు వహ్నిపరి-ణామమూర్తులై
యనలములంటుకొన్న (దమ-వైన యాకృతుల్
కొనకొని మారెగాని మఱి-కోలుపోవునై
జనిభృతమైన వన్నియల-జాలితోటలన్.

—రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర. 230.

## ప్రభద్రక

చూ. సుకేసర.

## భద్రక-2

చూ. సుకేసర.

## మాలిని

మాలిని యనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 4672 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-మ-య-య' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

సరససురవధూలా-స్యంబులున్ సిద్ధవిద్యా
ధరపటుపటహాతో-ద్యంబులున్ గిన్నరీకిం
పురుషలలితగీతం-బుల్ మహారమ్యమయ్యెన్
వరమునిదివిజాశీ-ర్వాదనాదంబుతోడన్.

—భార. ఆది. 5-127.

## మనోజ్ఞ

మనోజ్ఞ మనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 11632 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-జ-భ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

విమలమనోజ్ఞగుణప్ర-వృత్తినిఁదెల్పువా
కుసుమమెదచాటుననూగు-చొక్కపుఁబూవుఁగా
స్వమనితవస్తువిభూతి-పైకొనహృల్లతా
ప్రమితినిఁజాటు సుగంధ-భావసమజ్జలన్.

—ఛం. హం. 120.

**మణిభూషణ**

మణిభూషణ మనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 11707 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ర-న-భ-భ-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 10వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే భీమన 'మణిభూషణశ్రీ' అని పేర్కొన్నాడు.)

ఉదా :

రామవిక్రముఁడ జేయుఁడ-రాతిగజావళీ
సామజాహితుఁడు సాంబుఁడు-సాల్వచమూపతికి
క్షేమవృద్ధియనువాని న-కృత్రిమ సాహసో
ద్దాము దాకె శరధారల-ధారుణిఁగప్పుచున్.

—భార. అరణ్యా. 1-155.

**మణిభూషణశ్రీ**

చూ. మణిభూషణ.

**మణిగణనికర**

మణిగణనికర మనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 16384 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున వరుసగా '4 నగణములు+1 సగణ' ముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును. (ఈ వృత్తమునే చి. పెద్దన 'శశికళ' అని పేర్కొన్నాడు.)

ఉదా :

గొడుగులు పటియలు-గుఱుకులు గొనుటన్
సిడముల తునియలు-సెదరి యునికిఁబెం

దడిగలుఁబడగలు-దఱచు ముఱియలై

పుడమిఁగలయుటకుఁ-బొగులొలయమదిన్.

—భార. స్త్రీ. 2-3.

**కలికళ**

చూ. మణిగణనికర.

**నలిని**

నలిని యనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 14044వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ఐదు సగణములు' (5 స) ఉండును. ప్రాసనియమ మున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

నలినీవిమలాశయమా-నస మొప్పనవో

త్పలసుందరభావనము-ద్గతసుస్మితమం

జులసత్త్వమునం బ్రకృతిన్-శుభదర్పణమ

ట్లలరారు పరాత్పరు వ్యా-యతసృష్టిగనన్.

—ఛం. హం. 125.

**చంద్రరేఖ**

చంద్రరేఖ యనునది అతిశక్వరీ (15 వ) ఛ్ఛందమందలి 4625 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-ర-మ-య-య' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ఇంద్రాణిన్ జంద్రరేఖా-వృత్తాచ్ఛధీకౌముదిశ్రీ

సాంద్రస్మేరాభిరామన్-శశ్వత్సుధావర్షిణిన్ నీ

తేంద్రప్రామాణ్యనీరం-ద్రేభ్యన్ శ్రుతిజ్ఞేయనాద్యన్

మంద్రస్తోత్రప్రసక్తిన్-మాన్యప్రపత్తిన్ భజింతున్.

—ఛ. హం. 124.

**ఇల**

ఇల యనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమందలి 16364 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-న-న-స' అను గణక్రమముండును. ప్రాసనియమ మున్నది. 8వ అక్షరము యతి చెల్లును. చి. పెద్దన మాత్రము 5 వ, 8 వ అక్షరములు-అనగా పాదమున రెండుచోట్ల యతి చెల్లునన్నాడు.

ఉదా :

వసనంబులూడఁగఁ-బడఁతిగమిపఱవన్

పసమీఱుతత్కుచ-భరమురుచికనుచే

యసురుల్ మహాగ్నికి-నఱతగులఁబడియున్

గొసరైనచూపులఁ-గుసులుకొనిగనఁగన్.

—రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర. 231.

**అలసగతి**

అలసగతి యనునది అతిశక్వరీ (15వ) చ్ఛందమునందలి 7648 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-స-న-భ-య' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

తమ గృహములున్ మఱియు-దగ్ధమగుచుండన్

గుమతులయి రక్కసులు-కొందఱు దురాశా

క్రమములు తగులంబడు ప-రావసథచౌర్య

క్రమము నెఱపన్ దహన - కాండము దహింపన్.

—రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర. 234.

**గజరాజ**

గజరాజ మనునది అతిశక్వరీ (15 వ) చ్ఛందమందలి 15788 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'స-జ-భ-భ-స' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'స జభాస లష్టవి - క్రమరీతిఁ దనరినన్

గజరాజ మౌను రం - గ నృపాల-వసుమతిన్

—రంగ. చంద. 4-137

**లలితగతి**

లలితగతి యనునది అతిశక్వరీ (15 వ) చ్ఛందమందలి 16360 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-న-జ-స' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

నలినిఁబదునొకటి యతి - నాన జసలున్

లలితగతి కలరు నిల - రంగ నృపతీ.

—రంగ. ఛంద. 4-141.

**సరసాంక**

సరసాంక మనునది అతిశక్వరీ (15 వ) చ్ఛందమందలి 5868 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-స-స-య' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'సరసాంక వృత్తమమరున్ - సజసాయలొందన్

సరసీజసంభవ యతిన్ - జలజాతనేత్రా'.

—సులక్షణ. 4-73.

**ప్రియకాంత**

ప్రియకాంత యనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 13264 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-య-న-య-స-గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అవనియ శ్రీయునన్నతులఱుఁ - డాత్మోద్భవుఁ డాప్తుల్

దివిజులు దామోదరునకు - దేవళ్ళిక నేరీ

నవతుగనాగా నయనయ - సమ్యక్సగయుక్తిన్

గవినుతమై విఖ్యాతిఁ బ్రియ - కాంతాకృతి యొప్పున్

—అనం. ఛంద. 2-75.

**పంచ చామర**

పంచచామర మనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 21846 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'జ-ర-జ-ర-జ-గ' (8 లగములు) అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

మరుత్ప్రరోహాలోలతల్ప - మధ్యసంస్థలాశ్రయా

ధరారమాకరోపలాలి - త ప్రసారితాంఘ్రికా

మరుద్వృధా కథానుబంధ - మంథరోత్సవానక
స్ఫురద్విరావ నర్తితోప - భూవనీ శిఖావళా.

—క. క. ర. 1-67.

**పద్మక**

పద్మక మనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 23416 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-జ-జ-జ-గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును. భీమన, వి. పెద్దన ఈ వృత్తమునే 'పద్మ' మని పేర్కొన్నారు. నన్నయగారు 8 వ అక్షరము యతి చెల్లించినారు.

ఉదా :

కొడుకు పల్కువిని - కూడదు నాక దురాత్ముడై
కడఁగ మీకు నప - కారము సేసి ధరిత్రి వె
ల్వడఁగ బంచెఁగడుఁ - బాపమతిన్ ధృతరాష్ట్రుఁడె
య్యెడల దుర్జనుల - నేమటి నమ్మఁగఁ బోలునే.

—భార. ఆది. 6-230.

**పద్మ**

చూ. పద్మక.

**చంద్రశ్రీ**

చంద్రశ్రీ యనునది అష్టి (16 వ) చ్ఛందములోని 10178 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'య-మ-న-స-ర-గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

జగన్నాథున్ లక్ష్మీహృదయజల - జప్రోద్యదర్కున్
ఖగాధీశారూఢున్ సుకవిజన - కల్పద్రుమంబున్
దగ న్వర్ణింపంగా యమనసయు - తంబై రగంబుల్
మొగిం జంద్రశ్రీకి న్నిలుచు యతి - ముక్కంటి నొందున్.

—అనం. ఛంద. 2-79.

**గజ విలసిత**

గజ విలసిత యనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 32496 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'భ-ర-న-న-న-గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 8 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

చీఁకటు లివ్వికావు - జిలుగు తళుకు జిగి దం
తా కృతి కానరాద - యసలు నలుపుటిఱుల్
గాక నగాళి కావు - కదలవు మెదలవు ముం
దీ కరిరాజి లేద - యిటు గునగున కడుపన్.

—రామా. కల్ప. బాల. ఇష్టి. 67.

**అశ్వగతి**

అశ్వగతి యనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 28087వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '5 భగణములు+1 గురువు' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'ఐదు భకారములుంగము - నై తగు నశ్వగతిన్'.

—ల. సా. సం. 1-16 వ ఛం.

**ఫలసదన**

ఫలసదన మనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 16384 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-న-న-న-స-గ' (4 న+స+గ) అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అనల మిటుల పురము - నలమి యఱు మంగా
దనుజ సమితిచెడి స - దనము లఱవంగా
దనుజ పతికి నెడద - తలరి చెదరంగా
మనసు వివశమగుచు - మఱల గరువంబై.

—రామా. కల్ప. యుద్ధ. ఇంద్ర. 240.

**మేదిని**

మేదిని యనునది అష్టి (16 వ) చ్ఛందమందలి 11184 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-జ-భ-జ-ర-గ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తమునే 'వాణి' యని అప్పకవి పేర్కొన్నాడు. కాని చిత్రకవి పెద్దన మతమున 9 వ అక్షరము చెల్లినప్పుడే మేదిని 'వాణి' యనబడును.

ఉదా :

విను మిటు లేటికిం జనిన - వృత్తమూది యల్గన్
జనము నుతించు నీదుగురు - సారధీర బుద్ధిన్
నిను నతిశాంత చిత్తయని - నిక్కమేను గందున్
మనమున నిట్టి నీ కగునె - మత్సరంబు వత్సా.

—భార. స్త్రీ. 1-152.

**వాణి**

చూ. మేదిని.

**మదనదర్పణ**

మదనదర్పణ మనునది అష్టి (16వ) చ్ఛందమందలి 21855 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-స-జ-ర-జ-గ' అను గణక్రమముండును. 11 వ అక్షరము యతి చెల్లును. భీమన, వి. పెద్దనలు ఈ వృత్తమునే 'మదన దర్ప'మని పేర్కొన్నారు.

ఉదా :

శ్రీభసజరజల్గయుక్తిఁ-జెందివచ్చినంగుమా
రాభమదనదర్పమయ్యె-నబ్జభూవిరామమై.

—క. జ. వృత్తా. 83.

**మదనదర్ప**

చూ. మదనదర్పణ.

**చంద్రభాను**

చంద్రభాను వనునది అష్టి (16వ) చ్ఛందమందలి 21848 వ వృత్తము. ప్రాసనియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును. ఇందు ప్రతి పాదమున 'న-ర-జ-ర-జ-గ' అను గణక్రమముండును.

ఉదా :

'నరజరల్ జగల్ గదించి-నందిశావిరామమై

యరయఁ జంద్రభానువృత్త-మౌను రంగభూవరా!'

—రంగ. ఛంద. 4-142.

**హరిణి**

హరిణి యనునది అత్యష్టి (17వ) చ్ఛందమందలి 46112వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-స-మ-ర-స-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

హరిణియనువృత్తంబొప్పున్ భాస్క--రాత్తవిరామమై

సరినమరేఫస్వంబై షోడ-శప్రమదాసహ

ప్రసరమణుఁదృణావర్తక్రవ్యాద-సంహరుమస్తకో

పరిరుచిరపింఛాచూడుంబీత-వస్త్రనుతింపఁగా.

—అ. క. 4. 17 వ ఛం.

**శిఖరిణి**

శిఖరిణి యనునది అత్యష్టి (17వ) చ్ఛందమందలి 59330వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'య-మ-న-స-భ-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

తపస్స్వాధ్యాయాదిక్షపితమలచి-త్తప్రకలితా

విపజ్జాలజ్వాలావిరమణసుధా-వృష్టిలలితా

జపాపుష్ప క్షీరచ్ఛవి కిరణసం - సర్జనధురా

సపర్యానిర్వాహప్రచురకలన-స్థైర్యమధురా.

—భార. స్త్రీ. 1-187.

**వంశపత్త్రపతిత**

వంశపత్త్రపతిత మనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 64983 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'భ-ర-న-భ-న-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'బాగగు వంశపత్ర పతితన్ - భరనభనలగల్'.

—ల. సా. సం. 1-17 వ ఛం.

**మందాక్రాంత**

మందాక్రాంత యనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 18928 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'మ-భ-న-త-త-గగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

వీణానాద ప్రతిమనిగమా - విర్భవత్సార పుణ్య
శ్రేణీసంపాదిత విమలతా - స్థైమనిర్లేపచిత్త
త్రాణ క్రీడా కలనసతతో - త్సాహ వర్ధిష్ణుభావా
ప్రాణా పానాహరణ నిపుణ - ప్రాపణీయానుభావా

—భార. స్త్రీ. 2-185.

**పృథ్వి-2**

పృథ్వి యనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 38750 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'జ-స-జ-స-య-లగ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును. (9 వ అక్షరము యతి చెల్లించి జక్కన ఈ పద్యమునే 'ధృతి' యని పేర్కొన్నాడు. చూ. ధృతి. సంస్కృత లాక్షణికులు పృథ్వికి తొమ్మిదింట యతి చెప్పినారు. తెనాలిరామకృష్ణుడు పృథ్వికి 9 వ అక్షరమే యతి చెల్లించినాడు. పాండు. మహా. 4-89)

ఉదా :

అమూల్య మణిభూషణంబులు గ - జాశ్వ బృందంబులున్
సమృద్ధ ధన ధాన్యరాసులు ప్ర - శస్త గోవర్గముల్
గ్రమంబునను భూసురేశులక - గణ్య పుణ్యార్థియై
యమర్త్య నిభుఁడిచ్చెఁబాండువిభుఁ - డత్యుదారస్థితిన్.

—భార. ఆది. 4-62.

**పాలాశదళ**

పాలాశదళ యనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 32768 వ

వృత్తము. ఇందు ప్రతిపాదమున 5 న+గగ (న-న-న-న-న-గగ) అను గణ క్రమముండును. 11 వ అక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది. (ఈ వృత్తమునకే వి. పెద్దన, అప్పకవి 'త్వరితగతి' అని మరొక పేరు చెప్పినారు.)

ఉదా :

పదునయిదు లఘువులును - బరగ గగ మొందన్
బదియగునెడ విరతులు - బలసి పొడసూపన్
బొదలిహరి నుతులఁగడుఁ - బొలుపగుచుఁబాలా
శ దళమనఁ బరఁగుఁ గవి - జనులు గొనియాడన్.

—అనం. ఛం. 2-84.

**త్వరితగతి**

చూ. పాలాశదళ.

**నర్కుటము**

నర్కుట మనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 56240 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-భ-జ-జ-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును ఈ వృత్తమునకే అప్ప కవి 'కోకిలకాక' మను నామాంతరము చెప్పినాడు. కాని చి. పెద్దన మతమున 8, 14 వ అక్షరములు యతి చెల్లినచో 'పదకోకిలకాంక' మగునన్నాడు.

ఉదా :

ప్రస్మృతివిలోచనాకుసుమ-బాణదిశాలలనా
ఘుసృణపటీరలేపకృతి-కోవిదబాహుతటీ
విస్మృమరకీర్తిజాలరణ-వీక్షితవైరినృప
త్యసృగతిపంకిలాసిముఖ-యైందవవంశమణీ.

—పారి. 1-140.

**కోకిలకాక**

చూ. నర్కుట.

**పదకోకిలకాంక**

చూ. నర్కుట.

**చంపకకేసరి**

చంపకకేసరి యనునది అత్యష్టి (17 వ) చ్ఛందమందలి 46828 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-స-స-స-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

సజసాస్వలౌయతిగ-జంబులఁజంపకకేసరిన్.

—ల. సా. సం. 1. 17 వ ఛం.

**ధృతి**

'పృథ్వి' వృత్తమున (చూ. పృథ్వి-2) 9వ అక్షరము యతి చెల్లించి జక్కన (విక్రమార్క-చరిత్ర 2-262) 'ధృతి' యని పేర్కొన్నాడు.

ఉదా :

ప్రతాపగుణభూషణా-పరహితార్థసంభాషణా
వితీర్ణిరవినందనా-విభవనూత్నసంక్రందనా
శ్రుతిస్మృతివిచక్షణా-సుకృతకీర్తిసంరక్షణా
క్షితీంద్రనుతవర్తనా-శివపదద్వయీకీర్తనా.

—విక్ర. చరి. 2-262.

**హారనర్తన**

హారనర్తన మనునది ధృతి (18 వ) చ్ఛందమందలి 90971 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'ర-స-జ-య-భ-ర' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

బద్ధవాసనఁ జేసి హా - వళి శార్దూళావళి పొందుచున్
యుద్ధభూమినిఁ జేరి దృ - ష్టాగి నేదాత్త్యాయతిఁ జిందుచున్
విద్ధ సైంధవరాజిపై - విచలద్ గృధ్రావృతి క్రోధ సం
బద్ధ గర్జనఁ బాపి త - ప్పక యస్లే కప్పక నిల్చున్.

—రామా. కల్ప. అరణ్యా. పంచ. 397.

**మత్తకోకిల**

మత్తకోకిల మనునది ధృతి (18 వ) చ్ఛందమందలి 93019 వ

వృత్తము. ఇందు ప్రతిపాదమున 'ర-స-జ-జ-భ-ర' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది 11 వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తమునందే 9, 14 వ అక్షరములు యతి చెల్లినచో 'హరిణప్లుత' మగునని చి పెద్దన చెప్పినాడు.

ఉదా :

ఎంతకాలము నీవునాకము - నేలి తింతటినుండి నా
కంతకాలము నేలఁబాడిబి - డౌజ కశ్యపమౌని రా
ట్సంతతిత్వము మీకు దానవ - జాతికిన్ సరిగాదె నీ
వింతయుం గని రాజ్యహీనత - నేఁగు మెచ్చటి కేనియున్.

—ప్రభా. 1-87.

**హరిణప్లుత**

చూ. మత్తకోకిల.

**నిశ**

నిశ యనునది ధృతి (18వ) చ్ఛందమందలి 74944 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-ర-ర-ర-ర' (2న+4ర) అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అడవిఋనులుభక్ష-ణాశన్ శవానీకసాన్నిధ్యమున్
బడసిపెరమృగాళి-పైరాఁజలద్దర్శ్యయద్దంతముల్
గుడగుడలుగగొంచు-ఘూర్ణారవన్మంద్రరావంబుగన్
జడిసిజడియనట్లు-సాగున్ మరింబేర్చి కవ్వించుచున్.

—రామా. కల్ప. అరణ్యా. పంచ. 396.

**త్వరితపదగతి**

త్వరితపదగతి యనునది ధృతి (18 వ) చ్ఛందమందలి 65536 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '5న+1య' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 11 వ యక్షరము యతి చెల్లును.

ఉదా :

'సరసిరుహభవసదృశ-చతురననసాయల్
త్వరితపదగతికమరు-దశమయతియుగాగన్.

—క. జ. వృత్తా. 94.

### ఝ్మహార

ఝ్మావోర మనునది ధృతి (18వ) చ్ఛందమందలి 30841వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-య-త-న-మ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 9, 13 వ అక్షరములు యతి చెల్లును. చి. పెద్దన 11 వ అక్షర మొకటే యతి చెల్లించవలెనన్నాడు.

ఉదా :

సానుక్రోశుఁడు మధుర-స్వాద్వాభాషి-సకలవేదార్థా
హీనప్రౌఢుఁడు ధిషణా-హేలాలోక-హితసదాజీవుం
డేనోదూరుఁడు తరుణుం-డీహాదూరుఁ-డిలివాళజ్ఝార
జ్ఞానాస్థానమునిరత-స్వాహాభర్తృ-చరణశీలుండున్.

—రామా. కల్ప. బాల. కల్యాణ. 294.

### కుసుమితలతావేల్లిత

కుసుమితలతావేల్లిత మనునది ధృతి (18వ) చ్ఛందమందలి 37857వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-త-న-య-య-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 12వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

శ్రీనాథున్ బ్రహ్మాద్యమరవరసం-సేవ్యపాదారవిందున్
దీనసంఘవ్రాతభరసుగుణో-ద్దీర్ణునింబాడివోలిన్
గానారూఢాత్ముల్ మతనయయయల్-కామజిద్విశ్రమంబై
వీనుల్నిండారంగుసుమితలతా-వేల్లితావృత్తమొప్పన్.

—అనం. ఛంద. 2-88.

### అతివినయ

అతివినయ మనునది ధృతి (18 వ) చ్ఛందమందలి 131072 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-న-న-న-స' (5న+స) అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 11వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ననలుగలయఁగ ననల-నసయుతములగుచున్
దనరునతివినయకివి-దశమయతికృతులన్.

—క. జ. వృత్తా. 93.

**దేవరాజ**

దేవరాజ యనునది ధృతి (18 వ) చ్ఛందమందలి 125912 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-ర-న-జ-భ-స' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'క్షితినరల్ నజల్ భసలును-జెన్నుగా నభవయతి
స్థితియు దేవరాజమునకుఁ-జెల్లు రంగనరపతీ'

—రంగ. ఛంద. 4-149.

**తరలి**

తరలి యనునది ధృతి (18వ) చ్ఛందమందలి 97249 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-స-న-జ-న-ర' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'చారుభసనభూరిజనర-సాంద్రగణములన్ దిశా
సారవిరతినందముగని-జంబుతరలిచెన్నగున్.

—సులక్షణ. 4-80.

**శార్దూలవిక్రీడిత**

శార్దూలవిక్రీడిత మనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 149337వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-స-జ-స-త-త-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును. (ఈ పద్య ముకే తెలుగున సామాన్యముగా 'శార్దూల'మని వ్యవహారమున్నది.)

ఉదా :

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ-జెన్నొందవిశ్వంభరా
దేవిం దత్కమలాసమీపమునఁ బ్రీ-తిన్నిల్పినాఁడో యనం
గావందారుసనందనాదినిజభ-క్తశ్రేణికిందోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁజేయుశుభదృ-ష్టిం గృష్ణరాయాధిపున్.

మను. 1-1.

**మేఘవిస్ఫూర్జిత**

మేఘవిస్ఫూర్జిత మనునది అతిధృతి (19వ) చ్ఛందమందలి 75714వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'య-మ-న-స-ర-ర-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

స్థిరాంశు ప్రస్విన్నామృతకరవియ-ద్దేశచూడామనోజ్ఞా
పురాళీప్రధ్వసాద్భుతతరభుజా-భోగకేళీసమజ్ఞా
మరుత్పాళీకేళీగిరికృతధను-ర్మండలీలగ్నవిష్ణూ
సరజ్జ్వాలాహాలాహాలవిషమహా-సహ్యరేఖాసహిష్ణూ.

—రామా. కల్ప. బాల. అహల్యా. 562.

**భూతిలక**

భూతిలక మనునది అతిధృతి (19వ) చ్ఛందమందలి 186039 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-భ-ర-స-జ-జ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 12వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

వాఁడెవధూమణి చూడవే త్రిది-వద్రుమంబు ధరిత్రికిన్
బోఁడిమిదెచ్చిన శూరుఁడీతనిఁ-బోలలేరిల నెవ్వరున్
వీఁడధికుండని భీమవిక్రమ-వృత్తిభూతిలకంబగున్
వేఁడినుతింతురు భారసంబుల-వెంటజాగములొందగాన్.

—అనం. ఛంద. 2-92.

**తరళ**

తరళ మనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 186040 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-ర-స-జ-జ-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తము నకే వి. పెద్దన ధ్రువకోకిల' యను మరొక పేరు చెప్పినాడు.

ఉదా :

ధరణినాయకయట్లుపుత్రశ-తంబువైరికులంబుచే
నిరవశేషతనొందుటన్ మహ-నీయగౌరవహీనతన్

బొరసి కొమ్మలు దున్మ ప్రోడ్పడు - భూరుహంబును బోలె ని
ర్భర విపద్వికలాత్ముఁడై ధృత - రాష్ట్రుఁడుల్లము వమ్ముగన్.

—భార. స్త్రీ. 14.

## ధ్రువకోకిల

చూ. తరళ.

## చంద్రకళ

చంద్రకళ యనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 186587 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'ర-స-స-త-జ-జ-గ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

మున్ను విన్నది దేవరహస్యం - బున్ దమకున్ వినిపింపఁగా
నెన్నొసార్లు తలంచితి గానీ - యేను వచింపనెలేదు నేఁ
డెన్నఁ జెప్పకయున్న ఫలంబో - క్కంతయు లేదు ధరాధిపా
మున్ను దేవయుగంబున వింటిన్ - భూప భవత్సుత హేతువున్.

—రామా. కల్ప. బాల. ఇష్టి. 144.

## కవికంఠ విభూషణ

కవికంఠ విభూషణ మనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 177900 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'స-జ-స-స-స-జ-గ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది 9 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పొరపొచ్చెమున్నె మన - ముప్వురు తల్లులు ముప్వురున్ రమా
దరణీయ మూర్తులవ - దాత యశోనిధులందు నాపయిన్
దిరమైన ప్రేమనియ - తిం జనువారలు వారిలోననున్
మఱియుం గడిందిగను - మన్ననచేయున కైక కాదఁటే.

—రామా. కల్ప. అయో. పాదు. 409.

## శుభిక

శుభిక యనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 225275 వ

వృత్తము. ఇందు ప్రతిపాదమున 'మ-భ-న-న-భ-భ-గ' అను గణ క్రమ ముండును. ప్రాస నియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

సూరిస్తుత్యా మభనన విలసిత - సూర్యయతిన్ శుభికా
కారంబై యెల్లకృతుల వెలయును - కల్పిత భాగలన్.

—క. జ. వృత్తా. 100.

**శంభు**

శంభు వనునది అతిధృతి (19 వ) చ్ఛందమందలి 3174 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-త-య-భ-మ-మ-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 19వ యక్షరము యతి చెల్లును. ఇది తెలుగు లాక్షణికులు చెప్పని వృత్తము. పింగలచ్ఛందష్టిప్పణియందు చెప్పబడినది- (చూ. తె. భా. ఛం. రీ. పు. 73). రామా. కల్ప.లో ప్రయుక్తము. యతి చెల్లింపు ఈ ప్రయోగమునుబట్టి చెప్పబడినది. (4వ పాదమున యతి తప్పినది.)

ఉదా :

శ్రితహృత్పంద్మాంతరసంస్పందాయిత-రేఖావిక్షేయాకారా .
క్షితిభృత్కన్యాధరకాంతిశ్రీవివ-శీభూతాంతర్వ్యాపారా
ప్రతనుప్రాణాంతరవర్తీభూనత-వల్లీ రేఖోద్యత్పుష్పా
మతిసంవిద్వేదనమర్మప్లావిత-భక్తాళీనిర్యద్బాష్పా.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 408.

**మత్తేభవిక్రీడిత**

మత్తేభవిక్రీడిత మనునది కృతి (20 వ) చ్ఛందమందలి 288676 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-భ-ర-న-మ-య-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 14 వ అక్షరము యతి చెల్లును. (తెలుగులో దీనికి 'మత్తేభ' మని సామాన్య వ్యవహారము.)

ఉదా :

ఇవియేనున్ సతతంబు నాయెడఁగరం-బిష్టంబులై యుండుఁబా
యవు భూదేవకులాభితర్పణమహీ-యఃప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁబార్వతీపతిపదా-బ్జధ్యానపూజామహో
త్సవమున్ సంతతదానశీలతయుఁశ-శ్వత్సాధుసాంగత్యమున్.

—భార. ఆది. 1-12

### ప్రభాకలిత

ప్రభాకలిత మనునది కృతి (20 వ) చ్ఛందమందలి 372079 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-జ-భ-ర-స-లగ' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 13వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

వెలయనజాభరసంబులున్ రవి-విశ్రమంబులునుం బ్రభా
కలితకునొప్పు నగణ్యపుణ్య ల-గంబుమీద ధరం గృతిన్.

క. జ. వృత్తా. 105.

### ఖచరప్లుత

ఖచరప్లుత మనునది కృతి (20 వ) చ్ఛందమందలి 37176 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-భ-మ-స-స-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 12వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

కనకసారససారసరేఖా-గ్రస్థితపక్షిచయంబహో
యనినయట్టులకట్టినరెక్కల్-వ్యాయతచంచులునాడఁగన్
కనినమిన్నులకన్నులఁబంపా-కాండసరోజలమూగఁగా
దనుజనాయకుఁడాయకఁగొంచున్-దాటిచనెన్ గగనాధ్వమున్.

రామా. కల్ప. అరణ్యా. జటాయు. 316.

### ఉత్పలమాల

ఉత్పలమాల యనునది కృతి (20 వ) చ్ఛందమందలి 355799 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-ర-న-భ-భ-ర-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 10 వ అక్షరము యతి చెల్లును. (తెలుగులో దీనికి 'ఉత్పల'మని సామాన్య వ్యవహారము.)

ఉదా :

రాజకులైకభూషణుడు-రాజమనోహరుఁడన్యరాజతే
జోజయశాలిశౌర్యుఁడు వి-శుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁడప-రాజితభూరిభుజాకృపాణధా
రాజితశాంతశాత్రవప-రాగుఁడు రాజమహేంద్రుఁడున్నతిన్.

—భార. ఆది. 1-3.

**అంబురుహ**

అంబురుహ మనునది కృతి (20 వ) చ్ఛందమందలి 37215 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '4భ+ర-స-లగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 13వ అక్షరము యతి చెల్లును. నన్నయ, ఎఱ్ఱనలు 7, 13వ అక్షరములు యతి చెల్లించినారు.

ఉదా :

దేవకులార్చిత-దేవశిరోమణి-దేవదేవజగత్త్రియీ
పావనమూర్తి కృ-పావనమూర్తివి-భావనాకులచిత్తరా
జీవమధువ్రత-జీవదశాపరి-చేష్టితాఖిలలోకల
క్ష్మీవదనాసవ-శీతలసౌరభ-సేవనాంచితజీవనా.

—నృసిం. 4-190.

**కలిత**

కలిత మనునది కృతి (24 వ) చ్ఛందమందలి 522176 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-భ-స-న-న-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది 12 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'ననభసననవంబుల నలి-నాప్తవిరమణము రస
ప్రణుతకలితవృత్తమమరు-రంగమనుజపతిమణీ'.

—రం. ఛం. 4-155.

**భుజగ**

భుజగమనునది కృతి (20 వ) చ్ఛందమందలి 372216 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-భ-న-భ-ర-స లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 14 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'మునుసభల్ నభరసవముల్ పదు - మూఁట విశ్రమమొప్పినన్
మనవజారత విజయరంగ శి - ఖామణీ భుజగం బగున్.'

—రంగ. ఛంద. 4-158.

**మణిమాల**

చూ. మణిమాల-2.

**చంపకమాల**

చంపకమాల యనునది ప్రకృతి (21వ) చ్ఛందమందలి 711600 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-జ-భ-జ-జ-జ-ర' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును. (తెలుగులో దీనికి 'చంపక' మని సామాన్య వ్యవహారము.)

ఉదా :

ఘనదురితానుబంధ కలి - కాలజదోషతుషారసంహతిం
దన యుదయప్రభావమున - దవ్వగఁజోపి జగజ్జనాను రం
జన మగు రాజ్యసంతతవ - సంత నితాంత విభూతినెంతయుం
దనరుఁజళుక్య మన్మథుఁడు - ధర్మనిబద్ధ దయార్ద్రబుద్ధియై.

—భార. ఆది. 1-5.

**స్రగ్ధర**

స్రగ్ధర యనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 302993 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-ర-భ-న-య-య-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది 8, 14 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

పై పైఁదుక్షారధట్టా - ప్రఖరఖురపుటీ - పాత విక్షుద్యమాన
క్ష్మాపృష్ఠోత్తిష్ఠ ధంధం - కరణ రజరజ - స్కాండధారాంధకారం
బాపూర్ణంబై నఘోరా - హవముఖముల న - క్షాత్రి యీరాజుబాహా
టోపం బీక్షింపరాకుం-డుటకు మఱుగుచుం-డుందివిన్ దేవపంక్తుల్.

—శృం. నైష. 5-155.

**వనమంజరి**

వనమంజరి యనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 744304 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న+4జ+భ+ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 14 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

నయుత జకార చతుష్క-భరేఫగ - ణ త్రయోదశ విశ్రమా
శ్రయమగు నవ్వనమంజరి రేచన - సర్వశాస్త్ర విశారదా.

—క. జ. వృత్తా. 109.

**లాటీవిట**

లాటీవిట మనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 394972 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '4స-మ-త-య' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

అవునిల్లలుకంగనె పండువుకా-దంభోదోద్యద్రాక్షసరాజుల్
నివ్వతాననులుద్యతబాహులు-పృథ్వీఘోషాపర్యాప్తభుజోగ్రుల్
దవులంజనుదెంతురుమీదగునీ-దర్పావేశాధఃకృతిబద్ధుల్
నవలాచెవులున్మునినాసికయున్-నద్దంపెట్టంబండవుప్రజ్ఞల్.

—రామా. కల్ప. అరణ్యా. పంచ. 199.

**మణిమాల-2**

మణిమాల యనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 965356 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-జ-స-జ-స-జ-స' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 11వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తమునే చి. పెద్దన 'మణిమాలి' అని పేర్కొన్నాడు.

ఉదా :

కదియంగమూఁడుసజముల్ స-కారయుతమై దిశాఖ్యయతిగా
మదనానుకారి నిఖిలాగమజ్ఞ-మణిమాలయండ్రుసుకవుల్.

—క. జ. వృత్తా. 110.

**కరిబృంహిత**

కరిబృంహిత మనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 782271 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-న-భ-న-భ-న-ర' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరముయతిచెల్లును.

ఉదా :

ఉత్తరదిశకుఁబోయితి హిమవ-దుర్విధరమునవాలితియై
కత్తళమనుచుఁబోయిపరుగునఁ-గ్రౌంచగిరిపయివాలితియై
జొత్తిలనడుగుదోయితుదికొన-సోమగిరిపయివాలితియై
తత్తరపడుచువేరుదెసమది-తట్టకముడుగుచుండఁగా.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 315.

**కనకలత**

కనకలత యనునది ప్రకృతి (21వ) చ్ఛందమందలి 1084576 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '6న+స' అను గణక్రమముండును. (న-న-న-న-న-న-స.) ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పలుకునఁగనకలత వెలయఁ-బలికెదనవమణిసూ
నలసితముగ రవిశశికిర-ణసువిలసనము మహీ
స్థలినలమరహిశివశమర-సనలదమిలగురియన్
లలితనుగొలువఁగబదకమ-లములకెనయగుపసన్.

—ఛం. హం. 166.

**సురభూజరాజ**

సురభూజరాజ మనునది ప్రకృతి (21వ) చ్ఛందమందలి 786104 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-ర-న-న-న-ర' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'రవియతిన్సురభూజరాజము-ప్రబలునభరననారలన్
తవిలిరంగమహీతలాధిప-దళితవిమతనృపాలకా.

—రంగ. ఛం. 4-160.

**నరేంద్ర**

నరేంద్ర మనునది ప్రకృతి (21 వ) చ్ఛందమందలి 450519 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-ర-న-న-జ-జ-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 14వ అక్షరము యతి చెల్లును. (తెలుగు లాక్షణికులు చెప్పని వృత్తము. ప్రాకృతపింగలమునందు చెప్పబడినది. చూ. తె. భా. ఛం. రీ. పు. 75. రామా. కల్ప. ప్రయుక్తమైనది)

ఉదా :

జాలములై తరంగశిఖరములను-సన్ననిరేఖగ ధూమ
జ్వాలలులేచి యల్లుకొని నభమున-వల్లులు వృక్షములయ్యెన్
నీలతమాలకాననము నిలువున-నింగికి లేచెడునట్టుల్
హాలహలమ్ము క్రొత్తదిగ జలనిధి-యం దుదయించినయట్టుల్.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 341.

**విచికిలిత**

విచికిలిత మనునది ఆకృతి (22 వ) చ్ఛందమందలి 2097152 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '7న+గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తమునే క. రంగకవి 'కనకలతిక' అని పేర్కొన్నాడు.

ఉదా :

పొడివి పొదివి నృపులతలలు - పుణికి పుణికి నఱకి స
మ్మదము ముదము నెడఁద౯గదుర - మలఁగి మలఁగి గురునకున్
గుదురు కలుగ జలమువదలి - కొసకుఁ గినుకఁ దొల౯గితిన్
వదలి ధనువు జగమఖిలము - వదలి యెచటొ యరిగితిన్.

—రామా. కల్ప. బాల. ధనుస్సు. 473.

**కనకలతిక**

చూ. విచికిలిత.

**మానిని**

మానిని యనునది ఆకృతి (22వ) చ్ఛందమందలి 1797559 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '7భ+గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 7, 13, 19 వ అక్షరములు యతి చెల్లును. భీమన 13వ అక్షర మొకటె యతి చెల్లవలెననినను, లక్ష్యమున మాత్రము మూడుచోట్ల చెల్లించగా, అప్పకవి 13 వ యక్షరమునే చెప్పి, అట్లే ఒకచోటనే యతి చెల్లించి నాడు.

ఉదా :

బంగరుచేలయుఁ - బద్మనిభాక్షులు - బాహుచతుష్కము - భవ్యవిభో
త్సంగిత శంఖసు - దర్శన శార్ఙ్గగ - దాముఖ చిహ్నము - తత్త్వమునీ
లాంగము నీనది - యారసృజించు ని - జాశ్రిత దేహికి - నంతిక స
ద్రంగళయానుఁది - రంబుగఁజూచిక - రంబిదివోచతు - రత్వమనన్

—కళా. 2-149.

**మహాస్రగ్ధర**

మహాస్రగ్ధర యనునది ఆకృతి (22వ) చ్ఛందమందలి 605988 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'స-త-త-న-స-ర-ర-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9, 16 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

సరియాతాయాతరంహా - శ్చలకలితరత - శ్రాంతి నిశ్వాసధారా

పరిషద్వ్యామిశ్రభావ - ప్రవిఘటితమిథః - ప్రాణభేదోదయంబై

యొరిమ న్వౌజపాళీ - యుగకరిమకరీ - యుగ్భుజామధ్య చిహ్న

శరణ వ్యక్తైక భావో - భయవిలసితహృ - ద్భాగమైనిద్రవోయెన్

—శృం. నై ష. 7-188.

## మద్రక

మద్రక మనునది ఆకృతి (22 వ) చ్ఛందమందలి 1947095 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-ర-న-ర-న-న-న-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 11 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

దక్షిణదిక్కుపోయితిని చం-దనాగభుజంగవిషానలఝురీ

కుక్షిగిరీంద్రమెక్కితిని ది-క్కుడుఁగవితాననిరూపితమతిన్

దీక్షనగ స్త్వావాసముహాసం - త్రిదివ్యతపశ్చటఁగాంచితి విరూ

పాక్షుని వాలినందుగని దీ - ర్ఘ్యదాశభయానఁబలాయితుఁడనై.

—రామా. కల్ప. కిష్కిం. సమీ. 313.

## భద్రక-3

భద్రక మనునది ఆకృతి (22 వ) చ్ఛందమందలి 1930711 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'భ-ర-న-ర-న-ర-న-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 12 వ అక్షరము యతి చెల్లును. ఈ వృత్తమునే 'సుభద్రక' మని భీమన, 'భద్రిణి' యని వి. పెద్దన పేర్కొన్నారు.

ఉదా :

ఆదిభఁజేసియవ్వలరనద్వ-యంబునొగిమూఁడుతానకములన్

బాదుకొనంగనొక్కగురువొందఁ-బై విరతిరుద్రసంఖ్యనిడినన్

గాదనరాదుభద్రకమునాగ-గాథమగువృత్తమొప్పుఁగృతులన్

శ్రీదనరూరనాశ్రితవితాన-చింతితఫలప్రదానన్నహరీ.

—అనం. ఛం. 2-105.

**సుభద్రక**

చూ. భద్రక-2.

**భద్రిణి**

చూ. భద్రక-2.

**తురగ**

తురగ మనునది ఆకృతి (22 వ) చ్ఛందమందలి 1490944 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-న-న-స-జ-జ-గ' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 15 వ అక్షరము యతి చెల్లును. 8, 15 వ అక్షరములు యతిచెల్లునని క. రంగకవి చెప్పినాడు. వి. పెద్దన ఈ వృత్తమునే 'తురగవల్గిత' మన్నాడు.

**ఉదా :**

తరుణరవికరవికచసరసిజ దర్పమోచ లోచనా
శరధినిరవధినిఖిలజలహృతి-సాంద్రకంధరబంధురా
గిరిమథనమధువిధుకరశ్రిత-కీరవాహనమోహనా
స్ఫురదచిరరుచిరుచిరచిరరుచి-పోషకాంబరడంబరా.

—క. క. ర. 4-201.

**తురగవల్గిత**

చూ. తురగ.

**హంసి**

హంసి యనునది ఆకృతి (22 వ) చ్ఛందమందలి 1048321 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-మ-త-న-న-న-స-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును. (తెలుగు లాక్షణికు లీ వృత్తమును చెప్పలేదు. ప్రాకృత పింగలములో చెప్పబడినది. చూ. తె. ఛా. ఛం. రీ. పు. 76. రామా. కల్ప.లో ప్రయుక్తము. యతి చెల్లింపు ఈ ప్రయోగముబట్టి చెప్పబడినది.)

**ఉదా :**

శాతార్చిర్ధూర్యాంధుర్యంబుల్ జలనిధి-జలములుపలసలగ్రాగన్
పాతాళస్థప్రాణిశ్రేణుల్ పలపల-భరమయియసువులవ్రేగన్
యాతాయాతాయాసక్లిష్టాసువులయి-యలమటవడిబడియాదో
వ్రాతంబెల్లన్ వార్వాసంబుల్ వదలి ది-వమునకుఁజననెగురంగన్.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 340.

## మత్తాక్రీడ

మత్తాక్రీడ యనునది వికృతి (23వ) ఛ్ఛందమందలి 4194081 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-మ-త-న-న-న-న-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 9, 17వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

'మత్తాక్రీడన్ మాతల్ నానాల్

మణివమువసుగజ-మతయతులమరన్'

—ల. సా. సం. 23 వ ఛం.

## పద్మనాభ

పద్మనాభ మనునది వికృతి (23 వ) ఛ్ఛందమందలి 149797 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '7త+?గ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

శ్రీరంగనాథప్రథన్ బద్మనాభుండు-స్సప్తిస్థితిందా నైయై, స్రష్టకోల్యాన్

క్షీరాబ్ధికన్యాప్రసేవాసుఖానంద-సిద్ధింగనన్ శేషతల్పంబుపై

నారూఢయోగప్రశాంతిన్ సువిశ్రాంతి-నాత్మాంతసంస్మృప్తిరక్షించుచున్ భ

క్తారాధ్యుడై వంబుగా వైభవోపేతుఁ-డై వెల్గుధాత్రిన్ స్వలీలావిభూతిన్.

—ఛం. హం. 177.

## కవిరాజవిరాజిత

కవిరాజవిరాజిత మనునది వికృతి (23వ) ఛ్ఛందమందలి 3595120వ వృత్తము. ఇందు ప్రతి పాదమున '1న+6జ+లగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8, 14, 20 వ అక్షరములు యతి చెల్లును. నన్నయగారు 14 వ అక్షర మొకచే యతి చెల్లించినారు. ఉభయరీతులకు లక్ష్యములున్నవి.

ఉదా :

అనవుడునిట్లను-నన్నరపాలున-కాతఁడు మోక్షము-నర్థిజగ

జ్జనులకుఁబుట్టుట-సన్మతిగోరివి-శారదులాదర-సంభృతులై

యనఘుసుదుస్తర-మైనభవంబున-కచ్చగునీయువి-హీనముబో

ధనమహనీయవి-ధంబునఁ జెప్పిరు-దాత్తగుణాశ్రయ-తామహితా.

—భార. స్త్రీ. 1-51.

**అశ్వలలిత**

అశ్వలలిత మనునది వికృతి (23 వ) చ్ఛందమందలి 3861424 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-జ-భ-జ-భ-జ-భ-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

ఇరుదెసలందురజ్జువులుగట్టి-యిట్టటులలాగునట్టివెరవై
తురగచయంబుఘోరఖరరాజి-త్రోలఁగనుద్రాళ్లఁబ్రిలిచనివన్
ఖరతురగంబులుంగ్రమమునేగి-గాఢముగగోడలందుఁదునగన్
తిరిగినురారిబాహువులుగాని-దేహమునుగానినుంతచెడదున్.

—రామా. కల్ప. యుద్ధ. కుంభ. 214.

**కుసుమ**

కుసుమ మనునది వికృతి (23 వ) చ్ఛందమందలి 4193764 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-భ-న-భ-న-న-న-లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

'నభనభ త్రిగననగణముల్వగ-ణయుతమయిచెలువలరినన్
విభుఁడురంగనృపతిత్రయోదశ-విరతివసుమతిఁగుసుమవరా'

—రంగ. ఛంద. 4-122.

**సరసిజ**

సరసిజ మనునది సంకృతి (24 వ) చ్ఛందమందలి 8388193 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-త-య-న-న-న-న-స' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 10, 18వ అక్షరము యతి చెల్లును. లాక్షణికు లెవ్వరును చెప్పలేదుకాని, ఒక్క అప్పకవి తప్ప అందరును 4 అక్షరముల తరువాత ప్రాస యతినియతముగా చెల్లించినారు.

ఉదా :

రమ్యత్వం-బారఁగఁబెంపూ-ర్జితముగ మణివిర-చితమకుటములుం
దారుంజూడన్-సారవిభూతిన్-ధరణిపులనిమిష-దవనిభులగునన్

భూరిప్రీతిన్-సూరెలగొల్వన్-భువనవినుతమగు-పొలుపువెలయ ము
న్నీరాజుండున్-దారుణదైవం-బిటువలయుచునెతుది-నితనిఁగటకటా.

—భార. స్త్రీ. 2-37.

## తన్వి

తన్వి యనునది సంకృతి (24 వ) చ్ఛందమందలి 4155367 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-త-న-స-భ-భ-న-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

కల్పలతావేల్లితకుసుమవిలస-త్కాంతులుదిక్కులవెలుగిడుతన్విన్
కల్పవికల్పంబులనొకగతిసం-కల్పమునన్దమినెడపెడుధన్వన్
వేల్పులుజోహారులగొనుస్మితసం-ప్రీతనుపస్సునెదగొలుతుభక్తిన్
మేల్పసముత్తెంపుతెరవెడలినె-మ్మిన్మదితెల్విని నెఱపగరాగన్.

—ఛం హం. 180

## క్రౌంచపద

క్రౌంచపద మనునది సంకృతి (24వ) చ్ఛందమందలి 4193479 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-మ-స-భ-న-న-న-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 11, 19వ అక్షరములు యతి చెల్లును. లాక్షణికు లెవ్వరును చెప్పలేదు కాని, అప్పకవి తప్ప, అందరును 5 అక్షరముల తరువాత నియతముగా ప్రాసయతి చెల్లించినారు. ప్రసిద్ధ లక్ష్యములందును ప్రాసయతి చెల్లినది. అప్పకవి చెప్పిన క్రౌంచపదమునే క, రంగకవి 'పంచశిర' మని పేర్కొన్నాడు.

ఉదా :

చంచలవీచీ-సంచయలీలా-సలలితతరళిత-జలరుహపాళీ
సంచితహస్తో-దంచితభంగీ-జనితమదనమత-సరణిగుణవ్యా
ఖ్యాంచితగోష్ఠీ-సంచరణప్యా-త్యయసముచితహాళ-హాళికలతోరా
యంచలుమ్రోయన్-గొంచలుగూయన్-వ్యవహితపరరవ-మయినకొలంకున్.

—కళా, 6-225.

**పంచశిర**

చూ. క్రౌంచపద.

**అష్టమూ_ర్తి**

అష్టమూ_ర్తి యనునది సంకృతి (24వ) ఛ్ఛందమందలి 3614521 వ వృ_త్తము. ఇందు ప్రతి పాదమున 'మ-న-త-స-ర-భ-జ-య' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 9, 17 వ అక్షరములు యతిచెల్లును.

ఉదా :

నాకస్సృగ్విధుతి నేగున్-నతమహోసారమాగున్-నగమహోకృతి జోగున్
భాకారిప్రముఖసౌర-ప్రణతి గంభీరరేఖా - ప్రవిమలాద్భుతతేజః
ప్రాకారాంతరనిగూఢ-ప్రచలనాభోగధర్మ-ప్రసరణాంచితమూ_ర్తిన్
లోకాలోకకుధరాంభో-లులితపర్యాయమూ_ర్తిన్-లుఠనమంథరమూ_ర్తిన్

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 219.

**శృంగార**

శృంగార మనునది సంకృతి (24 వ) ఛ్ఛందమందలి 4193380 వ వృ_త్తము. ఇందు ప్రతి పాదమున 'న-త-య-భ-న-న-న-య' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 11, 19 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

మృడవిశ్రామంబవలన్ బందొ-మ్మిదిటనుయతి తగి-మెఱసినయంత
న్గడు శృంగారాఖ్యం జెలంగున్ ర-జ్గన్నృపతి సతయభ-నననయయు_క్తిన్

—రంగ. ఛంద. 4-125.

**దుర్మిల**

దుర్మిల యనునది సంకృతి (24వ) ఛ్ఛందమందలి 7190236 వ వృ_త్తము. ఇందు ప్రతి పాదమున ఎనిమిది 'సగణములు' (8 స.) అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. తెలుగు లాక్షణికు లీ వృ_త్తమును చెప్పలేదు ప్రాకృత పింగలమున చెప్పబడినది. (చూ. తె. భా. ఛం. రీ. పు. 77.) రామా. కల్ప.మున ప్రయోగింపబడినది. యతి ఏవర్ణము చెల్లించవలెనో కచ్చితముగా స్పష్టముగాదు. 2, 3వ పాదములనుబట్టి 13 వ అక్షరము చెల్లవలెనని తెలియుచున్న, 1, 4వ పాదములలో యతి చెల్లింపబడలేదు.

ఉదా :

ధరణీతనయాహృదయేశ్వరబా-ణనితాంతమహాగ్నిశిఖావలిచే
వరుణాలయభాగ్బహుజంతుతతి-ప్రళయాగతయైనగతింబొలిచెన్
ధరణింగననాశ్రయమందినచో-దగనాపదయైనదదాశ్రితులం
బొరయంగనుమానకయుండునొదు-ర్భరముల్సిలుగుల్బహులాకృతులై.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 338.

**కిరీట**

కిరీట మనునది సంకృతి (24 వ) చ్ఛందమందలి 14380471 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'ఎనిమిది భగణములు' (8 భ.) అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13వ అక్షరము యతి చెల్లును. తెలుగు లాక్షణికు లీ వృత్తమును చెప్పలేదు. ప్రాకృత పింగలమున చెప్పబడినది చూ. తె. భా. ఛం. రీ. పు. 77. రామా. కల్ప.లో ప్రయుక్తము

ఉదా :

వారిధియెచ్చటలోతులులోతులు-వారకచొచ్చెడియమ్ముల చేతను
నేరనిమాదరిలోపలలోపల-నిప్పులుపోసెడియమ్ములచేతను
దూరినచోటులచిక్కనినెత్తురు-తూములుకట్టెడునమ్ములచేతను
తీరికనూరకనూపిరిలేవంగ-దీసుకపోయెడునమ్ములచేతను.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 339.

**బంధుర**

బంధుర మనునది అతికృతి (25 వ) చ్ఛందమందలి 14368768 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '4న+1స+3భ+1గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 16 వ అక్షరము యతి చెల్లును.

ఉదా :

పరిమళభరితవికచ సుమముల శ్రీ-బంధుర కాంచన దివ్యమణి
స్ఫుర విలసమున వెలయంగ భ్రమరసం-వీత వినీలవిభాసమునన్
సిరిమొగమున రతనపునిలుపసలా-సేచనకంబుగ శోభిలంగన్
హరి మధువననివసనమిలగనె న - వ్యాకృతిగతిన్ ప్రియకామినికై.

—ఛం. హం. 182.

**భాస్కర విలసిత**

భాస్కరవిలసిత మనునది అతికృతి (25వ) చ్ఛందమందలి 8381311వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-న-జ-య-భ-న-న-స-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 13 వఅక్షరము యతి చెల్లును.

ఉదా :

భావనభమున రమాధవుఁడొప్పన్-భాస్కర విలసిత శుభదనశోభన్
జీవగత సరససారసరమ్య-శ్రీవిలసన ముఅవగునటు భక్తిన్
జేవనుగనుమది శాంతవివేక-స్నిగ్ధవికసనమున వెలయధీ సం
భావిత లలితవచోవిభవాప్తిన్-భాసిలుఁ బ్రజవిగ జనుఁడిలఁదుష్టిన్.

—ఛం. హం. 183.

**ధరణీధరగతి**

ధరణిధరగతి యనునది అతికృతి (25వ)చ్ఛందమందలి 16777216 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '8న+1గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 8, 15 వ అక్షరములు యతి చెల్లును. భీమన ఈ వృత్తమునే 'జలదరవ' మని పేర్కొన్నాడు.

ఉదా :

చెదరిన తలయు - చినిగిన వలువ - చెలువము తరిగిన మొగమై
కదలిన నడుము - కదిసిన యురము - కలగిన తునిగిన సరమై
అదరిన పిఱుఁదు - నలసిన పదము - నదవదలయిచను కనులై
బెదరి బెదరియు - విరిసి విరిసియు - వెడలకు వెడలకు మగువా.

రామా. కల్ప. అరణ్యా. జటాయు. 227.

**జలదరవ**

చూ. ధరణీధరగతి.

**వనరుహ**

వనరుహా మనునది అతికృతి (25వ) చ్ఛందమందలి 16776601 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'మ-స-భ-భ-న-న-న-న-గ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 11, 19 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

రుద్రప్రౌఢినిఁబందొమ్మిదిటన్

రుజులగు యతులొౕన-రుట వనరుహామై

భద్రశ్రీయుతరంగాధిపతీ-

పరగులిపులమస-భభననననగల్.

—రంగ. ఛంద. 4-126.

**సురుచి**

సురుచి యనునది అతికృతి (25 వ) చ్ఛందమందలి 4179904 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'న-న-భ-స-త-న-న-య-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 8, 14, 21 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

వసుమనువులని-ర్వదియొకటన్ జె-

ల్వైవిరమణములువరలంబాగా

నసమసురుచిశ్రీ-హరిసమరంగేం

ద్రానననభసతననయగప్రాప్తిన్.

—రంగ. ఛంద. 4-127.

**విజయ**

విజయ మనునది అతికృతి (25 వ) చ్ఛందమందలి 16644511 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-స-భ-త-న-స-న-న-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 12, 19వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

'భానులఁబదియుందొమ్మిదిటంజొ

ప్పడివిరతులునే-ర్పడవిజయమగు

సైన్యనికయుతరంగాధిపసల్లా-

ణసు భసభతనల్-సననగములతోన్.

—రంగ. ఛంద. 4-128.

రెండవపాదమున బహుయతినియతి చెడినది.

**చారుమతి**

చారుమతి యనునది అతికృతి (25వ) చ్ఛందమందలి 15658735 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-జ-స-న-భ-జ-స-న-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 13, 17వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

'చారుమతియొప్పునుభజల్ సనభ-
జల్ సనగ-సంగతికపీంద్రవినుతా
సారెకుఁద్రయోదశకసప్తదశ-
సద్యతిల-సద్గతినిరంగన్నృపతీ.

—రంగ. ఛంద. 4-130.

**సాధ్వీ**

సాధ్వి యనునది అతికృతి (25 వ) చ్ఛందమందలి 14665451 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-న-జ-న-స-న-న-భ-గ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. 8, 15, 22 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

నారదసనకస-నందనవినుతస
నాథభనజనస-నాభగురుల్
చారుశిఖరియతి-శైలవిరమణము
ఙ్మాధరవిరతియు-సాధ్వియగున్.

—సులక్షణ. 4-96.

**వరాహ**

వరాహ మనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 33888601 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '1మ+6న+స+గగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 10, 16 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

దిక్సీమాంతమిత ధిమిత-ధిమిత ధిమక-ధిమక పటుతరమృదంగోద్యత్
ప్రక్స్వంరావముల నటన-చతురశఫరీ-శకుని నిచయకృతసాహాయ్యన్

ప్రాకన్నృష్టిన్ వెలుచు జలజ-భవకృతనుతి-భరితసవనఘటనా నేహః
ప్రుక్సందీపిత మహితచ-రుని హితనుత-రుచిర మహిమహోధాయ్యున్.

—రామా. కల్ప. కిష్కిం. అన్వే. 357.

**భుజంగ విజృంభిత**

భుజంగ విజృంభిత మనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 23854849 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'మ-మ-త-వ-వ-న-ర-స-లగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 9, 19 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

పాతాళాయాతాహి శ్రేణీ-బహుళకుటిలగమన వి-భావనాద్భుతమాలికా
నీతాన్వీత ప్రౌఢా శ్లేషా-నితర జలచరనిచయ-నీలవర్ణ సితచ్ఛవిన్
స్రోతో వ్రాతవ్యాకీర్ణాంబు-తురిదళితసిత కిసల-సోమవల్కతరూజ్జ్వలున్
ద్రేతాఘాత క్రీడాధూమా-త్రిపథచలిత సురగణ-దివ్యభూషణవజ్జలున్.

—రామా. కల్ప. కిష్కిం. అన్వే. 354.

**అపవాహ**

అపవాహ మనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 4388601 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '1మ+6న+1స+గగ' అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. 10, 16, 22 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

'బొ బ్రహ్మర్తు రనములను - యతి మగణగ
హకనసగగ - లపవాహాఖ్యన్.'

—ల. సా. సం. 126 వ ఛం.

**ప్రభు**

ప్రభు వనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 28760988 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున '3న+5జ+లగ' అను గణ క్రమముండును. ప్రాస నియమమున్నది. 9, 15, 21 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

ప్రముదిత గజభుతు - రసవిక్రమముల్
రఘుణం గవి వ - ర్య నుతంబునునై

క్రమమున ననసలు - రహినై దుజకా
రములున్ లగమున్ - ప్రభువృత్తమగున్.

—సులక్ష. 4-97.

**మలయజ**

మలయజ మనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 33288224 వ వృత్తము. ఇందు ప్రతిపాదమున 'న-జ-న-స-న-న-భ-న-లగ' అను గణక్రమ ముండును. ప్రాస నియమమున్నది. 8, 15, 22 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

నలిన విలోచన - నజననసనంబులు
సభనగణంబులు - నటలగమున్
మలసగిరిత్రయ - మహితయతుల్దగి
మలయజవృత్తము - మహి వెలయున్.

—సులక్ష. 4-98.

**మంగళమహాశ్రీ**

మంగళమహాశ్రీ యనునది ఉత్కృతి (26 వ) చ్ఛందమందలి 15658735 వ వృత్తము. ఇందు ప్రతి పాదమున 'భ-జ-స-న-భ-జ-స-న-గగ' అను గణక్రమముండును. ప్రాసనియమమున్నది. 9, 17 వ అక్షరములు యతి చెల్లును.

ఉదా :

చిత్తజ భిదంఘ్రియుగ - చింతన కళాధిగత - జిష్ణు సమవైభవ విశేషా
విత్తరమణామరగ - వీ తరణిభూజలద - విశ్రుత కరాంబురుహ గోష్ఠీ
నృత్త మణిరంగతల - నీతిమనురాజనిభ - నిర్భరదయారస పయోధీ
మత్తగజయూథమద-మగ్నసుఖతాళిరవ-మాన్యగృహ మంగళమహాశ్రీ.

—పారి. 5-111.

**ఉద్ధురమాలావృత్తములు**

పాదమునం దిరువదియారింటికి మించి యక్షరములున్న పద్యములను 'ఉద్ధురమాలావృత్తములు' అని లాక్షణికులు పేర్కొన్నారు. 'ఉద్ధుర' మనగా బరువైనది, నిండిపోయినదని యర్థములు. లాక్షణికులు ఇరువదియారు ఛందము

లను మాత్రమే నిర్ధారించినారు. అందువలన ఆ ఛందముల యక్షరసంఖ్యకు మించిన యక్షరసంఖ్యలో నీ వృత్తము లుండుటచే వీటిని ఉద్ధురమాలా వృత్తములని పేర్కొనియుందురు పొత్తపి వేంకటరమణకవి మాత్రము ముప్పది యారువరకు ఛందములను చెప్పినాడు. అందువలన అతని మతమున ఈ ఉద్ధుర మాలావృత్తములు లేవు. వీటిని కేవలము 'వృత్తములు'గానే అతడు చెప్పినాడు. లాక్షణికులందరును సమ్మతించిన ఉద్ధురమాలావృత్తములు నాలుగు.

i. లయగ్రాహి, ii. లయవిభాతి, iii. లయహారి, iv. త్రిభంగి. ఇవికాక లాక్షణి, రమణకము అను రెండు ఉద్ధురమాలావృత్తములను లింగము గుంట తిమ్మకవి చెప్పినాడు. పొత్తపి వేంకటరమణకవి తన పద్ధతిలో ముప్పదవ ఛందమున చెప్పిన దరవృత్తమును, ముప్పదియారవ ఛందమున చెప్పిన 'లలితము, ఘననినదము' అను వృత్తములనుగూడ 'ఉద్ధురమాలావృత్తము'లను గానే భావించి వీటి వరుసలో నిక్కడ చెప్పబడుచున్నవి.

దండకములను లాక్షణికులు ఉద్ధురమాలావృత్తములుగానే భావించి నారు. వాటినిగూర్చి విడిగా వ్రాయబడును. (చూ. దండకములు)

లయగ్రాహి మొదలగు మూడు ఉ. మా. వృత్తములనుగూర్చి లక్షణములు చెప్పునపుడు లాక్షణికులు వృత్తములకు చెప్పినట్లే గణపద్ధతిలో చెప్పి నారు. అయితే వి. పెద్దన, అనంతుడు, అప్పకవి గణపద్ధతిలో లక్షణము చెప్పుచు ఆయా ఉ. మా. వృత్తములందలి అక్షరసంఖ్యను, దానితోబాటు మాత్రా సంఖ్యనుగూడా చెప్పినారు. దీనినిబట్టి, ఆ పద్యముల నడకనుబట్టి మాత్రాసంఖ్యా గణపద్ధతిలో లక్షణము చెప్పుట సమంజసముగా నుండుననిపించును. ఉదాహరణ మునకు లయగ్రాహికి పాదమున పంచమాత్రాగణము లేడు+ఒక చతుర్మాత్రా గణము (ఈ గణము గుర్వంతము కావలయును) అని లక్షణము చెప్పవచ్చును. కాని ఇట్లు చెప్పినచో మాత్రాసంఖ్య ప్రధానమై అక్షరక్రమ మప్రధానమగును. అప్పుడు లయగ్రాహి, లయవిభాతి, లయహారులన్నియు ఒకటే యగును. ఎందు కనగా ఈ మూడింటియందును ఏకోనచత్వారింశ (39) న్మాత్రలే యున్నవి. కాని యక్షరసంఖ్యలో భేదముండుటచే మూడు ప్రత్యేక పద్యములయినవి. మాత్రాసంఖ్యాగణముల పద్ధతిలో చెప్పినచో నిన్నిభేదము లేర్పడవు. వి. పెద్ద నాదులు అక్షరసంఖ్య, దానితోబాటు మాత్రాసంఖ్యను పేర్కొనుటలో, మాత్రా సంఖ్యాగణధోరణిలో అక్షరములు విభక్తములై లయ స్పష్టముగా నుండునట్లు ఈ పద్యములు రచింపవలెనన్న ఉద్దేశ్యము కన్పించును. దీనికి తగినట్లు ఈ మూడింటికిని పేర్లలో 'లయ' పదము నియతముగా నున్నది. మరియు త్రిభంగితోపాటు నీ మూడింటిలో (సరూపాక్షర) యతిని నిషేధించి కేవలము ప్రాసయతులనే చెల్లించవలెనని లాక్షణికులు చెప్పినారు.

లింగముగుంట తిమ్మకవి చెప్పిన లాక్షణి, రమణకములుగూడ లయ గ్రాహి మొదలగువాటివలె నడిచెడివే. లయగ్రాహ్యాదులు పంచమాత్రాగణము

లతో నడచినట్లు కన్పించగా, నివి చతుర్మాత్రాగణములతో నడచినట్లు కన్పించును. (చూ. లాక్షణి; రమణకము.) అందువలన వీటియందును (సరూపాక్షర) యతికి బదులు ప్రాసయతులనే విధించుట సమంజసము. కాని తిమ్మకవి (సరూపాక్షర) యతినే చెప్పినాడు. ఇక, దర-లలిత-ఘననినదములను వేంకటరమణకవి కేవల వృత్తములుగానే భావించుటవలన (సరూపాక్షర) యతినే చెప్పినాడు. కాని ఇవిగూడ మాత్రాసంఖ్యాగణముల ధోరణిలోనే నడచునవి గావున వీటికిని ప్రాసయతులను చెప్పుటే సమంజసమనిపించును.

ప్రాసయతులుండుట ఉ. మా. వృత్తముల సామాన్య లక్షణముగా కన్పించును. కాని ప్రాసయతి వృత్తములందు నిషిద్ధము. కాగా ఉ. మా. వృత్తములు కొంత జాతిలక్షణము కలవనియు భావించవలసియుండును. (చూ. జాతులు.) ప్రాసనియమము, అక్షర పరిగణనము వృత్తలక్షణము కాగా, ప్రాసయతినియమము, మాత్రాసంఖ్యాపరిగణనము జాతుల లక్షణము.

త్రిభంగిస్థితి ప్రత్యేకము. ప్రాసనియమమున్నది. పాదోత్తరార్ధమున మూడు విరుపులు, వాటికి అంత్యప్రాస. ఈ అంత్యప్రాస, మూడు విరుపులు త్రిభంగి ప్రత్యేకత.

శాలూరమనునది లాక్షణికులు చెప్పని ఉ. మా. వృత్తము రామా. కల్ప.లో ప్రయుక్తము. అయితే ప్రాసనియమమే తప్ప యతిచెల్లింపు లేదు.

దండకమందు యతిప్రాసలుండవు. (చూ. దండకములు.)

పైత్తపి చెప్పిన పద్యలక్షణములు శ్రీ రావూరివారి తె. భా. ఛం. రీ.లోనుండి గ్రహింపబడినవి. (పు. 130.)

**లయగ్రాహి**

'లయగ్రాహి' యనునది యొకానొక 'ఉద్ధురమాలా వృత్తము.' (చూ. ఉ. మా. వృ.) ఇందు ప్రతి పాదమున వరుసగా భ-జ-స-న-భ-జ-స-న-భ-య అను గణములుండును. ప్రతి ఎనిమిదక్షరముల తరువాత ప్రాసయతినే చెల్లించవలెను. ప్రాసనియమమున్నది.

ఉదా :

కమ్మని లతాంతముల - కుమ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీతనిన - దమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసల - యమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచుము - దమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకు - లమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు విన్పెనని - శమ్ము సుమనో భా

రమ్ములనశోక నిక - రమ్ములును జంపక చ
యమ్ములును గింశుకవ - నమ్ములును నొప్పెన్.
—భార. ఆది. 1-138.

**లయ విభాతి**

'లయవిభాతి' యనునది యొకానొక 'ఉద్ధురమాలా వృత్తము. (చూ. ఉ. మా. వృ). ఇందు ప్రతిపాదమున 'స-స-న-స-స-న-న-స-న-స-స-గ' అను గణక్రమముండును. ప్రతి తొమ్మిదక్షరముల తరువాత ప్రాసయతినే చెల్లింపవలెను ప్రాస నియమమున్నది.

ఉదా :

అలికులము నీలముల - చెలువము వహింప నవ
దళముల హరిన్మణుల - పొలుపు నదలిర్పన్
దలిరుగమి కెంపులుగఁ - బలుదెఱఁగు క్రొవ్విరుల
విలసనము ముత్తియపు - గుళికలకుఁ దక్కన్
గల మణులకుం బసిఁడి - కళుకులకు నీడగుచు
వెలయఁగఁ బరాగములు - లలితపు వితానం
బులుగ గృహముఖ్యముల - చెలువు ప్రతిబింబములు
బలెఁ బురము సద్దెసలఁ - బొలుచును వనంబుల్.
—కళా. 1-10.

**లయహారి**

'లయహారి' యనునది యొకానొక ఉద్ధురమాలా వృత్తము. (చూ. ఉ మా. వృ) ఇందు ప్రతిపాదమున 11 నగణములు+స+గ అను గణక్రమ ముండును. ప్రతి పదియక్షరముల తరువాత ప్రాసయతినే చెల్లింపవలయును. ప్రాస నియమమున్నది.

ఉదా :

పిడుగులురలినగతిని - బొడుచుచును నడచుచును
బెడిదముగ విదలుచుచు - విడివడని పట్టున్
నడగిరులు వెడదరులు - విడిలుకొని పెనుగరుల
సుడివడిన యులివులును - పొడుచుకొను రీతిన్
తొడలు తొడలు విఱుచుచు - మెడలు మెడలు విరుచుచు
నొడలు నొడలు కుములఁగ - బొడుచుచు మహోగ్రుల్
విడివడిన కనలు వెలు - వడిన పెనుపరిచలము
కడవ నొకఁడొకఁడు పెను - వడిన గతి పోరన్.
—రామా. కల్ప. కిష్కిం. గజ. 112.

త్రిభంగి

'త్రిభంగి' యనునది యొకానొక ఉద్ధురమాలా వృత్తము. (చూ. ఉ. మా. వృ). ఈ పద్యమునందు ప్రతిపాదమున :-

4 నగణములు + 2 సగణములు + భ + మ + స + గ

అను గణక్రమముండును. ప్రాస నియమమున్నది. పదునేడు, ఇరువదియొకటి, ఇరువది యారక్షరముల తరువాత ప్రాసయతి చెల్లును. అయితే పదునేడక్షరముల తరువాత ప్రాసమునుబట్టి మిగిలిన రెండు ప్రాసయతులు చెల్లును. వీటికి పాదాది యందలి ప్రాసాక్షరముతో సంబంధము లేదు. ఇది భీమన ననుసరించి చెప్పబడిన లక్షణము.

వి. పెద్దన మొదలగు తరువాతి లాక్షణికులు భీమనకు భిన్నముగా పాదాదియందు ఆరు నగణములను చెప్పినారు. మిగిలిన గణక్రమము సమానమే. ప్రాస నియమమున్నది. వీరి లక్ష్యము ననుసరించి పాదము పదునారక్షరములకు పూర్వార్థముగా, పదునెనిమి దక్షరములకు ఉత్తరార్థముగా విరుగును. ఎనమిది, పదునారక్షరముల తరువాత పాదాది ననుసరించి ప్రాసయతులే చెల్లును. ఇరువది మూడక్షరము తరువాత ప్రాసాక్షరము ననుసరించి 27, 32 అక్షరముల తరువాత ప్రాసయతులు చెల్లును.

వి. పెద్దనాదుల లక్ష్యముల ననుసరించి చెప్పబడిన యంశములనే ఈ క్రిందివిధముగా చెప్పినచో కొంత సులభముగా నుండును- ఉత్తరార్థము మూడు భాగములుగా విరుగును. మొదటి భాగమున తొమ్మిది, రెండవ భాగమున నాల్గు, మూడవ భాగమున ఐదు (మొత్తము పదునెనిమిది) అక్షరములుండును. ఈ మూడు భాగములకు అంత్యప్రాసలు చెల్లును. పాదమున ఎనిమిది, పదునారక్షరముల తరువాత పాదాది ననుసరించి ప్రాసయతులే చెల్లును. ఈ ప్రాసయతుల ప్రాసాక్షరమునకును, అంత్యప్రాసల ప్రాసాక్షరమునకును సంబంధములేదు. భీమన లక్షణమందును పాదము పదియక్షరములకు పూర్వార్థముగా పదునెనిమిది యక్షరములకు ఉత్తరార్థముగా విరుగునని, ఉత్తరార్థమున మూడు (వి. పెద్దనాదుల మతమున నున్నట్లే) అంత్యప్రాస లుండుననియు చెప్పవచ్చును. పాదాంతమందు కన్పించు నక్షరము ననుసరించి దాని వెనుక రెండుచోట్ల ప్రాస చెల్లుటచే ఈ ఉత్తరార్థమందలి వాటిని అంత్యప్రాసము లనుటయే సమంజస మనిపించును.

రెండువిధముల త్రిభంగులకు ఉదాహరణములు.

i. భీమన ననుసరించి

'ననననలునుసభమ

లునుసగయుక్తములైనన్-మృదువైనన్-ప్రస్తుతమైనన్

వనరుహాభవనిభమన
మలరఁద్రిభంగినిఁ జెప్పున్-వడిదప్పున్-ప్రాసములొప్పున్.
—క. జ. వృత్తా. 123.

ii. వి. పెద్దనాదుల ననుసరించి
బలికపిపతికర-తలమునఁజమరఁగ
బలమఱియంతటసుగ్రీ-వుఁడపగ్రీ-వుండయిదృగ్రీ
తులు కళవళపడఁ-దొలఁగుచుమల గుచు
ఛలపఱచెన్ మరివాలిన్-ధృతమాలిన్-సంగరకేళిన్
నిలిచినయదనున-నిలువకపదమున
సలలితవేగగతుండై-వినయుండై-పోసరతుండై
కలఁచునునిలుచును-వెలుచునువెలిఁజను
బలమగుపోటులుతప్పన్-జవమొప్పన్-లాఘవమొప్పన్.
—రామా. కల్ప. కిష్కిం. గజపుష్పి 115.

**లాక్షణి**

'లాక్షణి' యనునది యొకానొక ఉద్ధురమాలావృత్తము. (చూ. ఉ. మా. వృ.) ఈ పద్యమున ప్రతిపాదమున

భ+4 నగణములు+భ+2 నగణములు+స

అను గణక్రమముండును. పదునారవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :
పక్షివిరమణముఖనననములును-
భాసురభననసలెనసినచో
లాక్షణియనఁదగునతులితితమదనవి
లాసలలితగుణగణజలధీ.
—సులక్షణ. వృత్త. 103.

**రమణక**

'రమణక' మనునది యొకానొక యుద్ధురమాలా వృత్తము. (చూ. ఉ. మా. వృ.) ఈ పద్యమందు ప్రతిపాదమున :

9 నగణములు+లగము

అను గణక్రమముండును. తొమ్మిది, పదునేడు, ఇరువదియైదవ అక్షరములు యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

మనసిజ జనక స - మదరిపు గజహారి
మదగజ వనువిర - మణములతో
నన నన నన నన - నలగము లెనయఁగ
నరవరనుత రమ - ణక మమరున్.

—సులక్షణ. వృత్త. 104.

దర

'దర' మనునది యొకానొక ఉద్ధురమాలా వృత్తము. (చూ. ఉ మా. వృత్తము). ఈ పద్యమందు ప్రతిపాదమున :

8 నగణములు+భ+స

అను గణక్రమముండును. తొమ్మిది, పదునేడు, ఇరువవదియైదవ అక్షరములు యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

ఎనిమిది నగణము - లెలమిగ నిలుపుచు
నిరవుగ భసలము - లింపుగ నెరపన్
మును కొని దరమగు - పొలువుగ - వసువులు
మురిపెపు యతులుగ - మూఁడు నెలవులన్.

—కల్పితము.

లలిత-2

'లలిత' మనునది యొకానొక ఉద్ధురమాలా వృత్తము. (చూ. ఉ. మా. వృ). ఈ పద్యమునందు ప్రతిపాదమున :

8 నగణములు+స+న+న+య

అను గణక్రమముండును. పదునొకొండు, ఇరువదియొకటి, ముప్పదవ యక్షరములు యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

నలువుగను గవు లెపుడు - నగణములు నెనిమిది, స
ననలును మఱియున్ యగ - ణము నొనరఁజేయన్

వలపుగొను లలితమగు - పరువమొలికెడు నటుల
పది పదియును తొమ్మిది - పరగు యతులొప్పన్.

—కల్పితము.

## ఘన నినద

'ఘన నినద' మనునది యొకానొక ఉద్ధురమాలా వృత్తము (చూ. ఉ. మా. వృ). ఈ పద్యమందు ప్రతిపాదమున :

4 నగణములు+జ+న+జ+3 నగణములు+భ+స

అను గణక్రమముండును. పదునొకొండు, ఇరువది ముప్పదవ యక్షరములు యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

అరయఁగ ఘన నినదము - నగుఁ గృతిన్ ననననలు
నాపయి జన జనలు న - నభ త్తగ నెసఁగన్
దొరయుగఁ బదునొకఁడు గ - దురగ నిర్వ దిరువది
తొమ్మిదియుగ నగుచు య - తులొప్పఁగ నెప్డున్.

—కల్పితము.

## శాలూర

శాలూర మనునది యొక ఉద్ధురమాలావృత్తము. (చూ. ఉ. మా. వృ.) ఈ పద్యమందు ప్రతి పాదమున '1త+8న+1లగ' అను గణక్రమ ముండును. ప్రాసనియమమున్నది. తెలుగు లాక్షణికులెవరును దీనిని చెప్పినట్లు కనరాదు. రామా. కల్ప.లో ఇది ప్రయుక్తమైనది. యతిగాని, ప్రాసయతిగాని నియతరీతిలో చెల్లింపబడలేదు. పాదాదినమగణముండుటచే, ఆపయివరుసగా 8 నగణములుండుటచే నగణమధ్యమున మగణానుసారిగా ప్రాసయతి చెల్లింప వీలుండదు. కాగా కనీసము 16 వ అక్షరము యతి చెల్లుట సమంజసము.

ఉదా :

అంతన్రఘుపరివృఢధనురుదితశర
నికరసరదనలపటుతరశిఖా
ప్రాంతంబగుచుజలధిబహులకుహరని
వసదసురమకరతతితతతన్గా

సంతానములు తెక తెకలయితహాతహా
లయితికమకపడివడిగుడుసులై
యంతర్జలములనసుచయములుఁ రలిస
గము వెలకిలఁబడిచలవమురలెన్.

—రామా. కల్ప. సుందర. సంధ్యా. 837.

## స్వస్థానార్ధసమవృత్తములు

ఛందములు మొత్తమిరువదియారు, ఒక్కొక్క ఛందమునందు ప్రస్తారము ననుసరించి పలువృత్తములు నిష్పన్నములగును. (చూ. ఛందములు; ప్రస్తారము.) ఒకే ఛందమునందు నిష్పన్నమయిన ఒక వృత్తపు రెండు పాదములు, మరొక వృత్తపు రెండు పాదములు-మొత్తము నాల్గు పాదములుగా కూర్చబడిన పద్యము 'స్వస్థానార్ధసమవృత్త'మగును. అయితే బేసిపాదము లొక వృత్తమునకు, సరిపాదము లింకొక వృత్తమునకును చెందియుండవలెను. ఇట్లుండుట 'అర్ధసమత్వము' మొదటిపాద మెన్నవ ఛందమునకు చెందినదో, అదే ఛందమునకు మిగిలిన పాదములుకూడ సంబంధించియుండును. కాగా మొదటిపాదమునకు మిగిలిన పాదములు 'స్వస్థాన'మునకు చెందినవగుచున్నవి. ఈరీతిగా పై పద్ధతిలో రూపొందిన పద్యము 'స్వస్థానార్ధసమవృత్త'మగుచున్నది.

అప్పకవి 'అర్ధసమత్వ'మును మూడువిధములుగా చెప్పినాడు ఒకటి: పైని చెప్పబడినవిధముగా సరిపాదము లొకవృత్తమునకు, బేసిపాదము లింకొక వృత్తమునకు చెందినవగుట. ఇది సర్వలాక్షణిక సమ్మతమైన యంశము. ఇక రెండు : పూర్వార్ధము (1, 2 పాదములు) ఒక వృత్తమునకును, ఉత్తరార్ధము (3, 4 పాదములు) ఇంకొక వృత్తమునకు చెందినను 'అర్ధసమ'మగును. 'స్వస్థానార్ధసమవృత్త' సందర్భమున నీయంశమును చెప్పిన అప్పకవి, 'పరస్థానార్ధసమవృత్త' సందర్భమున చెప్పలేదు. ఈ రెండిటికి స్వస్థాన, పరస్థానము లగుటలోనే భేదముతప్ప 'అర్ధసమత్వ' లక్షణములో భేదములేదు. ఇక్కడ నీయంశము చెప్పి, యక్కడ చెప్పకపోవుటకు కారణ మనూహ్యము. మరియు నీరీతి పూర్వలాక్షణికు లెవరును ఒప్పినదికాదు. నిజమునకు పూర్వార్ధోత్తరార్ధములు భిన్నములైనను 'అర్ధసమత' లేకపోలేదు. ఇదిట్లుండగా, మూడు : పద్యమునందొక పాదమొకవృత్తమునకు, మిగిలిన పాదములు ఇంకొక వృత్తమునకు చెందినను 'అర్ధసమ'మగును. అయితే, ఈ లక్షణమునందు అర్ధసమత్వమే కనిపించుటలేదు. అందువలన ఇది ఒప్పదగినదిగా కనిపించదు. అయితే అప్పకవి ఈ యంశములను (రెండవ మూడవవాటిని) చెప్పుటకొక కారణము కనిపించును. 'ఉపజాతి' యన్న అర్ధసమవృత్తము ఒకటి యున్నది దాని భేదములు పదునాల్గు చెప్పబడినవి (చూ. ఉపజాతి.) ఆ భేదములలో ఈ రెండు లక్షణముల కనుకూలమైనవి కొన్ని యున్నవి. అంతేకాదు ఒకటవ, నాల్గవ పాదము లొకవృత్తమునకు; రెండవ, మూడవ పాదము లింకొక వృత్తమునకు చెందిన భేదములుకూడ

నున్నవి. ఈ ఉపజాతి భేదములను అప్పకవి దృష్టియందుంచుకొని పై రెండంశములను చెప్పియుండును. కాని ఆ రెండంశములతోబాటు నీ చివరి యంశమును గూడ చెప్పవలసియుండినది. చెప్పకపోవుటకు కారణము మృగ్యము. అయితే ఉపజాతి భేదములు-వాటి పాదముల స్థితులు ఉపజాతివరకే పర్యాప్తములుకాని, అర్ధసమసామాన్యలక్షణములుకావు. అందుకనియే లాక్షణికు లంగీకరించలేదు. వాటియందు విషమవృత్తలక్షణములుకూడ నున్నవి. (చూ. విషమవృత్తములు.) అందువలన, అప్పకవి చెప్పిన పాక్షికాంశములకన్న లాక్షణికులందరొప్పిన 'అర్థసమ'త్వమే అంగీకార్యమనిపించుకొనును. (అప్పకవి తాను చెప్పిన లక్షణముల ననుసరించి కొన్ని అర్ధసమవృత్తములను చెప్పినాడు. వాటిని అతని మతమునందు మాత్రమే అర్థసమములుగా 'స్వస్థానార్ధసమ' వృత్తములందు చూపించబడినవి )

లాక్షణికులు చెప్పిన స్వ. అ. స. వృత్తములు.

| | |
|---|---|
| 1. ఉపజాతి | 7. రతిప్రియ |
| 2. అజితప్రతాన | 8. విపరీతనిశి |
| 3. ఉపచిత్ర | 9. వ్యత్యస్తసమోపజాతి |
| 4 నారీప్లుత | 10. వ్యత్యస్తోపజాతి |
| 5 నారీనుత | 11 వైపరీత్యోపజాతి |
| 6. నిశి | 12. సమోపజాతి |

**ఉపజాతి**

'ఉపజాతి' యనునది ఒకానొక స్వస్థానార్థసమవృత్తము. (చూ. స్వస్థానార్థసమవృత్తములు.) ఈ పద్యమునకు ఆయా పాదములందుండు గణక్రమ మిది :

బేసిపాదములు : త-త-జ-గగ.

సరిపాదములు : జ-త-జ-గగ.

(బేసిపాదము లింద్రవజ్రావృత్తమునకు, సరిపాదములు ఉపేంద్రవజ్రావృత్తమునకు చెందినవి ఈ రెండు వృత్తములును పదునొకండవ (త్రిష్టుప్) ఛందమున నిష్పన్నములైనవి. (చూ. ఇంద్రవజ్ర; ఉపేంద్రవజ్ర.) నాల్గుపాదములందును ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

'సామస్వరశ్రీనుప-జాతివృత్తం

బమేయనాదాంచిత-యాగికోక్తిన్

సామర్థ్యశబ్దార్థర-సత్ప్రవృత్తిన్
ప్రమోదియౌపల్కును-రాయిడింపన్'.

—ఛం. హం. (మ. మ.) 1.

చి. పెద్దన ఈ పద్యమును 'నిశి' యని పేర్కొన్నాడు. వృత్తరత్నాకరమునందిది 'ఆఖ్యానిక' అని చెప్పబడినది.

నిజమునకు 'ఉపజాతి' యనునది అచ్చముగా ఒక వృత్తముపేరు కాదు. ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర వృత్తపాదముల సమ్మేళనములోని వివిధ రీతులనుబట్టి రూపొందిన కొన్ని వృత్తముల సమూహమునకు సమష్టిగా వ్యవహారింపబడు పేరు. ఈ ఉభయ వృత్తపాదసమ్మేళనము 14 రీతులుగా నేర్పడినవి. పింగళచ్ఛందమునకు టీక వ్రాసిన హలాయుధుడు 'ఆద్యన్తా వుపజాతయః (6-17) అను సూత్రమువద్ద ఈ పదునాల్గు 'ఉపజాతి' భేదములను నిరూపించి పేర్లు చెప్పినాడు అవి ఈ క్రిందివిధముగా నున్నవి. (ఈ క్రింది అంకెలు పాదములను సూచించును. 1, 3 అనగా ఒకటవ, మూడవ పాదములనుకొనవలెను. ఇ=ఇంద్రవజ్ర; ఉ=ఉపేంద్రవజ్ర.)

| | | | |
|---|---|---|---|
| 1. | హంసి | 1, 3 = ఉ; | 2, 4 = ఇ. |
| 2. | వాణి | 1, 3 = ఇ; | 2, 4 = ఉ. |
| 3. | మాల | 1, 2 = ఉ; | 3, 4 = ఇ. |
| 4. | శాల | 1, 2 = ఇ; | 3, 4 = ఉ. |
| 5. | కీర్తి | 1 = ఉ; | 2, 3, 4 = ఇ. |
| 6. | బుద్ధి | 1 = ఇ; | 2, 3, 4 = ఉ. |
| 7. | మాయ | 1, 2, 3 = ఉ; | 4 = ఇ: |
| 8. | బాల | 1, 2, 3 = ఇ; | 4 = ఉ. |
| 9. | జాయ | 1, 4 = ఇ; | 2, 3 = ఉ. |
| 10. | ఆర్ద్రా | 1, 4 = ఉ; | 2, 3 = ఇ. |
| 11. | బుద్ది | 1, 3, 4 = ఉ; | 2 = ఇ. |
| 12. | ప్రేమ | 1, 2, 4 = ఉ; | 3 = ఇ. |
| 13. | భద్ర | 1, 3, 4 = ఇ; | 2 = ఉ. |
| 14. | రామ | 1, 2, 4 = ఇ; | 3 = ఇ. |

ఈవిధమైన వృత్తపాదసమ్మేళనము ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్రలకే కాక, వంశస్థ-ఇంద్రవంశములకు (12 వ ఛందము), శాలిని-వాతోర్మి (11 వ ఛందము); నారాచక-ప్రమాణిక (8 వ ఛందము) లకును ఈ సమ్మేళనమును లాక్షణికులు అంగీకరించినారు. ఈ వృత్తములన్నియు 'ఉపజాతి' అనియే చెప్పబడును. ప్రసిద్ధముగా 'ఉపజాతి' యను పేర ప్రయుక్తమగునది ఇంద్రవజ్ర-

ఉపేంద్రవజ్ర పాదసమ్మేళనమువలన ఏర్పడిన 14 భేదములలోని 'వాణి' యను నది.

ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర వృత్తపాదముల సమ్మేళనమువలన ఏర్పడిన పదునాల్గు భేదములలో రెండవ (వాణి), ఒకటవ (హంసి), నాల్గవ (శాల), మూడవ (మాల), ఆరవ (బుద్ధి) యను భేదములను వరుసగా ఉపజాతి, వ్యత్యస్తోపజాతి, సమోపజాతి, వ్యత్యస్తసమోపజాతి అని అప్పకవి పేర్కొన్నాడు.

**అజితప్రతాన**

'అజితప్రతానము' అనునది ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ, స్వ. అ. స. వృ.) ఈ పద్యమునకు ఆయా పాదములందుండు గణక్రమ మిది :

బేసిపాదములు : స-జ-స-స.

సరిపాదములు : న-భ-జ-ర.

(బేసిపాదములు 'ప్రమితాక్షర' వృత్తమునకు, సరిపాదములు 'ప్రియంవద' వృత్తమునకు చెందినవి. ఈ రెండు వృత్తములును 12 వ (జగతి) ఛందమునందు నిష్పన్నములైనవి. (చూ. ప్రమితాక్షర; ప్రియంవద.). బేసిపాదములందు తొమ్మిదవ యక్షరము, సరిపాదములందు ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

కపిలోకమంత్రులును-ఖంబెసగన్
విపులపీఠమున-బెట్టి యాతనిన్
కపురారతుల్ చెలఁగఁ-గంజముఖీ
సుపరిదీప్తకర-శుభ్రకాంతులన్.

—రామా. కల్ప. కిష్కింధ. నియమపాలన. 27.

**ఉపచిత్ర**

'ఉపచిత్ర' యనునది ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ. స్వ. అ. స. వృ.). ఈ వృత్తమునందాయా పాదములందుండు గణక్రమమిది :

బేసిపాదములు : స-స-స-లగ.

సరిపాదములు : భ-భ-భ-గగ.

బేసిపాదములందు తొమ్మిదవ అక్షరము, సరిపాదములందు 7వ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఈ పద్యమందు సరిపాదములు దోధకమను వృత్తమునకు చెందినవి. బేసిపాదము లేవృత్తమునకు చెందినవో తెలుగు లాక్షణికు లెవరును చెప్పియుండ

లేదు. కాని 'పింగళచ్ఛందష్టిప్పణి'యందు ఈ బేసిపాదముల లక్షణముతో నొక వృత్తము చెప్పబడినది. దానిపేరుకూడ 'ఉపచిత్ర'మే. అయితే అది సమవృత్తము. ఆ వృత్తమును సమవృత్తములలో చెప్పని చి. పెద్దన, ఆతని ననుసరించి అప్పకవి, ఈ స్వ. అ. స. వృత్తమును 'ఉపచిత్ర'మను పేర తెలుగులో చెప్పినారు.

ఉదా :

ఉపచిత్రవిధమ్ముమ-హోజ్జ్వల
వ్యాప్తిమైపతి-వాక్కునవేదా
దిపరిష్టినిఁదోఁచుచు-ధీస్వరా
త్మపరిశోభిత-దర్శనమీయన్.

—ఛం. హం. (మ. మ.) 6.

## నారీప్లుత

'నారీప్లుత' మనునది ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ. స్వ. అ. స. వృ.) ఈ పద్యమునకు ఆయా పాదములందుండు గణక్రమమిది :

బేసిపాదములు : మ-త-త-గగ.

సరిపాదములు : త-త-జ-గగ.

బేసిపాదములు, 'శాలిని' వృత్తమునకు, సరిపాదములు 'ఇంద్రవజ్ర' వృత్తమునకు చెందినవి. ఈ రెండువృత్తములును 11వ (త్రిష్టుప్) ఛందమునందు నిష్పన్నములైనవి.) బేసిపాదములలో ఏడవ అక్షరము, సరిపాదములలో ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

దీనికే 'నారీనుత'మని మరొక పేరు.

ఉదా :

ఓసీతా కుంభోద్భ-వోద్యన్మునీంద్రా
వ్యాసక్తచిత్తాయిటు-వచ్చినావే
వేసాధ్వీవద్దన్న-విన్నావుకాదే
ఆసన్నమౌనాపద-యట్లుత్రోయన్.

—రామా. కల్ప. కిష్కింధ. నియమపాలన. 210.

## నారీనుత

చూ. నారీప్లుత.

## నిశి

'నిశి' యనునది ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ. స్వ. అ. స. వృత్తము.). ఈ పద్యమునం దాయా పాదములందుండు గణక్రమమిది :

బేసిపాదములు : త-త-జ-గగ.

సరిపాదములు : జ-త-జ-గగ.

(బేసిపాదము లింద్రవజ్రవృత్తమునకు, సరిపాదములు ఉపేంద్రవజ్రవృత్తమునకు చెందినవి. ఈ రెండువృత్తములును పదునొకండవ (త్రిష్టుప్) ఛందమునందు నిష్పన్నములైనవి.) అన్నిపాదములందును ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఈ 'నిశి' యను పద్యమునే అప్పకవి 'ఉపజాతి' యను పేరుతో చెప్పినాడు. ఈ పై పద్య ముపజాతి భేదములలోని 'వాణి' యగును. (చూ. ఉపజాతి.)

ఉదా :

బేసింద్రవజ్రంబునఁ-బేర్చిరాఁగా
నెసంగఁగాసర్లను-పేంద్రవజ్రన్
భాసిల్లఁగాగూర్చియు-బాగుమీఱన్
వెసన్నిశీనామసు-వృత్తమయ్యేన్.

—అ. సా. సం. 2-8.

## రతిప్రియ

'రతిప్రియ' యనునది ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ. స్వ. అ. స. వృ.) ఈ వృత్తమున ఆయా పాదములయందుండు గణక్రమమిది :

బేసిపాదములు : మ-న-జ-ర-గ.

సరిపాదములు : జ-భ-స-జ-గ.

(బేసిపాధములు 'ప్రహర్షిణి' వృత్తమునకు, సరిపాదములు 'రుచిర' వృత్తమునకు చెందినవి. ఈ రెండువృత్తములును పదుమూడవ (అతిజగతి) ఛందమునందు నిష్పన్నములైనవి.). బేసిపాదములలో ఎనిమిదవ యక్షరము, సరిపాదములందు తొమ్మిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

వాణిన్ హారతిప్రియ-వాదికాత్రయోక్తిన్
ప్రణాదబంధురనవ-రాగయుక్తమౌ

పిశాక్షాణమెలయ-వేడ్కఁగొల్వనెంతున్
గణిప్రసిద్ధగతివి-కర్ధనంబిడన్.

—ఛం. హం. (మ. మ.) 9.

**విపరీతనిశి**

'విపరీతనిశి' ఒకానొక స్వస్థానార్ధసమవృత్తము. (చూ. స్వ. అ. స. వృ.). ఈ పద్యమం దాయాపాదములందుండు గణక్రమమిది :

బేసిపాదములు : జ-త-జ-గగ.

సరిపాదములు : త-త-జ-గగ.

(బేసిపాదములు ఉపేంద్రవజ్రవృత్తమునకు, సరిపాదములు ఇంద్రవజ్రవృత్తమునకు చెందినవి. ఈ రెండు వృత్తములును పదునొకండవ (త్రిష్టుప్) ఛందమునందు నిష్పన్నములైనవి.) నాల్గుపాదములందును ఎనిమిదవ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

'నిశి' యను స్వ. అ. స. వృత్తమునకు ఈ వృత్తము వ్యత్యస్తముగానుండును. నిశియందలి బేసిపాదములిందు సరిపాదములుగను, సరిపాదములు బేసిపాదములుగను నుండును. అందువలన దీనిని 'విపరీతనిశి' యని చి. పెద్దన పేర్కొన్నాడు. (చూ. నిశి.). ఈ 'విపరీతనిశి'నే అప్పకవి 'వ్యత్యస్తోపజాతి' యన్నాడు. ఈ 'విపరీతనిశి' యనునది 'ఉపజాతి' భేదములలోని 'హాంసి' యగును. (చూ. ఉపజాతి.)

ఉదా :

ఇరస్తుతా బేసిను-పేంద్రవజ్రన్
హీరాంగసర్లిందును-నింద్రవజ్రన్
ధరాధిరాజాయిది-దాధరిత్రిన్
శ్రీరీతినొప్పున్ విప-రీతపూర్వన్.

—ల. సా. సం. 2-10.

**వ్యత్యస్తసమోపజాతి**

'వ్యత్యస్తసమోపజాతి' యనుపేర అప్పకవి యొక స్వస్థానార్ధసమవృత్తమును చెప్పినాడు. (చూ. స్వ. అ. స. వృ.). ఇందు పూర్వార్ధము (ఒకటవ, రెండవపాదములు) 'ఉపేంద్రవజ్ర' వృత్తమునకు, ఉత్తరార్ధము (మూడవ, నాల్గవ పాదములు) 'ఇంద్రవజ్ర' వృత్తమునకు చెందియుండును. (చూ. ఇంద్రవజ్ర; ఉపేంద్రవజ్ర; ఉపజాతి.). నాల్గుపాదములందును ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

ఒయారివ్యత్యస్త స-మోపజాత

స్వయంప్రభావృత్తవి-భావధీవ్యా

పారియోగదీప్తిన్ గని-బ్రహ్మ తెల్వెన్

వైయాత్వముంగాచెబ్ర-పంచసృష్టిన్.

—ఛం. హం. (మ. మ.) 4.

నిజమున కిది అప్పకవీతర లాక్షణికుల మతమున 'స్వస్థానార్థసమ వృత్తము కాదు. స్వస్థానార్థ విషమవృత్తమగును. (చూ. స్వ. అ. స. వృ.; స్వ. అ. వి. వృ.) ఈ వ్యత్యస్తసమోపజాతి యనునది 'ఉపజాతి' భేదముల లోని 'మాల' యగును. (చూ. ఉపజాతి.)

**వ్యత్యస్తోపజాతి**

'వ్యత్యస్తోపజాతి' యనుపేర అప్పకవి ఒకానొక స్వస్థానార్థ సమ వృత్తమును చెప్పినాడు. ఈ వృత్తమునకే 'విపరీతనిశి' యని నామాంతరము. చూ. విపరీత నిశి.

**వైపరీత్యోపజాతి**

వైపరీత్యోపజాతి యనుపేర అప్పకవి యొకానొక స్వస్థానార్థ సమ వృత్తమును చెప్పినాడు. దీని లక్షణ మిట్లుండును.

ఈ వృత్తమందలి మొదటి పాదము ఇంద్ర వజ్ర వృత్తలక్షణముతో, రెండవ, మూడవ, నాల్గవ పాదములు ఉపేంద్ర వజ్ర లక్షణముతో నుండును. అన్ని పాదములందును ఎనిమిదవ అక్షరము యతి చెల్లును. ప్రాస నియమ మున్నది. (చూ, ఇంద్ర వజ్ర; ఉపేంద్ర వజ్ర).

ఉదా :

వ్యాజ ప్రధానంబయి - వైపరీత్యో

ప జాతి వృత్తిన్ గను - భాష యంచున్

ప్వజాయ నాత్మాన న భాసురాజ్ఞాం

త జీవనగానిల్పె వి - ధాత రక్తిన్.

—ఛం. హం. (మ. మ.) 5.

ఈ వృత్తమునకు అర్థసమత్వము నిజమునకు లేదు. అందువలన అప్పకవీతర లాక్షణికులు దీనిని అర్థసమవృత్తముగా నంగీకరించలేదు. ఇది ఉపజాతి విభేదములలోని 'బుద్ధి' యను భేదము (చూ. ఉపజాతి).

## సమోపజాతి

'సమోపజాతి' యనుపేర అప్పకవి ఒకానొక స్వస్థానార్థ సమ వృత్తమును చెప్పినాడు దీని లక్షణ మిట్లుండును.

సమోపజాతి యందలి పూర్వార్థము (ఒకటవ, రెండవ పాదములు) 'ఇంద్రవజ్ర' వృత్త లక్షణముతో, ఉత్తరార్థము (మూడవ, నాల్గవ పాదములు) 'ఉపేంద్రవజ్ర' వృత్తలక్షణముతో నుండును. అన్ని పాదములందును ఎనిమిదవ అక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

ఓలాడ నాస్రష్ట స - మోప జాతిన్
హేలా విలాసాన్విత - హృష్టి; వాణీ
కలావహో లాపము - కౌముదీ దీ
ప్త లక్ష్యసంవిత్తును - బంచెనంతన్.

—ఛం. హం. (మ. మ.) 3.

నిజమునకు అప్పకవి చెప్పిన ఈ రీతిని అర్థసమత్వముగా అప్పకవీతర లాక్షణికు లంగీకరించలేదు. (చూ. స్వ. అ. స. వృత్తములు.). ఈ పద్యము 'ఉపజాతి' భేదములలోని 'శాల' అను భేదము. (చూ. ఉపజాతి).

## పరస్థానార్థ సమ వృత్తములు

ఛందములు మొత్త మిరువదియారు. ఒక్కొక్క ఛందమునందు ప్రస్తారము ననుసరించి పలువృత్తములు నిష్పన్నములగును. (చూ. ఛందములు; ప్రస్తారము.) ఒక ఛందమునందు నిష్పన్నమైన యొకానొక వృత్తపు రెండు పాదములు-మొత్తము నాల్గు పాదములుగా కూర్చబడిన పద్యము 'పరస్థానార్థ సమవృత్త మగును. అయితే బేసిపాదము లొక ఛందపు వృత్తమునకు, సరి పాదము లింకొక ఛందపు వృత్తమునకు చెందియుండవలెను. ఇట్లుండుట 'అర్థ సమత్వము.' బేసిపాదము లెన్నవ ఛందమునకు చెందినవో, ఆ ఛంద మాపద్య మునకు స్వస్థానము. కాగా సరిపాదములకు చెందిన పాదములు మరొక ఛందము నకు చెందిన వగుటచే, ఈ పాదముల ఛందము ఆ పద్యమునకు 'పరస్థాన' మగును. కావున భిన్న చ్ఛందోవృత్తపాద సమ్మేళనమువలన అర్థసమముగా రూపొందిన పద్యము 'పరస్థానార్థ సమవృత్త' మగును. స్వస్థానార్థ సమవృత్త ములు ఒకే ఛందములోని భిన్న వృత్తపాద సమ్మేళనములు కాగా పరస్థానార్థ సమవృత్తములు భిన్న చ్ఛందములలోని వృత్తముల పాదముల సమ్మేళనములు. (చూ. స్వ. అ. స. వృ).

భిన్న చ్ఛందముల భిన్నత్వము ఏకాక్షర భేదముతోమాత్రమే యుండ

వలెనని చి. పెద్దన, అప్పకవి చెప్పినారు. అనగా ఒకఛందములోని బేసిపాదముల (అక్షరసంఖ్యకు) కు ఒక అక్షర మెక్కువగానో లేక తక్కువగానో మాత్రమే యున్న ఛందములోనివి సరిపాదములు కావలెను. ఉదాహరణమునకు తొమ్మిదవ ఛందములోనివి బేసిపాదములైనచో, సరిపాదములు, ఎనిమిదవ, లేదా పదవ ఛందములోనివి కావలెను.

లాక్షణికులు చెప్పిన ప. అ. స. వృత్తములు :-

1. అపరవక్త్ర
2. కేతుమతి
3. కోమలి
4. ధృతమధ్య
5. పరావతి
6. పుష్పితాగ్ర
7. భద్రవిరాట్టు
8. మణివితానకాంతి
9. మనోహర
10. వియోగిని
11. వేగవతి.

**అపరవక్త్ర**

'అపరవక్త్ర' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమునం దాయాపాదములం దుండవలసిన గణ క్రమమిది:

బేసిపాదములు : న-న-ర-లగ

సరిపాదములు : న-జ-జ-ర

(బేసిపాదములు పదునొకండవ ఛందము (త్రిష్టుప్) నిష్పన్నమైన 'భద్రక' వృత్తమునకు చెందినవి. సరిపాదములు పన్నెండవ (జగతి) ఛందమున నిష్పన్నమైన 'పదమాలి' వృత్తమునకు చెందినవి.) బేసిపాదములందు ఏడవ యక్షరము సరిపాదములందు ఎనిమిదవ యక్షరము యతిచెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

అనఘ యనమ - మందు భద్రిక
జ్జనపతి మాలిని - సర్గయందు ని
ల్పనది యపర - వక్త్రవృత్తమౌ
ననుచును సత్కవు - లంద్రు మారుతీ.

—అ. సా. సం. 2-28.

**కేతుమతి**

'కేతుమతి' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. స్థా. అ. స. వృ). ఈ పద్య మందాయాపాదములందుండవలసిన గణ క్రమమిది:

బేసిపాదములు : స-జ-స-గ

సరిపాదములు : భ-ర-న-గగ.

(బేసిపాదములు పదవ (పంక్తి) ఛందమునకు, సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందమునకు చెందిన వృత్తముల పాదములు. ఈ యీ గణక్రమము లతో చెప్పబడిన పద్యములు ఆయా ఛందములలో కానరావు. కాగా ఇవి క్రొత్త వృత్తము లనుకొనవలెను. వీటికి పేర్లు చెప్పబడలేదు). అన్ని పాదము లందును ఏడవ అక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

చను బేసుల న్స - జ సగాప్తిన్

భాను సమాసరిన్ - భ్ర నగగంబుల్

తనరం గవీంద్ర - ద్రతతి యెన్నం

దో నమరింపఁగే - తుమతి మించున్.

—ల. సా. సం. 2-18.

అప్పకవి మాత్రము బేసిపాదములు స-జ-న-గ అను గణక్రమముతో నుండవలెనని చెప్పినాడు. యతి చెల్లింపులో భేదములేదు.

ఉదా :

మహితార్థ కేతు - మతి వచ

స్సాహితి నాత్మసౌ - ష్ఠవ రసాశ్రిన్

బహుకేతువైభ - వశుభద

వ్యాహృతి నొప్పఁగా - వ్యసభ మందున్.

—ఛం. హం. (మ. మ.) 15.

**కోమలి**

'కోమలి' యనునది యొకానొక పరస్థానార్ధ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.). ఈ పద్యమందాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

బేసి పాదములు : న-జ-జ-య

సరి పాదములు : జ-భ-స-జ-గ

(బేసి పాదములు పన్నెండవ (జగతి) ఛందమున నిష్పన్నమైన తోదక వృత్తము నకు; సరి పాదములు పదమూడవ (అతిజగతి) ఛందమున నిష్పన్నమైన రుచిర వృత్తమునకు చెందినవి.). బేసి పాదములందు ఎనిమిదవ యక్షరము, సరిపాదము లందు తొమ్మిదవ యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

అనిలజ దోదక - మౌ విషమాంఘ్రుల్

జన స్తుతా రుచిర యె - సంగు యుక్కులన్

ఘనతరమై తగుఁ - గావ్యములందున్

వినంగ గోమలియను - వృత్తమొప్పగున్.

—ల. సా. సం. 2-28.

**ధృతమధ్య**

'ధృతమధ్య' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ ). ఈ పద్యమునందాయా పాదములందుండవలసిన గణక్రమ మిది :

బేసి పాదములు : భ-భ-భ-గగ

సరి పాదములు : న-జ-జ-య

(బేసి పాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందమున నిష్పన్నమైన దోధక వృత్తమునకు, సరి పాదములు పన్నెండవ (జగతి) ఛందమున నిష్పన్నమైన తోదక వృత్తమునకు చెందిన పాదములు ). బేసి పాదములందు ఏడవ యక్షరము, సరి పాదములం దెనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమ మున్నది.

ఉదా :

అరయ దోధక - మంటును బేసు

ల్సరులను దోదక - లక్షణమొందున్

మారుతి యాధృత - మధ్యకు నెందున్

సరస కవీంద్రులు - సమ్మతిఁగూర్పన్.

—ల. సా. సం. 2-22.

అప్పకవీయ లక్షణ మిట్లేయున్నను, లక్ష్యమందు నాల్గవపాదము రెండవ పాదమువలె నుండుటకు బదులు బేసిపాద లక్షణముతోనున్నది. ఇది ప్రమాదవశమున జరిగినదై యుండును. (చూ. వావిళ్లవారి 'అప్పకవీయము' 1934 ప్రచురణ.).

**పరావతి**

'పరావతి' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

జేసిపాదములు : ర-జ-ర-జ

సరిపాదములు : జ-ర-జ-ర-గ

(జేసిపాదములు పన్నెండవ (జగతి) ఛందపు వృత్తమునకు, సరిపాదములు పదమూడవ (అతిజగతి) ఛందపు వృత్తమునకు చెందినవి. ఈ గణక్రమములతో నాయా ఛందములందు వృత్తములను లాక్షణికులు చెప్పినట్లు కానరాదు. కాగా ఇవి క్రొత్తవృత్తములు. పేర్లు చెప్పబడలేదు.). జేసిపాదములలో తొమ్మిదవ యక్షరము, సరిపాదములలో పదవ యక్షరము యతిచెల్లును ప్రాసనియమ మున్నది.

జేసిపాదములలో వరుసగా ఆరు 'గల'ములు; సరిపాదములలో వరుసగా ఆరు లగములు+ఒక గురువు అని చి. పెద్దన చెప్పినాడు. ఈ చెప్పినదానిని గణముల పద్ధతిలో చెప్పినచో పయిలక్షణ మేర్పడును.

అప్పకవి చెప్పిన లక్షణము పయిదానికి కొంత భిన్నముగా నున్నది జేసిపాదములందు 'ర-జ-ర-జ-గ' అను గణక్రమము నాతడు చెప్పినాడు. కాని అది సరికాదు. ఈ లక్షణమును జేసిపాదములకు స్వీకరించినచో, ఈ జేసిపాదములు గూడ సరిపాదములతోపాటు పదమూడవ ఛందమునకే చెందినవగును. అప్పుడా వృత్తము స్వస్థానార్థ సమవృత్తమగునుగాని, పరస్థానార్థ సమవృత్తము కాక పోవును. జేసిపాదముల లక్షణము మార్చి, సరిపాదముల లక్షణమును మార్చక పోవుటచే నీస్థితి యేర్పడినది. కాగా పరావతి పేర ప. అ. స. వృత్తముగా అప్పకవి చెప్పినది స్వ అ. స. వృత్తమని భావించవలసి యుండును.

రెండింటికి ఉదాహరణములు :

i. జేసులందు హంబులాయి-పెట్టియాల
దేసన్లగంబులాయిగంబ-దిన్నరిన్నాం
జేసిరేబరావతీప్ర-సిద్ధసంజ్ఞం
బొసంగుపేరివృత్తమాను-భూరికీర్తి

—అ. సా. సం. 2-21.

ii. కోరికన్పరావతీప్ర-కోష్ఠితోక్తిచే
విరాజమానసృష్టిచిత్ర-విభ్రమాభా
కారితస్వరూపమెంతుం-గావ్యసిద్ధికై
నిరంతరాత్మదృష్టినంది-నిత్యతుష్టిన్.

—ఛం. హం. (మ. మ.) 18.

## పుష్పితాగ్ర

'పుష్పితాగ్ర' యనునది యొకానొక పరస్థానార్ధ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమందు నాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

బేసిపాదములు : న-న-ర-య

సరిపాదములు : న-జ-జ-ర-గ

(బేసిపాదములు పన్నెండవ (జగతి) ఛందమున నిష్పన్నమగు 'భద్రిక' వృత్తమునకు చెందినవని చి. పెద్దన చెప్పినాడు; కాని అతడా ఛందమున చెప్పిన 'భద్రిక' వృత్తమునకు న-న-న-లగ అను గణక్రమమున్నది. ('ననరవవలు పెనంగు భద్రికన్' ల సా. సం. ఆ. 1. 11వ ఛందపు వృత్తములలో) ఛందము పదునొకండవది యగుచున్నది. ఇదిట్లుండగా న-న-ర-య గణక్రమముతో పన్నెండవ ఛందమున లాక్షణికులు ఏవృత్తమును చెప్పలేదు. కాగా ఇది కొత్తవృత్తము. పేరు చెప్పబడలేదు. సరిపాదములు పదమూడవ (అతిజగతి) ఛందపు ప్రభాతవృత్తమునకు చెందినవి.) బేసిపాదములందు తొమ్మిదవ యక్షరము, సరిపాదములందు ఎనిమిదవ యక్షరము యతిచెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

పరగనసమమందు-భద్రికాగ
లస్రరులఁబ్రభాతయె-సంగుఁబుష్పితాగ్రన్
హరికులమణియంజ-నాత్మజాతా
శరనిధిలంఘన-శౌర్యసత్వసంధా.

—ల. సా. సం. 2-26.

## భద్ర విరాట్టు

'భద్ర విరాట్టు' అనునది ఒకానొక పరస్థానార్ధ సమవృత్తము (చూ. ప. అ. స. వృ.). ఈ పద్య మందాయాపాదములందుండవలసిన గణక్రమమిది:

బేసిపాదములు : త-జ-ర-గ

సరిపాదములు : మ-స-జ-గగ.

(బేసిపాదములు పదవ పంక్తి) ఛందపు వృత్తమునకు చెందినవి. కాని ఈ గణక్రమముతో నా ఛందమునందు లాక్షణికులు ఏ వృత్తమును చెప్పలేదు. కాగా ఇది కొత్త వృత్తము. పేరు చెప్పబడలేదు. సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందపు వృత్తమునకు చెందినవి. ఈ గణక్రమముతో గూడ నా ఛందమందే లాక్షణికుడును చెప్పలేదు. కాగా ఇదియు క్రొత్తదే. అయితే ఈ

లక్షణముతో 'మేరురూప' మను వృత్తము 'వృత్తసారము' నందు చెప్పబడినది. (చూ. రావూరివారి 'తెలుగుభాషలో ఛందోరీతులు'. పు. 122). బేసిపాదము లందేడవ యక్షరము, సరిపాదము లందారవ యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

తాఁజెంద సమాన - త జ్జరగాప్తిన్
రాజిల్ శుద్ధ వి - రాట్టుగంబు సర్లన్
దేజో విజతార్క - తేటగాఁగన్
భ్రాజద్భద్ర వి - రాడ్విధంబు మించన్.

—అ. సా. సం. 2-27.

## మణి వితాన కాంతి

'మణి వితాన కాంతి' యనునది ఒకానొక పరస్థానార్థ సమవృత్తముఁ. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్య మందాయాపాదములందుండవలసిన గణ క్రమమిది:

బేసిపాదములు : మ-స-జ-గ

సరిపాదములు : ర-న-ర-లగ.

(బేసిపాదములు పదవ (పంక్తి) ఛందమందు నిష్పన్నమైన 'శుద్ధవిరాటి' వృత్త మునకు, సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందమందు నిష్పన్నమైన 'రథోద్ధత' వృత్తమునకు చెందినవి) బేసిపాదములందు ఆరవ యక్షరము, సరి పాదములందు ఏడవ యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

రంగా శుద్ధ వి - రాట్టు బేసులన్
సంగతిన్ సరులఁ - జాల్ రథోద్ధతన్
రంగత్సార ధు - రంధ రాభ్రమా
తంగ విన్మణి వి - తాన కాంతికిన్.

—అ. సా. సం. 2-24.

## మనోహర

'మనోహర' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమం దాయా పాదములం దుండవలసిన గణ క్రమమిది :

బేసిపాదములు : త-జ-జ-ల-గ

సరిపాదములు : స-స-స-స

(బేసిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందమున నిష్పన్నమైన 'కలితాంత' వృత్తమునకు, సరిపాదము పన్నెండవ (జగతి) ఛందమున నిష్పన్నమైన 'తోటక' వృత్తమునకు చెందిన పాదములు.) బేసిపాదములందు ఎనిమిదవ యక్షరము, సరిపాదములందు తొమ్మిదవ యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

'గాలించి హాసంతి సె-గల్సురియల్
కలుచల్ కలుపుల్ మల-కల్ మెలికల్
హాలాహాలపశ్చిమ-హాట్టమరు
ద్దలముల్ మలగెన్ పరి-దర్పితముల్.'

—రామా. కల్ప. అరణ్య. జటాయు. 256.

వియోగిని

'వియోగిని' యనునది ఒకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ) ఈ పద్యమం దాయా పాదములం దుండవలసిన గణక్రమమిది:

బేసిపాదములు : స-స-జ-గ

సరిపాదములు : స-భ-ర-ల-గ

(బేసిపాదములు పదవ (పంక్తి) ఛందమందు నిష్పన్నమైన 'సుముఖి' వృత్తమునకు, సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందమున నిష్పన్నమైన 'వనమాలి' వృత్తమునకు చెందినవి.) బేసిపాదములందు ఆరవయక్షరము, సరిపాదములందు ఏడవ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

'ఉపరిన్ జలి-తోరువీచికా
విపులాకాశవి-భీషణానిలా
ప్రపరావము-సాగగా భ్రమి
స్ఫుటస్థానమె-సంగెనచ్చటున్.

—రామా. కల్ప. అరణ్య. జటాయు. 269.

**వేగవతి**

'వేగవతి' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమందాయా పాదములం దుండవలసిన గణక్రమమిది:

బేసిపాదములు : స-స-స-గ

సరిపాదములు : భ-భ-భ-గగ

(బేసిపాదములు పదవ (పంక్తి) ఛందపు వృత్తమునకు, సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందపు వృత్తమునకు చెందినవి అయితే అయా ఛందములందు ఈ గణక్రమముతో లాక్షణికు లేవృత్తములను చెప్పలేదు. కాగా ఇవి క్రొత్త వృత్తములు. పేర్లు చెప్పబడలేదు.) అన్నిపాదములందును ఏడవ యక్షరమే యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా ;

కమనీయము వే-గవతీశ్యా

మామలజీవని-యామము నిత్య

ప్రమదాంచిత భా-వతరంగ

శ్రీమహితంబగు-నృత్యవిధోక్తిన్.

—ఛం. హం. (మ. మ.) 16.

**స్వస్థాన విషమ వృత్తములు**

ఒక ఛందమునందు నిష్పన్నములైన వృత్తములలో నొకవృత్తమునకు చెందిన పాదములు పూర్వార్థము (ఒకటవ, రెండవ పాదములు) గా, వేరొక వృత్తమునకు చెందిన పాదములు ఉత్తరార్థము (మూడవ, నాల్గవ పాదములు) గా రచింపబడిన పద్యము స్వస్థాన విషమ వృత్తమగునని వి. పెద్దన మతము. ఈ మతమును అనంతుడు, చి. పెద్దనలు కూడ అంగీకరించి లక్ష్యములను వ్రాసినారు. స్వస్థానార్థ సమవృత్తమునకు, స్వస్థాన విషమ వృత్తమునకు పై లక్షణము ననుసరించి యొక భేదమున్నది. స్వ. అ. స. వృత్తమున బేసి పాదము లొక వృత్తమునకు చెందగా, సరిపాదము లింకొక వృత్తమునకు చెందును. ఇందు బేసి, సరియనిగాక, ఒకబేసి ఒకసరి పాదములు (పూర్వార్థము) ఒక వృత్తమునకు చెందగా, మరొక బేసి మరొక సరి పాదములు (ఉత్తరార్థము) వేరొక వృత్తమగును (చూ. స్వ. అ. స. వృ.) అయితే ఈ రెండింటియందును 'అర్థసమత్వము' (పద్యమున సగభాగము-బేసి-సరిగా కావచ్చును, లేదా పూర్వార్థ-ఉత్తరార్థములుగా కావచ్చును) ఉన్నది. కాని వి. పెద్దన బేసి-సరుల పద్ధతినే 'అర్థసమము'గా భావించి పూర్వార్థోత్తరార్థముల అర్థసమత్వమును 'విషమము'గా భావించినాడు. వి. పెద్దన విషమముగా భావించినదానిని అప్పకవి

'అర్ధసమము'గానే భావించినారు. సంస్కృత లాక్షణికులు బేసి-సరి పద్ధతిని మాత్రమే అర్ధసమముగా భావించినారు. దానికి భిన్నముగా పూర్వార్ధోత్తరార్ధ పద్ధతి యుండుటచే వి. పెద్దన దానిని విషమముగా భావించియుండును గాని, నిజమునకు అర్ధసమత్వము ఉభయత్ర యుండుటచే అర్ధసమత్వమునకు పూర్వార్ధోత్తరార్ధ పద్ధతినిగూడ అప్పకవి చెప్పినట్లు బేసి-సరి పద్ధతితోబాటు స్వీకరించుటయే యుక్తముగా కన్పించును. అర్ధసమత్వము రెండు పద్ధతులలో గూడ నుండవచ్చును. ఈ రెండు పద్ధతులలోనేగాక, 1-4, 2-3 అను పద్ధతిలోగూడ నుండవచ్చును. దీనినిగూడ మూడవ పద్ధతిగా స్వీకరింపవచ్చును. (చూ. స్వ. అ. స. వృ.: ఉపజాతి )

ఇదిట్లుండగా, అనంతుడు, చి. పెద్దనల స్వస్థాన విషమ లక్ష్యముల ననుసరించి యొకపాద మొక వృత్తమునకు, మూడుపాదము లింకొక వృత్తమునకు చెందినవగుచో విషమవృత్తమగునని స్పష్టమగును. నిజమున కీపద్ధతియే 'విషమత్వము' ను స్పష్టపరచును. సమ, అర్ధసమత్వముల తరువాతి దశ విషమత్వము. కావున ఇదియే సరియైన పద్ధతి. అనంతుడు, చిత్రకవి పెద్దనలు ఈ పద్ధతిలోనే ఎక్కువ విషమవృత్త లక్ష్యములు చూపినారు. (వి. పెద్దన పద్ధతి నొక్క 'అంగజాస్త్రము' విషయముననే అనుసరించినారు. (చూ. అంగజాస్త్రము.)

అయితే అప్పకవి పైపద్ధతులకు భిన్నముగా విషమవృత్తమునందు నాల్గుపాదములు నాల్గు భిన్నవృత్తములకు చెందినవి కావలయునన్నాడు. ఈ పద్ధతికూడ వృత్తమునకు విషమత్వము కలిగించునదే. ఈవిధముగా విషమత్వము మూడు విధములుగా నుండవచ్చునని భావించవలసి యుండును.

లాక్షణికులు చెప్పిన. స్వ. వి. వృత్తములు :

1. అంగజాస్త్ర
2. ధరణి
3. నదీప్రఘోష
4. వరాంగి
5. వారాంగి.

**అంగజాస్త్ర**

'అంగజాస్త్ర' మనునది యొకానొక స్వస్థాన విషమవృత్తము. (చూ. స్వ. వి. వృ.) వి. పెద్దన, అనంతుడు, చి. పెద్దనల మతము ననుసరించి ఈ పద్యమునం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

పూర్వార్ధము : భ-మ-స-గ

ఉత్తరార్ధము : మ-స-జ-గ

**వేగవతి**

'వేగవతి' యనునది యొకానొక పరస్థానార్థ సమవృత్తము. (చూ. ప. అ. స. వృ.) ఈ పద్యమందాయా పాదములం దుండవలసిన గణక్రమమిది:

బేసిపాదములు : స-స-స-గ

సరిపాదములు : భ-భ-భ-గగ

(బేసిపాదములు పదవ (పంక్తి) ఛందపు వృత్తమునకు, సరిపాదములు పదునొకండవ (త్రిష్టుప్) ఛందపు వృత్తమునకు చెందినవి అయితే అయా ఛందములందు ఈ గణక్రమముతో లాక్షణికు లేవృత్తములను చెప్పలేదు. కాగా ఇవి క్రొత్త వృత్తములు. పేర్లు చెప్పబడలేదు.) అన్నిపాదములందును ఏడవ యక్షరమే యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా ;

కమనీయము వే-గవతీశ్యా
మామలజీవని-యామము నిత్య
ప్రమదాంచిత భా-వతరంగ
శ్రీమహితంబగు-నృత్యవిధోక్తిన్.

—ఛం. హం. (మ. మ.) 16.

**స్వస్థాన విషమ వృత్తములు**

ఒక ఛందమునందు నిష్పన్నములైన వృత్తములలో నొకవృత్తమునకు చెందిన పాదములు పూర్వార్థము (ఒకటవ, రెండవ పాదములు) గా, వేరొక వృత్తమునకు చెందిన పాదములు ఉత్తరార్థము (మూడవ, నాల్గవ పాదములు) గా రచింపబడిన పద్యము స్వస్థాన విషమ వృత్తమగునని వి. పెద్దన మతము. ఈ మతమును అనంతుడు, చి. పెద్దనలు కూడ అంగీకరించి లక్ష్యములను వ్రాసినారు. స్వస్థానార్థ సమవృత్తమునకు, స్వస్థాన విషమ వృత్తమునకు పై లక్షణము ననుసరించి యొక భేదమున్నది. స్వ. అ. స. వృత్తమున బేసి పాదము లొక వృత్తమునకు చెందగా, సరిపాదము లింకొక వృత్తమునకు చెందును. ఇందు బేసి, సరియనిగాక, ఒకబేసి ఒకసరి పాదములు (పూర్వార్థము) ఒక వృత్తమునకు చెందగా, మరొక బేసి మరొక సరి పాదములు (ఉత్తరార్థము) వేరొక వృత్తమగును (చూ. స్వ. అ. స. వృ.) అయితే ఈ రెండింటియందును 'అర్థసమత్వము' (పద్యమున సగభాగము-బేసి-సరిగా కావచ్చును, లేదా పూర్వార్థ-ఉత్తరార్థములుగా కావచ్చును) ఉన్నది. కాని వి. పెద్దన బేసి-సరుల పద్ధతినే 'అర్థసమము'గా భావించి పూర్వార్థోత్తరార్థముల అర్థసమత్వమును 'విషమము'గా భావించినాడు. వి. పెద్దన విషమముగా భావించినదానిని అప్పకవి

**ధరణి**

'ధరణి' యనునది యొకానొక స్వస్థాన విషమవృత్తము. (చూ. స్వ. వి. వృ.) ఈ పద్యమం దాయా పాదము లందుండవలసిన గణక్రమమిది :

1వ పాద : స-స-స-స

2వ పాద : ర-ర-ర-స

3వ పాద : న-న-స-స

4వ పాద : మ-మ-స-స

(వీటిలో మొదటిపాదము తోటకవృత్తము (12వ ఛందము) నకు చెందినది. మిగిలిన పాదముల లక్షణములతో లాక్షణికులు వృత్తములను చెప్పినట్లు కాన రాదు. కాగా పేరులేని క్రొత్త పద్యపాదములవి.) మొదటిపాదమున తొమ్మిదవ యక్షరము, రెండవ-మూడవ పాదములందు ఏడవ యక్షరము, నాల్గవ పాద మందు ఆరవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

'చలువల్ తరుగై వరు-సల్ విరుగై

వాలికల్ మాలికల్-బాడబాకృతులై

మలకలుగొని-మరియున్ విరియున్

గాలుల్ ప్రాచీది-క్క్రాంతములై గుములై.

—రామా. కల్ప. అరణ్యా. జటాయు. 255.

**నదీప్రఘోష**

'నదీప్రఘోష' మనునది ఒకానొక స్వస్థాన విషమవృత్తము. (చూ. స్వ. వి. వృ.) ఈ పద్యమం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1వ పాద : భ-భ-ర-ర

2, 3, 4వ పాద : జ-త-జ-ర.

మొదటి పాదమున ఏడవ అక్షరము, మిగిలిన పాదములలో ఎనిమిదవ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది. (పై పాదములలో మొదటిది క్రొత్త వృత్తము. లాక్షణికులెవరును చెప్పనిది. మిగిలిన పాదములు 'వంశస్థ' వృత్తము నకు చెందినవి.) ఈ లక్షణము వి. పెద్దన చెప్పినది. అయితే, అనంతుడు, చి. పెద్దనలు మొదటిపాదమున నాల్గు రగణములు (స్రగ్విణీవృత్తపాదముగా) ఉండవలెనన్నారు. అప్పకవి చెప్పిన లక్షణము నాల్గుపాదములకును భిన్నభిన్న ముగా నున్నది. అతని ప్రకారము లక్షణమిట్లున్నది.

1వ పాద : ర-ర-ర-ర

2వ పాద : జ-త-జ-ర

3వ పాద : య-య-య-య

4వ పాద : త-త-జ-ర.

ఈ నాల్గుపాదములు వరుసగా స్రగ్విణి, వంశస్థ, భుజంగప్రయాత, ఇంద్రవంశ వృత్తములకు చెందినవి. మొదటిపాదమున ఏడవ యక్షరము, మిగిలిన పాదములలో ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

మూడు రీతులకు ఉదాహరణములు :

i. భారరములొప్పెగిఁ-బ్రాగుపేతంబులై
చరించుచుండంజత-జస్థరేఫలన్
బరత్రి పాదంబు లఁ - బర్వ నొప్పంగన్
దిరంబు గామూట న - దీ ప్రఘోషమై'.

—కా. చూ. 8-15.

ii. చాలనాద్యంఘ్రికిన్ - స్రగ్విణీ వృత్తమున్
దలంపఁ గాఁదక్కిన - తత్త్రయాంఘ్రులన్
తెలంగ వంశస్థను - జిత్ర రీతి సం
ధిలంగఁ గూర్పంగ న - దీ ప్రఘోషమా.

—ల. సా. సం. 2-35.

iii. పూని సామీప్యముం - బొందఁగా రాకయే
నినాద ఘోరాకృతి - వార్ని ధాన జీ
వనీయో గ్రభంగా శి - వారిం చె విష్వ
క్సేనుండు వేత్రాగ్ర వి - న్యస్త్య రుండునా.

—రామా. కల్ప. అయోధ్య. అనసూయ. 72.

**వరాంగి**

'వరాంగి యనునది యొకానొక స్వస్థాన విషమవృత్తము. (చూ. స్వ. వి. వృ.) ఈ పద్య మందాయా పాదములందుండవలసిన గణక్రమమిది.

1, 2, 4 వ పాద : జ-త-జ-గగ

3 వ పాద : త-త-జ-గగ

(పై వాటిలో మూడవ పాదము ఇంద్రవజ్రా వృత్తమునకు చెందగా, మిగిలిన పాదములు ఉపేంద్రవజ్రా వృత్తమునకు చెందినవి.) అన్ని పాదములందును ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

సరి త్వదాజ్ఞా జత - జల్ గగల్ బం
ధురంబగున్ రెంటఁజ - తుర్థ కాంఘ్రిన్
గారాముతోఁ దాజగ - గల్ వరాంగిన్
హారార్పితా మూఁడవ - యంఘ్రి నొందున్.

—అనం. ఛంద. 2-123.

ఈ 'వరాంగి' లక్షణము స్వస్థానార్ధ సమవృత్తమగు 'ఉపజాతి' భేదములలో 'ప్రేమ' యను భేదమునకు సరిపోవుచున్నది. (చూ. ఉపజాతి.)

**వారాంగి**

'వారాంగి' యనునది యొకానొక స్వస్థాన విషమవృత్తము. (చూ. స్వ. వి. వృ.). ఈ పద్యమం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

పూర్వార్ధము (1, 2వ పాద) జ-త-జ-గగ
ఉత్తరార్ధము (3, 4వ పాద) త-త-జ-గగ.

(పూర్వార్ధము ఉపేంద్రవజ్రావృత్తమునకు చెందగా, ఉత్తరార్ధము ఇంద్రవజ్రా వృత్తమునకు చెందినది.) అన్నిపాదములందును ఎనిమిదవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది ఇది వి. పెద్దన చెప్పిన లక్షణము. అప్పకవి ననుసరించి ఆయా పాదముల గణక్రమమిది :

1వ పాద : త-త-జ-గగ
2వ పాద : జ-త-జ-గగ
3వ పాద : త-జ-జ-గగ
4వ పాద : మ-భ-త-గగ.

(ఈ పాదములు వరుసగా ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, గీతాలంబన, వాతోర్మి వృత్తములకు చెందినవి.). మొదటి మూడుపాదములందు ఎనిమిదవ యక్షరము, నాల్గవ పాదమందు ఏడవ యక్షరము యతి చెల్లును ప్రాసనియమమున్నది.

రెండు పద్ధతులకు ఉదాహరణములు.

i. చళుక్యవంశాజత-జల్గగంబుల్
చెలంగి యర్థంబునఁ-జెంది రీతిన్

గ్రాలంగఁ దాయత్త జ-గాని యుక్తిన్
మేలయ్యె వారాంగి స-మీహితాఖ్యన్.

—కా. చూ. 8-14.

ii. వారాంగి వారాంగ వి-భాసితంబౌ
సరప్రసూనస్మృతి-జాతయట్లా
ధారస్వక కావ్యవి-ధానరక్తిన్
ప్రేరెంచుం బల్లవ-భృంగప్రసీతిన్.

—ఛం. హం. (మ. మ.) 11.

## పరస్థాన విషమవృత్తములు

వేరు వేరు ఛందములందు నిష్పన్నములైన వృత్తములకు చెందిన పాదముల సమ్మేళనమువలన విషమత్వము కలుగునట్లుగా రచింపబడిన పద్యము 'పరస్థాన విషమవృత్త' మగును. స్వస్థాన విషమవృత్తములందు విషమత్వ మెట్లు కలుగునో పరస్థాన విషమవృత్తములందును విషమత్వ మట్లే కలుగును. (స్వ. వి. వృ.) స్వస్థాన విషమవృత్తములందు ఏకచ్ఛందోజాతవృత్తపాద సమ్మేళనమున విషమత్వమేర్పడగా, పరస్థాన విషమవృత్తములందు భిన్నచ్ఛందోజాత వృత్తపాద సమ్మేళనమున విషమత్వ మేర్పడును. ఈ రెంటియం దింతే భేదము.

స్వ. వి వృత్తములందు పూర్వోత్తరార్ధ పద్ధతిలో కలుగు విషమత్వమునకు ప. వి. వృత్తములందు లక్ష్యములు కానరావు. కాని అవిధమైన విషమత్వముకూడ ప. వి. వృత్తములందు ప్రయోగించుటకు నిషేధము కనుపించదు.

పరస్థాన విషమవృత్తములందు రెండు భిన్నచ్ఛందములకు చెందిన వృత్తపాదసమ్మేళనము మాత్రమే లాక్షణికుల లక్ష్యములందు కన్పించును. కాని, మూడు భిన్నచ్ఛందముల వృత్తపాదసమ్మేళనము ఉండవచ్చును. నాల్గు భిన్నచ్ఛందముల వృత్తపాదసమ్మేళనము మాత్రము ఉండరాదు. ఉన్నచో సర్వపరస్థానవిషమవృత్తమగును. (చూ. స. ప. వి. వృ.)

లాక్షణికులు చెప్పిన ప. వి. వృత్తములు :

1. రథగమనమనోహర 2. శరభక్రీడ 3. శ్రీరమణ.

## రథగమన మనోహర

'రథగమన మనోహర' మనునది యొకానొక పరస్థాన విషమవృత్తము (చూ. ప. వి. వృ.) ఈ పద్యమం దాయాపాదములందుండవలసిన గణక్రమమిది

1, 3, 4 వ పాద : న-న-ర-జ-గగ

2 వ పాద : స-జ-జ-ర-య

(రెండవ పాదమున పదవ యక్షరము, మిగిలిన పాదములందు తొమ్మిదవ యక్షరము యతి చెల్లును. (ఈ యీ గణక్రమములతో లాక్షణికులు వృత్తములు చెప్పినట్లు కానరాదు. కాగా ఇవి క్రొత్తవి.)

చి. పెద్దన, అప్పకవులు పైనచెప్పిన రెండవ పాదమందలి గణక్రమమునకు భిన్న గణక్రమము నిట్లు చెప్పినారు.

2 వ పాద : న-జ-జ-ర-య.

(ఈ గణక్రమమున పాదాది సగణము నగణముగా మారినది.) యతి చెల్లింపు విషయమున భేదములేదు. రెండు పద్ధతుల కుదాహరణములు :

i. రథగమన మనోహ - రంబు రెండ వాంఘ్రిన్
ప్రథితం బగున్స జజంబు - ర ప్రయుక్తయంబున్
ప్రథమ పదము నందుఁ - బై సగంబు నందున్
గథిత నసర జంబుబు - గద్వయం బుఁగృష్ణా.

—అనం. ఛంద. 2-126.

ii. రథగమన మనోహ - ర క్రుతిన్ రథాంగ
ప్రథితమనఃపరిస్పృష్ట - రక్తి నాత్మదీక్షన్
కథితలలితవృత్త - కాండయుక్త విద్యా
గ్రథితవిమలవృత్తి - గాథలంద నొప్పున్.

—ఛం. హం. (మ. మ.) 22.

## శరభక్రీడ

'శరభక్రీడ' యనునది యొకానొక పరస్థాన విషమ వృత్తము. (చూ. ప. వి. వృ.). ఈ పద్యమం దాయాపాదముల నుండవలసిన గణక్రమమిది :

1, 2, 4 వ పాద : య-మ-న-స-ర-గ

3 వ పాద : మ-భ-న-య-య

(మూడవ పాదము క్రొత్త వృత్తమునకు చెందినది. ఈ గణక్రమముతో లాక్షణికులు వృత్తము చెప్పినట్లు కానరాదు. మిగిలిన పాదములు 'చంద్రశ్రీ' వృత్తమునకు చెందినవి.). మూడవ పాదమున తొమ్మిదవ యక్షరము, మిగిలిన పాదములందు పన్నెండవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమ మున్నది.

పై లక్షణములలో మూడవ పాదపు గణక్రమమునకు భిన్నముగా చి. పెద్దన, అప్పకవి ఈ క్రింది గణక్రమమును చెప్పినారు.

3 వ పాద : మ-భ-స-య-స-మ.

యతి చెల్లింపులో భేదము లేదు.

రెండు పద్ధతులకు ఉదాహరణములు :

i. చతుర్వర్ణాధారా యమనసరగ - స్వాప్తినాద్య
ద్వితీయాం త్యాంఘ్రి ప్రస్తుతగతి న - తి స్పష్టమైనన్
ఖ్యాతాస క్తిన్ మభ నయ - య తృతీయాంఘ్రినొప్పన్
బ్రతిప్రే మోత్పత్తిన్ బరగి శర - భ క్రీడ యయ్యెన్.

—కా. చూ. 8-18.

ii. వనాంతర్వ్యాప్తంబౌ వటము శర - భక్రీడ నత్యం
త నష్టప్రాప్తాత్మీయ వికృతి న - దంత్రాత్మఘోషా
ర్త నిందావాలంబై సతతము స్థి - తప్రజ్ఞనాత్మన్
స్వనిష్ఠాతోన్మేషంబున వెలయు - జన్మప్రబుద్ధిన్.

—ఛం. హం. అ. (మ. మ.) 20.

**శ్రీరమణ**

'శ్రీరమణ' మనునది యొకానొక పరస్థాన విషమవృత్తము. (చూ. ప. వి. వృ.) ఈ పద్యమందాయా పాదములయందుండవలసిన గణక్రమమిది :

1వ పాద : భ-మ-స-గ

2, 3, 4వ పాద : భ-భ-భ-గగ.

(వీటిలో మొదటి పాదము 'రుగ్మవతి' వృత్తమునకు చెందినది. మిగిలిన పాదముల గణక్రమములతో లాక్షణికులు వృత్తములను చెప్పినట్లు కానరాదు. కాగా ఇవి క్రొత్తపద్యములు.) మొదటిపాదమున ఆరవ అక్షరము, మిగిలిన పాదములందు ఏడవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

ఇంతతనుస్సా-హిత్యముగల్గన్
శాంతము సత్యము-సాగుట యున్నె

ఇంతతలంచిన-నేనును గానే
యింతుల కౌనె యొ-కింతయుఁజూడన్.

—రామా. కల్ప. అరణ్య. జటాయు. 234.

## సర్వపరస్థాన విషమవృత్తములు

భిన్నములైన నాలుగు ఛందములకు చెందిన నాలుగు వృత్తముల పాదముల సమ్మేళనముగా రచింపబడిన వృత్తము 'సర్వపరస్థాన విషమవృత్త మ'గును. నాలుగు పాదములు నాల్గు భిన్నచ్ఛందములకు చెందినవగుటచే, విష మత్వము సమ్మేళనమునుండుటచే నీ వృత్తము 'సర్వపరస్థాన విషమ'మైనది. ఈ ఛందములయందు ఒకటి, రెండు, మూడక్షరములకన్న ఎక్కువగా భిన్న త్వము కానరాదు.

లాక్షణికులు చెప్పిన స. ప. వి. వృత్తములివి.

1. ఉద్గత
2. ఉద్ధత
3. మధుర
4. మణిదీపిక
5. వీణారచన

## ఉద్గత

'ఉద్గత' మనునది యొకానొక సర్వపరస్థాన విషమవృత్తము. (చూ. స. ప. వి. వృ.). ఈ పద్యమం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1 వ పాద : స-జ-జ
2 వ పాద : న-స-జ-గ
3 వ పాద : భ-గ-జ-లగ
4 వ పాద : స-జ-స-జ-గ

వీటిలో చివరిపాదము 'మంజుభాషిణి' వృత్తమునకు చెందగా, మిగిలినవి లాక్షణి కులు చెప్పని కొత్త వృత్తములు. పేర్లు చెప్పబడలేదు. పై నాల్గు పాదములు వరుసగా 9 వ, 10 వ, 11 వ, 13 వ ఛందములకు చెందిన వృత్తములవి.). ఈ పాదములందు వరుసగా ఆరవ, ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ అక్షరములు యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

జగతిన్ సజ - జ్ల గణంబు
నగణ సజగ - ల్నవీనధీ
నాగభ నజవ గ - ణంబులతో
నొగి మంజుభాషిణిగ - నుద్గతంబగున్.

—ల. సా. సం. 2-44.

**ఉద్ధత**

'ఉద్ధత' మనునది యొకానొక సర్వపరస్థాన విషమవృత్తము (చూ. స. ప. వి. వృ.). ఈ పద్యమందాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1 వ పాద : స-జ-య

2 వ పాద : న-స-జ-గ

3 వ పాద : భ-న-జ-గ

4 వ పాద : స-జ-స-స

పై వాటిలో నాల్గును లాక్షణికులు చెప్పని కొత్త వృత్తములకు చెందిన పాదములు. ఒకటవ పాదము తొమ్మిదవ ఛందమునకు, రెండవ-మూడవ పాదములు పదవ ఛందమునకు, నాల్గవ పాదము పన్నెండవ ఛందమునకు చెందినవి. నిజమునకు మూడవ పాదము పదునొకండవ ఛందమునకు చెందినది కావలెను. రెండవ, మూడవ పాదము లేక చ్ఛందమునకు చెందియుండుటచే 'సర్వపరస్థాన'త్వము తప్పినది. పై వృత్తమును అప్పకవి చెప్పినాడు.). వరుసగా నాల్గు పాదములందు వరుసగా ఆరవ, ఏడవ, ఎనిమిదవ, తొమ్మిదవ యక్షరములు యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

కృతి నుద్ధతా - కృతిశబ్దా

ర్ధతర తమభే - ద మాత్మయం

దేతున ఓపిక న - నిచ్చయా

నతిలోకసుందరి నో - యారి నికన్.

—ఛం. హం. (మ. మ.) 24.

**మధుర**

'మధుర' మనునది యొకానొక సర్వపరస్థాన విషమవృత్తము. (చూ. స. ప. వి. వృ.) ఈ పద్యమం దాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1వ పాద : న-జ-జ-ర-గ

2వ పాద : న-న-ర-స-లగ

3వ పాద : న-న-మ-య-య

4వ పాద : న-స-జ-జ-జ-గ.

(వీటిలో మొదటి పాదములు మూడు వరుసగా ప్రభాత, అపరాజిత, మాలినీ వృత్తములకు చెందగా నాల్గవది కల్పితము. లాక్షణికులు చెప్పని కొత్తవృత్తమునకు చెందినది. ఈ పాదములు వరుసగా 13, 14, 15, 16 వ ఛందములకు చెంది

నవి.) ఈ పాదములందు వరుసగా 8వ, 9వ, 9వ, 10వ అక్షరములు యతిచెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

మృదుమధురో_క్తుల-మేళవించి యాత్మా
త్తదృఢ నిరతి నిత్య-ధర్మపరిష్టిచే
నెదవెలుఁగునఁ బ్రత్యే-కేష్టినూనంగ భక్తి
ప్రదన వనసూక్తిమాల-రచింతు రసోత్కమై.

—ఛం. హం. (మ. మ.) 25.

**మణిదీపిక**

'మణిదీపిక' యనునది యొకానొక సర్వపరస్థాన విషమవృత్తము. (చూ. స. ప. వి. వృ.) ఈ పద్యమందాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1వ పాద : న-భ-న-భ-న-భ-స
2వ పాద : న-న-న-స-జ-భ-స
3వ పాద : న-భ-ర-స-న-స-న-స
4వ పాద : న-భ-ర-స-జ-జ-గ

(వీటిలో నాల్గవపాదము 'తరళ' వృత్తమునకు చెందగా మిగిలినవి లాక్షణికులు చెప్పని కొత్త వృత్తములకు చెందినవి.) ఈ పాదములందు వరుసగా 10-16, 14, 12, 12వ అక్షరములు యతి చెల్లును. (మొదటి పాదమున రెండుయతులు). ప్రాసనియమమున్నది. ఈ లక్షణము చి. పెద్దన చెప్పినది. ఈరీతిలో మొదటి రెండుపాదములు కూడా 21వ ఛందమునకు (మూడవ పాదము 24వ ఛందమునకు, నాల్గవపాదము 19వ ఛందమునకును) చెందినవి. రెండుపాదము లొకే ఛందమునకు చెందుటచే 'సర్వపరస్థాన'త్వము తప్పుచున్నది. అందువలననే అప్పకవి మొదటి పాదపు గణక్రమము మార్చినాడు. అతనిదృష్ట్యా మొదటి పాదపు గణక్రమమిది :

1వ పాద : న-భ-భ-న-భ-స.

ఈ పాదము పదునెన్మిదవ ఛందమునకు చెందినది. (13వ యక్షరము యతి చెల్లును.) ఈ మార్పువలన ఈ పద్యపు సర్వపరస్థానత్వము రక్షితమగుచున్నది.

రెండు రీతులకు ఉదాహరణములు :

i. పరగు నాది పదమున భత్రయ సగణ బంధురమయిరా
గరిమ నునన నలును సజభ ల్స-కారమున్ ద్విపదమగున్

బోరిని మూడవయం[ఘ్రిన [భస-ముల్న సయుగముజోడును దగునిడం

దరళ నాల్గవ పాదమొందుచుఁ-దా నగున్మణి దీపికన్.

—ల. సా. సం. 2-46

ii. [తిపుటనంది మహోరజనమణి-దీపికలటు క

ల్వవిడి వెలయ రజని నభినీత-వస్తుత త్త్వమున సుధాం

శు విభవోపనత[ప్రభాసిగ-శోచ్యకలుషమదల్చి యజుఁడురు ర

క్తి విశద[ప్రభఁగూర్చె నుత్పల-దీప్తి భారతి మెచ్చఁగన్.

—ఛం. హం. (మ. మ.) 26.

**వీణారచన**

'వీణారచన' మనునది యొకానొక సర్వపరస్థాన విషమవృత్తము. (చూ. స. ప. వి. వృ.) ఈ పద్యమం దాయా పాదములం దుండవలసిన గణ [క్రమమిది :

1వ పాద : త-య-స-స-గ

2వ పాద : త-స-స-స-గగ

3వ పాద : త-జ-న-భ-జ

4వ పాద : భ-స-న-జ-ర.

ఈ లక్షణమును వి. పెద్దన చెప్పినాడు. వీటిలో 1వ, 2వ పాదములు వరుసగా 13, 14వ ఛందములకు చెందగా, 3, 4వ పాదములు 15వ ఛందమునకు చెందినవి. రెండుపాదములును ఒకే ఛందమునకు చెందుటచే 'సర్వపరస్థానత్వ'ము తప్పినది.

అనంతుడు చెప్పిన లక్షణ మిట్లున్నది

1వ పాద : త-య-స-స-గ

2వ పాద : త-జ-న-భ-గగ

3వ పాద : త-జ-న-భ-స

4వ పాద : త-న-న-భ-స.

కీ లక్షణమందును 3, 4వ పాదములు ఒకే ఛందము (15వ ఛందము) నకు చెందినవి. (1, 2వ పాదములు వరుసగా 13, 14వ ఛందములకు చెందినవి. అందువలన వి. పెద్దన లక్షణమందువలె అనంతుని లక్షణమందును సర్వపరస్థాన త్వము తప్పినది. అందువలననే చి. పెద్దన అనంతుని లక్షణములోని నాల్గవ పాదపు గణ[క్రమము నిట్లు మార్చినాడు.

4వ పాద : భ-న-న-జ-న-గ.

ఈ మార్పుచే నీ పాదము 16వ ఛందమునకు చెంది 'సర్వపరస్థాన'త్వము రక్షిత మగుచున్నది. అప్పకవి చి. పెద్దన ననుసరించినాడు.

వి. పెద్దన లక్షణమున మొదటి రెండు పాదములందు 9వ యక్షరము, 3వ, 4వ పాదములందు వరుసగా 10, 11వ యక్షరములు యతి చెల్లును. అనం తుని లక్షణమున మొదటిపాదమున 9వ అక్షరము, మిగిలినవాటిలో 10వ అక్ష రము యతి చెల్లును. చి. పెద్దన, అప్పకవుల లక్షణమున మొదటి పాదమున 9 వ అక్షరము, 2వ, 3వ పాదములందు 10వ అక్షరము, 4వ పాదమున 11వ అక్ష రము యతి చెల్లును. అందరి మతమున ప్రాసనియమమున్నది.

మూడు రీతులకు ఉదాహరణములు :

i. చాణక్యయజ్ఞాతయ-స్థనగంబుల్
వీణారచనకొందు భు-విందనసావంబుల్
శ్రేణిందజనస్థితభస-సేవితనియతిన్
రాణలనెలవై భసనజ-రంబులొలిగన్.

—కా. చూ. 8-19.

ii. వీణారచనంబయ్యో భు-విన్ దయసాగల్
బాణప్రహారాతజనభ-భవ్యగగంబుల్
చాణూరహారాతజనభ-సల్ప్రికటయతిన్
వేణుధరభననభస-విశ్రుతమగుచున్.

—అనం. ఛం. 2-127.

iii. వీణారచనన్ శారద-వేడ్క దనంతన్
నాణెంబగు జృంభణమున-నాదము నింపన్
రాణించదె దిక్తతి శుభ-రాగ విలసిత
ప్రీణన మెదఁబులకల స-స్పృతును గొలుపన్.

—ఛం. హం. (మ. మ) 23.

## దండకములు

'దండకము'లను ఉద్ధురమాలా వృత్తములలో నొకటిగా లాక్షణికులు చెప్పినారు. (చూ. ఉ. మా. వృ.). వృత్తమునకు నాల్గు పాదము లుండవల

యును. దండకమునుగూడ వృత్తముగానే చెప్పుటవలన ఇంకుగూడ నాల్గు పాదము లుండవలయును. అయితే దండకము ఒక పాదముతోగాని, నాల్గు పాదములతోగాని రచింపవచ్చునని సంస్కృతాంధ్ర లాక్షణికులు చెప్పినారు. కాని తెలుగునందు మాత్రము ఒకే పాదముగల దండకములు మాత్రమే మిక్కిలిగా నున్నవి.

సంస్కృతమునందు చెప్పబడిన దండకములందు మొదట రెండు నగణములు, వెనువెంట రగణములుండును. 2 నగణములు + 7 రగణము లున్నచో 'చండవృష్టి ప్రయాత'మను దండకమగును. 7 మొదలుకొని 14 రగణములవరకు పెరుగవచ్చును. పదునాల్గు రగణములవరకు నుండి దండకములు చండవృష్టిప్రయాత, అర్ణ, అర్ణవ, వ్యాళ, జీమూత, లీలాకర, ఉద్దామ, శంఖ మను పేర్లతో చెప్పబడినవి. (చూ. 'చండవృష్టిప్రయాతము' మొదలగునవి.). పదునాల్గు రగణములకుగూడ మించి యుండవచ్చునని, ఏకైక రగణాభివృద్ధితో సాగు నీ దండకములు ఆరామ, సంగ్రామ, సురామ, వైకుంఠ, సార, కాసార, విసార, సంహార, నీహార, మందార, కేదార, ఆసార, సత్కార, సంస్కార, మాకంద, గోవింద, సానంద, సందోహ, ఆనంద - మొదలగు పేర్లతో పేర్కొనబడునని తర్కవాచస్పతి చెప్పినాడు. (చూ. శ్రీ రావూరివారి 'తెలుగుభాషలో ఛందోరీతులు' పు. 133.). ఏడు రగణములకు మించియున్న దండకము లన్నింటిని 'ప్రచితకము'లని పింగళుడు పేర్కొన్నాడు. పైన చెప్పబడినట్లు కేవలము రగణములతోనేగాక, యగణములతో, తగణములతోగూడ దండకములు రచింపబడవచ్చును.

తెలుగు లాక్షణికులు పై దండకములను కొందరు చెప్పినారు. కేవలము తెలుగునకు చెందినవన్నట్లుగా పేర్లు చెప్పకుండ కొన్నికొన్ని దండక భేదములను వివరించినారు. స్వరూపములనుబట్టి వాటిని ఈ క్రిందివిధముగా పేర్కొనవచ్చును.

| | |
|---|---|
| i. 'ననహత' దండకము | vii. 'రగణ' దండకము |
| ii. 'సనహత' దండకము | viii 'తగణ' దండకము |
| iii. 'ననత' దండకము | ix. 'నగణ' దండకము |
| iv. 'ననయ' దండకము | x. 'సగణ' దండకము |
| v. 'నత' దండకము | xi. 'హగణ' దండకము |
| vi. 'సత' దండకము | xii. 'నసహత' దండకము. |

('ననహత' దండకమనగా ననహగణముల వెనువెంట నిచ్చవచ్చినన్ని తగణము లుండునని భావము. పేరులోని చివరి గణము లిచ్చవచ్చినన్ని యుండును. దాని కన్న ముందివి చెప్పబడినట్లే యుండును. దండకమందలి గణక్రమ సూచకముగా నీ పేర్లు పెట్టబడినవి. మిగిలిన దండకముల రూపములను ఈ సూచనల ద్వారా గమనించవలెను.)

పైన చెప్పబడిన పన్నెండు దండకములలో 4, 9, 10, 11వ భేదములు తప్ప మిగిలినవాటిలో తగణ ప్రాధాన్యమున్నది తగణము గుర్వంతము కాదుగావున ఈ దండకముల చివర (పాదాంతములందు) గురువు నదనముగా చేర్చవలెను.

తెలుగులో మొదటి దండకము భారతమున నన్నయగారు రచించినది. (అరణ్య. 1-324). ఇది తగణ దండకము. (8వ భేదము.). పై పన్నెండు భేదములలో మొదటిది భీమన చెప్పినది. తరువాతి లాక్షణికులు రెండవ భేదమును చెప్పినారు. 5, 6, 7వ భేదములను అప్పకవి చెప్పినాడు. 9, 10, 11వ భేదములు 'సరసాంధ్ర వృత్తరత్నాకర'మందు వెల్లటూరి లింగన చెప్పినవి. ఇన్ని దండకములు చెప్పబడినను 1, 2, 8వ భేదములు, అందును ఎనిమిదవభేదమే మిక్కిలి ప్రచారములో నున్నవి. మిగిలినవాటిలో కొన్నిటికి ప్రచారము తక్కువ. కొన్నిటికి లక్ష్యములు మృగ్యములు.

తెలుగులో ఏకపాద దండకములే యున్నవి. (అయితే పారిజాతాపహరణము (3-39), రాజశేఖర చరిత్రలందు ద్విపాద దండకములు, శృంగార నైషధము (4-138), పాండురంగ మాహాత్మ్యము (4-77) లందు చతుష్పాద దండకములు కన్పించును.). అందువలన తెలుగు దండకములకు పాదవిభజన లేదని సామాన్యముగా చెప్పవచ్చును.

విన్నకోట పెద్దన దండకము 'ననియతపాద'మని, అనంతుడు 'అనియతాక్షర'మని చెప్పినారు. అనియతపాదమనగా-ఇన్ని పాదములుండవలెనన్న నియమము లేదని ఉద్దేశ్యము. ఇక్కడ గమనించవలసిన యంశమేమనగా, దండకమున ఒకటికి మించి పాదములున్నచో అ పాదములన్నియు సమాన గణ సంఖ్యకలవి కావలయును. (ఉద్ధురమాలావృత్తములన్నియు నిట్లే యుండును. దండకమును ఉ. మా. వృత్తముగా లాక్షణికులు చెప్పినారు). కాని, అనేక పాదములున్న దండకములందు ఇట్టి సమత్వము కన్పించదు. ఈవిధముగా తెలుగునందలి దండకములు 'ఉ. మా. వృత్తము' లగుటకు వీలులేదనిపించును. ఇక 'అనియతాక్షర'మనగా-ఇన్ని అక్షరములన్న నియమము లేదని భావము. కాని గణములనుబట్టి అక్షరసంఖ్య నియతమగును. అనేకపాద దండకములందు-ఆ పాదములలోని గణసంఖ్య సమానమైనచో-పాదములన్నియు సమానాక్షర సంఖ్య కలవి యగును. కాని ఇట్టిస్థితి కన్పించదు.

తెలుగులో యతిప్రాసలు-కనీస మేయొకటియైనను లేని పద్యము కానరాదు. మరి దండకమునందు ప్రాసనియమముగాని, యతినియమముగాని లేదు. అనేక పాదములున్నపుడే ప్రాసనియమము కుదురును. అట్లే అక్షర సంఖ్యయో, గణసంఖ్యయో నియతమైనపుడే యతి చెల్లింపు కుదురును ఈ రెండును లేని దండకములం దీ నియమముల కాస్కారము లేదు. పాదబద్ధత కానీ, యతిప్రాసల నియమములుగాని పాటింపబడని దండకములను, ప్రధానముగా తెలుగు దండకములను పద్యములనుగాకాక గణబద్ధమగు వచనములుగా

భావించుట సమంజసమగును. గణసంబంధము వీటికుండుటచే ఛందశ్శాస్త్రమున వీటి ప్రసక్తి.

## చండవృష్టిప్రయాత

'చండవృష్టిప్రయాత' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు) మొదట రెండు నగణములు తరువాత వరుసగా నారు రగణములున్నచో 'చండవృష్టిప్రయాత' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాసనియమములుగాని లేవు.

ఉదా :

'నగణయుగము-మీదటం దేడురేఫల్ దగన్ జండవృష్టాఖ్యతో దండకంబౌ వారి'.

—ల. సా. సం. 2-62.

## అర్ణ

'అర్ణ' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు). మొదట రెండు నగణములు, తరువాత నెనిమిది రగణములున్నచో 'అర్ణ' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు.

ఉదా :

'నయుగముపయి - రాష్టకంబైనచో నర్ణమన్ దండకం బొప్పునో యంజనాకంజనేత్రాత్మజా.'

—ల. సా. సం. 2-63.

దీనినే కస్తూరి రంగకవి 'అశ్వదండక'మని పేర్కొన్నాడు.

## అర్ణవ

'అర్ణవ' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.). మొదట రెండు నగణములు, తరువాత తొమ్మిది రగణములున్నచో 'అర్ణవ' దండకమగును. దీనికి పాద నియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు.

ఉదా ;

'మొదట నవల మీఁదటం దొమ్మిదే రేఫలు న్పొంగనా
దండకం బర్ణవం బండ్రు శ్రీరామ భక్తాగ్రణీ !

—ల. సా. సం. 2-64.

దీనినే క. రంగకవి 'అర్ణవ' దండకమని పేర్కొన్నట్లున్నది.

**వ్యాళ**

'వ్యాళ' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.). మొదట రెండు నగణములు, తరువాత పది రగణములున్నచో 'వ్యాళ' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములు గాని లేవు.

ఉదా :

'ఋతులఘువులు-పైని రేఫల్పది న్నిల్వగా వ్యాళనా
మంబుతోఁ దండకం బౌనయా జంబుమాలిద్రుధూమధ్వజా'.

—ల. సా. సం. 2-65.

**జీమూత**

'జీమూత' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట రెండు నగణములు, తరువాత పదునొకండు రగణము లున్నచో 'జీమూత' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాసల నియమములుగాని లేవు.

ఉదా :

'గుహముఖలఘు - వ్రులము ్రేఫలీరై దుజీమూతమన్దండకంబయ్యెనో నక్రచక్రస్తనీశాపజీమూతఝుంఝూనిలా'.

—ల. సా. సం. 2-66.

**లీలాకర**

'లీలాకర' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట రెండు నగణములు, తరువాత పన్నెండు రగణము లున్నచో 'లీలాకర' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు.

ఉదా :

'రసలఘువుల-మీఁదఁబండ్రెండు రేఫల్దలిర్పంగ లీలాకరం బన్నయా దండకంబుద్దగుద్దారుణింగంపనాంభోధికుంభీసుతా'.

—ల. సా. సం. 2-67.

**ఉద్దామ**

'ఉద్దామ' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట రెండు నగణములు, తరువాత పదమూడు రగణము లున్నచో 'ఉద్దామ' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతి ప్రాస నియమములుగాని లేవు.

ఉదా :

'నయుగళమును-రేఫయు[క్రమంబొప్ప]నేఫలీరాలు నుద్దామ దండకంబౌను బౌ ల_స్త్యకాసూహతాజిస్థలీలక్ష్మణప్రాణసంరక్షణోద్యద్యశా.'

—ల. సా. సం. 2-68,

## శంఖ

'శంఖ' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట రెండు నగణములు, తరువాత పదునాల్గు రగణము లున్నచో 'శంఖ' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు.

ఉదా :

'నయుగళిపయి - నెన్నఁబధ్నాల్గు రేఫల్ క్రమంబొప్పఁగా నుండిన న్శంఖమన్ దండకం బెందు నందంబగున్ శంఖహస్తాంఘ్రినీరేజభృంగాయ మానాఘనా'.

—ల. సా. సం. 2-69.

## ననహతదండకము

'ననహత' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.). మొదట న-న-హాఁగల గణములుండి, వెనువెంట నిచ్చవచ్చి నన్ని తగణములుండి చివర నొక గురువున్నచో 'ననహత దండక' మగును. దండకమందలి గణసూచనగా నీ పేరు కూర్చబడినది. ఈ దండకమునకు పాద నియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు.

ఉదా :

'అమరగననహంబు లందాదిగానొందె...చూడామణీ త్యాగ
వైరోచనా'

—క. జ. వృత్తా. 131.

## సనహత దండకము

'సనహత' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు ). మొదట స-న-హాఁగల గణములుండి వెనువెంట నిచ్చవచ్చి నన్ని తగణములుండి, చివరనొక గురువు చేరినచో 'సనహత దండక' మగును. పాద నియమముగాని, యతిప్రాస నియమములుగాని దీనికిలేవు. దండకమందలి గణసూచకముగా నీపేరు కూర్చబడినది.

ఉదా :

'కృతినాదినసహంబు-లొండొండెబ్ర కల్పించి యామీఁద నెల్లం దకార ప్రధానంబు గుర్వంతమైక్రాల...విశ్వంభరాధీశ్వరా!'

—కా. చూ. 8.

ససహత - సనహత దండకములకు దండకాదిగణమే భిన్నము.

## ననతదండకము

'ననత' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట రెండు నగణములుండి, వెనువెంట నిచ్చవచ్చినన్ని తగణములుండి చివర గురువు చేరినచో 'ననత' దండకమగును. పాదనియమము గాని, యతిప్రాసల నియమముగాని దీనికిలేవు. దండకమందలి గణసూచకముగా నీ పేరు కూర్చబడినది.

ఉదా :

'జయ గిరిశ సు - రేశముఖ్యామరస్తోమమౌళిస్థితస్నిగ్ధచామీకరోదగ్ర రత్నప్రయుక్తావతంస ప్రభాసంచయాంచత్పదాంభోరుహా—...పాపౌఘనాశా నమస్తే నమస్తే నమః'.

—రా. శే. వి. 3-194.

## ననయదండకము

'ననయ' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.). మొదట రెండు నగణములుండి, వెనువెంట నిచ్చవచ్చినన్ని యగణము లున్నచో 'ననయ' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతి ప్రాస నియమములుగాని లేవు. దండకమందలి గణసూచకముగా నీ పేరు కూర్చబడినది.

ఉదా :

'జయజయ హరిగజేంద్రాది సద్భక్తరక్షైక దీక్షాభవాంభోధి నిర్మగ్న జీవాళికిన్నీవకాకెవ్వరుద్ధారకుల్లేవదేవా నమస్తే నమస్తే నమస్తే.'

—కల్పితము.

## నతదండకము

'నత' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట నొక్క నగణముండి, వెనువెంట నిచ్చవచ్చినన్ని తగణములుండి, చివర నొక గురువు చేరగా 'నత'దండకమగును. దీనికి పాద నియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచ కముగా నీ పేరు కూర్చబడినది.) నత, సత, హత దండకములకు దండకాది యందుండు గణమే భేదించును.

ఉదా :

'జలధికన్యాకుచాలిప్త కస్తూరిరేఖాసమాలంకృతోరస్క రక్షింపవే దీను నిన్నన్నుదేవేశ మత్ప్రాణకోశా నమస్తే నమః'.

—కల్పితము.

## సతదండకము

'సత' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.). మొదట నొక్క సగణముండి, వెనువెంట నిచ్చవచ్చినన్ని తగణములుండి, చివర నొక గురువు చేరినచో 'సత' దండక మగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణ సూచకముగా నీ పేరు కూర్చబడినది.) నత, సత, హత దండకములకు దండ కాది గణము మాత్రమే భేదించును.

ఉదా :

'గిరిశా కైలాసవాసా ధరాకన్యకాముగ్ధనేత్రాబ్జరాగాంశుమాలీ ననుం జేడుకోవే భవత్పాదసాన్నిధ్య మీయగదే దేవదేవా నమస్తే నమస్తే నమస్తేనమః'

—కల్పితము.

## రగణ దండకము

'రగణదండక' మనునది యొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.). దండకమంతయు నాద్యంతము రగణము లిచ్చవచ్చినన్ని యున్నచో రగణదండక మగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియ మములుగాని లేవు. (దండకమందలి గణసూచకముగా నీపేరు కూర్చబడినది.)

ఉదా :

'దేవదేవేశ నీపాద భక్తుండ మన్నింపవే దీను దుగ్ధాబ్ధి
శాయీ నమస్తే నమస్తే నమః'

—కల్పితము.

## తగణదండకము

'తగణదండక' మొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండ కములు.). దండకమంతయు నాద్యంతము, ఇచ్చవచ్చినన్ని తగణములుండి చివరనొక గురువున్నచో తగణదండక మగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచకము నీ పేరు కూర్చబడినది.

ఉదా :

'శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థాన సంహారకారీ పురారీ మురారీ ప్రియా చంద్రధారీ...నమస్తే నమస్తే నమః'

—భార. అరణ్యా. 1-324.

### నగణదండకము

'నగణదండక' మొకానొక దండకభేదము (వివరములకు చూ. దండకములు.). దండకమంతయు నాద్యంతము ఇచ్ఛవచ్చినన్ని నగణములతో నుండి, చివర నొక గురువు చేరినచో 'నగణదండక' మగును దీనికి పాద నియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచకముగా నీపేరు కూర్చబడినది.).

ఉదా :

'మధుమథన నను దయగనవె జలధిశయన హరిహరీ'

—కల్పితము.

### సగణదండకము

'సగణదండక' మొకానొక దండకభేదము. (వివరములకు చూ. దండకములు.). దండకమందాద్యంతము ఇచ్ఛవచ్చినన్ని సగణములుండి, చివర నొక గురువు చేరినచో 'సగణదండక' మగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచకముగా నీ పేరు కూర్చబడినది.)

'ధరణీతనయా వదనాంబుజ భాస్కరనన్ దయజూడగదే రఘువీరా'

—కల్పితము.

### హగణదండకము

'హగణ దండక' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.). దండకమం దాద్యంతము ఇచ్ఛవచ్చినన్ని హ (గల) గణములుండి, చివర నొక గురువు చేరినచో 'హగణదండక' మగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచకముగా నీ పేరు కూర్చబడినది.)

ఉదా :

'దేవదేవ నన్ను బ్రోవరావె దుగ్ధవార్ధికన్యకాముఖాంబుజాత సూర్య నిన్నెగొల్తు నెల్లవేళలం బ్రభూ నమః'.

—కల్పితము.

### ననహతదండకము

'ననహత' మనునది యొకానొక దండక భేదము. (వివరములకు చూ. దండకములు.) మొదట ననహగణములుండి, వెనువెంట నిచ్ఛవచ్చినన్ని తగణములుండి, చివర నొక గురువు చేరినచో 'ననహత' దండకమగును. దీనికి పాదనియమముగాని, యతిప్రాస నియమములుగాని లేవు. (దండకమందలి గణసూచకముగా నీ పేరు కూర్చబడినది.)

ఉదా :

'అరిది బిరుదా నీవు-రాయంచ తేజీవ జీరుండవై ............'

—అచ్చ. రామా. యుద్ధ. 161.

## 4

# జాత్యుపజాతులు

**జాతులు**

అక్షరములచే లేదా అక్షరగణములచేకాక, మాత్రాగణములచే నిబద్ధములగు పాదములతో నేర్పడు పద్యములు 'జాతు' లనబడును. భారతదేశమందలి సంస్కృతేతరములయిన దేశీయ భాషలలో రూపొందిన పద్యములన్నియు మాత్రాగణబద్ధపాదములతోడివే. ఈవిధముగా రూపొందిన పద్యములలో కొన్ని స్వీకృతములై సంస్కృతచ్ఛందమందు 'జాతు'లను నొక వర్గముగా రూపొందినవి ఆవిధముగా సంస్కృతీకరింపబడినవికాక తెలుగునందు రూపొందిన మాత్రాగణబద్ధ పద్యములు తెలుగున 'జాతులు'గా చెప్పబడినవి.

మాత్రాగణబద్ధత యనునది తెలుగు, సంస్కృత 'జాతి' పద్యసామాన్యలక్షణము కాగా, తెలుగున 'జాతు'లకు యతిప్రాసల చెల్లింపునకు సంబంధించిన ప్రత్యేక లక్షణమున్నది.

జాతిపద్యములందు వృత్తములందువలె, (ఆది) ప్రాసనియమముండును. మరియు యతి చెల్లింపవలసినచోట ప్రాసయతి చెల్లింపకూడదు. ఇదియు వృత్తములకు తెలుగుకవులు నిర్ణయించిన లక్షణమే. కాగా గణప్రయోగము దృష్ట్యా దేశీయములై, యతిప్రాసల చెల్లింపుల దృష్ట్యా 'వృత్త' లక్షణము కలవి తెలుగులోని జాతులు.

సంస్కృతచ్ఛందమందలి 'జాతి' పద్యములగు 'ఆర్యాభేదము'లకు తెలుగు లాక్షణికులు తమ గ్రంథములందు లక్ష్యలక్షణములు ప్రదర్శించినారు. (గీతి, ఉద్గీత్యాదులు ఆర్యాభేదములందే చేరినవి. చూ. ఆర్యాభేదములు.). ఆర్యాభేదములందున్న 'ఆర్యాగీతి'కి, తెలుగు 'కందము'నకున్న సాన్నిహిత్యమును పురస్కరించుకొని తెలుగు లాక్షణికులు ఆర్యాభేదములను చెప్పియుందురు. (చూ. ఆర్యాగీతి; కందము.) ఆర్యాభేదములతోబాటు 'వైతాళీయ'ములకు గూడ తెలుగు లాక్షణికులు లక్ష్యలక్షణములు ప్రదర్శించినారు. రగడలకు వైతాళీయములకు కొంత సామ్యము కన్పించును. (చూ. రగడలు: వైతాళీయములు.)

తెలుగులోని 'జాతి' పద్యములివి :

1. కందము
2. ఎత్తుగీతి
3. ప్రగీతి
4. మేలనగీతి
5. ద్విపద
6. త్రిపద
7. చౌపదలు
8. పంచపద
9. షట్పదులు
10. సప్తపద
11. తరువోజ
12. ఉత్సాహము
13. అక్కరలు
14. రగడలు.

సంస్కృత 'జాతి' పద్యములు

1. ఆర్యాభేదములు
2. వైతాళీయములు.

## కందము

కందపద్యమునకు పలునియమములున్నవి.

i. గగ-భ-జ-స-నల-అను అయిదు గణములే కందమున నుపయోగింపదగినవి.

ii. మొదటిపాదమున మూడు, రెండవపాదమున అయిదు గణములు మొత్తము పూర్వార్ధమున ఎనిమిది గణములుండును.

iii. ఈ ఎనిమిదింటిలో బేసిగణము జగణము కారాదు. (అనగా మొదటిపాదమున 1, 3వ గణములు, రెండవపాదమున రెండవ, నాల్గవ గణములు జగణము కారాదు.)

iv. ఎనిమిదింటిలో ఆరవ గణము (రెండవ పాదమున మూడవ గణము) నలమైనను, లేదా జగణమైనను తప్పక కావలయును.

v. రెండవ పాదము గుర్వంతము కావలెను. (అనగా పాదాంత గణము గగమో, సగణమో కావలెను.)

vi. చిన్నపాదములో యతినియమ ముండదు. పెద్దపాదములో చతుర్థ గణాద్యక్షరమున యతి చెల్లును.

vii. ప్రాసనియమమున్నది.

viii. పూర్వార్ధమువలెనే ఉత్తరార్ధముగూడ నుండును.

ఉదా :

క. శ్రీవనితావల్లభవేం
  గీ విషయాధీశకావ్య-గీతప్రియ నా

నావనినాథకిరీటత
టీవిలసద్రత్నసంఘ-టితపదకమలా.

భార ఆది. 2-1.

కందము అచ్చముగా ఆర్యాగీతియే. చూ. ఆర్యాగీతి.

**విషమగీతులు**

తెలుగులోని గీతులను లాక్షణికులు విభజించిన ప్రకారము ఈక్రిందివి విషమగీతులు.

1. ఎత్తుగీతి
2. ప్రగీతి
3. మేలనగీతి.

వీటిని విషమములనుటకు కారణము స్పష్టముకాదు. పాదములన్నియు సమలక్షణముతోనే యివి యున్నవి. కాని ఈ గీతుల కధికప్రచారము లేదు. తేటగీతి, ఆటవెలది-ఈ రెండు విశేషప్రచారము కలవి, వీటిని సమగీతులన్నారు. ప్రచారాపేక్షబట్టి ఇట్లు విభజించియుందురనిపించును. (చూ. సమగీతులు.)

**ఎత్తుగీతి**

విషమగీతులని లాక్షణికులు చెప్పిన మూడింటిలో 'ఎత్తుగీతి' మొదటిది. (చూ. గీతులు.). ఈ పద్యమునకు భీమన, వి. పెద్దనలు ఒకవిధముగా అనంతాదు లింకొకవిధముగా లక్ష్యలక్షణములను ప్రదర్శించినారు. ప్రస్తుతము లభ్యమగు కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణులయందు భీమన, వి. పెద్దనలు చెప్పిన లక్ష్యలక్షణములు స్పష్టముగా సమన్వితములుగాలేవు. వాటిని సమన్వయించుకొని పరిష్కరించుకొన్నచో వారు చెప్పిన ఎత్తుగీతి లక్షణమిట్లుండును.

ఎత్తుగీతికి ప్రతిపాదమున మూడు సూర్యగణములుండును. యతి నియమము లేదు. ప్రాసనియమమున్నది.

అనంతాదుల ప్రకారము ఎత్తుగీతియందు మూడు సూర్యగణములకు బదులు ఒక ఇంద్రగణము+రెండు సూర్యగణములు వరుసగా నుండును. ప్రాస నియమమున్నది. మూడవ గణాద్యక్షరము యతి చెల్లును.

తెలుగులో యతిలేని పద్యముండగూడదన్న ఆస్థయే ఇంత చిన్న పద్యమందును అనంతాదులు యతి నిర్దేశించుటకు కారణమనిపించును.

ఉదా :

i. శ్రీదయాధిపా, న
యోదయనలినత్ర

యోదితమయి యెత్తు
గీది యొప్పుఁగృతుల.

—క. జ. జాతి. 20.

(ఇది కవిజనాశ్రయమందలి ముద్రితలక్ష్యము. లక్షణానురోధముగా వి. పెద్దన యుద్దేశ్యముదృష్ట్యా పరిష్కరించి రూపొందించిన పాఠము.)

ii. ఆదిప్రాసంబు హరియు
నాదిత్యయుగము నగుచు
నీదెస యతుల నెత్తు
గీదియ నెగడుఁ గృష్ణ.

—అనం. ఛం. 3-16.

ప్రగీతి

విషమగీతులని లాక్షణికులు చెప్పిన మూడింటిలో 'ప్రగీతి' రెండవది.

'ఆటవెలది' యను సమగీతమునకు (ఆది) ప్రాసనియమము పాటింపబడినచో నీ 'ప్రగీతి' యనబడును. (ఆటవెలదికి ప్రాసనియమము లేదు. లక్షణమునకు చూ. ఆటవెలది.)

ఉదా :

'మూండు నేసినగణములు రెండునలములు
మూండునగణములును మొగినహంబు
పొందిగాఁగ నర్థమునకగు మీఁది నిం
డ్లుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి'.

—క. జ. జాతి. 21.

(మూండు, పొండి వంటి దీర్ఘముమీద పూర్ణబిందువులున్న పదములు నన్నెచోడుని 'కుమారసంభవము' నందును కన్పించును. నగణము, నలము అనునవి అనంతాదుల మతములోని సూర్య-ఇంద్రగణములకు వరుసగా సూచకములు. చూ. సూర్యగణములు; ఇంద్రగణములు.)

ఈ 'ప్రగీతి'నే అనంతాదులు 'పవడగీతి' యన్నారు.

ఆటవెలదికి ప్రాసనియమము పాటించినచో 'ప్రగీతి' యైనట్లు, తేటగీతి యను సమగీతమునకు పాటించినచో మరొక (విషమ) గీతి కావలయును. కాని లాక్షణికు లెవరు నిట్టిది చెప్పలేదు. కాని తేటగీతికి ప్రాసనియమము పాటించినచో 'అంతరాక్కర' కావచ్చును. (చూ. తేటగీతి; అంతరాక్కర.)

పవడగీతి

చూ. ప్రగీతి.

**మేలనగీతి**

విషమగీతులని లాక్షణికులు చెప్పిన మూడింటిలో 'మేలనగీతి' మూడవది.

మేలనగీతికి ప్రతిపాదమున నేడు సూర్యగణములుమాత్రముండును. పంచమగణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

'జనకునింట దశరథేశు-సౌమ్యభావమెంచి
తనర జనకు సౌమ్యతఁగని-దశరథేశునింట
మనసునందు నొకరు నొకరి-మార్దవంబె చూచి
యనఘ ముదితులైరి యిద్ద-రైన పెండ్లివారు.

—రామా. కల్ప. బాల. ధనుస్సు. 871.

ఈ మేలనగీతికే 'కమలనగీతి' యని మరొకపేరు.

మేలనగీతికి పాదాంతములందు ఒక గురువు చేరినచో 'ఉత్సాహ' మగును. (చూ. ఉత్సాహము.)

**కమలనగీతి**

చూ. మేలనగీతి.

**ద్విపద**

'ద్విపద' జాతివర్గమునకు చెందిన పద్యము. (చూ. జాతులు.). ఈ పద్యమునకు నాల్గుపాదములుకాక రెండే పాదములుండును. అయినను దీనికి పద్యమనియే వ్యవహారము. (చూ. పద్యము.). ద్విపదకు ప్రతిపాదమున నుండు గణక్రమమిది :

3 ఇం.+1 సూ.

మొత్తము నాల్గుగణములు. ప్రాసనియమమున్నది. తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. ద్విపద 'జాతి'వర్గమునకు చెందినదిగాన, ఇందు ప్రాసయతి చెల్లించరాదు. మరియు ఏకపదము ఉభయపాదములందు వ్యాపించియుండ గూడదనియు లాక్షణికులుచెప్పినారు. ఏకపదము ఉభయపాదములందు వ్యాపించి యుండరాదనగా-ఒకపదములోని కొంతభాగము ఒకపాదము చివర, మరికొంత భాగము తరువాతి పాదము మొదట నుండగూడదనుట. లాక్షణికు లీ నియమము లను కచ్చితముగా చెప్పినను, కవులుమాత్ర మంత కచ్చితముగా పాటించినట్లు కానరాదు. ద్విపదయందు ప్రాసయతి చెల్లించిన కవులు, ఒకేపదము రెండు పాదములందు వ్యాపించిన తావులు, మరియు నొకేపదము ఒక ద్విపద చివరి పాదమునుండి రెండవ ద్విపద మొదటిపాదమునకు వ్యాపించిన తావులుగూడ ద్విపద కావ్యములందు కనిపించుచునేయున్నవి.

ఉదా :

'బాణపు, త్రికయుషా-బాలిక, యనఁగ

నేణాంక, బింబాస్య-హేమాంగి, కలదు

ఉషాకల్యాణము 1-206 పం.

ప్రాసయతికి ఉదా :

'పరగు వె, న్నెలపర-పరగాయు, కున్న

సరసిజం, బులుమొగి-విరియక, మున్న'

—పండితారాధ్యచరిత్ర. పురాతన. 11, 12 పంక్తులు.

రెండవపాదమున ప్రాసయతి చెల్లినది.

ఒకే పదము ఉభయపాదములందు వ్యాపించుటకు ఉదా :

'బళిరె నా, యేలిక-బాపురే, భూధ-

వుల శిరో, మణితగ-వుల చక్రవర్తి'.

—పరమయోగి విలాసము 4. 6787,8.

ఒకే పదము ఉభయ ద్విపదలందు వ్యాపించుటకు ఉదా :

'కొలనిమేఘముగజా-వళిహయావళియు

వలిపంబు సరిగమ్మి-తెలుపుదివ్యాంబ

రంబును నుదయరా-గంపుదేవాంబ

రంబు పొత్తియుగుజ-రాష్ట్రింబుపట్టు...'

—బసవపురాణము పు. 49.

(ఆంధ్ర గ్రంథమాల 1952 ప్రచురణ.)

పై రెండు ద్విపదలలో ప్రాసయతి, ఏకపద ముభయపాదములందు, ఉభయ ద్విపదలయందు వ్యాపించుటలు గమనించవచ్చును.

ఒకే ఒక పద్యముగా ద్విపదకు ప్రయోగము కానరాదు. మరియు ప్రాచీన సాహిత్యమున చంపూకావ్యములందు 'ద్విపద'కు ప్రయోగము లేదు. కాని ద్విపదభేదముగా చెప్పదగిన తరువోజకు కొంత ప్రయోగమున్నది. ఆద్యంతము ద్విపదయే యున్న 'ద్విపద కావ్యములు' తెలుగులో చాలయున్నవి.

## త్రిపద

'త్రిపద' జాతి వర్గమునకు చెందిన పద్యము. (చూ. జాతులు.). ఈ పద్యమునకు నాల్గుపాదములుకాక మూడుపాదములుండును. అయినను దీనికి పద్యమనియే వ్యవహారము (చూ. పద్యము.). ఈ పద్యపు పాదసంఖ్యనుబట్టియే దీనికి 'త్రిపద' యన్న పేరు కలిగినది.

ఈ పద్యమునకు లాక్షణికులు చెప్పిన లక్షణములు మూడువిధములుగా నున్నవి. భీమన చెప్పిన లక్ష్యలక్షణములు స్పష్టముగా లేవు. వాటిని సమన్వయించి చెప్పినచో త్రిపదకు భీమన లక్షణమిది :

పద్యమునందు మూడు పాదములుండును. ఆ మూడు పాదములందుండవలసిన గణక్రమమిది :

1 వ పాదము : ఇం+ఇం+ఇం+ఇం

2 వ పాదము : ఇం+సూ+ఇం+ఇం

3 వ పాదము : ఇం+సూ+ఇం.

మూడు పాదములకు మొత్తము పదునొకండు గణములు. మొదటి రెండు పాదములలో నాల్గేసి గణములు, మూడవ పాదములో మూడు గణములుండును. ఆరవ, పదవ (ద్వితీయ, తృతీయ పాదములందు రెండవ) గణములు సూర్యగణములు. మిగిలిన తొమ్మిది గణములు ఇంద్రగణములు ప్రాసనియమమున్నది. యతి నియమము లేదు.

వి. పెద్దన చెప్పిన లక్షణముకూడ దాదాపుగా నిట్లేయున్నది. కాని ఒక సూర్యగణము పెరిగి ఒక ఇంద్రగణము తరిగినది. సూర్యగణము లుండవలసిన స్థానములలోకూడ కొంతమార్పు కలిగినది. ఆయా పాదములందుండవలసిన గణసంఖ్య మాత్రము మారదు. త్రిపదకు వి. పెద్దన ప్రకార మాయా పాదములందుండవలసిన గణక్రమమిది :

1 వ పాదము : ఇం+ఇం+ఇం+ఇం

2 వ పాదము : ఇం+ఇం+సూ+సూ

3 వ పాదము : ఇం+ఇం+సూ.

ఏడవ, ఎనిమిదవ, పదునొకండవ గణములు సూర్యగణములు. అనగా భీమన లక్షణములోని ద్వితీయ పాదాంతమందలి ఇంద్రగణము సూర్యగణముగా మారినది. మరియు ఆరవ, ఏడవ గణములు; పదవ, పదునొకండవ గణములు వెనుక ముందులైనవి.

అనంతాదులు చెప్పిన లక్షణములో మొత్తము గణముల సంఖ్య పదునొకండు నుండి పదికి తగ్గినది. వి. పెద్దన చెప్పిన లక్షణములో రెండవ పాదమందలి చివరి సూర్యగణములు తొలగినచో అనంతాదులు చెప్పిన లక్షణమగును. వారి లక్షణమిది :

1 వ పాదము : ఇం+ఇం+ఇం+ఇం

2 వ పాదము : ఇం+ఇం+సూ

3 వ పాదము : ఇం+ఇం+సూ.

భీమన, వి. పెద్దనల ప్రకారము త్రిపదలో ఏ రెండుపాదములు సమానములుగావు. అనంతాదుల ప్రకారము చివరి రెండుపాదములు సమానములు. అయితే

వి. పెద్దన ప్రకారము త్రిపదలోని మొదటి రెండుపాదములు ఒక సీసపాదము లక్షణముతో నున్నవి. (చూ. సీసములు.). అందువలన, సీసపాదమునుండి విభేదింపచేయుటకు అనంతాదులు వి. పెద్దన చెప్పిన లక్షణములోని రెండవ పాదమునుండి ఒక సూర్యగణమును తగ్గించియుందురని తోచును. భీమన లక్ష్య లక్షణములను సమన్వయపరచుకొన్నచో వీరిట్లు తగ్గించునవసరముకలిగియుండదు. త్రిపదకు కన్నడములో ప్రాచుర్యమున్నది. భీమన కన్నడ త్రిపద లక్షణమునే తెలుగున చెప్పినాడుగాని అది స్పష్టముగాలేదు. వి. పెద్దన భీమన చెప్పిన లక్షణమును కన్నడ లక్షణానురూపముగ సమన్వయించుకొనక, లక్ష్యమునుబట్టి ఉజ్జాయింపుగా తాను లక్షణము చెప్పినట్లు కన్పించును. అనంతాదులు భీమనను గాక, వి. పెద్దన ననుసరించినారుకాని, త్రిపద ప్రథమ, ద్వితీయ పాదముల మొత్తమునకు కలుగు 'సీసపద్య'మును తొలగించుటకు చిన్నమార్పు చేసినారు. మరియు భీమన, వి. పెద్దనలకన్న విశేషముగా పెద్ద (మొదటి) పాదమునందు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లునని చెప్పినారు. తెలుగులో ప్రాసనియమము లేని పద్యము లున్నవిగాని యతి నియమములేని పద్యములేదు. ఉన్నచో ఈ త్రిపద మరియు షట్పద అను రెండు పద్యములుమాత్రమే యుండును. అనంతాదులు త్రిపదకు యతి నియమము చెప్పుటలో యతినియమములేని పద్యము ఉండగూడదను భావమే కారణము కావచ్చును. (అయితే షట్పదకే లాక్షణికుడును యతినియమము చెప్పకపోవుటకు కారణము కన్పించదు. (చూ. షట్పదలు.). యతినియమమున్నచో అన్నిపాదముల కుండవలెగాని, పద్యమందలి కొన్ని (ఒక) పాదములకుండి కొన్నిటికి లేకపోవుటలో సామంజస్యములేదు. మూడు గణములు మాత్రమేయున్న చిన్నపాదములుగాన త్రిపదలోని చివరి రెండు పాదములకు యతినియమము చెప్పకపోయియుందురు. కాని పాదమునకు మూడు గణములేయున్న అల్పాక్కర పద్యమునకు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లించవలయునన్న లాక్షణికులు (చూ. అల్పాక్కర) త్రిపద కట్లు చెప్పకపోవుటకు కారణము కన్పించదు. ఇదిట్లుండగా, భీమన లక్ష్యమున మొదటి పాదమందు ప్రాసయతి చెల్లినది. మిగిలిన రెంటిలో నేయతియు చెల్ల లేదు కాని ప్రాసనియమమున్న పద్యమునందు ప్రాసయతి నంగీకరించని లాక్షణికులు, భీమన ఆ పాదమున పొరపాటున ప్రాసయతి చెల్లించినాడనుకొని, దానికి బదులు యతినియమము చెప్పియుందురు. తరువాతి పాదములలో నే యతియు లేదుకాన, ఆ పాదములకు యతినియమము చెప్పకపోయియుందురు. అంతకుమించి మరొక కారణము కన్పించదు.

త్రిపదకు ప్రాచీన సాహిత్యమున ప్రయోగము కానరాదు.

**ఉదా :**

i. భీమన రీతి :

త్రిదశేంద్రు, లాఱగు పదియగు నెడనకున్
గదియఁగ రెండిటను మూఁట సూర్యుల
నడుకుడు త్రిపద కునమరు.

(పరిష్కృతపాఠము)

—క. జ. జాతి. 31.

ii. వి. పెద్దన రీతి :
త్రిపదికి నొకయంఘ్రి నింద్రులు నలువురు
ద్యుపతు లిద్దఱు సూర్యు లిర్వురౌల
ద్యుపతి ద్వయార్కులు నౌల.

—కా. చూ. 8-60

iii. అనంతాదుల రీతి :
మౌనీంద్ర యోగిసం - పన్నరూపితమూర్తి
నానాత్రయీ శిఖావర్తి
దానితాశ్రితజనతార్తి.

—రామా. కల్ప. అరణ్యా. శబరి. 377.

## చౌపద

చౌపద జాతివర్గమునకు చెందిన పద్యము. (చూ. జాతులు.). ఈ పద్యమునకు లాక్షణికులు చెప్పిన లక్షణములు రెండువిధములుగా నున్నవి. భీమన, వి. పెద్దనలు చెప్పిన లక్షణ మిట్లున్నది :

చౌపదకు ప్రతిపాదమున నాల్గు చతుర్మాత్రాగణములుండును. చతుర్మాత్రాగణములనగా నల-భ-స-గగ అను నాల్గుమాత్రమే. జగణము చతుర్మాత్రాకమైనను ఉపయోగింపరాదు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఈ పద్యమునకు నాల్గు పాదము లుండునని పద్యముపేరే చెప్పుచున్నది.

పైన చెప్పబడిన చౌపద లక్షణము అచ్చముగా మధురగతి రగడ లక్షణమే. (చూ. మధురగతిరగడ.). అయితే రగడ రెండుపాదముల పద్యము కాగా 'చౌపద' నాల్గుపాదముల పద్యము. భీమన, వి. పెద్దనలు రగడలను చెప్పలేదు. కన్నడమందలి 'మందానిలరఘట (రగడ'ను చూచి భీమనయు, అతని ననుసరించి వి. పెద్దనయు చౌపదపేర తెలుగులో నీ లక్షణము చెప్పియుందురు.

అయితే అనంతాదులు రగడలను-తద్భేదములను విపులముగా చెప్పినారు అందువలన వారు చౌపదకు పై లక్షణము నంగీకరించక కొంచెము మార్పుచేసి చెప్పినారు. వారిచౌపద లక్షణమిది :

చౌపదకు నాల్గు పాదములుండును. ప్రతిపాదమున వరుసగా మూఁడు జగణేతర చతుర్మాత్రాగణములు+ఒక లగేతర త్రిమాత్రాగణము ఉండును. ప్రాసనియమమున్నది. తృతీయగణాద్యక్షరము యతి చెల్లును.

ఇక్కడ గమనించవలసిన యంశమొకటి యున్నది. భీమన చెప్పిన లక్షణములో ప్రతిపాదమున పదునారు మాత్రలుండగా అనంతాదుల లక్షణమున నొకమాత్ర తగ్గినది. అయితే భీమన చౌపద మధురగతిరగడకు సరిపోగా, అనంతాదుల చౌపద ఒకవిధముగా ద్విపదకు సరిపోవుచున్నది. ద్విపదలో నుపయోగింపవలసిన మూఁడు ఇంద్రగణములు చతుర్మాత్రకములే యైనచో అనంతాదుల చౌపద లక్షణమునకు సరిపోవును. (చూ. ద్విపద.) ఇంద్రగణములలో కొన్ని చతుర్మాత్రాగణములు, కొన్ని పంచమాత్రాగణము లున్నవి. (చూ. ఇంద్ర గణములు.) (కేవలము పంచమాత్రాకములైన ఇంద్రగణములనే ఉపయోగించినచో 'కర్ణాటచతుష్పద' యగును. చూ. కర్ణాట చతుష్పద.). అయితే ద్విపద రెండు పాదముల పద్యముకాగా చౌపద నాల్గుపాదముల పద్యము.

అప్పకవి చౌపదకు చెప్పిన లక్షణము భీమన చెప్పినదానివలె నున్నది. అప్పకవి ప్రకారము చౌపదకు ప్రతిపాదమునందు పదునారు మాత్రలుండును. ఎనిమిది మాత్రల తరువాత యతి చెల్లును. (అనగా తొమ్మిదవ మాత్రయైన అక్షరము యతి చెల్లును.). ప్రాసనియమమున్నది. పాదమునకు పదునారు మాత్ర లనగా, నాలుగు చతుర్మాత్రాగణము లనియే అప్పకవి భావము. ఎనిమిది మాత్రల తరువాత యతి చెల్లుననగా తృతీయగణాద్యక్షరము యతి చెల్లుననియే భావము.

అయితే భీమన, చి. పెద్దనలు రగడలను చెప్పలేదుకాన, వారుచౌపద కట్లు లక్షణము చెప్పియుండురు. కాని రగడలకు లక్షణము చెప్పిన అప్పకవి, అనంతాదులవలె చౌపదకు లక్షణము చెప్పవలసియుండగా, భీమన ననుసరించి చెప్పుటకు కారణము కనిపించదు. అనంతాదుల లక్షణము ద్విపద లక్షణమువలె కన్పించినను, ప్రతి ద్విపదయు చౌపద కాదు. చతుర్మాత్రాగణము లింద్రగణములుగా నున్న ద్విపద, అదియు నాల్గుపాదముల కొకే ప్రాస చెల్లింపబడినప్పుడే అనంతాదుల చౌపద యగునన్నది గమనించవలసిన యంశము.

భీమన మొదలుకొని-ఒక్క అప్పకవి తప్ప-అందరును చౌపద కంత్య ప్రాసము, లక్ష్యములందు ప్రయోగించినారు. చి పెద్దన ఒక్కడే ఈనియమము చెప్పినాడు. ఈ యంత్యప్రాస రగడకు విశిష్టమైన లక్షణము. (చూ. రగడలు.) రగడ ప్రభావము చౌపదపై కలదనుట కీ యంశమే ప్రమాణము. ఈప్రభావము లేదనుటకే కావచ్చు, అప్పకవి అంత్యప్రాసను ప్రయోగింపకుండియుండును.

i. భీమన చౌపదకు ఉదా :

చిన్నది, యొక్కతె-చెందొవ, క్రోవిన్

దిన్నఁగఁ, జిమ్మెను-దేనియ తావిన్

మన్నన, సేయుచు-మారుని, శివిన్
బన్నిన, ఖచరుని-పవడపు, మోవిన్.

—సుద. పరిణ. 3-89.

ii. అనంతాదుల చౌపదకు ఉదా :

కదిసి చతుర్లఘు-గణములతోను
బదము త్రిగణమై-భానునితోను
దుదమొదలను బ్రాల్-దొలగకరాను
జదువంగ నీయది-చౌపదయౌను.

—ల. సా. సం. 2-121.

అప్పకవి యొక్క డీ చౌపదను 'చతుష్పద' యన్నాడు.

**చతుష్పద**

చూ. చౌపద.

**వితాళచౌపద**

వితాళచౌపద జాతివర్గమునకు చెందిన పద్యము (చూ. జాతులు). ఇందు ప్రతిపాదమున వరుసగా రెండు త్రిమాత్రాగణములు+రెండు చతుర్మాత్రాగణములు+ఒక లఘువు (=మొత్తము పదునైదు మాత్రలు) ఉండును. (3+3+4+4+1=15.). పాదము లఘ్వంతరముతో పూర్తియగును. ప్రాసనియమ మున్నది. ఎనిమిది మాత్రల తరువాత యతి చెల్లును.

పాదమునకు రెండు సూర్యగణములు+9 లఘువు (మాత్ర) లుండ వలెనని అప్పకవి వితాళచౌపద లక్షణము చెప్పినాడు. పై లక్షణమున కిది భిన్నముకాదుకాని, పాదము గుర్వంతరముతో పూర్తియగు నవకాశమిందున్నది. అప్పకవి లక్ష్యమున నాల్గుపాదములును గుర్వంతములే.

వితాళచౌపదకు అంత్యప్రాస నెవరును చెప్పలేదు. కాని అనంతుడు, చి. పెద్దనల లక్ష్యములందు అంత్యప్రాస ప్రయుక్తమైనది.

ఉదా :

i. రవియుగము చతు-ర్లఘుగణయుగము
నవులను నొక లఘు-వై పదపదము
దవిలిన నిదియె వి-తాళముక్రమము
జివరనౌను వి-శ్రమ మీవిధము.

—ల. సా. సం. 2-122.

ii. పూర్వ, జన్మ, సం-భూతసంస్కా-
రార్వనీయ మా-నాత్మలోకా
సర్వభూత ని-ర్వాణరూపా
శర్వ ధాతృ కే-శవాతిసఖా.

—రామా. కల్ప. అరణ్య. శబరి. 379.

**కర్ణాటచతుష్పద**

కర్ణాటచతుష్పద జాతివర్గమునకుచెందిన పద్యము. (చూ. జాతులు.). ఇందు ప్రతిపాదమున వరుసగా పంచమాత్రా గణములు మూడు+ఒక త్రిమాత్రా (సూర్య) గణము ఉండును. (జల, యగణములు పంచమాత్రాకములైనను ప్రయోగింపకూడదు.) తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

పై లక్షణము ద్విపదలక్షణమునకు సరిపోవునట్లు కన్పించును. కాని రెండు తేడాలున్నవి. ఒకటి. ద్విపదయం దుపయోగింపబడు నింద్రగణములు మూడును పంచమాత్రాగణములైనపుడే, అది కర్ణాట చతుష్పద యగును. ద్విపదలోని ఇంద్రగణములు కేవలము చతుర్మాత్రాకములుగూడ కావచ్చును. అప్పుడది అనంతాదుల 'చౌపద'యగును. (చూ. చౌపద.) చతుర్మాత్రా, పంచ మాత్రా గణములు కలగలుపుగా నున్నప్పుడే ద్విపద యగును. రెండు : ద్విపద రెండుపాదముల పద్యము కాగా, కర్ణాట చతుష్పద నాల్గుపాదముల పద్యము.

ఉదా :

'ఓవనీదేవతలు-నుర్విసుతతోడి
సావాసమందైన-చనవుచేసైన
నావిశ్వనాథుడుమ-దాయల్లకార్తి
మై వెక్కి-పోయినను-నాదరువుకండు'.

—రామా. కల్ప. అరణ్య. జటాయు. 103.

దీనిని 'కర్ణాటచౌపద' మని చి. పెద్దన పేర్కొన్నాడు.

**కర్ణాటచౌపద**

చూ. కర్ణాట చతుష్పద.

**పంచపద**

పంచపద యనగా ఐదు పాదములుగల పద్యమని యర్థము. సమవృత్తము నాలుగు పాదములతో నుండును. ఒకవృత్తమునకు ఆ వృత్తలక్షణమ్మే

గల మరొక పాదము నదనముగా నా వృత్తమునకే చేర్చి రచించినచో, ఆ వృత్తము పంచపద యగును. అనగా-ఉత్పలమాలావృత్తము నాల్గు పాదములు గలది కాగా, ఉత్పలమాలావృత్తలక్షణముతో నైదు పాదములు రచించినచో నది పంచపదయగును. లాక్షణికులు సమవృత్తములకే ఈ పంచపద స్వరూపము నుద్దేశించినారు. మరియు లక్ష్యముగా ఉత్పలమాలా వృత్తమునే 'పంచపద'గా చూపినారు. కాని ఏ వృత్తమునైనను 'పంచపద'గా రచింపవచ్చును. పద్యమైదు పాదములుగా నుండుటయే తప్ప దీనికి ప్రత్యేక లక్షణము వేరేలేదు. లాక్షణికులు సమవృత్తములను మాత్రమే 'పంచపద'లుగా నుద్దేశించినను నాల్గు పాదములు సమలక్షణముతోనున్న ఏ పద్యమునైనను (జాత్యుపజాతి పద్యములనుగూడ) పంచపదలుగా రచింపవచ్చునని కవుల రచనలవలన తెలియును.

ఈ 'పంచపద'కే పంచపాది యనియు నామాంతరమున్నది.

ఉదా :

'పంచపదప్రపంచిత శి-వప్రదనవ్యసితోత్పలస్ఫిరో
దంచిత దివ్యసౌరభము-స్వాత్మవిభావము బెంచఁదగ్గతిన్
బంచముఖావతంసిత న-వప్రభవంబును గాంచె రాజత
త్వాంచిత రాజసత్వమమృ-తాంశవిధుప్రమనోర్చిస్వీయహృ
త్సంచిత కల్మషంబెడపెఁ-జంద్రుఁడు శంకరకైరవంబుగాన్'.

—ఛం. హం. (మ. మ.) 61.

## పంచపాది

చూ. పంచపద.

## షట్పదలు

'షట్పద'కు తెలుగు సాహిత్యములో దాదాపుగా ప్రయోగము లేదనియే చెప్పవచ్చును. జానపద వాఙ్మయములోగూడ అరుదుగానే కొన్ని షట్పద భేదములు కన్పించును. ఆధునిక సాహిత్యమందును షట్పద భేదముల ప్రయోగము మిక్కిలి అరుదే. కాని, భీమన మొదలుకొని తెలుగు లాక్షణికు లందరును షట్పదకు లక్ష్యలక్షణములను ప్రదర్శించినారు.

షట్పద లక్షణమిది : పూర్వార్థమున మూడు, ఉత్తరార్థమున మూడు-మొత్త మారుపాదములుగల పద్యము షట్పద. పూర్వార్థమున పాదమునకు రెండేసి ఇంద్రగణములుగా మొదటి రెండుపాదము లుండును. మూడవ పాదమున వరుసగా రెండింద్రగణములు+ఒక చంద్రగణముండును. ఉత్తరార్థ మిట్లే యుండును,

భీమన చెప్పిన ఈ షట్పద లక్షణమునకు, కన్నడమున నాగవర్మ తన 'ఛందోంబుధి'యందు చెప్పిన లక్షణమాధారము. కన్నడమున ఆరు పాదములకును ప్రాస చెల్లింపబడగా, భీమన లక్ష్యమందు 1, 3, 4, 6 పాదములందే ప్రాస చెల్లింపబడినది. దీనినిబట్టి 1, 2 పాదములను, మరియు 4, 5 పాదములను ఒక్కొక్క పాదముగానే ప్రాస ప్రయోగవిషయమున భీమన భావించినాడని తోచును. కాని అట్లు భావించినచో షట్పద ఆరుపాదములు గలదిగాక నాల్గు పాదములుగలదియగును. అది సరికాదు. కావుననే, తరువాతి లాక్షణికులు ఆరు పాదములందును ప్రాస చెల్లించినారు. ఇక లాక్షణికులలో భీమనతో పాటుగా నందరును యతి నియమమును పాటించలేదు. కొందరు స్పష్టముగా షట్పదకు యతినియమములేదని చెప్పినారు. కాగా తెలుగులో యతినియమము లేని పద్యమిది యొక్కటే యగుచున్నది. అయితే తెలుగులో ప్రాసనియమము లేని పద్యము లనేకము లున్నవిగాని యతినియమములేని పద్యము (ఒక్క షట్పద తప్ప) లేదు. కావున ఈ యొక్కపద్యమందును యతినియమ ముండుట సమంజసము. 'త్రిపద'కు భీమన యతి చెప్పకున్నను, తరువాతి లాక్షణికులు త్రిపదయందలి పెద్దపాదమునకు యతిని చెప్పినారు. (చూ. త్రిపద.). అదే విధముగా షట్పదయందును పెద్ద (మూడవ, ఆరవ) పాదములందు లాక్షణికులు చెప్పియుండవలసినది. షట్పద కారుపాదములందు భీమన ప్రాసను చెప్పకున్నను తరువాతివారు చెప్పినారుగదా! కాని షట్పదకు యతినియమము లేదని అనంతుడు కంఠోక్తిగా చెప్పినాడు. అయితే, వి. పెద్దన, చి. పెద్దనల లక్ష్యములందు మూడవ పాదమున, అనంతుని లక్ష్యమందు ఆరవ పాదమున రెండింద్రగణముల తరువాత - అనగా తృతీయ గణాద్యక్షరము యతి చెల్లినది. ఇది యాదృచ్ఛికము కావచ్చును. కాని, పెద్దపాదములందు యతి ఈ విధముగా చెల్లుటయే సమంజసము. పెద్దపాదమునందు చిన్నపాదపు గణక్రమముతోపాటు మరికొంత అధికముగా నున్నది. ఈ యధికభాగపు టాద్యక్షరము యతి చెల్లినచో సహజముగా కనుపించును. (పెద్దపాదమందలి మొదటి రెండింద్రగణములు ఒక చిన్న పాదముతో సమానము. తరువాతి చంద్రగణము పెద్దపాదమున కధికము. ఈ అధికభాగపు టాద్యక్షరము యతి చెల్లును. ముందు చెప్పబోవు షట్పద భేదములన్నింటియందును యతి చెల్లింపువిషయము నిట్లే గమనింపవలయును.). ఇట్లు యతిచెల్లింపబడినచో, తెలుగునందు యతినియమములేని పద్యమని యే యొకటియును మిగులదు.

కన్నడమున నాగవర్మ చెప్పిన షట్పద లక్షణము ననుసరించి తెలుగులో భీమన చెప్పగా, ఆయనచెప్పిన లక్షణములనుచూచి తరువాతి లాక్షణికులు షట్పదల లక్షణము చెప్పినారుకాని, నాగవర్మ తరువాత కన్నడమున చెప్పబడిన షట్పద భేదములను ఎవరును గమనించినట్లులేదు. కన్నడమందు నాగవర్మకు తరువాతి లాక్షణికులు పది షట్పద భేదములను చెప్పినారు. వాటిలో 1. శర షట్పద, 2. కుసుమ షట్పద, 3. భోగ షట్పద, 4. భామినీ షట్పద, 5. పరి

వర్ధిని షట్పద, 6. వార్ధక షట్పద - అను నారు భేదములు ప్రధానములు. వీటిలో మరల భోగషట్పద భేదముగా 'తలషట్పద', భామినీషట్పద భేదముగా 'జల షట్పద', శర-కుసుమ షట్పదల మిశ్రమముగా 'విషమ షట్పద', ఈ విషమ షట్పద భేదముగా 'ప్రౌఢషట్పద' అని మరినాల్గు అవాంతర భేదము లేర్పడినవి. కాగా షట్పదభేదములు మొత్తము పది. తెలుగులో లాక్షణికులుచెప్పిన షట్పద పై పది భేదములలో అచ్చముగా దేనికిని సరిపోదు. షట్పదయం దుపయోగించ బడు గణముల మాత్రాసంఖ్య పై పది షట్పదులయందొక ప్రత్యేపద్ధతి ననుస రించియుండగా, తెలుగునందు కలగలుపుగా నుండును. కావున తెలుగు షట్పద నొక విశేషరూపముగా భావించినచో, నిది పదునొకండవ భేదమగును. పదునొ కండవ దనగా చివరిభేదమనికాదు. లెక్కకట్లు చెప్పబడినదిగాని, ఇదే మొదటి రూపము. దీనినుండియే మిగిలిన భేదములు కొన్ని ప్రత్యేక నియమములతో రూపొందినవని షట్పద భేదముల నన్నింటిని పరిశీలించినచో స్పష్టముకాగలదు. కావున ఈ మూలరూపమగు తెలుగు షట్పద నిరుపపదముగా 'షట్పద' అని మాత్రమే పేర్కొనబడును.

లాక్షణికులు షట్పదకు ఇంద్ర-చంద్రగణములను పేర్కొని లక్షణము చెప్పినను, తెలుగు షట్పద తప్ప మిగిలిన షట్పద భేదములన్నియు మాత్రా సంఖ్యాగణముల పద్ధతితో, రగడభేదములపై ఆధారపడి రూపొందినవి. ఉదాహర ణమునకు-శరషట్పద మధురగతి రగడపై, కుసుమషట్పద ద్విరదగతి రగడపై ఆధారపడి రూపొందినవి. మధురగతి రగడలో పాదమునకు నాలుగేసి చతు ర్మాత్రాగణము లుండును. కాగా, ఈ రగడలోని మొదటిపాదము రెండు సమ భాగములుగా విరిగి, రెండవపాదమున చివర రెండు మాత్రలు తగ్గినచో శరష ట్పదయొక్క పూర్వార్థ మేర్పడును. ఉదా :

మధురగతిరగడపాదములు : i. 4+4+4+4
ii, 4+4+4+4

శరషట్పద (పూర్వార్థము) : i. 4+4
ii. 4+4
iii. 4+4+4+2.

ఇట్లే మిగిలినవాటినిగూడ గమనించవచ్చును.

ఇక, రగడలలో మాత్రాసంఖ్యాగణ నియమమే తప్ప, సూర్యేంద్ర, చంద్రగణ నియమము లేదు. (చూ. రగడలు.) అందువలన రగడలపై ఆధార పడి రూపొందిన షట్పదభేదములందును సూర్యాదిగణములనిగాక, మాత్రా సంఖ్యాగణముల నుపయోగించుటయే సమంజసము. ఎదురునడకగల మాత్రా సంఖ్యాగణములు (లగ, జ-మొదలగునవి) రగడల కుపయుక్తములు కావు. కాని ఆధునిక రచనలయందు గతివైవిధ్యముకొరకు ఈ ఎదురునడక గణములనుగూడ లాక్షణిక నియమము నధిగమించి కవులు ప్రయోగించుట గమనింపదగిన

యంశము. రగడలపై నాధారపడిన షట్పదభేదములందును ఇట్టి ప్రయోగము లున్నవి.

"మరో ప్ర-పంచం । మరో ప్ర-పంచం । మరో ప్ర-పంచం-పిలిచిం-ది ।
పదండి-ముందుకు । పదండి-త్రోసుకు । పోదాం-పోదాం-పై పై -కి।"

అన్న శ్రీశ్రీ గారి ప్రసిద్ధమైన 'మహాప్రస్థాన' గేయము ఎదురునడక గణములతో రూపొందిన 'శరషట్పద'యే.

ఈ పైన చెప్పిన షట్పదభేదము అన్నింటికిని తెలుగులో లక్ష్యములు లభించవు. ఒకటి రెండింటికి జానపద వాఙ్మయమున, మరొకటి రెండింటికి ఆధునిక రచనలయందును లక్ష్యములు లభించును. మిగిలినవి ఊహ్యాములు. జానపద రచనలయందును, ఆధునిక రచనలయందును యతిప్రాసల ప్రయోగము యాదృచ్ఛికము, ఐచ్ఛికము కావున ఆ వాఙ్మయమునందు, గేయములందు లభించు లక్ష్యములలో యతిప్రాసల చెల్లింపుల ప్రసక్తికి తావుండదు. వీటిని అలక్ష్యముచేసి లక్ష్యములను చూచుకొనవలెను.

## షట్పద

పూర్వార్ధమున మూడు, ఉత్తరార్ధమున మూడు-మొత్తము ఆరు పాదములు గల పద్యము 'షట్పద'. పూర్వార్ధమున పాదమునకు రెండేసి ఇంద్ర గణములుగా మూడుపాదములు, మూడవపాదమునందు అధికముగా చివర నొక చంద్రగణము నుండును. ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. (ఆరు పాదములకు) ప్రాసనియమమున్నది. లాక్షణికులు యతినియమమును చెప్పలేదుగాని, మూడవ, ఆరవ పాదములందు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లించుట సమంజసము. (చూ. షట్పదలు.)

ఉదా :

"భృంగినై, యోంకార,
శృంగిము, భాసవ,
మింగిత, ప్రాభవ, మెచ్చించఁగ
సంగీత, సాహిత్య,
శృంగార, షడ్వృత్త
సంగతు, లనుబెంతు, షట్పదోక్తి."

—ఛం. హం. (మ. మ.) 62.

## శరషట్పద

పాదమునకు రెండేసి చతుర్మాత్రాగణములుగా మూడు పాదములు, మూడవపాదము చివర అదనముగా షణ్మాత్రగణమొకటి యుండును. (ఈ షణ్మాత్రాగణము 4+2 మాత్రలుగా విరుగునట్లు భాసింపవలయును.). ఈమూడు

పాదములు 'శరషట్పద'యొక్క పూర్వార్ధము. ఉత్తరార్ధముగూడ నిట్లే యుండును. ప్రాసనియమమున్నది మూడవ, ఆరవ పాదములందు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లించవచ్చును. కాగా, యతినియమ మైచ్ఛికము. (చూ. షట్పదలు.)

ఉదా :

'సురపతు, లిరువురు
సురసతు, లిద్దఱు
సురప యు,గముతో, సోముం,డును
బరువడి, బెనఁగొన
నరుదుగ, షట్పది
సరిఁ బ్రా,సలు దన,రారం,గను'.

—కా. చూ. 8-58.

(పై లక్ష్యమునందు మూడవపాదమున రెండవ గణము 'గమ్ముతో' యని మూలమున నున్నది. ప్రస్తుతోదాహరణమగుటకు 'గముతో' అని మార్చి చూపబడినది. మూలము ననుసరించి అది ఇంద్రగణము కాగా, ప్రస్తుతోదాహరణ రూపములో చతుర్మాత్రాగణము మాత్రమే యగును. వి. పెద్దన లక్ష్యము 'శరషట్పద' కతి సన్నిహితముగా నున్నదని చూపుటకే ఈవిధముగా ప్రదర్శింపబడినది.)

**కుసుమషట్పద**

పాదమునకు రెండేసి పంచమాత్రాగణములుగా మూడు పాదములు, మూడవపాదము చివర అదనముగా సప్తమాత్రాగణ మొకటి యుండును. (ఈ సప్తమాత్రాగణము 5+2 మాత్రలుగా విరుగునట్లు భాసింపవలెను.) ఈ మూడు పాదములు 'కుసుమషట్పద' యొక్క పూర్వార్ధము. ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. ప్రాసనియమున్నది. మూడవ, ఆరవ పాదములందు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లింపవచ్చును. కాగా యతినియమ మైచ్ఛికము. (చూ. షట్పదలు.)

ఉదా :

'మెఱయంగ, నిద్దఱి
ద్దఱు సురేం,ద్రులు మూఁడు
తెఱఁగులన్, శశిఁగూడ, నర్థంబు,లన్
నెఱిఁ గ్రాలఁ,గా వళ్లు
దొఱఁగ ష,ట్పదరీతి
వఱలుఁ జ,క్రిపదాబ్జ, వర్ణనం,బుల్'.

—అనం. ఛం. 3-46.

**భోగషట్పద**

భోగషట్పదకు నాయా పాదములందుండు మాత్రాసంఖ్యాగణక్రమ మిది :

i. 3+3+3+3
ii. 3+3+3+3
iii. 3+3+3+3+3+3+2 (గ)

ఇది పూర్వార్ధకము. ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. (యతీ, ప్రాసల చెల్లింపు విషయమున చూ. షట్పదలు.)

ఉదా :

'తులసి, యింట, నుంచు, వార్ని
తులసి, పూజ, చేయు, వార్ని
తులసి, యందు, భక్తి, యుంచి, కొలుచు, వారి, నీ'

(జానపదము)

భోగషట్పద 'హయప్రచార' రగడపై ఆధారపడి రూపొందినది. (చూ. హయప్రచార రగడ.)

**భామినీషట్పద**

భామినీషట్పదకు నాయా పాదములందుండు మాత్రాసంఖ్యాగణ క్రమ మిది :

i. 3+4+3+4
ii. 3+4+3+4
iii. 3+4+3+4+3+4+2 (గ)

ఇది పూర్వార్ధము ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. యతి, ప్రాసల చెల్లింపులు ఐచ్ఛికములు. (చూ. షట్పదలు.)

ఉదా :

'గుమ్మ, డేడే, గోపి, దేవీ
గుమ్మ, డేడే, కన్న, తల్లీ
గుమ్మ,డినిపొడ,సూప,గదవే, అమ్మ, గోపెమ్మా'.

(జానపదము)

భామినీషట్పద 'హరిణగతి' రగడపై ఆధారపడి రూపొందినది. (చూ, హరిణగతిరగడ.)

**పరివర్ధిని షట్పద**

పరివర్ధిని షట్పదకు నాయా పాదములందుండు మాత్రాసంఖ్యాగణ క్రమమిది :

i. 4+4+4+4
ii. 4+4+4+4
iii. 4+4+4+4+4+4+2 (గ)

ఇది పూర్వార్ధము. ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. యతి, ప్రాసల చెల్లింపులు ఐచ్ఛికములు. (చూ. షట్పదలు.)

ఉదా :

మనిషికి మనిషికి బంధమ్మేమిటి ?
మనసున పెనగొను మధురస్నేహ
మ్మను పేశలభావమ్మొకటే జగమందున నిశ్చితమై.

—కల్పితము.

పరివర్ధినిషట్పద 'మధురగతి' రగడపై ఆధారపడి రూపొందినది. (చూ. మధురగతి రగడ.). ఇది శరషట్పదకు రెట్టింపు రూపము.

**వార్ధకషట్పద**

వార్ధక షట్పదకు నాయా పాదములందుండు మాత్రాసంఖ్యాగణ క్రమమిది ;

i. 5+5+5+5
ii. 5+5+5+5
iii. 5+5+5+5+5+5+2 (గ)

ఇది పూర్వార్ధము. ఉత్తరార్ధముకూడ నిట్లే యుండును. యతి, ప్రాసల చెల్లింపు లైచ్ఛికములు. (చూ. షట్పదలు.)

ఉదా :

'ఏనాడు భయహీనుడై నిత్యతృప్తుడై
ఏనాడు పీడావిహీనుడై శాంతిమై
ఏనాడు జీవించె లోకాన సామాన్యమానవుడు మానవుండై'.

—కల్పితము.

వార్ధక షట్పద 'ద్విరదగతి' రగడపై ఆధారపడి రూపొందినది. (చూ. ద్విరదగతి రగడ.) మరియు కుసుమషట్పదకు రెట్టింపు రూపము.

**తలషట్పద**

'తలషట్పద'కు నాయా పాదములందుండవలసిన మాత్రా సంఖ్యా గణక్రమమిది :

i. 3+3
ii. 3+3
iii. 3+3+3+2 (గ)

ఇది పూర్వార్థము. ఉత్తరార్థముకూడ నిట్లేయుండును. యతి, ప్రాసల చెల్లింపు లైచ్ఛికములు. (చూ. షట్పదలు.).

ఉదా ;

'తెలుగు వెలుగు
చెలగి దెసల
నలుముకొనెడు నట్లుగా'

—కల్పితము.

ఈ తలషట్పద 'భోగషట్పద'కు సగమురూపము. అనగా, భోగషట్పద లోని ప్రతి పాదమందలి త్రిమాత్రా గణముల సంఖ్యలో సగము తొలగినచో తల షట్పద యగును. పెద్దపాదముల చివర ఇ (గ) మాత్రలుమాత్ర మట్లేయుండును. (చూ. భోగషట్పద ).

**జలషట్పద**

'జలషట్పద'కు నాయాపాదములందుండవలసిన మాత్రా సంఖ్యా గణక్రమ మిది :

i. 3+4
ii. 3+4
iii. 3+4+3+2 (గ)

ఇది పూర్వార్థము. ఉత్తరార్థముకూడ నిట్లేయుండును. యతి, ప్రాసల చెల్లింపు లైచ్ఛికములు. (చూ. షట్పదలు.).

ఉదా :

'తరుణి కన్నుల
విరియు వెన్నెల
మురిపెములలో మున్గితిన్'.

—కల్పితము.

ఈ జలషట్పద 'భామినీ షట్పద'కు సగరూపమువంటిది. అనగా, భామినీషట్పద చిన్నపాదములందు సప్తమాత్రా (3+4) గణములు రెండేసి యుండుననుకొన్నచో, ఒక్కొక్క గణము 'జలషట్పద' యందుండును. ఇట్లే పెద్దపాదములందొక సప్తమాత్రా (3+4) గణముతోబాటు, మరొక సప్త మాత్రా (3+4) గణమందలి చివరిభాగము (4 మాత్రలు) తగ్గును. చివరి 2(గ) మాత్రలుమాత్ర మట్లేయుండును. (చూ. భామినీషట్పద.).

**విషమషట్పద**

'విషమషట్పద' కాయా పాదములందుండెడి మాత్రాసంఖ్యా గణ క్రమ మిది :

i. 4+5

ii. 4+5

iii. 4+5+4+5+2 (గ)

ఇది పూర్వార్థము. ఉత్తరార్థ మిట్లేయుండును. యతి ప్రాసల చెల్లింపు లైచ్ఛికము. (చూ. షట్పదలు.).

ఉదా :

సీతా వదనాంబు
జాతారుణ కిరణ
భూతార్తిహరణ విభూ కావవే.

—కల్పితము.

శర-కుసుమ షట్పదల మాత్రా సంఖ్యాగణముల మిశ్రమముగా రూపొందినది 'విషమషట్పద'. శరషట్పద చతుర్మాత్రాగణములతో, కుసుమ షట్పద పంచమాత్రాగణములతో నేర్పడునవి. 'శర' గణమొకటి, 'కుసుమ' గణ మొకటిగాచేరి విషమషట్పద రూపొందినది. శర-కుసుమల పెద్దపాదము లందు మూడేసిగణములు మాత్రమే యుండగా, విషమషట్పదలో నాల్గుగణము లుండుటకు రెండు షట్పద గణముల మిశ్రమరూపమీ షట్పద యగుటయే కారణము. చివరి 2 (గ) మాత్ర లట్లేయుండును. మరొక 2 (గ) పెరుగవు. (చూ. శరషట్పద, కుసుమషట్పద.).

విషమషట్పద పాదములలో గణక్రమము 4+5 అని పైన చెప్పబడినది కాని, వ్యత్యస్తమై 5+4 అనికూడా ఉండవచ్చును.

## ప్రౌఢషట్పద

'ప్రౌఢషట్పద' కాయా పాదములందుండవలసిన మాత్రా సంఖ్యా గణక్రమ మిది :

i. 4+5+4+5

ii. 4+5+4+5

iii. 4+5+4+5+4+5+2 (గ)

ఇది పూర్వార్థము. ఉత్తరార్థముకూడ నిట్లేయుండును. యతి, ప్రాసల చెల్లింపు లైచ్ఛికములు. (చూ. షట్పదలు.).

ఉదా :

వల్లీ మృదుకరమ్మును ముందుకుసాచి
యుల్లాసమెసగన్ సుమచషకములతో
కొల్లలుగా మధువు నందించుం బ్రకృతి కూరిమి ప్రియురాలుగా.

—కల్పితము.

ప్రౌఢషట్పద 'విషమషట్పద'కు రెట్టింపు రూపమువంటిది. (విషమ షట్పద చిన్నపాదములందు నవమాత్రా (4+5) గణమొక్కటి యున్నదను కొన్నచో ప్రౌఢషట్పదయందు రెండేసియుండును. పెద్దపాదములందు మూడుండును. చివరి ృ (గ) మాత్రలుమాత్ర మట్లేయుండును. (చూ. విషమ షట్పద-). ప్రౌఢషట్పదయందు గణక్రమము 4+5+4+5 అని పైన చెప్పబడినదికాని 5+4+5+4 అనిగూడ నుండవచ్చును.

## సప్తపద

'సప్తపది'ని తెలుగు లాక్షణికు లెవరును చెప్పియుండలేదు. కాని, 'రాధికా స్వాంతనము' రచించిన ముద్దుపళని 'తిరుప్పావు' అను తమిళ భాషలోని లఘుకావ్యమును 'సప్తపది' పద్యములలో తెలుగునకు పరివర్తనము చేసినది. తమిళమున 'ఆండాల్' (గోదాదేవి, ఈమె శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్త మాల్యదా' కావ్యనాయిక.) తిరుప్పావును రచించినది. ముద్దుపళని లక్ష్యములను బట్టి 'సప్తపది' లక్షణ మిట్లేర్పడును.

పద్యమున నేడుపాదము లుండును. ప్రతిపాదము రెండు ఖండములుగా విరుగును. పూర్వఖండమున ఎనిమిది త్రిమాత్రాగణములు, ఉత్తర ఖండమున ఆరు త్రిమాత్రాగణములు మరియు నొక గురువుండును. ప్రాస నియమము లేదు. ప్రతి ఖండమున పంచమ గణాద్యక్షరము యతి చెల్లును. మరియు నవమ గణాదియందు ప్రాసయతి తప్పక చెల్లును. ప్రాసనియమము లేకపోవుటవలన 'సప్తపది' ఉపజాతివర్గమున చేరునుగాన, యతిస్థానమున ప్రాస యతియు చెల్లును.

సప్తపదలోని గణములు ప్రాయికముగా త్రిమాత్రాగణములుగానే విరుగునుగాని ఒక్కొకపుడు మూడేసిమాత్రలకు కాక ఆరుమాత్రలుగా (రెండు త్రిమాత్రాగణముల కలయికగా) గూడ గణములు విరుగును. ఆరుమాత్రలుగా నేర్పడినప్పుడు లగము కన్పించవచ్చుగాని, త్రిమాత్రాగణములుగా విరిగినప్పుడు 'లగ' ముండరాదు. (లగమున్నపుడు షణ్మాత్రాగణముగా భావింపబడునన్న మాట.). ఈ పద్ధతి రగడలయందున్నది. (చూ. రగడలు.)

ఈ సప్తపద లక్షణమును చూడగా, 'విజయమంగళ' రగడపై నాధారపడి ఇది ఏర్పడినట్లు కన్పించును. (చూ. విజయమంగళ' రగడ.). ఈ రగడ పాదమందలి చివరి రెండు సూర్యగణములకు బదులు నొక గురువును (ఒక్కొకప్పుడొక లఘువును) ఉంచినచో సప్తపద పాదమేర్పడును. సప్తపద పాదాంతమున నొకప్పుడొక లఘువుండవచ్చును. లేదా పాదమందలి చివరి త్రిమాత్రాగణముగా గుర్వంతమై చతుర్మాత్రాగణముగా కూడ నుండవచ్చును.

ఉదా :

'శ్రీనివాసగురునిదలచి-చిత్తమునను ముద్దుపళని
పూని చేయు ద్రవిడభాష-లోని భావము

చెలఁగి చెలియ వాణి తనదు-జిహ్వాకోనను నిలిచి యిటుల
పలికె తిరుప్పావు సప్త-పది పదంబుగా
మాసములకు నెల్ల మంచి-మార్గశిరము పర్వ మహాహా
యాస గలిగినట్టి చెలులు-డాసి రారే
మంచినగల మించి కులము-నెంచి యవతరించినట్టి
చంచలాక్షులెల్లఁగూడఁ జనగరారే
న్యాయశాలియైన నందనందనుండు తోయజాక్షి
శ్రీయశోద కనినిసింహ-శిశువుగాడ కే
నల్లమబ్బు చాయమేనిఁ-దెల్లజేయు డాలుకల్గు
పుల్లపుండరీకనయన-పురుషవర్యుఁడే
కీరవాణులార : హరినిఁ-గోరి చేరితేని సకల
పూరుషార్థములను దృప్తి-పొంద రారే.'

—('రాధికాసాంత్వన'మున అనుబంధముగా నీ సప్తపదులున్నవి.)

(3వ, 4వ, 7వ పాదాంతములందు చివరి త్రిమాత్రాగణము గుర్వంతమై చతుర్మాత్రాగణముగా నున్నది. 1వ, 3వ పాదోత్తరఖండములందు 4వ, 6వ, 7వ పాదముల పూర్వఖండములందు ప్రాసయతి చెల్లినది.)

సప్తపద, సప్తపది యని రెండువిధముల వ్యవహారమున్నది.

## సప్తపది

చూ. సప్తపద.

## తరువోజ

'తరువోజ' జాతివర్గమునకు చెందిన పద్యము. (చూ. జాతులు.). ఇందు ప్రతి పాదమున నుండవలసిన గణక్రమమిది :

3 ఇం +1 సూ.+3 ఇం.+1 సూ.

మొత్తము పాదమున కెనిమిది గణములు. ప్రాసనియమమున్నది. 3వ, 5వ, 7వ గణముల ఆద్యక్షరములు యతి చెల్లును. (అనగా పాదమునకు మూడుచోట్ల యతి చెల్లును.)

గణక్రమమునుబట్టి చూచినచో, రెండు ద్విపదపాదములు కలిసి తరువోజ కొక పాదమగును. యతి చెల్లించు పద్ధతియు తదనుకూలముగానే యున్నది. (చూ. ద్విపద.) ఒక రగడ పాదమును రెట్టించగా మరొక రగడ రూపొందినట్లు (చూ. రగడలు), ద్విపదపాదమును రెట్టించగా తరువోజ యేర్పడినదని, కాదు, తరువోజ పాదము రెండుగా విరిగి ద్విపద యేర్పడినదని ఛందోవిమర్శకులు భిన్నమతములు గలిగియున్నారు. రగడల పద్ధతినిబట్టి మొదటి మతమునకే వ్యాప్తి ఎక్కువ.

ఉదా :

'కురువంశ,నిస్తార-కులధర్మ,యుక్తిఁ-గొడుకుల,(బడసియి-క్కురుకుంజ,రునకు,
గరము మ,నః(ప్రీతి-గావించి, పుణ్యా-గతికిఁగా,రణమవై-కమలాక్షి, నీవు
దిరముగా, నిష్టంబు-దీర్చితే, నిందు-ధృతి(బతి, యిష్టంబు-దీర్పన, కాన
యరిగెదఁ, బతితోడ-నవ్యలో,కంబు-నందైనఁ, (బీతిసే-యఁగఁగాంచు,ననియు'.

—భార. ఆది. 5-145.

తరువోజకే 'తరువద' యనియు మరొక పేరు.

**తరువద**

చూ. తరువోజ.

**ఉత్సాహము**

జాతివర్గమునకు చెందిన పద్యము ఉత్సాహము. ఇందు ప్రతి పాద మున ఏడు సూర్యగణములు+ఒక గురువు ఉండును. ప్రాసనియమ మున్నది. పంచమ గణాద్యక్షరమున యతి చెల్లును.

ఏడు సూర్యగణములనగా గల, నగణముల సమ్మేళన రూపముగా నుండవలెను. అచ్చముగా ఏడు గణములే ఉపయుక్తములైనచో 'సుగంధి' యను సమవృత్తము, లేదా అచ్చముగా నగణములే ఉపయుక్తములైనచో 'విచికలిత'మను సమవృత్తమగును. అందువలన ఉత్సాహ పాదములందు గల, నగణముల కలగలుపు ఉండవలెను. అప్పుడే అది 'ఉత్సాహ' మగును.

ఉదా :

'ఏల దీని నెడయఁజేయ - నీక్షణంబయేగి పాం
చాలుఁబట్టి తెత్తమధిక - శౌర్యలీల మెఱయఁగా
బోలుననుచుఁ చెలగి రాజ - పుత్రులెల్ల నరిగి పాం
చాలు పురము ముట్టికొనిర - సంఖ్యబలసమేతులై'.

—భార. ఆది. 6-66.

**అక్కరజాతి పద్యములు**

'అక్కరజాతి పద్యములు' అనగా, అక్కర పద్యములవంటి కొన్ని పద్యములని భావము. ఇక్కడ 'జాతి' పదము సాంకేతికము కాదు. కొన్ని పద్యములను-వాటియందుపయోగింపబడు గణస్వరూపము ననుసరించి చేయబడిన వర్గీకరణమునకు సూచకము. 'అక్కరజాతి' పద్యములను విభాగమును భీమన, విన్నకోట పెద్దనలు మాత్రమే తమ కవిజనాశ్రయ, కావ్యాలంకార చూడామణులయందు పేర్కొన్నారు. వారిదృష్ట్యా ఈ జాతికి చెందిన పద్యములు

అక్కరలు, ద్విపద, త్రిపద, షట్పద. చంద్రగణములు ఈ జాతి-వర్గపు-పద్యము లందే-ఒక్క ద్విపదయందు తప్ప- ఉపయోగింపబడును. మరియు, ఈ వర్గపు పద్యములకు లక్షణము చెప్పునప్పుడు మాత్రమే, భీమన, వి. పెద్దనలు 'సూర్య-ఇంద్ర-చంద్ర' అను పేర్లతో గణములను పేర్కొన్నారు. సీస, గీతాదుల లక్షణము చెప్పునప్పుడు 'నలనామకగణములు'-ఇత్యాదిగా పేర్కొన్నారు తప్ప సూర్యేంద్రచంద్ర నామముల నుపయోగించలేదు. ఈ ఇద్దరు లాక్షణికులుతప్ప అనంతాదులగు తరువాతి లాక్షణికులు సర్వత్ర సూర్యేంద్రచంద్రగణములనే పేర్కొన్నారు. అందువలన వారికి 'అక్కరజాతి' పద్యములన్న విభాగ మక్కర లేకపోయినది. భీమన, వి. పెద్దనలకు తరువాతివారగు అనంతాదులకును మాత్రా గణస్వరూప విషయమున మతభేదమున్నది. (చూ. సూర్యగణములు మొ.). ఈ మతభేదమే 'అక్కరజాతిపద్య' విభాగమును ప్రతిపాదించుటకు, ప్రతిపాదించ కుండుటకు కారణము.

ఈ అక్కరజాతి పద్యములన్నియు 'జాతి' పద్యములే. (చూ. జాతులు.)

**అక్కరలు**

'అక్కరలు' జాతిపద్యములు. (చూ. జాతులు.). ఇవి అయిదు విధములు : 1. మహాక్కర, 2. మధ్యాక్కర, 3. మధురాక్కర, 4 అంతరాక్కర, 5. అల్పాక్కర. మొదటిదయిన మహాక్కరయందు పాదమున నేడు గణములుండును. అక్కడినుండి వరుసగా మిగిలిన అక్కరలలో ఒక్కొక్క గణము తగ్గుచు, చివరకు అల్పాక్కరలో పాదమునకు మూడు గణములుండును. పాదమునందుండు గణసంఖ్యాప్రకారము పై అక్కరల క్రమము నిర్ధారితమయినది. ఒక్క మధ్యాక్కరకుతప్ప మిగిలిన అన్ని అక్కరలకు పాదాంతమున చంద్రగణము నియతముగా నుండును మరియు మధ్యాక్కర, అల్పాక్కరలకు తప్ప మిగిలిన అన్ని అక్కరలకు పాదాదిన సూర్యగణము నియతముగా నుండును. కాగా, అక్కరలలో చంద్రగణము లేనిది ఒక్క మధ్యాక్కరయే. అట్లే సూర్య గణము లేనిది అల్పాక్కరమాత్రమే. (మధ్యాక్కరయందు పాదమధ్య, పాదాంతములందు సూర్యగణముండును). ఇవి అక్కరలయొక్క సామాన్య లక్షణములు.

అక్కరలకు లాక్షణికులందరును లక్షణములుచెప్పి లక్ష్యములు ప్రదర్శించినారు గాని, తెలుగు సాహిత్యమున వీటికి ప్రయోగములేదు. ఒక్క మధ్యాక్కరను మాత్రము నన్నయగారు, ఆయన ననుసరించి ఎఱ్ఱనగారు భారతమున ప్రయోగించినారు. (మధురాక్కరయు ఒక్కసారిమాత్రము ప్రయుక్తమైనది. నన్నయగారు మాత్రమే దానిని ప్రయోగించినారు). ఆధునిక కాలమున ఒక్క మధ్యాక్కరకేకాక అక్కరభేదము లన్నింటికిని శ్రీ విశ్వనాథ

సత్యనారాయణగారు ప్రచారము కల్గించినారు. అయితే ఆధునిక కాలమున మధ్యాక్కరకే ప్రాచుర్యము కలిగినది. మిగిలినవి అరుదే.

**మహాక్కర**

అయిదు విధములైన అక్కరలలో 'మహాక్కర' మొదటిది. దీనికి ప్రతి పాదమందును ఉండవలసిన గణక్రమమిది :

1 సూ.+2 ఇం.+1 చం.

మొత్తమేడు గణములు. భీమన తరువాతి లాక్షణికులు పైన చూపిన గణక్రమములో-రెండవ, నాల్గవ గణములు ఇంద్రగణములగుటకు బదులు సూర్యగణములు గూడ కావచ్చునని ఒక మార్పు సూచించినారు. లాక్షణికులెవరును చెప్పకున్నను గమనించవలసిన విశేషాంశమొకటి యున్నది. రెండవ, నాల్గవ గణములు సూర్యగణములు కావచ్చుననగా, ఒకేపాదమున ఒకేసారి రెండవ, నాల్గవ గణములు సూర్యగణము లుండవచ్చుననికాదు-రెండవది సూర్యగణమైనపుడు నాల్గవది సూర్యగణము కారాదు. అట్లే నాల్గవది సూ. గ. అయినపుడు రెండవది కారాదు. మరొక యంశమేమనగా, రెండవదో, నాల్గవదో-ఏదో ఒకటి-సూర్యగణమయినప్పుడు పాదాదిన సూర్యగణముకాక ఇంద్రగణమే ఉండవలయును. అనగా-పాదము మొత్తముమీద సూర్యగణ మొకేఒకటి ఉండవలయును కాని రెండుండరాదు. ఈ విశేషాంశము వి. పెద్దన కా. చూ.లో చూపిన లక్ష్యము వలన తెలియవచ్చును. అతని 'మహాక్కర' లక్ష్యములోని రెండవపాదమిది :

"ఆరయ-రెండవ-నాల్గవ-చోట్ల
నర్కుండ-యినునుండ-నర్చుచుండ".

పై పాదమున నాల్గవగణము సూర్యగణము (చోట్ల గలము) కాగా, మొదటిది ఇంద్రగణము (ఆరయ-భ). ఇంతకు ఈ విశేష నియమ మైచ్ఛికమే యని లాక్షణికుల లక్ష్యపద్యములవలన స్పష్టమగును.

మహాక్కరకు పంచమ గణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది. ఉదాహరణము పైన చూపబడినది.

**మధ్యాక్కర**

అయిదు విధములైన అక్కరలలో 'మధ్యాక్కర' రెండవది. దీనికి ప్రతి పాదమందును ఉండవలసిన గణక్రమ మిది :

2 ఇం. + 1 సూ. + 2 ఇం. + 1 సూ.

మొత్తము ఆరు గణములు. ప్రాస నియమమున్నది. లాక్షణికులందరును మధ్యాక్కరకు ప్రతి పాదమున చతుర్థగణాద్యక్షరము యతి చెల్లునని చెప్పినారు. అయితే, యుద్ధమల్లుని బెజవాడ శాసనమందలి మధ్యాక్కరలయందు పంచమ గణాద్యక్షరము యతి చెల్లినది. నన్నయగారు భారతమందు మధ్యాక్కరలలో పంచమ గణాద్యక్షరమే యతి చెల్లించినారు. లాక్షణికులందరును నన్నయగారికి

తరువాతివారు. మధ్యాక్కర పాదము సమాన గణక్రమముతో రెండు భాగములుగా (ఒక్కొక్క-భాగమున 2 ఇం+1 సూ.) విరుగునుగాన, లాక్షణికులు చతుర్థ గణాద్యక్షరమును యతి చెల్లించియుండురు. ఆధునిక కాలమున శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ శ్రీ మద్రామాయణ కల్పవృక్షము నందు మధ్యాక్కరలలో పై రెండులక్షణముల సమన్వయించినట్లుగా, చతుర్థ, పంచమ గణాద్యక్షరములు—ఒకే పాదమున రెండుచోట్ల–యతి చెల్లించినారు. 'విశ్వనాథ మధ్యాక్కరల' యందు మాత్రము పంచమ గణాద్యక్షరమునే చెల్లించగా, ఇతరులు చాలావరకు చతుర్థ గణాద్యక్షరమునే చెల్లించినారు.

ఉదా :

i. పంచమ గణాద్యక్షర యతికి :

"అవసరయజ్ఞుండయి వ్యాసుఁడే కేంచె - నవని న త్తపసి"

—భార. ఆది. 4-253.

ii. చతుర్థ గణాద్యక్షర యతికి :

"అసదృశతేజుఁడు బ్రాహ్మ-ణానీకసహితుఁడై కడఁగి"

—భార. అర. 4-310.

iii. చతుర్థ, పంచమ గణాద్యక్షరయతికి :

"ప్రాణంబులందున సర్వ-భారంబు-బాసి తేలికగ"

—రామా. కల్ప. బాల. కల్యాణ. 1.

**మధురాక్కర**

అయిదు విధములైన అక్కరలలో 'మధురాక్కర' మూడవది. దీనికి ప్రతి పాదమం దుండవలసిన గణక్రమ మిది :

1 సూ.+3 ఇం.+1 చం.

మొత్త మయిదు గణములు. చతుర్థగణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమ మున్నది.

ఉదా :

'తనర, జనకుండు, నన్నప్ర-దాతయు, నుభయత్రాత
యును న,నఁగ నింతు,లకు ముప్పు-రొగిన గు,రువులు వీర
లనఘ, యుపనేత, మఱియు ని-రంతరా,ధ్యాపకుండు
ననఁగఁ, బురుషున, కియ్యేవు-రనయంబు,ను గురువులు

—భార. ఆది. 4-49.

**అంతరాక్కర**

అయిదు విధములయిన అక్కరలలో 'అంతరాక్కర' నాల్గవది. దీనికి ప్రతి పాదమం దుండవలసిన గణక్రమ మిది :

1 సూ.+2 ఇం.+1 చం.

మొత్తము నాల్గు గణములు. ప్రాసనియమమున్నది. భీమన, వి. పెద్దనల మతమున చతుర్థ గణాద్యక్షరము యతి చెల్లును అంతరాక్కరకు వారు వ్రాసిన లక్ష్యమువలన ఈ యంశము స్పష్టమగును. (ముద్రిత కవిజనాశ్రయ ప్రతులందు అంతరాక్కర లక్ష్యపద్యపు ప్రథమపాదమున మూడవ గణపు చివరి యక్షరము యతి చెల్లినట్లు కన్పించును. మిగిలిన మూడు పాదములందు చతుర్థ గణాద్యక్షరము యతి చెల్లినది. ఈ మూడు పాదములదృష్ట్యా, మరియు వి. పెద్దన లక్షణము దృష్ట్యా క. జ. లక్ష్యమందలి మొదటి పాదపు స్థితి విచార్యము. ఆ పాదమందును చతుర్థ గణాద్యక్షరమే యతి చెల్లియుండవలెను. అప్పుడది ప్రస్తుతము ముద్రిత ప్రతులలో నున్నట్లు-

'ఇనను, రేంద్రచం, ద్రంబులి-ప్పాటవచ్చి'

అనికాక-

'ఇనను, రేంద్రచం, ద్రంబులు-నిట్లువచ్చి'

అని యుండుట సమంజసము. తరువాతి లాక్షణికులగు అనంతాదులు మూడవ గణపు చివరి యక్షరము యతి చెల్లునని చెప్పినారు. అనంతాదులు చెప్పిన యంశము కొంత వింతగా కన్పించును. అక్షరసంఖ్యనుబట్టి కాక గణసంఖ్యను బట్టి యతి చెల్లింపు చెప్పవలసిన అన్ని సందర్భములందును ఏదో ఒక గణాద్యక్షరమునే తప్ప, గణమధ్యాక్షరమునుగాని, గణాంతాక్షరమునుగాని చెప్పుట జరుగలేదు. ఈ యొక్కచోట మాత్రమే ఇట్లు చెప్పుటకు కారణము గమనించ దగినది.

అంతరాక్కరలో పాదాంతమందుండు చంద్రగణము 'నగలము' (III U I) గాని, 'రలము' (UIUI) గాని యగుచో, అది రెండు సూర్యగణములుగా (III-UI అని, లేదా UI-UI అని) విరుగును. అప్పుడు ఈ 'అంతరాక్కర' తేటగీతి పద్యమగును. (చూ. తేటగీతి.). 'తేటగీతి'లో చతుర్థ గణాద్యక్షరము యతి చెల్లును. భీమన, వి. పెద్దనలు చెప్పిన యతి చెల్లింపుదృష్ట్యా 'అంతరాక్కర' ప్రాసనియమముగల తేటగీతి యగును. (భీమన లక్ష్యములోని చంద్రగణము 'రలము'. వి. పెద్దన లక్ష్యములోని బేసిపాదములందలి చంద్రగణము 'నగలము', సరిపాదములోనిది 'రలము'). అనంతాదులు అంతరాక్కరకు సంభవించు ఈ 'తేటగీత'త్వమును తొలగించుటకు చతుర్థగణాద్యక్షరమునకు బదులు, తృతీయగణాంతాక్షరమును యతి చెల్లించవలెనని చెప్పియుందురు. వీరి లక్ష్యములందు కన్పించు చంద్రగణములు కొన్ని రెండు సూర్యగణములుగా విరుగుటకు వీలులేనివిగూడ నున్నవి. ఈ విధముగా 'అంతరాక్కర'కు తేటగీతిత్వాభాస కలిగించుట, తొలగించుటలనుబట్టియే, దీని యతిస్థాన విషయమున లాక్షణికులలో మతభేద మేర్పడియుండును.

ఉదా : i. చతుర్థ గణాద్యక్షరయతికి :

'కమల, మిత్రుండు, సురరాజ-గణయుగంబు

కమల, శత్రుని, తోఁ జెంది-కందళింప

నమరుఁ, బ్రావళ్లు, నర్థంబు-నతిశయిల్ల

నమల, మగునంత, రాక్కర-మబ్ధిసంఖ్య'.

—కా. చూ. 8-56.

ii. తృతీయ గణాంతాక్షరయతికి :

'మొగిని, సర్వార్తు, సేవ్య-ములు, ఫలరాజి

నగము,లిచ్చు న,మర్చ-ణా,యత్తబుద్ధి."

—రామా. కల్ప. కిష్కిం. సమీకరణ. 254

### అల్పాక్కర

అయిదు విధములైన అక్కరలలో 'అల్పాక్కర' చివరిది. దీనికి ప్రతి పాదమందుండు గణక్రమమిది :

2 ఇం.+1 చం.

మొత్తము మూడు గణములు తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

'ఎప్పుడు, సంగీత-హేలాస్వనం

బప్పురం,బుమియు వా-యువు చలించు'.

—రామా. కల్ప. కిష్కింధ. సమీకరణ. 257.

### రగడలు

రగడలు 'జాతి' పద్యములు. (చూ. జాతులు.). ద్విపదవలె రగడయు రెండు పాదములుగల పద్యము. అయితే, రగడకు ఆదిప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము. తెలుగులో రగడభేదములకు తప్ప అంత్యప్రాస యే పద్యమునకును నియతముగా చెప్పబడలేదు. జానపద గేయములలో రగడ భేదములకున్న అత్యంత సాన్నిహిత్యమును గుర్తించిన లాక్షణికులు రగడ భేదములకే విశిష్ట లక్షణమును నియతము చేసియుందురు.

రగడభేదములను లాక్షణికులు వైతాళీయ భేదములనుగా చెప్పినారు. (చూ. వైతాళీయములు.) సంగీతశాస్త్రము ననుసరించి చూచినచో వేరువేరు తాళములతో, వేరువేరు గతులతో నీ రగడలు సాగును. కావున రగడభేదము

లాయా గతులనుబట్టి యేర్పడినవని చెప్పవచ్చును. సంగీతశాస్త్రమునందు త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ గతులు ప్రసిద్ధములు. వీటిలో సంకీర్ణ గతిని విడిచి, మిగిలిన నాల్గు గతులలో సాగు రగడలను లాక్షణికులు చెప్పినారు. ఈ గతుల కనువుగా నొదుగు మాత్రాగణములనుబట్టి రగడలలో ప్రధాన భేదములు నాలుగు.

i. హయప్రచార రగడ

ii. మధురగతి రగడ

iii. ద్విరదగతి రగడ

iv. హరిణగతి రగడ.

ఇవి వరుసగా 3, 4, 5, 7 మాత్రలుగల గణములతో త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతులలో సాగును. ప్రతి పాదమందును సమాన మాత్రాసంఖ్యగల గణములు నాలుగుండుట రగడల సామాన్య లక్షణము. కాని ఒక్క హరిణగతి రగడయందు మాత్రము సప్తమాత్రా (3+4=7 లేదా 4+3=7) గణములు రెండే యుండును. (హరిణగతియందును లెక్కకు నాల్గు గణములు-3+4+3+4 ఉండునుగాని ఆ నాల్గు సమానసంఖ్యగల మాత్రాగణములు కావు. రెండు అసమాన మాత్రాసంఖ్యాగణములు కలిసి ఒక సప్తమాత్రాగణ మగుచున్నది. వీటిని సప్తమాత్రాగణములుగానే లెక్కించి హరిణగతిలో పాదమునకు రెండు సప్తమాత్రాగణములు చెప్పబడినవి. అప్పుడు ఈ రగడయందును సమమాత్రా గణములే యున్నట్లగును. అయితే, మిగిలిన రగడలయందు సమమాత్రాగణములు నాలుగుండగా, ఇందులో రెండే యుండును ఇది గమనించవలసిన యంశము.). మొదటి మూడు రగడభేదములందు తృతీయ గణాద్యక్షరమున యతి చెల్లును. హరిణగతి రగడయందు ద్వితీయ గణాద్యక్షరము యతిచెల్లును.

ప్రధానమైన ఈ నాల్గు రగడభేదములను రెట్టించుటవలన వరుసగా-తురగవల్గన, హరిగతి, జయభద్ర (విజయభద్ర), వృషభగతి యను మరి నాల్గు రగడభేదము లేర్పడినవి. ఈ రెట్టింపువలన ఏర్పడిన మొదటి మూడు భేదములందు పాదమున కెనిమిదేసి గణములు, వృషభగతియందు (సప్తమాత్రాకములు) నాల్గు గణములుండును. మరియు మొదటి మూడింట పంచమ గణాద్యక్షరము, చివరిదానిలో తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. ఈ రెట్టింపు లిట్లుండగా, వీటిలో 'తురగవల్గన'ము నొక్కదానికే రెట్టింపు రూపముగా 'విజయమంగళ' రగడను చెప్పినారు. దీనితో రగడభేదములు మొత్తము తొమ్మిదయినవి.

లాక్షణికు లొక్క 'తురగవల్గనము'ను మాత్రమే రెట్టించి 'విజయ మంగళము'గా చెప్పినారుతప్ప, హరిగతి మొదలగువాటిని రెట్టించి చెప్పలేదు. పాదములు సుదీర్ఘములగునని చెప్పియుండకపోవచ్చును. కాని 'తురగవల్గనము'ను వారు రెట్టించి చెప్పుటనుబట్టి మిగిలినవాటినిగూడ రెట్టించుటకు వీలున్నదని స్పష్టము. ఈ వీలును గమనించియే కావచ్చును, శ్రీనాథుడు తన

'శివరాత్రిమాహాత్మ్యము'నందు 'హరిగతి'కి రెట్టింపు రూపమును ప్రయోగించి ఒకచోట దానిని తాళరగడ' అని, మరొకచోట 'విషమరగడ' అని పేర్కొన్నాడు. (రగడయందు విషమత్వమేమియును లేదుకాన, దీనిని 'విషమరగడ' యనుటకన్న 'తాళరగడ' యనుటయే సమంజసము. పాదముయొక్క సుదీర్ఘత్వ మీ పేరులో సూచితముకూడ నగుచున్నది.) శ్రీనాథుడుతప్ప, లాక్షణికులు చెప్పని ఈవిధమైన రెట్టింపునకు రెట్టింపు రగడభేదమును మరి యేకవియు ప్రయోగించినట్లు కానరాదు. ఈ తాళరగడనుకూడ కలుపుకొన్నచో, రగడ భేదములు పది యగును.

లాక్షణికులు చెప్పని మరియొక రగడభేదము 'ఉదాహరణ' కావ్యములందు కన్పించుచున్నది. తన 'లక్షణసారసంగ్రహము'లో 'ఉదాహరణ' కావ్యమునకు లక్ష్యము రచించిన చిత్రకవి పెద్దన ఈ క్రొత్త రగడభేదమును 'హంసగతికళిక' అని పేర్కొన్నాడు. (ఉదాహరణ కావ్యములందు ప్రయుక్తమగు రగడలను 'కళిక'లని, అర్ధరగడలను 'ఉత్కళిక'లని యందురు. చూ. ఉదాహరణ కావ్యము.) అయితే చి. పెద్దన నవవిధరగడ భేదములనే తన లక్షణ గ్రంథమున చెప్పినాడుగాని, ఈ 'హంసగతి'ని దానియందు చేర్చి పది భేదములుగా చెప్పలేదు. మరే లాక్షణికుడును ఈ భేదమును పేర్కొనైన పేర్కొనలేదు. దీనికి కారణము రగడల పద్ధతికి కొంత విరుద్ధముగా దీనియందు మొదటి రెండు గణములు ఖండ (ద్విరద) గతికి, మిగిలిన రెండు గణములు త్ర్యస్ర (హయప్రచార) గతికి చెందియుండుట కావచ్చును. ఈ గణక్రమమునుబట్టి 'హంసగతి' రగడ 'విషమరగడ' యగుచున్నది. ఈ విషమగతిగల 'హంసగతి'ని గూడ చేర్చినచో రగడభేదములు పదునొకండగును.

'రగడ' జాతిపద్య మగుటచే (ఆది) ప్రాస దీనికి నియతము. కాని, అయ్యలరాజు నారాయణామాత్యుడు తన 'హంసవింశతి' యందు (ఆది) ప్రాస నియమములేని 'మధురగతి' రగడను ప్రయోగించి, దానిని 'మంజులరగడ' అని పేర్కొన్నాడు. (ఆది) ప్రాస నియమములేని ద్విపద 'మంజరీద్విపద' యైనట్లు, రగడయు 'మంజులరగడ' యగునని ఆయన భావించినట్లు కన్పించును. ఈ 'మంజుల రగడ'కు అంత్యప్రాసయు లేకుండుట గమనించవలసిన మరొక యంశము. ప్రాస నియమములేని పద్యము 'ఉపజాతుల'లో చేరును. (చూ. ఉపజాతులు). గాన, యతిస్థానమున ప్రాస యతియు నుపయోగించవచ్చును. 'మంజుల రగడ'లో ప్రాస యతియు నుపయోగింపబడినది. కాగా 'మంజుల రగడ' యనగా, ఆద్యంత్య ప్రాసలులేని, ఉపజాతివర్గమునకు చేర్చబడిన 'మధురగతి' రగడయని చెప్పవలసియున్నది. ఈ దృష్టితో చూచినచో 'ప్రాస' నియమములేనిచో ప్రతి రగడయు 'మంజుల' రగడ యగుననిపించును. ద్విపద విషయమున 'మంజరి'వలె, రగడల విషయమున 'మంజుల' పదము దాని ప్రాసనియమ రాహిత్యమునకు సూచకమగుచున్నది. కాగా 'మంజుల హయప్రచారము', 'మంజుల

హరిగతి' ఇత్యాదిగా పేర్కొనబడవచ్చును. ఈ విధముగా ప్రతి రగడయు రెండు విధము లగుచున్నది. కాని 'మధురగతి'కి తప్ప మిగిలినవాటికిట్టి ప్రయోగము కానరాదు.

మరొకయంశము : ఒకేపదము ఉభయ పాదములందు వ్యాపించి యుండగూడదని ద్విపద విషయమున లాక్షణికులు చెప్పినారుకాని, రగడ విషయమున నెవ్వరును చెప్పలేదు. అయినను సాంప్రదాయికముగా ఈ నిషేధమును కవులు పాటించుచున్నారు. కాని నారాయణామాత్యుడు తన 'మంజుల' రగడయందు ఈ నిషేధము నుల్లంఘించి, ఒకేపదము రెండుపాదములందు వ్యాపించునట్లుగా ప్రయోగించినాడు. ద్విపదయందును ఈ ఉల్లంఘనము అరుదుగానే కన్పించును. ఇంకొక యంశము : నారాయణామాత్యుడు మంజుల రగడయందంత్యప్రాస నియమమును పాటించలేదుగదా! కాని కాశీఖండమందు శ్రీనాథుడు 'మణికర్ణిక' రగడయందు అంత్యప్రాస నియతిని పాటించలేదు. (మణికర్ణిక రగడ యనగా, కాశీక్షేత్రమందలి మణికర్ణికా ఘట్టమును వర్ణించిన రగడయని ప్రసిద్ధము. ఈ రగడ 'హరిగతి రగడ' (చూ. కాశీ. 6-125.) శ్రీనాథుడితరత్ర తాను రచించిన రగడలయం దంత్యప్రాస నియతి పాటించి ఈ యొక్కచోట మాత్రము పాటించలేదు. అంత్యప్రాసనియమము రగడకు పాక్షికమని ఆయన భావించియుండును. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్పవృక్షమున రగడల కంత్యప్రాసను పాక్షికముగానే పాటించినారు. ఇట్లే ఆధునిక రచనలయందు పలుచోట్ల చూడవచ్చును.

రగడలవిషయమున గమనించదగిన ప్రధానాంశ మింకొకటియున్నది. రగడలలో నుపయోగింపదగిన గణములు 3-4-5-7 మాత్రల గణములని చెప్పినంతమాత్రమున, వాటి యునికి ఇష్టమువచ్చినట్లుగా నుండుటకు వీలులేదు. గణములలో నుండవలసిన మాత్రాసంఖ్యను మాత్రమేచెప్పి యూరకొనక, ఆయా మాత్రాగణములనుగూడ లాక్షణికులు పేర్కొనినారు. ఉదాహరణమునకు త్రిమాత్రాగణములనగా గల, నగణములు మాత్రమే. 'లగ'ము త్రిమాత్రకమే అయినను, అది ఎదురునడకగల గణముగాన, నిషేధింపబడినది. ఇట్లే జ-జల-య గణములు ఆయా మాత్రాసంఖ్యాగణములుగా రగడలందు నిషిద్ధములు ఏడు మాత్రలుగల గణములనగా, లగ, జగణేతరత్రి, చతుర్మాత్రాగణముల కూడికమాత్రమే. ఇట్లు లాక్షణికులు నిషేధించుటకు కారణము, వీటి నుపయోగించినచో నాయా రగడలకు ఉద్దిష్టమయిన త్ర్యస్రాది గతులకు భంగము కలుగుటయే యని చెప్పవలయును. కాని పలువురు కవులు ఈ నిషేధమును పాటించలేదు. పింగళి సూరన తన కళాపూర్ణోదయమున (8-238)

'అహం క్రి-యాత్మక-మగు శం-ఖంబును'

అని మధురగతి రగడలో నిషేధింపబడిన జగణమును ప్రయోగించినాడు. ధూర్జటి తన 'శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము'న (2-152)

'జయజయ-సహస్ర-లింగా-లయ ద
ర్శనమా-త్రస్థిత-మోదా-పాదక'

అని మధురగతికి రెట్టింపైన 'హరిగతి'యందును జగణమును ప్రయోగించినాడు. పాల్కురికి సోమనాథుడు (బసవోదాహరణము-షష్ఠీవిభక్తికళిక') హయప్రచార మునకు రెట్టింపయిన తురగవల్గనమందు

'వెండి-యునోం-కార-సార-విదిత-ముదిత-మేళనునకు'

అని ఆ రగడకు నిషిద్ధమయిన 'లగ'ము నుపయోగించినాడు. ఇట్లే ఇతరత్ర గమనించవచ్చును. ఆధునిక రచనలలో గతివైవిధ్యముకొరకని ఇట్టి నిషిద్ధ గణ ప్రయోగమును కవులు విరివిగా చేసినారు.

ఈ వ్యతిక్రమ మిట్లుండగా, రగడల పాదములందు గణములనుబట్టి కాక, పాదము మొత్తమునకుగాని, సగపాదమునకుగాని యుండవలసిన మాత్రా సంఖ్యను మాత్రమే దృష్టియందుంచుకొని పలుమంది కవులు రగడలను రచించి నారు. ఉదాహరణమునకు మధురగతియందు పాదమునకు చతుర్మాత్రాగణ ములు నాలు గుండవలెననగా, పాదము మొత్తమునకు పదునారు మాత్రలు. ఇవి నాల్గేసి నాల్గేసిగా విరుగవలెను. అనగా, 4వ, 5వ మాత్రలు, 8వ, 9వ మాత్రలు, 12వ, 13వ మాత్రలు కలిసి ఒకే అక్షరము (గురువు) కారాదు. ఇట్లు కలిసినచో 4+4 గా విరుగక 3+5 గానో 5+3 గానో మరొక విధముగానో విరుగును. పై నుదాహరించిన కళాపూర్ణోదయమందలి రగడ (8-238) లో

'అరయ, జీవమయ-మగు కౌ-స్తుభమును
నెరయ, వైజయం-తీ సౌ-రభమును'

అను పాదములలో 4వ, 5వ మాత్రలు కలిసి ఒకేవర్ణము (జీ, వై) గా ప్రయుక్త మైనవి. పాదపూర్వార్ధమందు మొత్తముగా లెక్కకు ఎనిమిది మాత్రలున్నవి తప్ప అవి 4+4 గా కాక, 3+5 గా విరిగినవి. అనగా ఇక్కడ పాదార్థమున కుండవలసిన మాత్రాసంఖ్యయే ప్రధానమైనది తప్ప, గణములబట్టి విరుగుదల కాలేదు. రెట్టింపు రగడ భేదములందు రెండు గణములను కలిపి ఒకే గణముగా భావించుటయు కొన్నిచోట్ల గమనించవచ్చును. అనగా తురగవల్గనమందు త్రిమాత్రాగణము లెనిమిదియనిగాక, షణ్మాత్రాగణములు నాల్గని భావించుట. ఉదాహృత సోమనాథ రగడయం దట్లే భావింపబడినది. శ్రీనాథుని మణికర్ణిక రగడయందు ఈవిధమయిన రీతి, వ్యతిక్రమములు 46 చోట్ల నున్నవి. (ఆ రగడ 64 పాదములు గలది.) కాగా గణములనుబట్టికాక, పాదమం దుండవలసిన మాత్రాసంఖ్యను మాత్రమే దృష్టియందుంచుకొని రగడలను రచించుట కవు లలో నొక సంప్రదాయముగా నేర్పడిన దనవచ్చును. నిషిద్ధ గణప్రయోగము గూడ ఈ మాత్రాసంఖ్యాదృష్టినే సూచించును. సోమనాథుని రగడలోని లగ మిట్లేర్పడినదే. (వెండియు-నోం-4+2=6). అయితే ఈవిధమైన వ్యతిక్రమములు

కొన్ని కొన్ని చోట్ల రగడల నిర్దిష్టగతికి పోషకములు కావనుట గమనించదగిన యంశము.

'జాతి' విభాగమునకు చెందిన రగడ సామాన్యముగా రెండు పాదముల తోడి ఒక రగడగా మాత్రమేకాక, కొన్ని రగడలు కూడి మాలికగా ఉండును. అయినను రెండేసి పాదములకే ఆద్యంతప్రాసలు. కాగా మొత్తముమీద సరి సంఖ్యాపాదములే యుండును. 'ఉపజాతి' విభాగమునకు చెందిన మంజులరగడ బేసిపాదములతోగూడ నుండవచ్చును. కారణము (ఆది) ప్రాసనియతి లేక పోవుటయే. అయితే రెండు పాదములకు మాత్రము తగ్గియుండుటకు వీలులేదు.

ద్విపదకువలె రగడకును 'కావ్యత్వ'ము కలిగించినవాడు పాల్కురికి సోమనాథుడే. శ్రీనాథునినుండి తెలుగు సాహిత్యమున రగడల ప్రయోగము విరివిగా సాగినది. తెలుగునందుకన్న కన్నడమందు రగడ (రఘట) లకు విస్తృత ప్రయోగమున్నది. తెలుగునందున్నన్ని భేదములు అందు లేవు. మధురగతి, ద్విరదగతి, తురగవల్గనములకు సమానములగు మందానిల, లలిత, ఉత్సాహ రఘటలు మాత్రమే అందున్నవి.

షట్పదభేదములు, మరియు ఆధునిక గేయములు ఈ రగడ భేదము లపై ఆధారపడియున్నవి. (చూ. షట్పదలు, 'గేయము')

## హయప్రచార రగడ

హయప్రచార రగడ త్రిమాత్రాగణములతో నేర్పడునది. ఇందు ప్రతి పాదమున నాల్గేసి త్రిమాత్రాగణములుండును. త్రిమాత్రాగణములనగా న-గలములు మాత్రమే. లగము త్రిమాత్రాగణమే యైనను లాక్షణికులు నిషే ధించినారు. (చూ. రగడలు.). తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము.

ఉదా :

'రాజి తంబు-రత్న మయము
భ్రాజి తంబు-ప్రసవ మయము.'

—రామా. కల్పా. కిష్కింధ. నియమపాలన. 319.

## తురగవల్గన రగడ

హయప్రచార రగడకు రెట్టింపు 'తురగవల్గన రగడ. ఇందు పాద మున కెనిమిది త్రిమాత్రాగణములు (లగముతప్ప) ఉండును. పంచమగణాద్యా క్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము. (చూ. హయప్రచార రగడ.)

ఉదా॥:

'దళర ధావ నీళ విమల-తరత పఃఫ లావ తార

నిశిత శరల ఘుప్ర యోగ-నిహత తాట కావి హారః.'

కళా. 2-159.

## విజయమంగళ రగడ

తురగవల్గన రగడకు రెట్టింపు 'విజయమంగళ' రగడ. (చూ. తురగవల్గన రగడ.) ఇందు ప్రతి పాదమున త్రిమాత్రాగణములు (లగము తప్ప) పదునారుండును. 5వ, 9వ, 13వ గణాద్యక్షరములు (అనగా, పాదమున మూడు చోట్ల) యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము.

ఉదా :

'విజయమంగళప్రసక్తి-వెలయభవ్యమహితభక్తి

విరళచిత్తవృత్తరక్తి-వితతమందబలుకుదుక్తి

విజితవితతవిషయశక్తి-వృద్ధినందదలతు వ్యక్తి

విలసితాత్మకలితముక్తి-విదితరమ్యసత్యసూక్తి.'

ఛం. హం. 65.

## మధురగతి రగడ

మధురగతి రగడ చతుర్మాత్రాగణములతో నేర్పడునది. ఇందు ప్రతి పాదమున చతుర్మాత్రాగణములు నాలుగుండును. జగణము చతుర్మాత్రాగణమే యైనను లాక్షణికులు నిషేధించినారు. (చూ. రగడలు.). తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటుగా నంత్యప్రాసయు నియతము.

ఉదా :

'పదియా' ర్వన్నియ-బంగరు వలపును

మెదిలెడి తళుకుల-మేఖల చెలువును.

—కళా. 8-237.

## హరిగతి రగడ

మధురగతి రగడకు రెట్టింపు 'హరిగతి' రగడ. (చూ. మధురగతి రగడ). ఇందు ప్రతిపాదమున జగణేతరములైన చతుర్మాత్రాగణములు ఎనిమిదియుండును. పంచమగణాద్యక్షరము యతి చెల్లును, (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము.

ఉదా :

'జయజయ, కలశీ, సుతగిరి, కన్యా-శైవలి, నీతట, కల్పమ, హీరుహ

జయజయ, దక్షిణ, రజత, క్షితిధర,-సంయమి, సేవిత, పాదస, రోరుహా'

—శ్రీకాళ. మాహా. 2-153.

## తాళ రగడ

లాక్షణికులు చెప్పని రగడ భేదమీ 'తాళరగడ'. శ్రీనాథుడు దీనిని మూడుమార్లు (శివరాత్రి మాహాత్మ్యము 4-88, 91; 5-21) ప్రయోగించి, మొదట 'తాళవృత్త' మని, రెండవచోట 'విషమవృత్త' మని, మూడవచోట కేవలము 'రగడ' యని పేర్కొన్నాడు. ఎట్లు పేర్కొన్నను ఈ మూడును 'హరిగతి' రగడకు రెట్టింపు రూపములు. (చూ. హరిగతి రగడ). ప్రతిపాదమున జగణేతరమైన చతుర్మాత్రా గణములు పదునారుండును. 5 వ, 9 వ, 13 వ గణముల ఆద్యక్షరములు (పాదమున మూడుచోట్ల) యతి చెల్లును. (ఆది) ప్రాసతో పాటు అంత్యప్రాసయు నియతము. పాదపూర్వోత్తరార్ధముల కంత్యప్రాస మైచ్ఛికముగా చెల్లింపబడినది. శ్రీనాథుడు తప్ప నెవరును ఇట్టి రగడను ప్రయోగించినట్లు కానరాదు. (విశేషములకు చూ. రగడలు)

ఉదా : (ఒకే పాదము).

'దవుదౌ, వులగాం, చెంగై, లాసము-తరుణేం-దుకళా-ధరుని ని-వాసము

దళహరి, నికట, స్థాన, స్థపుటిత-ధవళ చ్ఛాయా, చ్ఛేదవి, లాసము.'

—శి. రా. మా. 4-88.

## ద్విరదగతి రగడ

ద్విరదగతి రగడ పంచమాత్రా గణములతో నేర్పడునది. ఇందు ప్రతిపాదమున పంచమాత్రా గణములు నాలుగుండును. జల-యగణములు పంచమాత్రాగణములే యైనను లాక్షణికులు నిషేధించినారు. (చూ. రగడలు). తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు నంత్యప్రాసయు నియతము.

ఉదా :

"ఓ హంసి, నీ చేత - నున్నయది, నా బ్రదుకు

నా హృదయ, మింతిదెం - దమునేక, ముగ నదుకు".

—ప్రభా. 5-152.

**విజయభద్ర రగడ**

ద్విరదగతి రగడకు రెట్టింపు 'విజయభద్ర' రగడ. (చూ. ద్విరదగతి రగడ). ప్రతిపాదమున జల-యగణేతరములైన పంచమాత్రాగణము లెనిమిది యుండును. 3 వ, 5 వ, 7 వ గణముల ఆద్యక్షరములు (పాదమున మూడుచోట్ల) యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు నంత్యప్రాసయు నియతము. ఈరగడకే 'జయభద్ర' మని నామాంతరము.

ఉదా :

దారిప్ర, కర్ణన ధరా - ధరకోణ, ఘనశిలా-
త్త వితర్ది, కాపరి - స్తరణ ర, మ్యంబైన
దారి మ, ధ్యన ధరా - ధరఝురీ, సారణీ-
దర నీల, పదిలఘూ - త్తమ వారి, మృదువైన

—రామా. కల్ప. కిష్కింధ. నియమపాలన. 323.

**జయభద్ర రగడ**

చూ. విజయభద్ర రగడ.

**హరిణగతి రగడ**

హరిణగతి రగడ సప్తమాత్రాగణములతో నేర్పడునది. ఇందు ప్రతి పాదమున సప్తమాత్రాగణములు రెండుండును. సప్తమాత్రాగణమనగా త్రిమాత్రా+చతుర్మాత్రాగణముల సమ్మేళనము. (3+4=7, లేదా 4+3 కూడ కావచ్చును.). అయితే త్రిమాత్రాగణములలో లగమును, చతుర్మాత్రాగణము లలో, జగణమును లాక్షణికులు నిషేధించినారు. ద్వితీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము. (చూ. రగడలు.)

ఉదా :

విహగశాత్మజ-వినుము ముదమున
వృషభగతి సగ-మిడిన పదమున
వితతిగిరులను-వెలయ నుంచఁగ
హరిణగతియగు-నార్యులెంచఁగ.

—ల. సా. సం. 2-139.

**వృషభగతి రగడ**

హరిణగతి రగడకు రెట్టింపు 'వృషభగతి' రగడ. (చూ. హరిణగతి రగడ.) ఇందు ప్రతి పాదమున సప్తమాత్రాగణములు నాలుగుండును. (సప్త

మాత్రాగణ మనగా 3+4 అని, లేదా 4+3 అనికూడ కావచ్చును. లగ-జగణ ములు నిషిద్ధములు.). తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతో పాటు అంత్యప్రాసయు నియతము. (చూ. రగడలు.)

ఉదా :

'కొమ్మ-వేగిర,మేటి-కేకొన-గోర-గోరట, విరులు-గిల్లుము

తమ్మి-పువ్వుల,మీద-జలములు-ధార-దారక,యుండఁ-జల్లుము.

—పారి. 4-16.

## హంసగతి రగడ

'హంసగతి' రగడ లాక్షణికులు చెప్పని యొక రగడభేదము. ఇందు ప్రతి పాదమున రెండు (జల-యగణేతర) పంచమాత్రాగణములు+లగేతర త్రిమాత్రాగణములు రెండుండును (5+5+3+3). 'ద్విరదగతి' సగపాదము, 'హయప్రచార'పు సగపాదము కలసి ఒక పాదముగా నేర్పడిన మిశ్రరగడ రూపమిది. (చూ. రగడలు). తృతీయ గణాద్యక్షరము యతి చెల్లును. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు నియతము. ఈవిధమైన రగడభేదము 'ఉదాహరణ కావ్యము'లందే కనుపించుచున్నది.

ఉదా :

'మఱియును గ,టాక్షజిత-మారునందు

తఱిత్రాడు, సొమ్మగు ను-దారునందు.'

—త్రిపురాంతకోదాహరణము. సప్తమి. కళిక.

## అర్ధహంసగతి రగడ

హంసగతి రగడభేదము 'అర్ధహంసగతి'. (చూ. హంసగతిరగడ.). ఇందు ప్రతి పాదమున ఒక పంచమాత్రాగణము+ఒక త్రిమాత్రాగణముండును. (5+3. జల, యగణములు-లగము నిషిద్ధములు. (చూ. రగడలు.). ప్రాసనియమ మున్నది. ఈ అర్ధహంసగతికి ఉదాహరణ కావ్యములందు ఉత్కళికా రూపముననే ప్రయోగము కన్పించును. ఉత్కళికలియందు యతి చెల్లింపు ఉండదు. (చూ. ఉదాహరణ కావ్యము.)

ఉదా :

'ఇలయు సలి-లంబు

వెలుగు నని-లంబు.

—త్రిపురాంతకోదాహరణము. సప్తమి. ఉత్కళిక.

**మంజుల రగడ**

'మంజుల రగడ' లాక్షణికులు చెప్పని యొక రగడ భేదము. (ఆది) ప్రాసతోపాటు అంత్యప్రాసయు లేని 'మధురగతి' రగడకు అయ్యలరాజు నారాయణామాత్యుడు తన 'హంసవింశతి'లో పెట్టిన పేరిది. కాగా (ఆది) ప్రాస, అంత్యప్రాస లేక రచింపబడిన ప్రతిరగడ భేదము 'మంజుల రగడ' కావచ్చునని తోచును. అనగా 'మంజుల హరిణగతి, మంజుల ద్విరదగతి'... ఇత్యాదిగా నుండవచ్చునన్నమాట. ప్రాసనియమము లేదుగాన ఇది ఉపజాతి వర్గమునకు చెందును. కాగా ప్రాసయతి చెల్లింపవచ్చును. కాగా, 'జాతి' వర్గమునకు చెందిన రగడ (ఆది) ప్రాసలేనిదై, 'మంజుల రగడ' అనుపేర 'ఉపజాతి' వర్గమునకు చెందుచున్నది. (చూ. జాతులు, ఉపజాతులు).

ఉదా :

i. శ్రీ వైకుంఠ - క్షేత్రం, బున దగు
వాసు దేవునకు - వందన, మొనరించి

ఇందు ఆద్యంత ప్రాసలు లేవు.

ii. వీర రాఘవుల - జేరి నుతింపుచు.

ఇందు ప్రాసయతి చెల్లినది.

iii. ఆమోదస్థితి - యందలి సంక-
ర్షణు నకుఁగర్ణా - చ్ఛాదన ములనిడి.

ఇందు 'సంకర్షణ' పదము ఉభయపాదములకు వ్యాపించినది.

—హంస. 4-214.

**కళిక**

ఉదాహరణ కావ్యము (తద్భేదము) లందు ఉపయోగింపబడిన రగడలను 'కళిక' లందురు. రగడ సహజముగా రెండుపాదముల పద్యము. కళిక యందు ఎనిమిది పాదములుండుట నియతము. అయితే రెండేసి పాదములకు ఆద్యంత ప్రాసములు భేదింపవచ్చును. అనగా ఒకే భేదము (రగడలలో పలు భేదములున్నవి. చూ. రగడలు) నకు చెందిన నాల్గు రగడల మొత్తమునకు కళిక యనిపేరు. (చూ. ఉదాహరణ కావ్యములు).

**ఉత్కళిక**

కళికయందు ఉపయోగింపబడు రగడ పాదము (చూ. కళిక) లో సగభాగముతో రూపొందిన దానిని 'ఉత్కళిక' అందురు. కళికా పాదమందు

ఎన్ని ఏవిధమైన గణములుండునో అన్నింటిలో సగము ఉత్కళికా పాదమున నుండును. (విశేషములకు చూ. ఉదాహరణ కావ్యములు.).

**ఆర్యా భేదములు**

ఆర్యా భేదములు సంస్కృత ఛ్ఛందస్సునకు చెందినవి, మరియు 'జాతి' వర్గములలోనివి. (చూ. జాతులు.).

ఆర్యా భేదము లన్నింటికిని మూలము 'ఆర్య.' ఈ ఆర్యా లక్షణము నందు, పాదముల యునికిని వెనుక ముందులుగా మార్చుటలయందు కలిగిన తేడాలవలన 'ఆర్యా భేదములు' రూపొందినవి. ఈ భేదములు 'ఆర్య' లని 'గీతు' లని రెండు వర్గములుగా విభజింపబడినవి.

ఆర్యా వర్గమున నీక్రింది యైదు భేదములున్నవి.

i. పథ్యార్య ii. విపులార్య
iii. చపలార్య iv. ముఖచపలార్య
v. జఘన చపలార్య.

గీతి వర్గమున నీక్రింది నాల్గు భేదములున్నవి.

i. గీతి ii. ఉపగీతి
iii. ఉద్గీతి iv. ఆర్యాగీతి.

**ఆర్య**

ఆర్యా భేదముల కన్నింటికి మూలము 'ఆర్య'. సంస్కృత ఛ్ఛందో రీతులకు చెందిన 'జాతి' పద్యము. (చూ. జాతులు.).

ఆర్యా లక్షణమిది :

ఆర్యకు పూర్వార్థమున ఏడు చతుర్మాత్రాగణములు, చివర నొక గురువు ఉండును. ఈ ఏడింటిలో బేసిగణముగా (1, 3, 5, 7 వ గణస్థానము లందు) జగణము - అది చతుర్మాత్రాగణమైనను-ప్రయోగింపగూడదు. కాని, ఆరవగణము మాత్రము జగణమో లేదా నలమో తప్పక కావలెను. ఆరవగణము మొదటి యక్షరము తరువాత యతి. (సంస్కృతీయపద్ధతి ననుసరించి ఆరవగణపు మొదటి అక్షరముతో పదము పూర్తిఅయి, తరువాతి అక్షరముతో మరొక పదము మొదలగును. తెలుగు పద్ధతినిబట్టి ఆరవగణ మందలి రెండవ అక్షరము యతి చెల్లును. చూ. యతి.). ఏడవగణము నలమైనప్పుడు ఆరవగణము తరువాత యతి.

ఉత్తరార్థమున గూడ గణక్రమము పూర్వార్ధమందు వలెనే యుండును గాని, ఆరవ గణస్థానమున ఒకే ఒక లఘువుండును. ఉత్తరార్థమున పంచమగణము నలమయినచో చతుర్థగణము తరువాత యతి, లేకున్నచో పూర్వార్థమందు వలెనే యతి (ఉత్తరార్థమున ఆరవ గణస్థానమున ఒకే లఘు వర్ణముండును గాన దాని తరువాత యతి.).

ఇది ఆర్యా సామాన్యలక్షణము. (లక్ష్యమునకు చూ. పథ్యార్య.).

యతి చెల్లింపు విషయమున తెలుగు లాక్షణికులు పై విధమున గాక పూర్వోత్తరార్థములు రెంటింట సప్తమ గణాద్యక్షరమునే చెప్పినారు. నలములు కారణముగా యతిస్థానము మారదు.

## పథ్యార్య

ఆర్యా భేదములలో పథ్యార్య మొదటిది. (చూ. ఆర్యాభేదములు). ఆర్యా భేదము లన్నింటికి సామాన్యముగా చెప్పబడిన లక్షణముతో నిదియుండును. అయితే పూర్వార్థ మందలి మొదటి మూడు గణములొక పాదముగా, మిగిలిన భాగము రెండవ పాదముగా విరుగును. ఉత్తరార్థము గూడ ఇట్లే. కాగా బేసిపాదములు పొట్టిగా, సరిపాదములు పొడవుగా మొత్తము నాల్గు పాదము లేర్పడును. సరిపాదములందు మాత్రమే యతి నియమముండును. ఆర్యా సామాన్యలక్షణమున చెప్పిన యతిస్థానములు సరిపాదములలో మూడవ గణపు మొదటి యక్షరము తరువాత యతి. మిగిలిన యంశము లిట్లే చూడవలెను. (పూర్వార్థమున ఆరవ గణమన్నను, సరిపాదమున మూడవ గణమన్నను నొకటే.)

తెలుగులో సరిపాదములందు నాల్గవ గణపు ఆద్యక్షరము యతిచెల్లును మరియు ప్రాస నియమమున్నది.

ఉదా :

ఎప్పుడొ చేసిన కర్మం<br>
బిప్పుడు ఘటియిల్లుననుట - మృషయగునో<br>
ఇప్పుడ చేసిన కర్మం<br>
బిప్పుడ ఫలియింప - ఋజువిదిగో.

—రామా. కల్ప. అరణ్యా. జటాయు.

## విపులార్య

విపులార్య యనునది ఆర్యాభేదములలో నొకటి. (చూ. ఆర్యాభేదములు.)

సంస్కృతచ్ఛందోనియమముల ననుసరించి, పద్యపాదాంతమందు పదచ్ఛేదము జరుగవలెను. అనగా పాదము పూర్తియగుటతో పదముకూడ ముగియవలెను. 'పథ్యార్య' యందు దీ నియమము పాటింపబడక పోయినచో, అది 'విపులార్య' యనబడును. అనగా విపులార్యయందు మొదటిపాదమునుండి రెండవ పాదమునకు, మూడవ పాదమునుండి నాల్గవ పాదమునకు ఒకే పదము వ్యాపించియుండవలెను అయితే పూర్వార్థమునుండి ఉత్తరార్థమునకు (రెండవ పాదమునుండి మూడవ పాదమునకు) మాత్రము వ్యాపించరాదు. ఆర్యా

సామాన్య లక్షణమందు పూర్వోత్తరార్ధ విభజనయేతప్ప ప్రతి అర్ధమున పాద విభజన లేదు. కాగా పూర్వోత్తరార్ధములు రెండు పాదములన్నట్లు భావించినచో మూడవ గణముతో పదము పూర్తికాకున్నను సంస్కృతయతినియమభంగము లేదు. పథ్యార్యలో పాదవిభజన జరుగుటవలన పూర్వార్ధమందు, ఉత్తరార్ధమందును ఉభయపాదములందాకే పదము వ్యాపించు స్థితి యేర్పడినది. ఈ స్థితిని బట్టి విపులార్య రూపొందినది. ఈ దృష్ట్యా రెండవ మూడవ పాదములందాకే పదము వ్యాపించియుండరాదు. (గణాదిలక్షణమునకు చూ. పథ్యార్య.).

ఉదా :

'అమరెడు పథ్యనుచారుపా
దములు సమాంఘ్రులనుగూర్పఁ-దగియిట్లున్
క్షమలో విపులార్యారూ
పమిది యగును దెలియఁ-బవనసుతా'.

—ల. సా. సం. 2-76.

## చపలార్య

చపలార్య యనునది ఆర్యాభేదములలో నొకటి. (చూ. ఆర్యాభేదములు.).

'పథ్యార్య' యొక్క (చూ. పథ్యార్య.) పూర్వార్ధమందును, ఉత్తరార్ధమందును రెండవ, నాల్గవ (బేసిపాదములలో రెండవ, సరిపాదములలో మొదటి) గణములు జగణములై, ఆ జగణములకు ముందువెనుకల గురువులుండినచో 'చపలార్య' యగును. (అనగా ఒకటవ గణము సగణము కావలయును. ఇట్లే అయిదవ గణము భగణమో, గగమో కావలయును. మూడవ గణము మాత్రము గగమే కావలయును. అప్పుడే రెండవ, నాల్గవ గణములు జగణములై వాటి కిరుప్రక్కల గురువులుండు స్థితి ఏర్పడును.)

(తెలుగు లాక్షణికులగు చి. పెద్దన, అప్పకవులు రెండవ గణము జగణము కావలెనన్న యంశమును చెప్పలేదు. నాల్గవ గణము జగణము కావలెనని చెప్పినను దాని కిరువైపుల గురువు లుండవలెనన్న యంశము నప్పకవి చెప్పలేదు

ఉదా :

రమణీ వినీల నేత్రాం
తముగ్ధ రోచిర్విసార-ణమ్మందున్

విమలీ కృతాత్మ భావ
ప్రమావిభూతిగని-రాణించెన్.

—కల్పితము.

**ముఖచపలార్య**

ముఖచపలార్య యనునది ఆర్యాభేదములలో నొకటి. (చూ. ఆర్యా భేదములు.)

'పథ్యార్య'లో పూర్వార్థము మాత్రమే చపలార్యా లక్షణముతో నున్నచో 'ముఖచపలాచార్య' యగును. (చూ. పథ్యార్య; చపలార్య.)

ఉదా :

మనుజుండుపొందు సౌఖ్య
మ్మనంగ దుఃఖమనగాన-దంతయు వా
ని నిజప్రవృత్తి ననుసరిం
చునదియె యగుగద విశుద్ధమతీ !

—కల్పితము.

**జఘనచపలార్య**

జఘనచపలార్య యనునది ఆర్యాభేదములలో నొకటి. (చూ. ఆర్యా భేదములు.)

'పథ్యార్య'లో ఉత్తరార్థము మాత్రమే చపలార్యా లక్షణముతో నున్నచో 'జఘనచపలార్య' యగును. (చూ. పథ్యార్య; చపలార్య.)

ఉదా :

విరిసిన వసంతకాలపు
టొరిపిడిలో మనసు లోభమొంది యిటుల్
తరుణీ త్వదీయ హాస
ప్రరోహ మందున ప-రవశించెన్.

—కల్పితము.

**గీతి**

'గీతి' యనునది ఆర్యా భేదములలోని గీతి వర్గమునకు చెందినది. (చూ. ఆర్యా భేదములు.).

'పథ్యార్య' యొక్క పూర్వార్థము వలెనే ఉత్తరార్థము గూడ నున్నచో 'గీతి' యగును. (ఆర్యయందు పూర్వోత్తరార్థముల లక్షణములలో కొంత భేదమున్నది ఆర్య ఉభయార్థములందు విషమలక్షణము కలది కాగా, గీతి సమలక్షణము కలది యగుచున్నది. (చూ. ఆర్య.).

ఉదా :

వెలయఁగఁ బథ్యా పూర్వా
ర్థ లక్షణము రెండరలను రాఁజేయన్
సలలిత మతులగు సుకవులు
పలికిరి యిది గీతియగుచుఁ - బ్లవగపతీ.

—ల. సా. సం. 2-80.

**ఉపగీతి**

'ఉపగీతి' యనునది ఆర్యా భేదములలోని గీతి వర్గమునకు చెందినది. (చూ. ఆర్యా భేదములు.).

'పథ్యార్య' యొక్క ఉత్తరార్థము వలెనే, పూర్వార్థము గూడ నున్నచో 'ఉపగీతి' యగును. (ఆర్యయందు పూర్వోత్తరార్థ లక్షణములందు కొంత భేదమున్నది. ఆర్య ఉభయార్థములందు విషమలక్షణము కలది కాగా, ఉపగీతి సమలక్షణము కలదగుచున్నది. (చూ. ఆర్య.).

ఉదా :

ధరఁ బథ్యార్యకుఁ గలిగిన
చరమార్థమె-రెం-డు-సగములలో
బరగిన నుపగీతి యగున్
సురగిరి సమధై-ర్య-శుభచరణా.

—ల. సా. సం. 2-82.

**ఉద్గీతి**

'ఉద్గీతి' యనునది ఆర్యాభేదములలోని గీతివర్గమునకు చెందినది. (చూ. ఆర్యాభేదములు.)

పథ్యార్యయొక్క పూర్వార్థము ఉత్తరార్థముగా, ఉత్తరార్థము పూర్వార్థముగా కూర్చబడినచో 'ఉద్గీతి' యగును. (చూ. ఆర్య.)

ఉదా :

తుదపథ్యార్థము మొదలుగ
మొదలర్థము తుద-గ-మొనసినఁ దా

నది యుద్గీతికిఁ బేరగు
సదాగతికుమారవర్గ్య-జయధుర్యా.

—ల. సా. సం. 2-81.

**ఆర్యాగీతి**

ఆర్యాగీతి యనునది ఆర్యాభేదములలోని గీతివర్గమునకు చెందినది. (చూ. ఆర్యాభేదములు.)

ఆర్యయందు పూర్వార్ధమున ఏడు చతుర్మాత్రాగణములు, చివర నొక గురువుండగా, ఆర్యాగీతియందు ఎనిమిది చతుర్మాత్రాగణములుండును. ఎనిమిదవ గణము గుర్వంతమగును. (అనగా 8వ గణము సగణమో గగమో యగును.) ఈ పూర్వార్ధమువలెనే ఉత్తరార్ధముగూడ నుండును. పథ్యార్య యందువలె నాల్గు పాదములు ఆర్యాగీతియందు విరుగును.

ఆర్యకు పూర్వోత్తరార్ధముల చివర నొక్కొక్క గురువు చేర్చగా ఆర్యాగీతి యగునని తెలుగు లాక్షణికులు చెప్పినారు. ఇట్లు చెప్పటవలన ఎనిమిదవ గణము గగమే యగును. (ఆర్యా పూర్వోత్తరార్ధముల చివర నొక గురువుండును. మరొక గురువు చేరగా గగమగును.). కాని సగణముకూడ నుండ వచ్చును.

గణపాద వ్యవస్థనుబట్టి ఆర్యాగీతి తెలుగునందలి కందమునకు కచ్చితముగా సరిపోవును. అయితే, ఆర్యాగీతియందు యతినియమములు ఆర్య ననుసరించును. తెలుగున సప్తమగణాద్యక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

గీతియరల రెంటితుదన్
ఖ్యాతిగ నొక్కొక్క గురువు-నట యెక్కింపన్
రీతివహింపఁగ నార్యా
గీతియగుం గంధమిదియె-కేసరిపుత్రా.

—ల. సా. సం. 2-83.

**వైతాళీయములు**

వివిధ తాళానుగుణముగా నుండుటనుబట్టి కొన్ని ప్రత్యేకవిధములకు చెందిన జాతి పద్యములను లాక్షణికులు 'వైతాళీయము' అని పేర్కొన్నట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. సంస్కృతచ్ఛందో గ్రంథములలో 'పింగళచ్ఛందము' మొదలుకొని ఇవి చెప్పబడుచున్నవి. తెలుగునందు చి. పెద్దన మరియు అప్పకవి ఈ వైతాళీయములను చెప్పినారు.

పింగళుడు వైతాళీయ లక్షణములను మాత్రాసంఖ్యను పేర్కొని చెప్పగా తెలుగున కొంత మాత్రాసంఖ్య, కొంత అక్షరగణములతో కలగలుపుగా చెప్పబడినది.

వైతాళీయములందు గమనించవలసిన ప్రత్యేకలక్షణ మొకటియున్నది. కొన్ని కొన్ని స్థానములందలి రెండు మాత్రలు కలిసి ఒక వర్ణము (గురువు) కారాదు. ఉదాహరణమునకు సరిపాదములలో సరి+బేసి సంఖ్యామాత్రలు రెండేసి కలిసి ఒక గురువర్ణముగా రూపొందగూడదు. (ఆయా వైతాళీయ భేదముల లక్షణములలో ఈ విశేషాంశములను వివరముగా గమనించవచ్చును.)

వైతాళీయములలో ఎనిమిది భేదములను పింగళుడు చెప్పినాడు. 1. వైతాళీయము. 2. ఔపచ్ఛందసికము, 3. ఆపాతలిక, 4. ప్రాచ్యవృత్తి, 5 ఉదీచ్యవృత్తి, 6. ప్రవృత్తకము, 7. చారుహాసిని, 8. అపరాంతిక. 'దక్షిణాంతిక' మను నొక భేదమును తరువాతి లాక్షణికులు అదనముగా చెప్పినారు. కాగా వైతాళీయ భేదములు మొత్తము తొమ్మిది యగును. పింగళుడు చెప్పిన ఎనిమిదింటిలో మొదటి రెండు ప్రధానములైనవి. మిగిలినవి వైతాళీయమందు చేయబడు అల్పమైన మార్పులవలన, పాదసమ్మేళనముల, సమానతల వలన ఏర్పడును.

## వైతాళీయము

వైతాళీయ పద్యభేదములలో మొదటిది, ప్రధానమైనది 'వైతాళీయము'.

వైతాళీయములో బేసిపాదములందు పదునాల్గు మాత్రలు, సరిపాదములందు పదునారు మాత్రలుండును. అన్ని పాదములు గురువుతోనో, రగణముతోనో పూర్తి కావలెను. సరిపాదములలో సరి+బేసి మాత్రలు కలిసి ఏకవర్ణము (గురువు) కాగూడదు. అయితే ఈ నియమము ఎనిమిది మాత్రలవరకే. (అనగా 2-3; 4-5; 6-7; మాత్రలు కలిసి ఒకే వర్గము కాగూడదన్నమాట.). సరిపాదములలో ఆరు లఘువులు వరుసగా నుండరాదు. ఇది పింగళుడు చెప్పిన లక్షణము.

తెలుగులో చి. పెద్దన చెప్పిన లక్షణరీతి క్రిందివిధముగా నున్నది.

i. బేసిపాదములు = 6 మాత్రలు+ర+లగ

ii. సరిపాదములు = 8 మాత్రలు+ర+లగ

బేసిపాదములలో 7 వ అక్షరము, సరిపాదములలో 9 వ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమము కలదు.

ఉదా :

'ఎగిరి యెగిరి-హేళిమార్గముల్

చిగిరిచి చిగిరిచి-చీల్చుకొంచునున్

తగిలి తగిలి-దండనోగ్రులై
రగులుచు రగులుచుఁ-బ్రౌఢవహ్నులై'.

—రామా. కల్ప. కిష్కింధ. గజపుష్పి. 108.

### ఔపచ్ఛందసిక

వైతాళీయ భేదములలో 'ఔపచ్ఛందసికము' రెండవది. దీనికి లక్షణమంతయు 'వైతాళీయము'దే. (చూ. వైతాళీయము.). కాని ప్రతి పాదాంతమున ఒక గురువధికముగా చేరును. మాత్రల కలయికకు సంబంధించిన నియమములన్నియు వైతాళీయమునకున్నట్లే. ఇది పింగళుడు చెప్పిన లక్షణము.

తెలుగులో చి. పెద్దన చెప్పిన లక్షణము ఈ క్రిందివిధముగా నున్నది.

i. బేసి పాదములు : 6 మాత్రలు + ర + య

ii. సరి పాదములు : 8 మాత్రలు + ర + య.

బేసిపాదములందు 7 వ అక్షరము, సరిపాదములందు 9వ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

ధర లఘువులు-దప్పకన్ రయంబుల్
చరణంబులపై-సంధిలం గవీంద్రుల్
విరచింపఁగ-వింతలై తలిర్పన్
సరవినౌప-చ్ఛందసంబు మించున్.

—ల. సా. సం. 2-112.

### ఆపాతలిక

వైతాళీయ భేదములలో 'ఆపాతలిక' మూడవది. ఇది పూర్తిగా 'వైతాళీయ' లక్షణముతోనే యుండును. (చూ. వైతాళీయము). అయితే, వైతాళీయమున పాదములు గురువుతోనో, లేదా రగణములోనో పూర్తికాగా, 'ఆపాతలిక' యందు పాదములు గగముతోనో, భగణముతోనో పూర్తి యగును. మాత్రల కలయిక మొదలగు నంశములన్నియు వైతాళీయమందు వలెనే.—ఇది పింగళుడు చెప్పిన లక్షణము.

తెలుగులో చి. పెద్దన చెప్పిన లక్షణము ఈక్రిందివిధముగా నున్నది.

i. బేసిపాదములు : 6 మాత్రలు + భ + గగ

ii. సరిపాదములు : 8 మాత్రలు + భ + గగ

బేసిపాదములలో 7 వ అక్షరము, సరిపాదములలో 9 వ అక్షరము యతిచెల్లును. ప్రాస నియమమున్నది.

ఉదా :

'కడగి కడగి - క్రమ్మెదు రుగ్రుల్
సుడియక సుడియక - చొత్తురు దారుల్
కడచి కడచి - ఘాతలు గాఁగన్
బొడుతురు విడుతురు - భూరి భుజోగ్రుల్.

—రామా. కల్ప. కిష్కిం. గజపుష్పి. 109.

ప్రాచ్యవృత్తి

వైతాళీయ భేదములలో 'ప్రాచ్యవృత్తి' నాల్గవది. ఇది పూర్తిగా వైతాళీయ లక్షణముతోనే యుండును. (చూ. వైతాళీయము.). అయితే ఒక మార్పు మాత్రల కలయిక విషయమున అధికముగా నిందున్నది. ప్రాచ్యవృత్తి యొక్క సరిపాదములందు అయిదవ మాత్ర నాల్గవ మాత్రతో కలిసి ఒకే అక్షరముగా (గురువుగా) తప్పక నుండవలెను. వైతాళీయమున నిట్లుండగూడదు. మిగిలిన మాత్రల కలయిక మొదలగు నంశములు వైతాళీయము ననుసరించియే యుండును.

తెలుగున బేసిపాదములలో 7 వ అక్షరము, సరిపాదములలో 9 వ అక్షరము యతిచెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

అయిదవ లఘు - వంటి క్రింద మా
త్ర యొసగ నసరులఁ - బ్రాచ్యవృత్తిఁ బొ
ల్చియు వైతా - ళీయజాతి నొం
ది యిది యొప్పగన్ - దేవ మారుతీ.

—ల. సా. సం. 2-117.

ఉదీచ్యవృత్తి

వైతాళీయ భేదములలో 'ఉదీచ్యవృత్తి' ఐదవది. ఇది పూర్తిగా వైతాళీయ లక్షణముతోనే యుండును. (చూ. వైతాళీయము.). అయితే మాత్రల కలయిక విషయమున నొక మార్పు ఇందు అధికముగా నున్నది. ఉదీచ్యవృత్తియొక్క బేసిపాదములందు మూడవమాత్ర రెండవమాత్రతో కలిసి ఒకే అక్షరము (గురువు) గా తప్పక నుండవలెను. వైతాళీయమున నిట్లుండ రాదు. మిగిలిన మాత్రల కలయిక మొదలగు నంశములు వైతాళీయము ననుసరించియే యుండును.

తెలుగున బేసిపాదములలో 7వ అక్షరము, సరిపాదములలో 9వ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఉదా :

తగనుమ్మనున్-దక్షిణాంతికా
ఖ్యగయుక్పదమది-యంటకుండురీ
తిగా నగు ను-దీచ్యవృత్తి మె
చ్చగ వాతాత్మజ-పూరిసన్నుతా.

—ల. సా. సం. 2-116.

ప్రవృత్తక

వైతాళీయ భేదములలో ప్రవృత్తకము ఆరవది. ఇందు బేసిపాదములు ఉదీచ్యవృత్తి లక్షణముతో (చూ. ఉదీచ్యవృత్తి), సరిపాదములు ప్రాచ్యవృత్తి లక్షణముతో (చూ. ప్రాచ్యవృత్తి) నుండును.

బేసిపాదములలో 7వ అక్షరము, సరిపాదములలో 9వ అక్షరము యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

ఈ పద్యము చి. పెద్దన 'ప్రవర్తకము' అని, అప్పకవి 'వర్తకము' అని పేర్కొన్నారు. 'ప్రవృత్తక' మన్న పేరు పింగళుడు పెట్టినది.

ఉదా :

స్థిరనొమ్మిదలు-దీచ్యవృత్తియుం
బరగసర్లఁదగఁ-బ్రాచ్యవృత్తియుం
జొరంగయతిఁ-జూడ నిట్లయై
వరుసతోనిడఁ-బ్రవర్తకంబగున్.

—ల. సా. సం. 2-118.

చారుహాసిని

వైతాళీయ భేదములలో 'చారుహాసిని' ఏడవది. 'ఉదీచ్యవృత్తి' యొక్క బేసిపాదముల లక్షణముతోనే పద్యమందు నాల్గుపాదములును రచింపబడినచో 'చారుహాసిని' యగును. (చూ. ఉదీచ్యవృత్తి.). నాల్గుపాదములందును 7 వ అక్షరమే యతిచెల్లును. ప్రాసనియమమున్నది.

వైతాళీయ భేదములన్నింటిలో నీ 'చారుహాసిని' యు 'పరాంతికము' మాత్రమే నాల్గుపాదములు సమలక్షణము కలవి. (మిగిలిన యన్ని భేదములందును సరి, బేసి పాదలక్షణములు భేదించును.).

ఉదా :

కవులొప్పగడ - గాఁబ్రవర్త కా

ఖ్య వృత్తమునఁ - గల్గు బేసి పా

ద వైఖరుల్ - దాల్చు నంఘ్రులన్

జవాంచితా - చారుహాసినిన్.

—ల. సా. సం. 2-120.

**పరాంతిక-2**

వైతాళీయ భేదములలో 'పరాంతికము' ఎనిమిదవది. వైతాళీయము యొక్క సరిపాదముల లక్షణముతోనే పద్యమందు నాల్గుపాదములును రచింప బడినచో 'పరాంతికమ'గును. (చూ. వైతాళీయము.). నాల్గు పాదములందును 9వ అక్షరమే యతి చెల్లును. ప్రాసనియమమున్నది.

(వైతాళీయ భేదములన్నింటిలో నీ 'పరాంతికము' మరియు 'చారుహాసిని' మాత్రమే నాల్గు పాదములందును సమలక్షణము కలవి. మిగిలిన యన్ని భేదములందును సరి, బేసిపాదముల లక్షణములు భేదించును.).

ఉదా :

వన్నె మీరఁగఁబ్ర - వర్త కాఖ్యతో

నున్న దానన్సర్ల - నుండు లక్షణం

బన్ని యంఘ్రులను - నంటఁ గూర్పఁ దా

నెన్నగాఁ దనరు - నీ పరాంతికన్.

—ల. సా. సం. 2-119.

**దక్షిణాంతిక**

వైతాళీయ భేదములలో 'దక్షిణాంతికము' తొమ్మిదవది. దీనిని పింగళుడు చెప్పలేదు. తెలుగులో చి. పెద్దన, అప్పకవి పరస్పరము భిన్నముగా దీనికి లక్షణము చెప్పినారు. చి. పెద్దన ననుసరించి లక్షణ మిట్లుండును.

i. బేసిపాదములు = వైతాళీయపాదములు. (6 మా.+ర+లగ).

ii. సరిపాదములు = ఔపచ్ఛందసిక పాదములు (8 మా+ర+య).

బేసిపాదములలో 7 వ, సరిపాదములలో 9 వ అక్షరము యతిచెల్లును. ప్రాస నియమమున్నది.

అప్పకవి ననుసరించి లక్షణమిది :

i. బేసిపాదములు : స + స + జ + గ

ii. సరిపాదములు : స + భ + ర + లగ

పాదము మొత్తమునకు గణపద్ధతిలోనే లక్షణము చెప్పబడినది. దీనిని మిగిలిన వాటికి చెప్పిన పద్ధతిలో చూపినచో—

బేసిపాదములు : 6 మాత్రలు + ర + లగ

సరిపాదములు : 8 మాత్రలు + ర + లగ.

ఇది అచ్చముగా 'వైతాళీయ' లక్షణము. (చూ. వైతాళీయము.). మరి అప్పకవి చూపిన భేదమొకటే. బేసిపాదములందు 3 వ 4 వ మాత్రలు, సరి పాదములందు 3 వ, 4 వ మరియు 5 వ, 6 వ మాత్రలు కలిసి తప్పక గురువులుగా నుండవలయును. వైతాళీయమం దిట్లుండవచ్చును, ఉండకపోవచ్చును. సరి+బేసి మాత్రలు కలిసి గురువు కాగూడదన్న దొక్కటే వైతాళీయ నియమము. ఇచ్చట బేసి+సరి మాత్రలు కలిసి గురువులైనవి. కావున నిది వైతాళీయమునకు విరుద్ధముకాదు. నిజమునకు అప్పకవి చెప్పినది ప్రాచ్యవృత్తి, ఉదీచ్యవృత్తివంటి యొక భేదమగుచున్నది. అయితే వాటియందు వైతాళీయమున నిషేధింపబడిన బేసి+సరి మాత్రల కలయిక చెప్పబడుట విశేషము. అప్పకవి 'దక్షిణాంతిక' మందది లేదు. వైతాళీయమున అనుమతింపబడినదే ఒకటి, రెండు చోట్ల మాత్రల కలయిక నియతము చేయబడినది. మరియు బేసిపాదములందలి 5 వ, 6 వ మాత్రలు, సరిపాదములందలి 7 వ, 8 వ మాత్రల కలయిక నియతముగా నిషేధింపబడినది. పూర్తిగా గణపద్ధతి ననుసరించుట వలన ఇట్టిస్థితి కలిగినది. అయితే అప్పకవి చెప్పిన ఈపద్ధతి వైతాళీయముల లక్షణ పద్ధతికి విరుద్ధము (యతి ప్రాసలు చి. పెద్దన చెప్పినట్లే అప్పకవియు పాటించినాడు).

ఉదా :

i. వళులు లముల్ - వచ్చుటట్లు నై
రలలు గ మున్ బై - రాన్ ద్వితీయంబులన్
(తి) ద్విలము బూన్చు - (దీటి) యంఘ్రులన్
దలిరుచు మారుతి - దక్షిణాంతికాఖ్యన్

—ల. సా. సం. 2-115.

ii. ఉరు సాజగ - లుండు బేసులన్
సరులందూకొను - సంభవంబులున్
దొర లేడిట - తొమ్మిదింట రా
ధరలోఁ జెన్నగు - దక్షిణాంతికన్.

—అ. క. 4-287.

**ఉపజాతులు**

'జాతులు' ఆధారముగా ఏర్పడినవి 'ఉపజాతులు'. జాతిపద్యములందు వలెనే ఉపజాతి పద్యములందును మాత్రాగణములే ఉపయోగింపబడును. (చూ. జాతులు; మాత్రాగణములు.). కాని, జాతులకున్న (ఆది) ప్రాసనియమము ఉపజాతుల కుండదు. మరియు ఉపజాతులలో యతికి బదులు ప్రాసయతియు చెల్లింపవచ్చును. యతిప్రాసల చెల్లింపులలో వచ్చిన భేదమే తప్ప జాతులకు, ఉప జాతులకు వేరే భేదమేమియులేదు. ఈ విధమైన యతిప్రాసలు సంస్కృతమున లేవు కావున, సంస్కృతీయములందు ఉపజాతి భేద మేర్పడలేదు. కాగా 'ఉప జాతి' భేదము తెలుగునకు మాత్రమే ప్రత్యేకమయినది.

ఉపజాతి పద్యము లివి :

i. ఆటవెలది

ii. తేటగీతి

iii. సీసములు

iv. మంజరీద్విపద.

**సమగీతులు**

తెలుగులోని గీతులను లాక్షణికులు విభజించిన ప్రకారము ఈక్రిందివి సమగీతులు.

i. ఆటవెలది.

ii. తేటగీతి.

ఈ రెండింటిలో ఆటవెలది యందలి నాల్గుపాదములు సమములుకావు బేసిపాదము లొకవిధముగా, సరిపాదములు మరొక విధముగా నుండును. ఇది 'విషమ' లక్షణము. తేటగీతి యందు మాత్రము విషమత్వము లేదు. కాని ఈ రెంటిని కలిపి లాక్షణికులు 'సమగీతు' లన్నారు. ఎత్తు గీత్యాదులను విషమగీతు లన్నారు. (చూ. విషమగీతులు.) విషమగీతులకు ప్రయోగము మిక్కిలి తక్కువ. సమగీతులకు విశేష ప్రయోగము ఉన్నది. వీటి ప్రచార స్వరూపము వీటి సమ విషమత్వములకు కారణమేమో యనిపించును.

**ఆటవెలది**

లాక్షణికులు చెప్పిన రెండు సమగీతులలో 'ఆటవెలది' మొదటిది. ఈ పద్యము ఉపజాతి వర్గమునకు చెందినది, (చూ. ఉపజాతులు.).

ఆటవెలది యందు బేసిపాదము లొకవిధమైన గణక్రమముతో, సరి పాదము లింకొకవిధమైన గణక్రమముతో నుండును.

బేసిపాదములు : 3 సూ. + 2 ఇం.

సరిపాదములు : 5 సూ.

(పాదమున కై దేసి గణములుండును.). ఈ పద్యము ఉపజాతి వర్గములోనిది గాన ప్రాస నియమముండదు. చతుర్థగణాద్యక్షరము యతిచెల్లును. యతికిబదులు ప్రాసయతిగూడ చెల్లవచ్చును.

ఉదా :

ఉప్పు కప్పురంబు - నొక్కపోలిక నుండుఁ
జూడఁ జూడ రుచుల - జాడవేరు
పురుషు లందుఁ బుణ్య - పురుషులు వేరయా
విశ్వదాభిరామ - వినురవేమ.

—వేమన పద్యములు.

ఆటవెలదికి (ఆది) ప్రాస నియమము పాటించినచో విషమగీతమని లాక్షణికులు చెప్పిన 'ప్రగీతి' యగును. (చూ. ప్రగీతి.). కాని (ఆది) ప్రాస నియమము వలన ప్రగీతి 'జాతి వర్గమునకు చెందుటచే, ప్రాసయతిని చెల్లించ రాదు. యతినే చెల్లించవలెను.

ఆటవెలదికిని, తేటగీతికిని 'గీతి' ('గీది') యను వ్యవహారమున్నది.

**తేటగీతి**

లాక్షణికులు చెప్పిన రెండు సమగీతులలో 'తేటగీతి' రెండవది. ఇది 'ఉపజాతి' వర్గమునకు చెందినది. (చూ. ఉపజాతులు.)

తేటగీతి యందు ప్రతిపాదమున నుండవలసిన గణక్రమమిది :

1 సూ. + 2 ఇం. + 2 సూ.

ఈపద్య ముపజాతి వర్గములోనిదిగాన ప్రాసనియమము లేదు. చతుర్థగణాక్షరము యతిచెల్లును. యతికి బదులు ప్రాసయతిగూడ చెల్లవచ్చును.

ఉదా :

కన్నె మరునకుఁ బూఁదూపు - లెన్ని లేవు!
కన్నె గేదంగి విరికెన - గావు గాక,
సూన బాణాభియాతికి - దీని గాలి
సోకి ననుగాడు తలయేలు - సోకు నపుడు.

—వసు. 3-145.

తేటగీతికి ఆది ప్రాసనియమము పాటించినచో 'అంతరాక్కర' యగును. కాని (ప్రాసలేని) ప్రతి అంతరాక్కరయు తేటగీతి కాదు. అంతరా క్కర పాదాంతమం దుండవలసిన చంద్రగణము రలమో, నగలమో అయి నప్పుడే తేటగీతికి సరిపోవును. అంతరాక్కర యందు యతి చెల్లింపు విషయ మున మత భేదమున్నది. (చూ. అంతరాక్కర.).

తేటగీతికిని, ఆటవెలదికిని 'గీతి' (గీది) యను వ్యవహారమున్నది.

## నన్నయగారి గీతములు

నన్నయగారు సీసపద్యములందు వలెనే గీతపద్యము (ఆటవెలది, తేటగీతి) లందును యతి-ప్రాసయతి నుపయోగించుటలో కొన్ని నియతపద్ధతుల ననుసరించినారు. (చూ. నన్నయగారి సీసములు.) ఈదృష్ట్యా నన్నయగారి గీతములను వర్గీకరించినచో ఆరు పద్ధతులు నిష్పన్నము లగును.

1. సర్వ యతికము : అన్నిపాదము లందును (కేవల) యతి గల గీతము.

ఉదా :

ఆ.వె. సభల వి_స్తరిల్లి - శల్యాదికములైన
నాల్గు పర్వములవి - నంగజాలి
నవమ పర్వమనఁగ - నవ్యార్థరమణీయ
మగుచు శల్యపర్వ - మతిశయిల్లు.

—ఆది. 1-52.

2. సర్వప్రాసము : పాదములన్నింట ప్రాసయతిగల గీతము.

ఉదా :

ఆ.వె. జపము సేయుచున్నఁ - దపనుఁ డాతనికిఁ బ్ర
త్యక్ష మయి త్రిలోక - చక్షుఁ డమర
వరుఁడు దురిత హరుఁడు - తరణి త్రయీమూ_ర్తి
వనజ మిత్రుఁ డిట్టు - లనియెఁ గరుణ.

—అరణ్య. 1-42.

3. బేసిపాదములలో యతి, సరిపాదములలో ప్రాసయతి గల గీతము.

ఉదా :

ఆ.వె. భ్రమ విమోహలోభ - భయపరిభూతనై
కొడుకు విడువనంత - వెడఁగనయ్య
యేను భీముశ_క్తి - యెఱుఁగక పంచిన
దానఁగాను వినుము - పినిశ_క్తి.

—ఆది. 6-283.

4. బేసిపాదములలో ప్రాసయతి, సరిపాదములలో యతి గల గీతము.

ఉదా :

తే.గీ. వినయమున ద్రోణురూపు మ - న్నన నమర్చి
ధాని కతి భ_క్తితోడఁ బ్ర - దక్షిణంబుఁ

జేసి మ్రొక్కుచు సంతతా - భ్యాసశక్తి
నస్త్ర విద్యా రహస్యంబు - లర్థిఁబడసె.

—ఆది. 5-232.

5. పూర్వార్థమున యతి, ఉత్తరార్థమున ప్రాసయతి గల గీతము. ఈ పద్ధతికి ఉదాహరణములు నన్నయగారి రచనలో లభించవు.

6. పూర్వార్థమున ప్రాసయతి, ఉత్తరార్థమున యతి గల గీతము.

ఉదా :

తే.గీ. వానిఁ జూచి నలుఁడు - దా నగ్గి శాప మీ
నున్నగతి యెఱింగి - నిన్నుఁబొంది
యహి విషంబుచేత - ననిశంబు దగ్ధుండ
నైతి నింక నాకు - నలుగ వలదు.

—అరణ్య. 2-179.

**సీసములు**

సీసము ఉపజాతి వర్గమునకు చెందిన పద్యము. (చూ. ఉపజాతులు.). ఇందు ప్రతిపాదమున వరుసగా ఆరింద్రగణములు + రెండు సూర్యగణములు = మొత్తమెనిమిది గణములుండును. ఇట్లు నాల్గు పాదములు రచించి, చివర 'గీత' మును అనుబంధముగా చేర్చవలెను. (గీత మనగా ఆటవెలది కావచ్చును లేదా తేటగీతి కావచ్చును. ఈ రెండింటికిని 'గీత' మన్న వ్యావహారమున్నది). అప్పుడీ మొత్తము కలిసి 'సీస' పద్యమని చెప్పబడును. అయితే, ఎనిమిదేసి గణములుగల నాల్గు పాదములకు మాత్రమే సీసపాదములని వ్యవహారము. అనుబంధ పద్య పాదములకు గీత పాదములని వ్యవహారము ఈ సీస-గీత పాదముల మొత్తమే 'సీస' పద్యము.

ప్రతి సీసపాదము నాల్గేసి గణముల కొకటిగా రెండు ఖండములుగా విరుగును. పూర్వ ఖండమందు వరుసగా నాలుగింద్ర గణములు, ఉత్తరఖండమందు వరుసగా రెండింద్ర గణములు + రెండు సూర్య గణములు = (మొత్తము నాల్గు) ఉండును. ఏ ఖండమున కా ఖండమందే యతి చెల్లింపు. అనగా పూర్వ ఖండాద్యక్షరమున కా ఖండమందలి తృతీయ గణాద్యక్షరము, ఉత్తర ఖండాద్యక్షరమున కా ఖండమందలి తృతీయ గణాద్యక్షరము యతిచెల్లును. (నిజమునకు పూర్వోత్తర ఖండములను రెండు పాదములని, మొత్తము సీసపాదము లెనిమిది యని, బేసిపాదము లొకరీతి గణక్రమముతో, సరిపాదము లింకొకరీతి గణక్రమముతో నుండునని, ప్రతిపాదమున తృతీయ గణాద్యక్షరము యతి చెల్లునని, గీతము ననుబంధముగా చేర్చినచో నీమొత్తము సీసపద్య మగునని చెప్పవచ్చును. కాని ఇది లాక్షణికులొప్పిన పద్ధతి కాదు). ఇట్లు రెండేసి ఖండనులుగా విభక్తమగు నాల్గుపాదముల తరువాత గీత మనుబంధింపబడును. (గీత=ఆటవెలది లేదా తేటగీతి లక్షణములకు చూ. ఆటవెలది, తేటగీతి).

సీస మువజాతి వర్గమునకు చెందినదిగాన ప్రాసనియమముండదు. అందువలన యతి చెల్లింపవలసినచోట ప్రాసయతిని గూడ చెల్లింపవచ్చును.

—ఇది సీసపద్య లక్షణము.

ఈ సీస పద్యమందు ప్రాస, ప్రాసయతి, యతి చెల్లింపులలోని కొన్ని నియమముల ననుసరించి కొన్ని సీస భేదములను లాక్షణికులు చెప్పినారు. మొత్తమా భేదములు పది.

1. సమ సీసము
2. ప్రాస సీసము
3. అక్కలి ప్రాససీసము
4. అవకలి సీసము
5. వడి సీసము
6. అక్కలివడి సీసము
7. వృత్త ప్రాససీసము
8. సర్వతః ప్రాససీసము
9. సర్వలఘు సీసము
10. విషమ సీసము

వీటిలో చివరి రెండు తప్ప మిగిలినవి ప్రాస, ప్రాసయతి, యతి చెల్లింపులలోని భేదముల ననుసరించి రూపొందినవి. 9 వది లఘ్వక్షర నియమముతో రూపొందగా, పదవది సీసపాద విరహితముగా రూపొందిన సీసపద్యము. ఇందు సీస పాదములకు బదులు వేరే పద్యపాదము లుండును. ఈ మొత్తము పదింటిలో చివరిది విషమసీసము కాగా, మిగిలిన తొమ్మిది 'సమసీసము' లనబడును. (సమ సీసమన్నది సీసపద్యభేదములలో సర్వకావ్యవ్యాప్తమైన యొకసీసముపేరుగూడ). వీటిలో మొదటి ఆరు+విషమసీసము=మొత్తమేడు భేదములను భీమనచెప్పినాడు. వి. పెద్దన అతనినే అనుసరించినాడు. ఈ మొత్తము పది భేదములను అనంతుడు చెప్పగా. చి. పెద్దన అతని ననుసరించినాడు. అప్పకవి పై పదింటిలో 3 వ, 4 వ, 7 వ భేదములను చెప్పలేదు. అనంతాదుల తరువాతి వాడప్పకవి. అతడిట్లు కొన్నింటిని వదులుటకు కారణము కనుపించదు. అప్పకవి తానుచెప్పిన సీస భేదములందును కొన్నిచోట్ల తన లక్ష్యలక్షణముల కే పొందిక లేకుండ వ్రాసినాడు. మిగిలినవారి లక్ష్య లక్షణములును అక్కడక్కడ సందిగ్ధములుగానున్నవి. అనంతుడు చెప్పినవి మాత్రము సమగ్రములు.

భీమన సీస భేదములను చెప్పుటలో కేవలము సీసపాదములనే ప్రధానీకరించి గీత పాదములను వదిలినట్లు కన్పించును. తరువాతి లాక్షణికులు గీత పాదములనుకూడ స్వీకరించినారు. ఈ స్వీకరించుటలో కొన్ని సీస భేదముల విషయమున గీత పూర్వార్ధము ఒక పాదముగా, ఉత్తరార్ధము ఇంకొక పాదముగా భావింపబడినది.

కస్తూరి రంగకవి పై పదిభేదములే కాక i. అర్ధ సమసీసము, ii. సమనామ ప్రాససీసము, iii. ఉత్సాహవేదండ సీసము, iv. గీతరహిత చతుప్ప్రాస సీసము అను మరినాల్గు భేదములను పేర్కొన్నాడు. కాని వాటి లక్ష్య లక్షణములు వ్రాయలేదు. పై పదింటిలోని సమసీస, ప్రాససీసములను చెప్పలేదు. ఏడెట్లయి

నను అతడు పేర్కొన్న పై నాల్గింటి స్వరూపమేమో తెలియుటకవకాశము లేదు. (క. రం. కవి ఏ సీసభేదమునకును లక్ష్య లక్షణములు వ్రాయలేదు.).

'అవకలి, అక్కిలి' అను పదములను లాక్షణికులు ప్రయోగించిన రీతిని గమనించినచో, కచ్చితముగా నా పదము లేయర్థము నుద్దేశించుచున్నవో చెప్పుటకు వీలు కన్పించదు. 'అక్కిలి యనగా తమిళ మందలి 'మోనై' వంటి దనియు, అవకలి యనగా 'ఎదుగై' వంటిదనియు గ్రహింపదగును' అని డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు (ఆంధ్రమహాభారతము : ఛందఃశిల్పము. పు. 472) చెప్పినారు. (తమిళ ఛందశ్శాస్త్రము ననుసరించి 'మోనై' ఆద్యక్షర మైత్రిని, 'ఎదుగై' ద్వితీయాక్షర మైత్రిని చెప్పును. ఇవి వరుసగా తెలుగులోని యతి, ప్రాసలకు సమానములు.) భీమన ననుసరించి యీాయంశము చెప్పబడినది.

సీస భేదములలో విషమసీసము చిత్రమైన పద్యము. 'ఉత్సాహ' పద్యమునకు గీతము ననుబంధించినచో విషమసీస మగును. (వివరములకు చూ. విషమసీసము.). అనగా సీసపాదములు లేకుండగనే ఇది 'సీస'ముగా చెప్పబడినది. ఒక పద్యమునకు మరొక పద్యమును అనుబంధముగా చేయుట యన్నది సీస పద్యముయొక్క ప్రత్యేకత. ఈ ప్రత్యేకత ననుసరించియే విషమసీసము ఒక సీస భేదమగుటకు వీలేర్పడి యుండవచ్చును.

జనాశ్రయ చ్ఛందము (సంస్కృతము) నందు 'శీర్షక' మని యొక పద్యము చెప్పబడినది. ఇది 'అధికాక్షర' యొక్క భేదము. అధికాక్షర చివర 'గీతిక' చేరినచో శీర్షక మగును. (వివరములకు చూ. జనాశ్రయి. అయిదవ అధ్యాయము. 44-51). ఈవిధముగ లక్షణము సంస్కృతమున చెప్పబడుటకు సీసపద్య ప్రభావమే కారణ మనిపించును. జనాశ్రయిలో చెప్పబడిన శీర్షకము లకు సంస్కృతమున లక్ష్యములు లేవు. 'లలిత' మన్న శీర్షకభేదము తెలుగు సీసమునకు దగ్గరగా నుండును.

**సమసీసము**

సీస పద్యమందు యతి, ప్రాసయతి స్వేచ్ఛగా ఉపయోగింపబడినచో అది 'సమసీస' మగును. సామాన్యముగా సీసపద్యమన్నచో, అది సమసీసమనియే భావింపబడును. (సీసపద్యపు గణక్రమాది సామాన్యలక్షణములకు చూ. సీసములు) ఈ సమసీసమందే ప్రాస, యతి, ప్రాసయతుల నుపయోగించుటలోని కొన్ని నియమములనుబట్టి ఏడు భేదము లేర్పడినవి. (చూ. సీసములు.). అవి విడిగా చెప్పబడును.

ఉదా :

సీ. సింహాసనము చారు-సితపుండరీకంబు

చెలికత్తె జెలువారు-పలుకుఁజిలుక

శృంగారకుసుమంబు-చిన్ని చుక్కలరాజు
పసిండి కిన్నెరవీణ-పలుకుఁ దోడు
నలువ నెమ్మోముద-మ్మోలు కేళిగృహములు
తళుకుటద్దంబు స-త్కవుల మనసు
వేదాది విద్యలు-విహారణ స్థలములు
చక్కని రాయంచ-యెక్కిరింత
గీ. యెపుడు నేదేవి కాదేవి-యిందుకుంద
చంద్రచందనమందార-సారవర్ణ
శారదాదేవి మామక-స్వాంతవీధి
నిండువేడుక విహరించు-చుండుఁగాత.

—శృం. నై ష. 1-5.

ప్రాస సీసము

సీస పాదములు నాల్గింటికి, (గీత పూర్వార్థ మొక పాదముగా, ఉత్తరార్థము మరొక పాదముగా భావించి) గీతపు రెండు పాదములకు, మొత్తమూరు పాదములకు (ఆది) ప్రాస చెల్లింపబడినచో, అది 'ప్రాససీస' మగును. ప్రాస సీసమందు పాదమందంతట యత్యక్షర మొకటే కావలెను. (అనగా పాద పూర్వోత్తర ఖండములందు యతిచెల్లు నక్షరము భిన్నము కాగూడదు. అట్లే గీత పూర్వోత్తరార్థములందును.) ప్రాసయతి ప్రయోగింపగూడదు. (సీసపు గణక్రమాది లక్షణములకు చూ. సీసములు.).

ఉదా :

సీ. భామిని చేనున్న - పట్టుతోరముఁ జూచి
ప్రల్లదంబునఁ ద్రెంచి - పారవైచి
యా ముని ద్రోమ మ - త్యంతమై తనుబట్టి
యతి దరిద్రునిఁ జేయ - నార్తి నొంది
భూమి వెల్వడిపోయి - పుర పురఁబొక్కుచు
బుండరీకాక్ష యో - భువన వంద్య

స్వామి నాయపరాధ - శతసహస్రంబులు
సైరింపవే కృపా - జలధి యనుచు
గీ. ప్రేమ డించు కౌండిన్యుని - భీతిఁబాపి
పృథుల సౌఖ్యంబు లొసఁగి గాం - భీర్యమమరఁ
బాముపైఁ బవ్వళించిన - ప్రభుఁడ వనినఁ
బ్రాస సీసంబు విలసిల్లుఁ - బద్మనాభ.

—అనం. ఛం. 3-27.

**అక్కిలి ప్రాస సీసము**

సీసపద్య పాదములు ఒక్కొక్కటి రెండేసిగా ఎనిమిది ఖండము లగును. ఈ ఎనిమిది ఖండములకు, గీతపద్యపు నాల్గుపాదములకు (మొత్తము పన్నెండు) (ఆది) ప్రాస చెల్లింపబడినచో, అది 'అక్కిలి ప్రాససీస' మగును. పాదమంతట (పూర్వోత్తర ఖండములందు) యత్యక్షర మొక్కటే కావలయు నని 'కవిజనాశ్రయ' మందలి లక్ష్యమువలన తెలియును. కాని అనంతాదులీ యంశమును పాటించలేదు. ప్రాసయతి ప్రయోగించ కూడదు. సీసపద్య గణ క్రమాది సామాన్య లక్షణములకు చూ. సీసములు.).

ఉదా :

సీ. ఉరగ తల్పునిఁ గాని - యుల్లంబులో నిల్పు
శరధి తల్పునిఁ గాని - సన్నుతింప
మురసంహరుని గాని - మ్రొక్కులఁ గై సేయ
నరమృగేంద్రులఁగాని - నమ్మి కొలువ
గరుడవాహను పేరుఁ-గాని వీనులఁజొన్ప
బురుషోత్తముని గాని - పూజసేయ
హరి ప్రసాదముఁగాని - యర్థిమైఁగొనవొల్ల
బరమాత్ము పనిఁగాని - భక్తిఁబూన
గీ. ధరణి నివినాదు నిత్య వర్తనము లనుచుఁ
బరఁగు వ్రతిఁగాని నీవు చే - పట్టవనిన

జరుగు నక్కిలి ప్రాససీ - సంబు కృతులఁ
బర భృతాతసి పుష్పాభ - పద్మనాభ.

—అనం. ఛం. 3-30.

'ప్రాససీస' మందలి గీతపు నాల్గుపాదములకును (ఆది) ప్రాస చెల్లినచో అక్కిలిప్రాససీస మగునని వి. పెద్దన చెప్పినాడు. (చూ. ప్రాస సీసము.)

**అవకలి సీసము**

సమసీసమునందు నియతముగా అన్ని పాదములందును (గీతపాదము లందును) యతికాక ప్రాసయతినిమాత్రమే చెల్లించినచో, అది 'అవకలిసీస' మగును. (సీసపద్యపు గణక్రమాది సామాన్యలక్షణములకు చూ. సీసములు.)

అవకలి సీసమునే అనంతుడు, చి. పెద్దనలు 'అవకలి ప్రాససీస' మన్నారు.

ఉదా :

సీ. నిజమహీమండల-ప్రజఁ బ్రీతిఁ బెంచుచు
బరమండలంబుల-ధరణిపతుల
నదిమి కప్పంబుల-ముదముతోఁ గొనుచును
బలిమి నీయని భూమి-వలయపతుల
నుక్కడఁగించుచు-దిక్కులఁ దనయాజ్ఞ
వెలుఁగించుచును విప్ర-కులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ-గాచుచు భీతుల
నగ్రజన్ములకు న-నుగ్రహమున

గీ. జారుతరమహో గ్ర-హారంబు లిచ్చుచు
దేవభోగముల మ-హావిభూతిఁ
దనరఁ జేయుచిట్లు-మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశ-వర్ధనుండ.

భార. ఆది. 1-7.

**వడి సీసము**

సీస పాదములు నాలుగు, (గీత పూర్వార్ధ మొకపాదము, ఉత్తరార్ధ మింకొక పాదముగా) గీత పాదములు రెండు = మొత్తమారు పాదములం దేపాదమున కా పాదమునందు యత్యక్షర మొకటే యున్నచో, అది 'వడిసీస' మగును. పాద పాదమునకు యత్యక్షరము మారవచ్చునుగాని, ఒకే పాదమందలి పూర్వోత్తర ఖండములకు మారకూడదు ప్రాసయతి చెల్లింపరాదు. (సీసపు గణక్రమాది సామాన్య లక్షణములకు చూ. సీసములు.).

ఉదా :

సీ. కరుణా సముద్రుండు - గజరాజ వరదుండు

గర్వితాసుర శిరః - ఖండనుండు

విహగేంద్ర వాహుండు - విబుధేంద్ర వంద్యుండు

విశ్వరక్షాచణ - వీక్షణుండు

రతిరాజ జనకుండు - రఘువంశ తిలకుండు

రణ బలోదగ్రుండు - రమ్యగుణుఁడు

గోకులాధీశుండు - గోపికా రమణుండు

గోవిందుఁ డురుకళా - కోవిదుండు

గీ. అనుచు వడి సీసముల నిన్ను - నభినుతింతు

రఖిల విద్యా విశారదు - లైన మునులు

పన్నగాధీశ తల్ప నా - పాలి వేల్ప

భక్తజన కామ్యలాభ శ్రీ - పద్మనాభ.

—అనం. ఛంద. 3-31.

గీతమును రెండు పాదములుగా గాక, నాల్గు పాదములుగానే చి. పెద్దన భావించినట్లాయన లక్ష్యమువలన తెలియును.

**అక్కిలివడి సీసము**

సమసీసమునందు పాదములన్నింట యతిమాత్రమే చెల్లించినచో అది 'అక్కిలివడి' సీసమగును. పాదపాదమునకేకాక, ఖండఖండమునకును యత్యక్షరము భేదింపవచ్చును. ప్రాసయతిమాత్రము కూడదు. (సీసపు గణక్రమాది సామాన్య లక్షణములకు చూ, సీసములు.).

ఉదా :

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగా
బునరుక్తిదోషంబు పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁజనక
ప్రకృతార్థభావంబు పాదుకో నడుకుచు
నుపపత్తియెందు నత్యూర్జితముగ
గీ. నొకటఁబూర్వోత్తరవిరోధ మొదవకుండఁ
దత్తదవయవవాక్య తాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలముగాదె.

—ప్రభా. 2-3.

'వడిసీస' మందు గీతపు నాల్గు పాదములకు యత్యక్షరము భేదించి నచో 'అక్కిలివడి సీస'మగునని వి. పెద్దన యన్నాడు. అగుచో, చి. పెద్దన యొక్క 'వడిసీస' లక్ష్యము వి. పెద్దన దృష్ట్యా అక్కిలివడిసీస మగును. (చూ. వడిసీసము.).

'అక్కిలివడి' సీసమును చి. పెద్దన 'అవకలివడి సీసమని పేర్కొన్నాడు.

## వృత్తప్రాస సీసము

సీసపు నాల్గు పాదములకు మాత్రమే (అది) ప్రాసము చెల్లినచో అది 'వృత్తప్రాస' సీసమగును. పాదపాదమునకు యత్యక్షరము భేదించవచ్చునుగాని, పాదమందలి పూర్వోత్తరఖండములకు భేదించరాదు. సీసపాదములందు ప్రాస యతి కూడదు. (సీసపు గణక్రమాది సామాన్య లక్షణములకు చూ. సీసములు.).

ఉదా :

సీ. శ్రీశ్రితవక్షుండు సింధురవరదుండు
చింతిత ఫలదాన శీలుఁడితఁడు

ఆశ్రితావనలోలుఁ-డాభీరకాంతాకు
చాగ్రకుంకుమభూషి-తాంగుఁడితఁడు
అక్రాంతజయధాముఁ-డాశాంత విశ్రాంత
యశుఁడు ధారాధర-శ్యాముఁడితఁడు
విశ్రుతవిభవుండు-విపులబలాఢ్యుండు
వికసితవదనార-విందుఁడితఁడు
గీ. అనుచు మునులును దివిజులు-నభినుతింప
జూపు చెవులపొన్నున వెన్ను- మోపియుండు
నంబుజోదరుఁడంచు ని-ట్లాంధ్రకృతులఁ
జెప్పరేని వృత్తప్రాస-సీసమగును.

—అనం. ఛం. 3-28.

ఇది దాదాపు 'ప్రాససీసము' వంటిదే. ఒక్కటే భేదము. ప్రాససీస మందు గీతపు బేసిపాదములందుకూడ (ఆది) ప్రాస చెల్లును. ఇందులో చెల్లదు. (చూ. ప్రాససీసము.).

**సర్వతః ప్రాససీసము**

సమసీసమునందు నియతముగా నన్నిపాదములందు ప్రాసయతిగా నొకే యక్షరము చెల్లించినచో 'సర్వతః ప్రాస' సీసమగును. (సీసపు గణక్రమాది సామాన్య లక్షణములకు చూ. సీసములు.)

ఉదా :

సీ. రామాంఘ్రిభక్తుండు-హేమాద్రిధీరుండు
భూమిజాశోక త-మోమిహిరుఁడు
శ్రీమాణవకలోక-సోముండు పుణ్యుండు
భీమపరాక్రమ-శ్రీమహితుఁడు
కామితఫలదుండు-ధీమంతుఁ డురువాల
రోమకోద్ధూత పూ-ర్వామరుండు
క్షేమంకరుండు సం-గ్రామపురారాతి
సామజాహితసమ-స్థేమకీర్తి

గీ. తామరసమిత్రతేజుఁడు-ద్దామగుణుఁడు
నామదివసించు నియ్యభి-రామమూర్తి
స్వామియన సర్వతః ప్రాస-నామసీస
మైమెఱయు నిది కపిసార్వ-భౌమ కృతుల.

—ల. సా. సం. (చి. పె.) 2-3.

**సర్వ లఘుసీసము**

సీస పద్యమం దుపయోగింప వలసిన ఇంద్రగణములకు బదులు పంచ లఘు (నలల) గణములను, సూర్యగణములలో కేవలము నగణములను మాత్రమే ప్రయోగించి సీసపాదములు నాల్గింటిని సర్వ లఘుకముగా రచించినచో, అది 'సర్వలఘుసీస' మగును. గీతము సర్వలఘుకము కానక్కర లేదు. (సీసపు గణ క్రమాది సామాన్య లక్షణములకు చూ. సీసములు.). సర్వలఘు సీసమునకు లాక్షణికులు చెప్పిన లక్షణమిది.

అయితే, కొందరు కవులు సీసపాదములతోపాటు గీతములను గూడ సర్వలఘుకముగా గ్రహించినారు. గీతమందును ఇంద్రగణములకు బదుల పంచలఘు గణములను, సూర్యగణములలో కేవలము నగణములను మాత్రమే ఉపయోగించినారు. ఇదిట్లుండగా, మరికొందరు కవులు సీస, గీతపాదములం దును పంచలఘుగణములకు బదులు ఇంద్రగణములలోని సర్వలఘుకమగు 'నల' మును ప్రయోగించినారు. నలము చతుర్లఘుగణము. కాగా గణమున కొక్క లఘువుగా సీసపాదములం దారు, గీతపాదములందు రెండు లఘువులు తగ్గును. మొత్తముమీద నీ యంశములన్నియు లాక్షణికు లొప్పనివి. కాని ఇతర సీస భేదములకు లక్షణము చెప్పునప్పుడు (ఒక్క భీమన తప్ప) లాక్షణికులు గీతమును గూడ గ్రహించి కలిపి చెప్పి 'సర్వలఘు' భేదవిషయమున గీతమును గ్రహింప కుండుటకు కారణము కన్పించదు.

పై యంశము లన్నింటిని గమనించినచో, సర్వలఘుసీసము క్రింద చూపబడు రీతులలో నుండుట కవకాశమున్నట్లు కన్పించును. (గమనించవలసిన యొకటి రెండంశములు : పంచలఘు గణములను ప్రయోగించినచో సీసపాద మున 36 లఘువులు (6×5 + 2×3 = 36) ఉండును. చతుర్లఘుకమగు నల ములను ప్రయోగించినచో సీసపాదమున 30 లఘువులు (6×4 + 2×3 = 30) ఉండును. ఇట్లే గీతమందును పంచలఘు గణముల నుపయోగించినచో గీత పాదమున 19 లఘువులు (3+5+5+3+3=19) ఉండును. నలముల నుపయో గించినచో 17 లఘువులు (3+4+4+3+3=17) ఉండును. అనగా 36, 30 లఘువులతో సీసపాదములు ద్వివిధములు, 19, 17 లఘువులతో గీతపాదములు ద్వివిధములు. ఈ లెక్కతో ఈ భేదములను గమనించవలెను.).

1. సీసపాదములు మాత్రమే సర్వలఘు నియమము గలది.
   i. 36 లఘువులు కలది. (లాక్షణికులు చెప్పినదిది.)
   ii. 30 లఘువులు కలది.
2. సీసపాదములతోపాటు గీతముగూడ సర్వలఘు నియమముకలది.
   i. గీ. పా. 19 లఘువులు కలది.
   ii. గీ. పా. 17 లఘువులు కలది.

ఈ రెండవ భేదమాధారముగా నీక్రింది యవాంతర భేదముతేర్పడును
   i. సీ. పా. 36 ల. — గీ. పా. 19 ల.
   ii. సీ. పా. 36 ల. — గీ. పా. 17 ల.
   iii. సీ. పా. 30 ల. — గీ. పా. 19 ల.
   iv. సీ. పా. 30 ల. — గీ. పా. 17 ల.

పై నాలుగింటి దృష్ట్యా ఈ క్రిందివిధములలోకూడ సర్వలఘు సీస ముండుట కవకాశమున్నది.

i. సీసపాదములందు మాత్రమే చతుర్లఘు-పంచలఘు గణ మిశ్రణము.
ii. గీతపాదములందు మాత్రమే చతుర్లఘు-పంచలఘు గణ మిశ్రణము.
iii. సీసపాదములు కేవల చతుర్లఘు, లేదా పంచలఘు గణములతో నుండి గీతపాదములు మిశ్రముగా నుండుట.
iv. సీసపాదములు మిశ్రముగా నుండి గీతపాదములు కేవలము చతుర్లఘు, లేదా పంచలఘు గణములతో నుండుట.

సర్వలఘు సీసము ఇన్నివిధములుగా నుండుటకు వీలున్నట్లు కన్పించినను, కొన్నిటికేతప్ప అన్నింటికి లక్ష్యములు లభించవు.

యతి చెల్లించు విషయమున లాక్షణికుల లక్ష్యములు భిన్నముగా నున్నవి. అనంతుని లక్ష్యమందు సీసపాద పూర్వఖండములయందు ప్రాసయతి, ఉత్తరఖండములందు యతి చెల్లనది. చి. పెద్దన, అప్పకవుల లక్ష్యములందు సర్వత్ర ప్రాసయతి చెల్లినది. అంతేగాక ప్రాసాక్షరముగూడ నొకటియే. గీత పద్యమునం దీ యిద్దరు యితినే చెల్లింపగా అనంతుడు ప్రాసయతి, యతి-రెంటి నుపయోగించినాడు. అయితే సర్వలఘు సీసములను రచియించిన కవులు యతి, ప్రాసయతులను సమసీసమందువలె స్వేచ్ఛగా నుపయోగించినారు. అయితే లాక్షణికులు యతిచెల్లింపు విషయమున నేమియును చెప్పలేదు. అందువలన, కవుల ప్రయోగములనుబట్టి యతి, ప్రాసయతులను సర్వలఘుసీసమున స్వేచ్ఛగా నుపయోగింపవచ్చునని చెప్పవచ్చును.

పైన వివరించిన భేదములలో లభించినంతవరకు లక్ష్యములు చూపబడుచున్నవి.

i. లాక్షణికులు చెప్పినరీతికి ఉదా :

సీ. మృగమదము తిలకమును - నగుమొగము చెలువమును
నలతి పవడముఁ దెగడు - నధర పుటము
వలుద జఘనములు బోలు - పలరు కనకపు వలువ
కలితకర చరణమణి - కటకములును
విరుల తురుమును నమలి - పురి సొబఁగు మకరికము
రచన నెసఁగిన చెవుల - రమణములును
కరకమల యుగళ ధృత - మురళియును ద్రివిధమగు
నిలుకడయు నిటలతటి - నెఱయు కురులు

గీ. తెల్ల దమ్మిరేకుల భంగి - నుల్లసిల్లు
వెడద కన్నులుగల గోప - వేషకాని
నాశ్రయించెద ననుచు ని - ట్లమరఁ జెప్ప
సర్వలఘు సీసమగు నం(డు - జలజనాభ.

—అనం. చం. 3-38.

ii. సీ. పా. 36 ల - గీ. పా. 19 ల. ఉదా :

సీ. తరుణశశి భరణ సువి - తరణ భయ హరణకర
యరుణ సరసిరుహనిభ - చరణ యుగళ
మదన మద మథన ఘన - కదన తల విజయగిరి
వదన జగదవనకరి - వదన జనక
వనజభవ దమనపుర - దనుజకుల శమనముని
మనుజసుర వరదప్రతి - దిన విలసిత
బహుళతర విభవ రిపు - దహన దవ దహనపటు
విహగ పతిగమన నుత - మహిత చరిత

గీ. ధరణి రథ తరణి శత సదృశ - హరత్రినయన
గరళ గళధనద సఖ శుభద - గగన చికుర
వరసుగుణ నికర మృదుహృదయ - శరధి శరధి
యురగ వరభరణ ధరపరమ - పురుష గిరిశ.

—రాజశే. విలా. 1-17.

iii. సీ. పా. 38 ల. - గీ. పా. 17 ల. ఉదా :

సీ. నవ వికచ సరసిరుహ - నయనయుగ నిజచరణ
గగనచర దివిజనుత - నిగమ వినుత
జలధిసుత కుచకలశ - లలితమృగ మదరుచిర
పరిమళిత నిజహృదయ - ధరణి భరణ

ద్రుహిణ ముఖ సురనికర - విహితనుతి కలితగుణ
కటిఘటిత రుచిరతర - కనకవసన
భుజగరిపు వరగమన - రజత గిరి పతివినుత
సతతజప రతనియమ - సరణి చరిత

గీ. తిమి కమఠ కిటినృహరి ము - దిత బలి నిహి
తపదప రశుధ రదళన - ఘన విదళన
ముర దమన కలికలుష సు - ముదపహరణ
కరివరద మునినరసుర - గరుడ వినుత.

—భాగవ. దశమ. 72.

## విషమ సీసము

'ఉత్సాహ' మునకు గీతము ననుబంధింప జేసినచో, నా రెండు కలిసి విషమ సీసమగును. గీతమనగా తేటగీతియు, ఆటవెలదియు కావచ్చును. కాని, 'గీతి' యని సామాన్యముగా మొదటచెప్పి, లాక్షణికులందరును లక్ష్యములం దాటవెలదినే ఉపయోగించినారు. అనంతుడు, చి. పెద్దనలు ఆటవెలదినే అను బంధించవలెనని స్పష్టముగా చెప్పినారు. (ఉత్సాహాదుల లక్షణములకు చూ. ఉత్సాహము; తేటగీతి; ఆటవెలది.)

ఉదా :

ఉత్సా. వేఁడు కాంతను బలవంత - పెట్టి యపహరించు నో
వాఁడు సృష్టి ధర్మ మర్మ - పథము బాహరించెఁబో
మూఁడు గుణము లేవొ పాళ్లు - మొనసి జగము సాగినన్
వీఁడు మాత్ర మచ్చతమము - వెట్టురూపు, సర్వథా-

గీ. రణ కితఁడు వెలుపల - యణువునుగాఁడు, ప
దార్థమైన, దాని - యందు నాత్మ
పీసమైనను బ్రతి - బింబించుఁ జీఁకటి
మొదటి ముద్ద, వెలుఁగు - ముట్టుకోదు.

—రామా. కల్ప. అరణ్యా. జటాయు. 253.

## నన్నయగారి సీసములు

తెలుగునందు ఛందోలాక్షణికులందరును నన్నయగారికి తరువాతి వారు. కాని వారు నన్నయగారు ప్రయోగించిన సీసపద్యములలోని ప్రత్యేక లక్షణములను గుర్తించినట్లు లేదు. వారు చెప్పిన సీసభేదములలో రెండింటితో తప్ప మిగిలినవాటితో నన్నయగారి సీసములకు సంబంధము లేదు. నన్నయగారి సీసములలోని ప్రత్యేకతలు యతి, ప్రాసయతుల యుపయోగములలోని వైవిధ్యమువలన కలిగినవి. నన్నయగారి సీసములలోని యీ ప్రత్యేకతలను గుర్తించిన వారు శ్రీ గిడుగు సీతాపతిగారు. వారు నన్నయగారి సీసములలో పదునారు

భేదములను గమనించి 'అప్పకవీయ' (చూ. వావిళ్లవారి అప్పకవీయము 1934 ప్రచురణ) పీఠికయందు ప్రదర్శించినారు. ఆ భేదము లిట్లున్నవి.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| సీ.యతి | సీ యతి | సీ.యతి | సీ.యతి |
| గీ.యతి | గీ.ప్రాస | గీ.య./ప్రా. | గీ ప్రా. య. |
| 5 | 6 | 7 | 8 |
| సీ.ప్రాస | సీ.ప్రాస | సీ.ప్రాస | సీ.ప్రాస |
| గీ.యతి | గీ ప్రాస | గీ.య. ప్రా. | గీ.ప్రా. య. |
| 9 | 10 | 11 | 12 |
| సీ.య. ప్రా. | సీ.య./ప్రా. | సీ.య./ప్రా. | సీ.య. ప్రా. |
| గీ.యతి | గీ.ప్రాస | గీ.య. ప్రా. | గీ.ప్రా. య. |
| 13 | 14 | 15 | 18 |
| సీ.ప్రా. య. | సీ.ప్రా./య. | సీ.ప్రా. య. | సీ.ప్రా. య. |
| గీ.యతి | గీ.ప్రాస | గీ.య. ప్రా. | గీ.ప్రా./య. |

"ఇందుకు తెలివిడి : సీ.యతి / గీ.యతి అంటే, సర్వయతి సీసము. అన్నిచోట్లను వడి నియమమే కలది. సీ.య. ప్రా. / గీ య. ప్రా. అంటే, సీసపాదములు నాల్గింటను ప్రతిదానిలోను మొదటి దళమందు యతిన్ని, రెండవ దళమందు ప్రాసమున్ను, గీతపాదములు నాల్గున్ను రెండు వరుసలుగా నుంచగా మొదటి దళమందు, అనగా ప్రథమ, తృతీయ చరణములందు యతిన్ని, రెండవ దళమందు, అనగా ద్వితీయ, చతుర్థ చరణములందు ప్రాసమున్ను ఉండును. ఇట్లే తక్కిన సీసభేదములున్ను తెలుసుకొనవచ్చును." (ప్రాసమనగా ప్రాసయతి యని ఉద్దేశము.) ఈ 16 సీసభేదములలో 12, 14, 15 విధములయిన సీసములు మాత్రము నన్నయ భారతములో కనబడలేదు. నన్నయ భారతములో నున్న సీసములన్నీ 251. వీటిలో ఎన్నెన్ని ఏయే సీసభేదముల ననుసరించి ఉన్నవో దిగువను వివరిస్తున్నాము.

1-156; 2-3; 3-2; 4-2; 5-3; 6-33; 7-1; 8-4; 9-16; 10-5; 11-1; 13-21; 16-2."

అని సీతాపతిగారు వ్రాసినారు.

నన్నయగారి సీసములలో 1వ, 5వ భేదములు లాక్షణికులు చెప్పిన వడిసీసము, అవకలి సీసములకు సరిపోవును. (చూ. వడిసీసము; అవకలిసీసము.) అక్కిలి ప్రాస సీసలక్షణముతో

'అంత దేవాహితు లమృతంబుగానక
యెంతయు నలిగి బలీంద్రుఁగూడి...'

—భార. ఆది. 2-21.

అను పద్యము కన్పించును. మరియు, సర్వతః ప్రాససీసలక్షణముతో

'పలుకుల ముద్దును-గలికి గ్రాల్గన్నుల
తెలివును వలుద చ-న్నుల బెడంగు...'

—భార. ఆది. 3-27.

అను పద్యము కన్పించును. కాని ఈ రెండింటి గీతపద్యములు లాక్షణిక మతానుసారముగా (అ. ప్రా. స.లో గీతమున నాల్గు పాదములకు (ఆది) ప్రాస, స.ప్రా. సీ.లో గీతపాదము లందంతట సీసమందు చెల్లింపబడిన ప్రాసయతియే యుండుట లాక్షణికము.) లేవు. అనగా ఈ పద్యములందు గీతము పరిగణింపబడలేదని చెప్పవలెను. ఇంతకుమించి లాక్షణికుల సీసభేదములతో నన్నయగారి సీసభేదములకు సంబంధము కనిపించదు.

సీసపద్యమందు నన్నయగారి రీతులను ఎఱ్ఱనగారు భారతారణ్య పర్వశేషమునందు మాత్రము పాటించినారు. ఆతరువాత నెవరును సీసపద్య ప్రయోగమున నన్నయగారి రీతులను నియతముగా పాటించలేదు.

నన్నయగారి సీసభేదములకు ఉదాహరణములు :

1. సీ. 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు...'

—ఆది. 1-31.

2. సీ. 'అంత దేవాహితు-లమృతంబుగానక
యెంతయు నలిగి బ-లీంద్రుఁగూడి...

అ. వరులఁదాకి యేసి-రురుతరశరపఙ్క్తి
జాతవాతరయ వి-ధూతమగుచు...'

—ఆది. 2-11.

3. సీ. అలఘువేదాధ్యయ-నాసక్తు నారభ్య
మాణ మహాధ్వరు-మనుచరిత్రు...

అ. అన్నరేంద్రునందు-నాపూర్ణతరశర
దైందవాతపంబు-నందు ప్రీతి

సమమగా సమస్త-జనుల చిత్తంబు లా
నందరసభరంబు-నొందఁదాల్చె.

—ఆది. 8-82.

4. సీ. ఆయంబునందు నా-లవభాగమొండె మూఁ
డవభాగమొండె నం-దర్థమొండె...

ఆ. గురుల వృద్ధశిల్పి-వరవణిగ్బాంధవ
జనుల నాశ్రితులను-సాధుజనుల

—సభా. 1-48.

5. సీ. ఇంద్రసమానున-కిందీవరశ్యామ
సుందరాంగున కింద్ర-నందనునకు...

ఆ. తత్పురోహితుండు-దానిట్టులనియెను
పాండవులనుగుఱిచి-బహువిధంబు.

—ఆది. 7-23.

6. సీ. నిజమహీమండల-ప్రజఁ బ్రీతిఁ బెంచుచు
పరమండలంబుల-ధరణీవరుల...

—ఆది. 1-7.

7. సీ. అనిన నారద మహా ముని వల్కు-సేకొని
తమలో నొడంబడి విమలబుద్ధి...

ఆ. సేవచేయుచును విశేషవ్రతంబును
ధీరవృత్తిఁజలుపువారుగాగ...

—ఆది. 8-115.

8. సీ. అంగనాజనుల యు-త్తుంగసంగతకుచ
కుంకుమ చందన-పంకములయు...

తే. అనిలుఁడను దూతపోయి తోడ్కొనియ దెచ్చె
దేవయాని పాలికి మృగతృష్ణచేసి—

—ఆది. 3-158.

9. సీ. ఇతని విక్రమ మాశ్రయించియ కాదె య
య్యోడ లక్కయిల్లు వెల్వడలఁగంటి...
ఆ. నిద్రలేక తమకు నిలుచు నుపాయంబు
లొండుదక్కి వెదుకుచున్నవారు...

—ఆది. 8-278.

10. సీ. వదలక కురుపతి-వారణావతమున
లక్కయిల్గావించి-యక్కజముగ...
ఆ. రతుల నఖిలలోక - హిత మహారంభుల
భూరి గుణుల నిర్జి - తారి వర్గు......

—ఆది. 3-14.

11. సీ. పుణ్య కర్మంబులు - పొలిసిన నుర్వికి
నేతెంచు నట్టి య - యాతి పోలె......
ఆ. శార్ఙ్గ మప్రియావ - సన్నదేహుండనై
యుడిగి రథము మీఁద - బడితి నేను......

—అరణ్య. 1-191.

13. సీ. పరశు రాముండు భీ - కర నిజ కోపాగ్ని
నుగ్రుఁడై యిరువది - యొక్కమారు......
ఆ. బర్వి రాజధర్మ - పథ నీతి విడువక
జార చోర దుష్ట - జనుల బాధ......

—ఆది. 3-51.

16. సీ. కలహంస పలికిన - పలుకులు గణియించు
వడి దాని పోయిన - వలను సూచు

ఆ. అంద బుద్ధి నిలిపి - కందర్ప బాధిత
యగుచునున్న యది ధ - రాధి నాథ......

—అరణ్యా. 2-28.

## మంజరీ ద్విపద

మంజరీ ద్విపదకు లక్షణమంతయు ద్విపదకు చెప్పబడిన లక్షణమే. (చూ. ద్విపద.). కాని, ద్విపదకున్న ప్రాసనియమము మాత్రము మంజరీ ద్విపదకు నుండదు. అనగా, ప్రాసనియమములేని ద్విపద మంజరీ ద్విపదయగుచున్నది. ప్రాసనియమము లేకపోవుటవలన మంజరీ ద్విపద ఉపజాతి వర్గమునకు చెందును. అయితే, ఉపజాతి వర్గమునకు చెందిన పద్యములకు నంగీకరింపబడిన ప్రాసయతిని లాక్షణికులు మంజరీ ద్విపదకు మాత్రము నిషేధించినారు.

ఉదా :

కవిసార్వభౌముఁడ - ఘనత గన్నట్టి
శ్రీనాథుఁ డనువాఁడ - శివభక్తిపరుఁడ
..............................
విలసిల్లు పలనాటి - వీరుల చరిత
జనులెల్ల భక్తిచేఁ - జదువుట కొఱకు
మంజరీ ద్విపదగా - మన్నించి నేను
చెప్పఁబూనితి వచః - శ్రీ మెరయంగ.

—పల. చరి. పు. 1, 2.

# 5

# పరిశిష్టము

**అక్షర దేవతాదికము**

అనాదిగా భారతదేశమందు మంత్ర శాస్త్ర మనంతముగా విస్తరించి ప్రామాణ్యమును పొందినది. వివిధ దేవతోపాసనములు, తత్తద్దేవతాకమైన మంత్రములు బీజాక్షరములు మొదలగు వాటితో ఆ శాస్త్ర మీదేశమునందు విపరీతముగా ప్రాచీనకాలమున వ్యాప్తిపొందినది. ఈనాటికిని దీనివ్యాప్తి ఈదేశమున తక్కువేమియుగాదు. ఆయా అక్షరముల, అక్షర సంపుటుల మనన ధ్యానాదులవలన ఒకానొకవిధమయిన శక్తికలుగుట ఆ శాస్త్రరీతిలో ప్రవర్తించు వారికి అనుభూతమగు విషయము. వివిధ బీజాక్షర సంపుటులవలన వివిధ దేవతలు ప్రసన్నమగుటయు, ఆయా దేవతల స్వరూప స్వభావముల ననుసరించి శుభాశుభ ఫలములు కలుగుటయు ఆ శాస్త్రమందు ప్రసిద్ధమై, ఉపాసకుల కనుభూతమైన విషయము. ఆయా శక్తులను, ఫలములను పొందుటకు ఉపాసకులు తత్తదక్షర, అక్షర సంపుటుల నెన్నికచేసికొని యుపాసింతురు. ఉపాసనరీతులలో గూడ పలుభేదములున్నవి. యజ్ఞ, యాగాదులుగూడ ఉపాసనారూపములే. కావ్య రచనముగూడ ఒక ఉపాసనగానే భావించబడినది. నాట్యమును చాక్షుషక్రతువుగా కాళిదాసు 'మాళవికాగ్ని మిత్రమం'దు చెప్పినాడు...'పుణ్యప్రబంధంబు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధనా విశేషం,...' బని తిక్కనగారు (విరాట. 1-31) భావించినారు. 'వాగ్వై యజ్ఞః' అని శతపథ బ్రాహ్మణమున చెప్పబడినది. కావ్య, నాట్య, చ్ఛందోవేత్తలయిన భరత, పింగళాదులు ఋషులు. వాక్కునందు ప్రామాణ్యము సుష్ఠుగా కలిగినవారు. వాక్ఛక్తిని పూర్తిగా తెలిసినవారు. అందువలన కావ్య రచనా విషయమునందును మంత్ర శాస్త్ర ప్రభావముతో అక్షరములకు దేవతాదికమును భావించి నిరూపించినారు. వాటి వివిధ శక్తులను, ఫలములను నిర్ణయించినారు. (గణములకు సంబంధించి చూ. 'గణ దేవతాదికము')

'శుభ వర్ణాః శుభ శబ్దాచయే శుభగణాః తఏవ కావ్యా దౌగ్రాహ్యాః' అని చెప్పబడినది. శుభవర్ణములను శబ్దములను, గణములను కావ్యా దియందు ప్రయోగించవలెను. దానివలన కావ్యమునకు, కవికి కృతిభర్తకు గూడ మంగళము కలుగునని, విశ్వాసము. ఈ విశ్వాసమున కనుకూలముగా దేశమం

దనేక గాథలు వ్యాప్తియందున్నవి. గణితమందు అంకెలున్న స్థానమునుబట్టి వాటికి విలువకలిగినట్లు, అక్షరములకును కలుగుననిపించును. ఆరవ యక్షర ముగా 'త' కారమునుంచి పద్యము చెప్పినచో ఆ పద్య మెవరిని గూర్చి చెప్ప బడినదో, వారికి కీడు కలుగును. దీని కుదాహరణముగా భీమకవి గాథ, అతని పద్యము.

'హయమదిసీత పోత వసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ సహ్యజవారిధి మారుఁడంజనా
ప్రియతనయుండు, లచ్చన విభీషణుఁ డాగుడిమెట్టలంక నా
జయమును బోతరక్కసుని చావును నేడవనాఁడు చూడుఁడీ'.

అనునది ప్రసిద్ధము. ఇట్లే బడబానల భట్టు మొదలగువారి గాథలు ప్రసిద్ధములు.

అక్షరముల దేవతాదికమును గూర్చి సంస్కృతమునందును, తదను సారముగా తెలుగునందును వివరముగా చెప్పబడినది. సాహిత్యచూడామణి, కవి కంఠపాశము, సాహిత్య చంద్రోదయము మొదలైన వీ విషయములను వివరిం చిన సంస్కృత గ్రంథములు తెలుగులో 'కవిగజాంకుశము' (భైరవకవి) వంటివి పూర్తిగా ఈ యంశములతోనే యున్నవి. దాదాపుగా తెలుగు ఛందో గ్రంథములన్నింటను ఈ యంశములు కొంచెముగనో, గొప్పగనో చెప్పబడినవి. అప్పకవీయము, రంగరాట్ఛందములందు వివరము లెక్కువగా చెప్పబడినవి.

ఈ అక్షర దేవతాదిక నిర్ణయమున గ్రంథములన్నియు నేకమతములు కావు. చాలా మత భేదములున్నవి.. అందువలన ప్రస్తుతము రంగరాట్ఛందము ననుసరించి అక్షర దేవతాదికము వ్రాయబడుచున్నది. ప్రాచీన పద్ధతుల ననుస రించి వ్రాయబడిన ఛందోగ్రంథములలో నీగ్రంథము దాదాపుగా చివరిది. మరియు నిందు చెప్పబడిన యంశములకు పూర్వగ్రంథముల నుండి ప్రమాణము లుదాహరింపబడినవి.

**అక్షరముల అధి దేవతలు**

| | |
|---|---|
| అ, గ, జ, చ, ఞ, డ, ప | విష్ణువు |
| అం, ప, మ, హ | హరుఁడు |
| క | బ్రహ్మ |
| ఈ, శ | లక్ష్మి |
| ఖ, జ, ఓ, ఉ | పార్వతి |
| ణ, స | సరస్వతి |
| ఛ | కుమారస్వామి |
| ధ, ష | సూర్యుఁడు |
| థ | గరుడుఁడు |
| త్ర | శేషుఁడు |

| | |
|---|---|
| ద | నంది |
| ఆ, య | భూమి |
| ఘ | గణేశుడు |
| బ | ఆశ్వినేయులు |
| ౠ, ౠ | వసువులు |
| ధ, ర | అగ్ని |
| ట | యముడు |
| ఠ | నైఋతి |
| వ | వరుణుడు |
| ఖ, య | వాయువు |
| ఐ, ఞ | మన్మథుడు |
| ఔ | చాముండి |
| ఋ | కౌమారి |
| ౠ | వారాహి |
| ఊ | అదితి |
| శ | పంచభూతములు |
| ఞ | జినుడు |
| ల | ఐరావతము |
| ఝ | భైరవుడు |
| ఏ | వసంతుడు |

ఈ అక్షరములన్నియు సంస్కృత వర్ణ సమామ్నాయము ననుసరించి యున్నవి. అందువలన తెలుగునకు ప్రత్యేకములయిన ఎ, ఒ, ఱ, అర్ధాను స్వారము పై వాటిలో కనుపించవు. మొత్తమక్షరము లేబది.

| | |
|---|---|
| అచ్చులు | 15 |
| స్పర్శములు (క మొదలు మ వరకు) | 25 |
| అంతఃస్థములు (య ర ల వ) | 4 |
| ఊష్మములు (శ ష స హ) | 4 |
| ళ, క్ష | 2 |
| | 50 |

అచ్చులు పదునేననగా అ, ఇ, ఉ, ఋ, ౠ = 5 + వీని దీర్ఘములు= 5=10 + ఏ, ఐ, ఓ, ఔ, అం = 5 = 15. ఈవిధముగనే మునుముందుగూడ గమనించవలయును

ఈ ఏబది యక్షరములలో ఋ, ౠ, ఌ, ౡ, అం అనునవి 5 కాక మిగిలిన 10 అచ్చులు, క వర్గ (క-ఖ-గ-ఘ-ఙ) అయిదక్షరములు, ఝ-డ-ఙ;

త, ద, ధ; ప, బ, భ; య, వ, శ, ష, హ; క్ష - అను పదునేను - మొత్తము ముప్పది యక్షరములు ఉత్తమములు. మిగిలిన ఇరువది యక్షరములు అధమములు.

## అక్షరముల గ్రహములు

| | |
|---|---|
| అచ్చులు 15 | సూర్యుడు |
| క వర్గము (క-ఖ-గ-ఘ-ఙ) | అంగారకుడు |
| చ వర్గము (చ-ఛ-జ-ఝ-ఞ) | బుధుడు |
| ట వర్గము (ట-ఠ-డ-ఢ-ణ) | శుక్రుడు |
| త వర్గము (త-థ-ద-ధ-న) | బృహస్పతి |
| ప వర్గము (ప-ఫ-బ-భ-మ) | శని |
| అంతఃస్థములు (య, ర, ల, వ)<br>ఊష్మములు (శ, ష, స, హ, ళ, క్ష) | చంద్రుడు |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఊ | ఏ | క | చ | ట | త | ప | య | ష | = 10. | వాయుబీజములు |
| ఆ | ఋ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స | = 10. | అగ్నిబీజములు |
| ఇ | ౠ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ | = 10. | భూబీజములు |
| ఈ | ఌ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ | = 10. | జలబీజములు |
| ఉ | ౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | క్ష | = 10. | ఆకాశబీజములు |

వాయు, అగ్ని, ఆకాశ బీజాక్షరములు అశుభములు. ఈ బీజాక్షరముల ఫలములు వరుసగా, శోక, మృత్యు, దారిద్ర్యములని కవిసర్పగారుడమున చెప్పబడినవి. భూ, జల బీజాక్షరములు శుభములు. వీటి ఫలములు వరుసగా సంతోషము, ఐశ్వర్యము అని 'కవిసర్పగారుడము'.

## అక్షర జాతులు; వర్ణములు

| | | | | |
|---|---|---|---|---|
| అచ్చులు | = 15 | 30 | బ్రాహ్మణజాతి | — తెలుపు |
| క, చ, ట వర్గాక్షరములు | = 15 | | | |
| త, ప వర్గాక్షరములు | = 10 | 12 | క్షత్రియజాతి | — ఎరుపు |
| ర, వ | = 2 | | | |
| య, ల, శ, ష, స హ | = 6 | | వైశ్యజాతి | — పచ్చ |
| ళ, క్ష | = 2 | | శూద్రజాతి | — నలుపు |

## అక్షర లింగములు

వర్గ ప్రథమ, తృతీయాక్షరములు

| | | | |
|---|---|---|---|
| (క, గ; చ, జ; ట, డ; త, ద; ప, బ;) | = 10 | 12 | పుంలింగములు |
| స, క్ష | = 2 | | |

వర్గ ద్వితీయ, చతుర్థాక్షరములు

(ఖ, ఘ; ఛ, ఝ; ఠ, ఢ; థ, ధ; ఫ, భ) = 10
అచ్చులు = 15 > 27 స్త్రీలింగములు
శ, ష = 2

అనునాసికములు (ఙ, ఞ, ణ, న, మ) = 5
అంతఃస్థములు (య, ర, ల, వ) = 4 > 11 నపుంసక లింగములు
హ, ళ = 2

**అక్షర గతులు**

అనునాసికేతర వర్గాక్షరములు మొత్త మిరువది- ఇవి హ్రస్వములుగా నున్నచో 'సురగతి' కలవి యగును. ఇవే దీర్ఘములుగా నున్నచో 'నరగతి' కలవి యగును. రేఫము (దీర్ఘమైనను, హ్రస్వమైనను) 'అధోగతి' కలది. మిగిలిన యక్షరము (దీర్ఘములైనను, హ్రస్వములైనను) 'తిర్యగ్గతి' కలవి. 'సుర, నర' గతి గల యక్షరములే శ్రేష్ఠములు.

అక్షర ముఖములు, తత్ఫలములు :

ఇ, ఈ, ఏ = అధోముఖములు = కీడు
ఐ = ఊర్ధ్వముఖము = వినాశము
ఉ, ఊ, ఓ, ఔ = పార్శ్వముఖములు = ఐశ్వర్యనాశము
అ, ఆ = సమ ముఖములు = సౌఖ్యము.

హల్లులకు ముఖ నిర్ణయములేదు. హల్లులపైనుండు అచ్చులనుబట్టియే వాటి ముఖ నిర్ణయము జరుగును. (పద్యాదియందు అచ్చురహితమైన హల్లుండుటకు వీలు లేకపోవుటచే హల్లులకీ నిర్ణయము తప్పనిసరి కాకపోయి యుండునని తోచును).

అక్షరముల అమృతత్వ విషత్వములు :

హ్రస్వాక్షరములు అమృతాక్షరములు
దీర్ఘాక్షరములు విషాక్షరములు.

అయితే సంయుక్తాక్షరములందు విషత్వము తొలగును.

**శ్రీకార ఫలము**

శ్రీకారమును గూర్చి ఎంతో గొప్పగా చెప్పబడినది. దానికి కారణములివి.

శ్రీకారము సంయుక్తాక్షరము. ఇందలి శకార రేఫములకు చంద్రుడు, ఈకారమునకు సూర్యుడు గ్రహములు. శకార, ఈకారములకు అధిదైవతము లక్ష్మి. రేఫ కధిదైవత మగ్ని. 'శ్రియ మిచ్ఛేత్ హుతాశనాత్' అని ప్రమాణము అందువలన అగ్ని లక్ష్మీప్రదుడు. ఈవిధముగా 'శ్రీ' కారము ఆపాతతః లక్ష్మి

ప్రదము. ఇక, ఈకారము దీర్ఘమగుటచే కలుగు విషత్వము, మరియు దాని అధోముఖత్వము వలని కీడు (శ్రీ)కారము సంయుక్తాక్షర మగుటవలన తొలగును. అందువలన (శ్రీ)కారము కావ్యాదియందు ప్రయోగించుట సర్వశుభప్రదమని అందరి మతము. ఈ కారణముననే తెలుగులో కావ్యాదియందు శ్రీకారము నుప యోగించుట ఒకానొక శుభ సంప్రదాయమైనది. అన్నిటికి మించి 'శ్రీ' లక్ష్మి వాచక శబ్దము. కాగా శుభవర్ణ, శుభ శబ్దత్వములు రెండును దీనియందు సమాపన్నములైనవి.

అక్షరములను గూర్చి యిన్నియంశములు చెప్పబడినను, శ్రీకార ప్రయోగ ప్రాధాన్యము తప్ప, మిగిలినవాటికి తెలుగున నెవరును ప్రాధాన్యము గమనించినట్లు తోచదు. శ్రీకారమును పాటించినచో మిగిలినవాటిని గురించి యోచింప నక్కరలేదన్న భావముగూడ నుండియుండవచ్చును. ఏదెట్లయినను 'తెలుగు ఛందోవికాస' పీఠికలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు '...ప్రయోక్త తపస్వియై యుపాసకు డయినచో నా యక్షరములకా శక్తి వచ్చును'. లేనిచో రాదు. ఇదంతయు ప్రధానముగా విశ్వాసమునకు సంబంధించిన యంశము.

## గణదేవతాదికము

వర్ణసమామ్నాయమునకువలెనే ఛందశ్శాస్త్రమందలి గణములకును ప్రాచీనులు దేవతాదికమును నిర్ణయించి చెప్పినారు. (చూ. అక్షరదేవతాదికము). సాహిత్య చూడామణి, కవికంఠపాశము, సాహిత్య చంద్రోదయము మొదలగు సంస్కృత గ్రంథములందును తెలుగులో 'కవిగజాంకుశము', అప్పకవీయము, రంగరాట్ఛందము వంటి గ్రంథములయందును ఈ యంశములు వివరించబడినః గణములకు సంబంధించి యిక్కడ వ్రాయబడుచున్న యంశములు ప్రధానముగా రంగరాట్ఛందము ననుసరించి యున్నవి. అప్పకవీయమున చెప్పబడినవియు కొన్ని గ్రహింపబడినవి.

ఛందశ్శాస్త్రమున మూడక్షరముల సంపుటికి 'గణ'మని పేరు. (చూ. గణములు.). పింగళుడు నిర్ణయించిన ఈ క్రింది ఎనిమిది గణములకే దేవతాదికము నిర్ణయింపబడినది.

| | |
|---|---|
| 1. మగణము U U U | 5. తగణము U U I |
| 2. యగణము I U U | 6. జగణము I U I |
| 3. రగణము U I U | 7. భగణము U I I |
| 4. సగణము I I U | 8. నగణము I I I |

('U' గురువర్ణమునకు 'I' లఘువర్ణమునకు సంకేతములు. మరియు గురువునకు 'గ' యనియు, లఘువునకు 'ల' అనియు క్లుప్తనామములు). గలమునకు (UI) హగణమనియు, లగము (IU) నకు వగణమనియు వ్యవహారమున్నదికాని, ఇవి

| క్ర. సం. | గణ నామము | అధి దేవత | జాతి | వర్ణము | ఉత్పత్తి యామము | గ్రహము | నక్షత్రము | రాశి | యోని | గణము | కాంతి | రసము | ఫలము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 1 | మగణము | భూమి | పురుష | శూద్ర | ప్రథమ | బుధ | జ్యేష్ఠ | వృశ్చిక | హరిణ | రాక్షస | పచ్చ | రౌద్ర | శుభము |
| 2 | యగణము | జల | స్త్రీ | బ్రాహ్మణ | ద్వితీయ | శుక్ర | పూషా | ధనుస్ | వానర | మనుష్య | తెలుపు | కరుణ | ధనము |
| 3 | రగణము | అగ్ని | స్త్రీ | క్షత్రియ | తృతీయ | అంగారక | కృత్తిక | మేష | మేష | రాక్షస | ఎరుపు | శృంగార | భయము |
| 4 | సగణము | వాయు | నపుంసక | చండాల | చతుర్థ | శని | స్వాతి | తుల | మహిష | రాక్షస | నలుపు | భయానక | క్షయము |
| 5 | తగణము | ఆకాశ | పురుష | బ్రాహ్మణ | పంచమ | గురు | పుష్య | కర్కాటక | మేష | దేవ | నలుపు | శాంత | ఐశ్వర్యము |
| 6 | జగణము | సూర్య | పురుష | క్షత్రియ | షష్ఠ | సూర్య | ఉత్తర | సింహ | వృషభ (అ.క.) | మనుష్య | ఎరుపు | వీర | రోగము |
| 7 | భగణము | చంద్ర | నపుంసక | వైశ్య | సప్తమ | చంద్ర | మృగశిర | వృషభ | సర్ప | దేవ | తెలుపు | హాస్య | సుఖ |
| 8 | నగణము | పరమాత్మ | పురుష | బ్రాహ్మణ | అష్టమ | గురు (అ.క.) | భరణి | మేష | గజ (అ.క.) | మనుష్య | పసుపు | అద్భుత (అ.క) | సర్వశుభములు |

**సూచన** :- i. పై తాలికలో 'అ.క.' అను సంకేతముద్వారా సూచింపబడిన యంశములు 'అప్పకవీయము' నుండి గ్రహింపబడినవి.

ii. ఎనిమిది యామముల పేర్లు, 1. జయము, 2 విజయము, 3. శంఖము, 4. మహాశంఖము, 5. రామము, 6. అవిరామము, 7. సుప్తము, 8. ప్రసుప్తము. వీటిలో మొదటి నాల్గు పగటి జాములు (యామములు, మిగిలిన నాల్గు రాత్రి జాములు (యామములు).

వర్ణత్రయ సంపుటి కాకపోవుటచే, వీటికి నిజముగా గణత్వము లేదు. వీటికి 'గణ' వ్యవహారము ఔపచారికము మాత్రమే. అందువలన ఈ రెంటికి దేవతాదికము చెప్పబడలేదు. ఇట్లే నాల్గయిదక్షరముల 'గణ'ములకును (నలము, నలలము మొదలగునవి) దేవతాదికము చెప్పబడలేదు. ఎనిమిది గణముల దేవతాదికము ౨౮౬వ పేజీలో 'తాలిక' రూపమున చూపబడినది.

తాలికనుబట్టి కొన్ని గణములు శుభకరములని, మరికొన్ని అశుభకరములని తెలియును. కావ్యాదియందు శుభగణములను మాత్రమే ఉపయోగించవలయును. అయితే కొన్నిగణములు మరికొన్ని గణములకు వెనుక ముందులుగా నుండుటవలనగూడ కలుగు మంచిచెడ్డలు చెప్పబడినవి. ఇది 'గణసాంగత్యఫల'మని చెప్పబడును. ఏగణము తరువాత నే గణమున్నచో శుభమగునో, లేక అశుభమగునో ఈవిధముగా చెప్పబడినది.

i. మగణమునకు తరువాత న-మ-య-స గణములలో నేదియున్నను శుభమగును. మరియు నిట్లుండుట ఉత్తమము. ఇట్లే-
ii. సగణమునకు తరువాత న-భ-మ-య గణములుండుట,
iii. భ-న-త గణములకు తరువాత రగణముండుట,
iv. న-భ-ర-జ గణములకు తరువాత తగణముండుట,
v. య-ర-త-భ గణములకు తరువాత జగణముండుట,
vi. త-న-ర-స గణములకు తరువాత భగణముండుట,

-ఈవిధముగా నుండుటగూడ శుభము, ఉత్తమమే, కాని,

i. ర-త-జ-భ గణముల తరువాత యగణము,
ii. స-మ గణముల తరువాత రగణము,
iii. మ-య గణముల తరువాత భగణము, లేదా తగణము,
iv. త-జ-భ-ర గణముల తరువాత మగణము,
v. జ-ర గణముల తరువాత సగణము

-ఉండరాదు అయితే, నగణముతో నే గణము కలిసియున్నను ఆ గణము నిర్దుష్టమగునని నిర్ణయము.

పైనచెప్పబడిన గణముల సాంగత్యరీతిని బట్టియు, శ్రీకార ప్రయోగార్హతనుబట్టియు తెలుగునందు శార్దూలవిక్రీడితము, ఉత్పలమాలయు కావ్యాదియందు ప్రయోగింపబడుట సర్వసామాన్యమయియుండును. శార్దూల విక్రీడితమునందు మగణము తరువాత సగణము, ఉత్పలమాలయందు భగణము తరువాత రగణము ఆ పద్యముల పాదాదియందుండును. (చూ. శార్దూలవిక్రీడితము, ఉత్పలమాల.). పాదాదిగణము మగణము (◡ ◡ ◡) లేదా భగణము (◡ ı ı) అయినందున శ్రీకారప్రయోగము పద్యాదిన నొనరించుటకు నవకాశమున్నది. ఇట్లుండగా, గణములకు నక్షరములకును (చూ. అక్షరదేవతాదికము) చెప్పబడిన గ్రహ,

నక్షత్రాదుల ననుసరించి జ్యోతిశ్శాస్త్రరీత్యా కావ్యకర్త, కావ్యభర్త నక్షత్రాదికముతోగూడ మైత్రిని చూచుకోవలయుననియు చెప్పబడినది.

అక్షరముల విషయమునవలె ఈ గణముల విషయమందును పైన చెప్పబడిన యంశములన్నియు విశ్వాసమునకు సంబంధించినవి.

## ఛందో గురుపరంపర

వేదాంగము లారింటిలోనిది ఛందస్సు. 'ఛందఃపాదౌతు వేదస్య' అని వేదమూర్తికి పాదస్థానముగా ఛందస్సు చెప్పబడినది. అట్లే వ్యాకరణము ముఖముగా చెప్పబడినది. (పాణినీయ శిక్షా. 41, 42) వ్యాకరణమునకు వలెనే ఛందోవిద్యావమునకు ప్రథమయనుడైన పరమేశ్వరుడే మూలముగా సాహిత్య రత్నాకరమున చెప్పబడినది. అందు ఛందశ్శాస్త్ర గురుపరంపర ఈవిధముగా నున్నది. ఛందోజ్ఞానము మొదట పరమశివునినుండి నందికేశ్వరుడు, అతనినుండి సనత్కుమారుడు, అతనినుండి అగస్త్యుడు, అతనినుండి బృహస్పతి, అతనినుండి ఇంద్రుడు, అతనినుండి ఆదిశేషుడు, అతనినుండి అతని తమ్ముడు పింగళుడు పొందినారు. పింగళుని శిష్యులచే ఇది లోకమందు వ్యాప్తిపొందనది. కావ్యాలంకార చూడామణి యందు విన్నకోట పెద్దన మరొక విధముగా ఈగురుపరంపర చెప్పినాడు. పరమశివునినుండి వాచికాభినయమునకై 'ఉత్కట యతి లయమయ తాళస్ఫుట వికట చ్ఛందము'ను బ్రహ్మ పొందినాడు. అతనినుండి భరతుడు, అతనినుండి పిగళుడు పొందినారు. భరతుని నాట్యశాస్త్రమందు ఛందోవిషయము విస్తరించబడినది. ఈ రెండు విధములైన గురుపరంపరల యందును మొదట శివుడు, చివర పింగళుడు నున్నారు. పింగళుడు ఆదిశేషుని అవతారమైన పతంజలి మహర్షినుండి, భరతునినుండి ఛందోవిషయజ్ఞానము పొంది వాటిని సమన్వయించి శిష్యులద్వారా లోకమున వ్యాపింప చేసినాడు. తరువాతి ఛందో లాక్షణికులందరకును పింగళుడే పరమాచార్య స్థానమునందున్నాడు. 'పింగళాద్యాచార్యులచేత మాత్రా వర్ణ భేదముతో రెండువిధములుగా చెప్పబడిన లౌకిక చ్ఛందమును' తాను వివరించుచున్నట్లు వృత్తరత్నాకరకర్త చెప్పుకొన్నాడు. (వృత్త. 1-4.). పింగళుడు ప్రతిపాదించిన చ్ఛందశ్శాస్త్ర మర్యాదలనే, సంప్రదాయములనే తరువాతివారు అనుసరించినారు. రత్నమంజూషా, జనాశ్రయకర్తలు కొన్ని క్రొత్తదారులు గణనిర్మాణాది విషయములలో ప్రదర్శించినను పింగళుని నిర్ణయములకే ప్రచారము, ప్రాధాన్యము లోకమునందు కలిగినవి. దేశభాషలయందు ఛందశ్శాస్త్ర గ్రంథరచన చేసినవారును పింగళుని అనుసరించియే ముందుకు సాగినారు. దేశీయ చ్ఛందోవిషయకముగా క్రొత్త యంశములను కొన్నియంశములను ప్రతిపాదించినను మార్గము పింగళునిదే.

ఇప్పటివరకు లభ్యమగు చారిత్రకాంశములనుబట్టి తెలుగులో ఛందశ్శాస్త్రమునకు పరమాచార్యుడు కవిజనాశ్రయకర్త.

## ఛందోలాక్షణికులు

భారతదేశమందు తొలితొలిగా ఛందోలక్షణగ్రంథము సంస్కృతము నందు రూపొందినది. సంస్కృతమున తొలి 'ఛందము' రచించిన తొలి లాక్ష ణికుడు పింగళుడు. భరతుడు తన నాట్యశాస్త్రమున ఛందోవిషయములను ప్రపంచించినాడు. అగ్నిపురాణకర్తయు ఛందోవిషయములను వివరించినాడు. సంస్కృతమున ప్రసిద్ధులైన ఛందోలాక్షణికులు 'ఛందోనుశాసన' కర్త హేమ చంద్రుడు, జయదేవుడు, జనాశ్రయుడు, 'వృత్త రత్నాకర' కర్త కేదారభట్టు 'ఛందోమంజరీ' కర్త గంగాదాసు మొదలగువారు. ఇట్టివారి గ్రంథములు ప్రాంతీయ భాషా ఛందో లాక్షణికులకు ప్రామాణికము లయినవి.

ఇప్పటివరకు లభించిన సమాచారమునుబట్టి తెలుగులో మొదటి ఛందోలాక్షణికుడు కవిజనాశ్రయకర్త. కవిజనాశ్రయ కర్తృత్వమును గూర్చి మత భేదమున్నది. ఆధునిక కాలమువరకు లాక్షణికు లందరును కవిజనాశ్రయ మును వేములవాడ భీమన రచించినాడన్నారు. ఆధునికులు కొందరు రేచన యనుచున్నారు. లభించు ప్రమాణముల బలమును బట్టి భీమనయే తెలుగున తొలి లాక్షణికుడని నిశ్చయింపవచ్చును. రేచనాంకితముగా, రేచన రచించినట్లు కవిజనాశ్రయమును భీమన రచించినాడని శ్రీ రావూరివారు నిరూపించినారు. (చూ. శ్రీ రావూరివారి 'కవిజనాశ్రయము: భీమన ఛందము' వ్యాసము. శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారి అభినందన గ్రంథము 'సాహితీవాల్లభ్యము' మొదటి భాగములో.). నాచియ యను ఛందోలాక్షణికుని గూర్చి 'యాప్పిరుంగల క్కారికై' అను తమిళ ఛందోగ్రంథము (11 వ శతాబ్ది) నందు ఉటంకింపు ఉన్నది గాని ఆ వాంచియ యెవరో తెలియరాదు. పాల్కురికి సోమనాథుడు 'అనియతగణైః' ఇత్యాదిగా పండితారాధ్య చరిత్రయందు ఉటంకించిన ఛంద స్సూత్రకర్త గూడ ఎవరో తెలియరాదు. కాగా భీమన తెలుగులో తొలి ఛందో లాక్షణికుడు. భీమన తరువాత ఛందోలక్షణ గ్రంథములు రచించినవారు పలు మంది యున్నారు. తెలుగులో ప్రసిద్ధులు వీరు :-

1. వేములవాడ భీమన
2. రేచన
3. విన్నకోట పెద్దన
4. అనంతుడు
5. చిత్రకవి పెద్దన
6. వెల్లంకి తాతంభట్టు
7. లింగమగుంట తిమ్మన
8. ముద్దరాజు రామన
9. కాకునూరి అప్పకవి
10. వార్తాకవి రఘునాథయ్య
11. పొత్తపి వేంకటరమణ కవి
12. గణపవరపు వేంకటకవి
13. కూచిమంచి తిమ్మన
14. కస్తూరి రంగకవి
15. కూచిమంచి వేంకటరాయడు

(భీమన రేచనలను గూర్చిన మత భేదమునుబట్టి రేచనయు పైన పేర్కొబడి నాడు. వీరినిగూర్చి విడివిడిగా ముందుముందు చూడవచ్చును).

ఆధునిక కాలమున ఛందో గ్రంథములు, విమర్శ వ్యాసములు, గ్రంథములు రచించినవారు చాలమంది కలరు. వారిలో ప్రసిద్ధులుగా పేర్కొనదగినవారు శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రి, శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీ చేకుమళ్ళ రాజగోపాలరావు, శ్రీ సి. పి. బ్రౌను, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి, శ్రీ నిడుదవోలు వేంకటరావు, శ్రీ రావూరి దొరసామిశర్మ, శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, శ్రీ కోవెల సంపత్కుమారాచార్య, శ్రీ బండి నాగరాజు, శ్రీ చేకూరి రామారావు మొదలగువారు.

ఇట్లు వ్యాసములు, గ్రంథములు రచించుటగాక ఛందస్సుల ప్రయోగములో క్రొత్తరీతులు ప్రదర్శించినవారు కొందరున్నారు. వారిలో శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఆధునిక ఛ్ఛందస్సులలో ప్రయోగములు చేసినవారిలో శ్రీ శ్రీ, ఆరుద్ర, విద్వాన్ విశ్వం మొదలగువారు ప్రసిద్ధులు.

## వేములవాడ భీమకవి

శాపానుగ్రహ సమర్థుడైన మహాకవిగా మిక్కిలి ప్రసిద్ధుడైన వేములవాడ భీమకవి 12 వ శతాబ్ది యారంభమువాడని చారిత్రకుల అభిప్రాయము. ఈయన తెలంగాణములో కరీంనగర మండలమందలి 'రాజరాజేశ్వరస్వామి' క్షేత్రమయిన 'వేములవాడ' నివాసియని, గ్రామనామమే ఆయన గృహనామమైనదని ప్రసిద్ధము. 'రాఘవపాండవీయము'ను ద్వ్యర్థికావ్యము భీమన రచించినట్లు ఒక ప్రథ వ్యాప్తియందున్నదని పింగళి సూరన తన రాఘవ పాండవీయావతారికలో చెప్పినాడు. అది ఆనాటికే అలభ్యము.

తెలుగుఛందోగ్రంథములలో మొదటిది 'కవిజనాశ్రయము' భీమనకవి కృతమని ఇటీవలివరకు నిశ్చితమైన విషయము. తెలుగు లాక్షణికులు కవిజనాశ్రయము 'భీమన ఛందము' అని వ్యవహరించినారు. 'రేచన'యే రచించినట్లుగా కవిజనాశ్రయమును భీమన రచించినాడని చెప్పుదురు. కాని, ఆధునిక కాలమున 'రేచన'యే కవిజనాశ్రయమును రచించినాడను వాదము వెలసినది. కాగా భీమనయొక్క కవిజనాశ్రయ కర్తృత్వము కొంత వివాదాస్పదమైనది. (చూ. రేచన; కవిజనాశ్రయము.). ప్రస్తుత గ్రంథమునందు లాక్షణికుల నిర్ణయము ననుసరించి భీమనయే కవిజనాశ్రయ కర్తగా వివిధ సందర్భములలో పేర్కొనుట జరిగినది.

వేములవాడ భీమకవిపేర పలు ప్రసిద్ధములైన చాటుపద్యములు మాత్రము లభించినవికాని, తత్కృతగ్రంథము (కవిజనాశ్రయముతప్ప) లభించుటలేదు.

## రేచన

తెలుగులోని తొలి ఛందోగ్రంథమగు 'కవిజనాశ్రయము' రేచనను గూర్చిన సంబోధనలతో నిండియున్నది. ఆ సంబోధనలలో 'శ్రావకాభరణాంక' యనునదొకటి. గ్రంథములో 'అధికారము'ల చివరి గద్యములయందు కవిజనాశ్రయము 'వాదీంద్రచూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాన శ్రావకాభరణాంక విరచితం బని యున్నది. శ్రావకాభరణాంకుడు రేచన. కావున కవిజనాశ్రయము రేచన విరచితమని ఆధునిక కాలమున నొక వాదము వెలసినది. (కవిజనాశ్రయము వేములవాడ భీమకవి కృతముగా ప్రసిద్ధము. చూ. వేములవాడ భీమకవి). గ్రంథమందు 'రేచా' అని, 'మల్లియరేచా' యని పలుచోట్ల సంబోధనలున్నవి. అతడు జైనుడని తెలియజేయు సంబోధనలును చాలాఉన్నవి. ఇతర సంబోధనలు అతని సౌందర్యము, దాతృత్వము, కవిపోషకత, సర్వసద్గుణవత్త, రసికత మొదలగు నంశములను సూచించును. మరియు అతడు వణిగ్వంశీయుడనియు కొన్ని సంబోధనలు తెలియజేయును. ఈ సంబోధనలబట్టి తెలియు నంశములుతప్ప అతని కాలము మొదలగు నే యంశములుగూడ తెలియరావు.

## విన్నకోట పెద్దన

తెలుగులో మొదటి అలంకార శాస్త్రగ్రంథమగు 'కావ్యాలంకార చూడామణి' రచియించిన విన్నకోట పెద్దన 15వ శతాబ్ది పూర్వార్థమునందుండిన చళుక్య విశ్వేశ్వర భూపతి కాలమువాడు. తన గ్రంథమును చళుక్య విశ్వేశ్వర భూపతికే అంకితము చేసినాడు. వి. పెద్దన శివభక్తుడు. గోవిందామాత్యనందనుడు. కౌశికసగోత్రుడు. తాను 'కావ్యక్రమవేది' నని, 'కళాకౌశలు' డనని చెప్పుకొన్నాడు. (కా. చూ. 1-10.). కావ్యాలంకారచూడామణి రచన ఆ యంశములను స్పష్టము చేయును. ఈ అలంకార శాస్త్రగ్రంథము తప్ప వి. పెద్దన రచన మరేదియు కనిపించదు.

కావ్యాలంకార చూడామణియందు ప్రధానముగా అలంకారశాస్త్ర విషయములు, అప్రధానముగానైనను నాటిదృష్ట్యా వలసినంత విపులముగానే ఛందోవ్యాకరణాంశము లున్నవి. (చూ. కావ్యాలంకార చూడామణి.).

## అనంతుడు

ప్రసిద్ధుడైన ఉత్తమ కవి, లాక్షణికుడు అయిన అనంతుడు (అనంతయ, అనంతామాత్యుడు) పదునయిదవ శతాబ్ది పూర్వార్థమువాడు. ఈతని ముత్తాతయైన బయ్యన తిక్కనసోమయాజిచే 'భవ్యభారతి' యను బిరుదందినాడట. అనంతుడు తిక్కనామాత్యుని కుమారుడు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు. కౌండిన్యస గోత్రుడు. విష్ణుభక్తుడు.

అనంతుని రచనలు మూడు. 1. భోజరాజీయము, 2. ఛందోదర్పణము, 3. రసాభరణము. భోజరాజీయము భోజనాయకమైన చిన్నచిన్న

కథలు గల చక్కని కావ్యము. ఇందలి రచన తిక్కనగారి రచనారీతిని పుణికి పుచ్చుకున్నట్లుండును. ఉత్తమము, సహజమైన వర్ణనాశక్తి, కథాకథనశక్తి భోజరాజీయమున కన్పించును. 'రసాభరణము' అలంకార శాస్త్రగ్రంథము. తెలుగులోని అలంకార శాస్త్రగ్రంథములలో రెండవదిది. (మొదటిది కావ్యాలంకార చూడామణి.). అయితే కా. చూ. యందున్న ఛందోవ్యాకరణాంశము లిందు లేవు. ప్రధానముగా ఛందోవిషయములను, అల్పముగా వ్యాకరణాంశములను వివరించునది 'ఛందోదర్పణము'. ఇది 'అనంతుని ఛంద'మను పేర ప్రసిద్ధము. (చూ. 'ఛందోదర్పణము'.).

### చిత్రకవి పెద్దన

ఈ పెద్దనకున్న చిత్రకవితాశక్తినిబట్టి 'చిత్రకవి' యన్నది ఈతనికి ప్రియమైన బిరుదు. చిత్రకవి పెద్దన ఆంజనేయ భక్తుడు. తత్ప్రసాదలబ్ధ కవితాశక్తి కలవాడు. భారద్వాజస గోత్రుడు. లక్కమాంబా-సర్వధీరుల పుత్రుడు. కందాళ అన్నయగారి శిష్యుడు. 'చిత్రకావ్యధనుడు'. ఇంటిపేరు పార్శ్వంచాల. (ల. సా. సం. 1-6.). 'లక్షణసారసంగ్రహము' ఈతని రచన. ఛందోలక్షణ వైపుల్యము కలది. చిత్రకవితా విషయము లిందు పెక్కులున్నవి. (చూ. లక్షణసారసంగ్రహము.). లక్షణసారసంగ్రహముతప్ప చి. పెద్దన రచన మరేదియు కానరాదు.

### వెల్లంకి తాతంభట్టు

వెల్లంకి తాతంభట్టు 15 వ శతాబ్దివాడు. 'కవిచింతామణి, ఛందోదర్పణము' అనునవి ఈతని రచనలు. మొదటిది ప్రధానముగా వ్యాకరణగ్రంథము కాగా రెండవది ఛందోవిషయ ప్రాధాన్యము కలది. అనంతుని ఛందోదర్పణమున కిది భిన్నము. ఈ రెండింటిలో అనంతుని గ్రంథము ప్రసిద్ధము. తాతంభట్టు రచనలలో 'కవిచింతామణి' ప్రసిద్ధమైనది. (చూ. కవిచింతామణి.). ఇవి తప్ప తాతంభట్టు రచన లితరములు తెలియరావు.

### లింగమగుంట తిమ్మన

'సులక్షణ సారము' అను బహుళప్రచారముగల ఛందోగ్రంథమును రచించినవాడే లింగమగుంట తిమ్మన ఈతని తండ్రి లక్ష్మన, తల్లి తిమ్మాంబ. తెనాలి రామకృష్ణుని అల్లుడు, మత్స్యపురాణ, వామన పురాణాదుల రచించిన రామకవి తిమ్మన కగ్రజుడు. అగ్రజుని కావ్యములకీతడు లేఖకుడుకూడ. ఈ యంశములవలన తిమ్మన 16 వ శతాబ్ది ఉత్తరార్థమువాడని తెలియును. రామకవియేగాక పెద్దన, మారన అనుమరి ఇరువురును తిమ్మన అన్నలు. 'వృద్ధకుండి కాతీర లింగమగుంటనామ పట్టణస్థితికుండ' (సులక్షణ. అవతారిక. 2.) నని చెప్పుకొనుటచే ఇతడు లింగమగుంట నివాసియని తెలియును. తిమ్మన కాశ్యప గోత్రుడు. చిక్కయభట్టరు శిష్యుడు. శ్రీవైష్ణవమతావలంబి. ఈతని పితా

మహుడు సర్వార్యుడు. ఈ పితామహుడు 'కవితా విశేషతులితు'డని (సులక్షణ. అవ. 27) తిమ్మన చెప్పినాడు. సులక్షణసారముతప్ప తిమ్మన రచనలు మరి యేవియు కానరావు.

**ముద్దరాజు రామన**

ప్రసిద్ధ లక్షణగ్రంథమయిన 'కవిజనసంజీవని' రచించిన ముద్దరాజు రామన 16వ శతాబ్ది చివర, 17వ శతాబ్ది మొదట జీవించిన లాక్షణికుడు. తన పేరు రామభద్రుడని చెప్పుకొన్నను, 'రామన' అని ప్రసిద్ధ వ్యవహారము. 'రాఘవ పాండవీయ' వ్యాఖ్యాతయగు పెదరామన ఈతని అన్న. 'పెదరామ చినరామ సచివమణుల కనుఁగ దమ్ముండ' (క. జ. సం. 1-8) నని చెప్పు కొన్నాడు. ఈతని తండ్రి గణపయ్య. 'నన్నయ తిక్కన యజ్వ ప్రముఖ నిఖిల కవిసూక్తిమణిజని'గా రచింపబడిన ఈ 'కవిజనసంజీవని' ప్రధానముగా వ్యాకర ణాంశములను, అప్రధానముగా కొన్ని ఛందోవిషయములను వివరించును. (చూ. కవిజనసంజీవని.). ఈతని ఇతర రచనలు తెలియరావు.

**కాకునూరి అప్పకవి**

'అప్పకవీయ'మను పేర ప్రసిద్ధమైన 'ఆంధ్ర శబ్దచింతామణి' (సం స్కృతమూలముకూడ 'ఆంధ్ర శబ్దచింతామణి'యే. దానికిది వ్యాఖ్యారూపము. దీనికిని అప్పకవి 'ఆంధ్ర శబ్దచింతామణి' అనియే పేరిడినాడు.) రచించిన కాకునూరి అప్పకవి 17 వ శతాబ్దివాడు. భారద్వాజస గోత్రుడు. వెంగనార్యుని పుత్రుడు. శ్రీకృష్ణభక్తుడు. శ్రీశైలమున 'భోగవిభూషణుని పట్టపు కవీంద్రుడు'. తాను 'షట్కర్మపద్ధతి ఖండనము', అనంతవ్రతకల్పము, సాధ్వీధర్మము, కవి కల్పకము, అంబికావాదము (యక్షగానము), శ్రీశైలస్వామినిగూర్చి నిందా స్తుతిగర్భమైన సీసపద్య శతకము రచించినట్లు (అప్పక. 1-85) చెప్పుకొన్నాడు. కాని 'ఆంధ్ర శబ్దచింతామణి'కి పద్యవ్యాఖ్యారూపమై, 'ఆంధ్ర శబ్దచింతామణి' పేరుగల 'అప్పకవీయ'మని ప్రసిద్ధమైన అయిదాశ్వాసముల గ్రంథముతప్ప మరేదియు లభించదు. అప్పకవీయము ప్రధానముగా వ్యాకరణ గ్రంథము. కాని ఛందోవిషయమే సమగ్రముగా నిండున్నది. (చూ. అప్పకవీయము.).

**వార్తాకవి రఘునాథయ్య**

'లక్షణదీపిక' రచించిన ఈ రఘునాథయ్య 17 వ శతాబ్దివాడు. గౌరన రచించిన 'లక్షణదీపిక'కు దీనికి సంబంధము లేదు. ఛందోవిషయముతే కాక కావ్య, వ్యాకరణ విషయములుగూడ విపులముగా గల గ్రంథమిది. ఈ రచనయే ఈతని పేరు నిలిపినది. (చూ. లక్షణదీపిక.).

**పొత్తపి వేంకటరమణకవి**

'లక్షణ చక్రవర్తి' బిరుదాంకితుడగు పొత్తపి వేంకటరమణకవి 17వ శతాబ్దివాడు. ఈతని రచనయగు 'లక్షణ శిరోమణి' ఈతని బిరుదుకు తగిన

గ్రంథము. అప్పకవీయముతో సరితూగగలది. (చూ. లక్షణ శిరోమణి). ఈ రచన తప్ప వేరే ఇతని రచనలు తెలియరావు.

**గణపవరపు వేంకటకవి**

అద్భుత చిత్రకవితాశక్తి గల గణపవరపు వేంకటకవి 17వ శతాబ్ది వాడు. ఈతని ఈ కవితాశక్తికి 'ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము' అను గ్రంథము అద్భుత సాక్ష్యము. గర్భ, బంధ, చిత్రకవితా రచనాశక్తి ఇందు ఆశ్చర్యకరమగు స్థాయిలో ప్రదర్శింపబడినది. ఇదిగాక 'సర్వలక్షణ శిరోమణి' యన్న లాక్షణిక గ్రంథమునుగూడ రచించినాడు. ఛందోవ్యాకరణాలంకార శాస్త్రాది విషయములకు సంబంధించిన పది ఉల్లాసములుగల గ్రంథమిది. ఒక్కొక్క ఉల్లాసము ఒక్కొక్క గ్రంథమువంటిది. విశేషమేమనగా ఈ పది ఉల్లాసములలో రెండవది ఆంధ్ర నిఘంటువు. పదవది ద్విరూపకోశము. 6, 7, 8, 9వ ఉల్లాసములు అలభ్యములు. (చూ. సర్వలక్షణ శిరోమణి'.).

**కూచిమంచి తిమ్మన**

'కవిసార్వభౌమ' బిరుదాంకితుడైన కూచిమంచి తిమ్మన పదునేడవ శతాబ్ది చివరినుండి పదునెన్మిదవ శతాబ్ది మధ్యవరకు (క్రీ. శ 1684-1757) జీవించిన ఉత్తమకవి, లాక్షణికుడు. పిఠాపురసంస్థానమునకుచెందిన 'కందరాడ' వాస్తవ్యుడు. ఆర్వేల నియోగి. కౌండిన్యస గోత్రుడు. అచ్చమ్మ-లింగన్నల పుత్రుడు. దెందలూరి లింగనారాధ్యులవారివద్ద దీక్ష పొందిన మహాశైవుడు. కాని శివ-కేశవులందు సమ భక్తిప్రపత్తులు గలవాడు. తన గ్రంథములు నరులకు గాక పరమేశ్వరునకే అంకిత మొనరించినవాడు.

రాజశేఖర విలాసము. రుక్మిణీ పరిణయము, సింహాశైల మాహాత్మ్యము, నీలాసుందరీ పరిణయము, అచ్చతెనుగు రామాయణము, సారంగధర చరిత్ర, సాగరసంగ మాహాత్మ్యము, (సర్వ) లక్షణసార సంగ్రహము, రసికజన మనోభిరామము, సర్పపుర మాహాత్మ్యము, శివలీలా మాహాత్మ్యము, సుజన మనః కుముదచంద్రిక, కుక్కుటేశ్వర శతకము, భర్గశతకము ఈయన రచనలు. వీటిలో 'లక్షణసారసంగ్రహము' (సర్వలక్షణసారసంగ్రహమనియు దీనికి వ్యవహారము) ప్రధానముగా వ్యాకరణాంశములను వివరించునది. ఛందోవిషయములు అల్పముగా ఇందున్నవి (చూ. 'లక్షణసార సంగ్రహము-2 ). చిత్రకవి పెద్దన 'లక్షణసారసంగ్రహము'నకిది భిన్నము. (చూ. ల. సా. సం.-1.).

**కస్తూరి రంగకవి**

దక్షిణదేశమున ఫ్రెంచి పరిపాలకుడుగా నున్న 'డూప్లే'కు దుబాసిగ నుండినవాడగు ఆనందరంగ పిళ్లను ఆశ్రయించి, అతని పట్టపుకవియైనవాడు కస్తూరి రంగకవి. 18 వ శతాబ్ది పూర్వార్థమువాడు. 'ఆర్వేల కమ్మనియోగి కులీనుడు'. వేంకటకృష్ణార్య పుత్రుడు. తాను రచించిన లక్షణ గ్రంథమునక్కు

'ఆనందరంగచ్ఛంద' మనియు, 'లక్షణచూడామణి' యనియు రెండు పేరులు పెట్టినాడు. (దీనికే రంగరాట్ఛందమనియు వ్యవహారము.) ఆనందరంగచ్ఛందము ఆనందరంగ పిళ్లైకు అంకితము. కృతికర్త, కృతిభర్తల పేరులు రెండు కలిసినట్లు గ్రంథనామమున్నది. ఆనందరంగచ్ఛందము తప్ప ఇతర రచన లీయనవి కనరావు. (చూ. ఆనందరంగచ్ఛందము)

## కూచిమంచి వేంకటరాయడు

కూచిమంచి వేంకటరాయడు కవిసార్వభౌమ బిరుదాంకితుడైన కూచిమంచి తిమ్మనకు ప్రపౌత్రుడు. సుబ్బమ్మ-తిమ్మనల పుత్రుడు. 19వ శతాబ్ది పూర్వార్ధమువాడు. ఈయన రచించిన సుకవిమనోరంజనము యతి-ప్రాస, రేఫ-ఱకార నిర్ణయములకు ప్రధానముగా సంబంధించినది. అప్పకవీయమున కిది ప్రధానముగా విమర్శగ్రంథము. ప్రాసంగికముగా పలు వ్యాకరణాంశములు ప్రదర్శింపబడినవి. ఈ గ్రంథము కాక వేరే రచనలు కానరావు.

పీఠికాపురమునకు సమీపముననున్న 'రావువారి చంద్రమపాలెము' నివాసి. 'లక్షణచక్రవర్తి' బిరుదాంకితుడు.

## ఛందోగ్రంథములు

భారతదేశమందలి వివిధ ప్రాంతీయ భాషలలో రచింపబడిన ఛందోగ్రంథములకు సంస్కృతచ్ఛందోగ్రంథములు ప్రమాణములైనవి సంస్కృతమున ఆదిమచ్ఛందోగ్రంథము 'పింగళచ్ఛందము'. ఇందులో వైదిక, లౌకికచ్ఛందములకు సంబంధించిన వివిధాంశములు వివరింపబడినవి పింగళచ్ఛంద మాధారముగా వెలువడిన పలుఛందోగ్రంథములలో వృత్తరత్నాకరము, ఛందోమంజరి మిక్కిలి ప్రచారములో నున్నవి. ఇవిగాక ఛందోనుశాసనము, రత్నమంజూష, ఛందః కౌస్తుభము, సువృత్త తిలకము, జనాశ్రయి మొదలగునవి ప్రసిద్ధ చ్ఛందో గ్రంథములు.

ప్రాంతీయభాషలయందు సంస్కృతీయ చ్ఛందోవిషయములతోబాటు తమతమ భాషలకు సంబంధించిన ఛందోవిషయముల వివరణములతో ఛందో గ్రంథములు రూపొందినవి.

తెలుగునందు ఛందోగ్రంథరచన 11వ శతాబ్ది మొదటనో, అంతకు పూర్వమో ప్రారంభమైనట్లు తెలియును. 11వ శతాబ్దమందు తమిళమున రచింపబడిన సుప్రసిద్ధ చ్ఛందోగ్రంథమగు 'యాప్పిరుంగలక్కారికై' యందు పేర్కొనబడిన సంస్కృతాంధ్రకర్ణాట ఛందోగ్రంథములలో 'వాంచియ' రచించిన తెలుగు చ్ఛందోగ్రంథమొకటి పేర్కొనబడినది. ఇది 'కవిజనాశ్రయ' మగునని మొదట కొందరు భావించినారుగాని, తరువాత కాదని ఛందోవిమర్శకులు తేల్చినారు. అయితే వాంచయచ్ఛంద మీనాడు లభించదు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో ప్రాచీన తెలుగు చ్ఛందోగ్రంథమునుండి 'అనియత

గణైః' 'ప్రాసోవా యతిర్వా' అను సూత్రముల నుదాహరించినాడు. ఈ సూత్రములు గల ఛందోగ్రంథముగూడ నేదియు నీనాడు అలభ్యము. అయితే ఇప్పటి వరకు లభించు సమాచారము ననుసరించి తెలుగులో లభించు మొదటి ప్రాచీన చ్ఛందోగ్రంథము 'కవిజనాశ్రయము'. ఇది 11వ శతాబ్ది మధ్యభాగమున రచింపబడినట్లు నిర్ణయింపబడినది. కవిజనాశ్రయము నాటినుండి తెలుగులో ఎన్నో ఛందోగ్రంథములు రచింపబడినవి. వీటిలో కొన్ని నామమాత్రావశిష్టములు. మరికొన్ని గ్రంథకర్త లెవరో తెలియనివి. ఇంక కొన్ని సంకలన గ్రంథములు

ఛందోగ్రంథములు పలురకములుగా కన్పించును. కొన్ని కేవలము యతిప్రాసములనే వివరించగా, మరికొన్ని కేవలము వృత్తములను, పద్యములను మాత్రమే వివరించునవి. వేరొక కొన్ని కేవలము అక్షరగణాదుల శుభాశుభ లక్షణములను వివరించునవి 'యతిప్రాస విలాసము, కవిగజాంకుశము' వంటి వింందు కుదాహరణములు. కొన్ని వ్యాకరణ, అలంకార విషయముల వివరించుచు ఛందోవిషయములు చెప్పినవి ఛందస్సు ప్రధానమై వ్యాకరణాంశములు స్వల్పముగా చెప్పినవి కొన్ని. అచ్చముగా ఛందోవిషయమే చెప్పినవి కొన్ని. ఇట్లు పలువిధములుగా ఛందోగ్రంథము లెన్నో యున్నవి. (ఇట్టి పలురకములైన గ్రంథములలో దాదాపు 65 గూర్చి లభ్యమైన వివరములను శ్రీ రావూరివారు తెల్పినారు. చూ. తె. భా. ఛం. రీ ). తెలుగులో ప్రసిద్ధములు, ప్రచారములో నున్న ఛందోగ్రంథము లివి.

1. కవిజనాశ్రయము.
2. కావ్యాలంకార చూడామణి.
3. ఛందోదర్పణము (అనంతుడు)-1.
4. కవిచింతామణి.
5. ఛందోదర్పణము (తాతంభట్టు)-2.
6. లక్షణసారసంగ్రహము (చి. పెద్దన)-1.
7. సులక్షణసారము.
8. కవిజనసంజీవని.
9. అప్పకవీయము.
10. లక్షణశిరోమణి.
11. సర్వలక్షణ శిరోమణి.
12. లక్షణసారసంగ్రహము (కూ. తిమ్మన)-2.
13. ఆనందరంగచ్ఛందము.
14. సుకవిమనోరంజనము.

(వీటినిగూర్చి విడివిడిగా పరిచయము ముందు చూడవచ్చును.)

ఆధునిక కాలమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి 'ఛందస్సు', శ్రీ ఱ్ఱేకుమళ్ళ రాజగోపాలరావుగారి ఛందశ్శాస్త్రము పేర్కొనదగినవి. ఈకాల్ల

మున ఛందోవిషయములను సమీక్షించుచు పలు వ్యాసములు, గ్రంథములు రచింపబడినవి. అముద్రిత గ్రంథచింతామణి, ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక, త్రిలింగ, భారతి, ఆంధ్రపత్రిక మొదలగు పలు పత్రికలయందు ఆయా వ్యాసములు వెలువడినవి. వెలువడిన గ్రంథములు తక్కువే. 'తెలుగు ఛందోరీతులు' (శ్రీ గిడుగు సీతాపతి), 'తెలుగు ఛందోవికాసము' (శ్రీ కోవెల సంపత్కుమారాచార్య), 'తెలుగుభాషలో ఛందోరీతులు' (శ్రీ రావూరి దొరసామిశర్మ) ప్రసిద్ధములైనవి. ద్రావిడభాషలోని తెలుగు ఛందోరీతుల పోల్చి విమర్శించు గ్రంథము శ్రీ చేకుమళ్ల రాజగోపాలరావుగారి 'Comparative Prosody', బ్రౌను దొర రచించిన 'Analysis of Telugu Prosody' అనునవి తెలుగు ఛందస్సుగూర్చి ఆంగ్లమున వెలువడిన గ్రంథములు.

**కవిజనాశ్రయము**

ఈనాటికి లభించు ఛందోగ్రంథములలో కవిజనాశ్రయము మొట్ట మొదటిది. ఇది వేములవాడ భీమకవి కృతమని ప్రసిద్ధము. కాని ఆధునికముగా రేచన దీని కర్తయనువాదము వెలసినది. ఈ కర్తృత్వ వివాద మింకను వివాదముగానే యున్నది. చూ. వే భీమన; రేచన.). ప్రస్తుత కోశమున కవిజనాశ్రయము భీమన కృతముగానే ఉదాహరించబడినది.

కవిజనాశ్రయమున ఐదు 'అధికారము' లున్నవి

మొదటిది 'సంజ్ఞాధికారము'. ఇందు ఛందఃప్రశంస, కావ్య-పద్యగద్య విభాగములు, గురులఘు వివేకము, గణస్వరూపము, గణదేవతాదికము, యతి భేదములు, ఒకటిరెండు ప్రాసభేదములు, శబ్దాలంకారప్రాయములైన షడ్విధ ప్రాసములు చెప్పబడినవి.

రెండవది 'వృత్తాధికారము'. ఇందు 26 ఛందములు, ఆయా ఛందములలో ప్రసిద్ధ వృత్తములు, అర్ధసమ, ఉద్ధురమాలా వృత్తములు చెప్పబడినవి.

మూడవది 'జాత్యధికారము'. ఇందు ఆర్యగీత్యాదులు, తెలుగు జాత్యుపజాతులు చెప్పబడినవి.

నాల్గవది 'షట్ప్రత్యయాధికారము' ఇందు ప్రస్తారాది షట్ప్రత్యయములు చెప్పబడినవి.

ఐదవది 'దోషాధికారము'. ఇందు దశవిధ కావ్యదోషములు, కొన్ని వ్యాకరణ సంబంధాంశములు చెప్పబడినవి.

**కావ్యాలంకార చూడామణి**

'కావ్యాలంకార చూడామణి' కర్త విన్నకోట పెద్దన. (చూ. విన్నకోట పెద్దన.). ఈ గ్రంథమునే 'పెద్దిరాజు అలంకారము' అని కొందరు లాక్షణికులు పేర్కొన్నారు. ప్రధానముగా ఇది అలంకారశాస్త్ర గ్రంథము ఇందలి తొమ్మిది 'ఉల్లాసము'లలో 7, 8వ ఉల్లాసములు ఛందో విషయములను వివరిం

చును. కావ్య రచనకు ఛందో వ్యాకరణ జ్ఞానముగూడ ముఖ్యముగావున ఈ ఛందో విషయములు, చివరి ఉల్లాసమున వ్యాకరణాంశములు చెప్పబడినవి.

తొమ్మిది ఉల్లాసములలో ప్రథమోల్లాసమందు అనుభావ విభాగములు, ద్వితీయోల్లాసములో రస-భావములు, దశావస్థాదులు, తృతీయోల్లాసములో నాయికానాయక భేదములు, కవి-కావ్యభేదములు, అష్టాదశవర్ణనలు, చతుర్థాశ్వాసములో వృత్తి రీతి ధ్వన్యాదులు, పంచమోల్లాసమందు అర్థాలంకారములు, షష్ఠోల్లాసమున శబ్దాలంకారములు, బంధములు శబ్దార్థ దోషములు చెప్పబడినవి. కాగా అయిదాశ్వాసములు అలంకారశాస్త్ర విషయికము. సప్తమోల్లాసమందు యతిప్రాస భేదములు, 12వ ఛందము వరకు వృత్తములు, చెప్పబడినవి. అష్టమోల్లాసమున 13వ ఛందము నుండి 26వ ఛందము వరకు వృత్తములు, అర్థసమ-విషమవృత్తములు, ఉద్ధుర మాలావృత్తములు షట్ప్రత్యయములు చెప్పబడినవి. ఈ రెండు ఛందో విషయికములు. నవమోల్లాసమున సంధి, సమాస, తద్ధితాదులగు వ్యాకరణాంశములు చెప్పబడినవి.

ఇందలి ఛందో విషయములు పూర్తిగా క. జ. ను అనుసరించినవి. ఒకటి రెండంశము లధికమైనను ఈ రెండు—కవిజనాశ్రయ, కావ్యాలంకార చూడామణి—జంట గ్రంథములు. ఒకదానిలోని సందిగ్ధాంశము నింకొకదానితో సరిచూచుకొని నిరూపించుకొన దగినట్లుగా నున్నవి సూర్యాది గణ నిర్ణయ విషయము, త్రిపదాది పద్య స్వరూపములు ఈవిధమైన పరస్పర సాన్నిహిత్యమునకు ఉదాహరణములుగా గమనించ వచ్చును. (చూ. సూర్యగణములు మొ.: త్రిపద.).

**పెద్దిరాజు అలంకారము**

చూ. కావ్యాలంకారచూడామణి.

**ఛందోదర్పణము**

'ఛందోదర్పణము' అనంతామాత్య విరచితము. (చూ. అనంతుడు.). అనంతర కాలీనుడైన వెల్లంకి తాతంభట్టు రచించిన 'ఛందోదర్పణ' మింకొకటి యున్నది. దానికన్న నిది భిన్నమనుటకు కావచ్చును, దీనికి 'అనంతుని ఛంద' మను ప్రసిద్ధ వ్యవహారము కలిగినది.

ఛందోదర్పణము-నాలుగాశ్వాసములు గల ప్రసిద్ధ చ్ఛందోగ్రంథమిది. ప్రథమాశ్వాసమున పద్యగద్యాది కావ్యవిభాగము, గురులఘునిర్ణయము, గణనిరూపణము, యతిప్రాస భేదములు, కొన్ని పారిభాషికాంశములు చెప్పబడినవి. ద్వితీయాశ్వాసమున 26 ఛందములలోని కొన్ని వృత్తములు, అర్ధసమ-విషమ వృత్తములు, ఉద్ధురమాలా వృత్తములు, దండకము చెప్పబడినవి. తృతీయాశ్వాసమున ఆర్యాగీతాదులు, జాత్యుపజాతులు, చాటుప్రబంధ విశేషములు, ఉదాహరణ కావ్యలక్షణము, షట్ప్రత్యయములు చెప్పబడినవి. చతుర్థాశ్వాసమందు

దశవిధ దోషములు, కొన్ని సంస్కృత సంధులు, సమాసములు, కారకము మొద లగు వ్యాకరణాంశములు చెప్పబడినవి.

అనంతుడు సూర్యాది గణనిర్ణయ విషయమున పూర్వులతో భేదించినాడు. అనంతర కాలీను లితనినే అనుసరించినారు. నేటికిని అనంతుని నిర్ణయమే ప్రచారములో నున్నది. అనంతర కాలీనులగు లాక్షణికులు పరమ ప్రమాణముగా గ్రహింపదగినంత సమగ్ర గ్రంథమిది. సీసభేదములకు అనంతుడు అందరికన్నను సమగ్రరీతిలో లక్ష్యలక్షణములు నిరూపించినాడు.

**అనంతుని ఛందము**

చూ. ఛందోదర్పణము-1.

**కవి చింతామణి**

'కవి చింతామణి' కర్త వెల్లంకి తాతంభట్టు (చూ. వెల్లంకి తాతంభట్టు).

ఈ గ్రంథమందు భాషా నిర్ణయము, వర్ణ నిర్ణయము, యతిప్రాస భేదములు, దోషాధికార మనునవి యున్నవి. ప్రధానముగా నిది వ్యాకరణ గ్రంథము యతిప్రాసలకు సంబంధించినవే ఛందో విషయికములు.

ఈగ్రంథ మిత్పటివరకు నముద్రితము. కాని ఛందో లాక్షణికులందిది ప్రసిద్ధము. పలు లాక్షణికులు దీని నుదాహరించినారు

**ఛందో దర్పణము-2**

'ఛందో దర్పణము' వెల్లంకి తాతంభట్టు కృతము. (చూ. వెల్లంకి తాతంభట్టు.). తాతంభట్టుకన్న పూర్వుడగు అనంతుడు రచించిన ఛందోదర్పణము దీనికన్న భిన్నము తాతంభట్టు గ్రంథమునుండి దానిని విభేదింపచేయుటకే దానికి అనంతుని ఛంద'మను వ్యవహారప్రసిద్ధి వచ్చియుండును. అప్పకవి ఛందో గ్రంథములను పేర్కొనుచు 'అనంతామాత్య ఛందంబును, ఛందోదర్పణంబును' అని వ్రాసినాడు. (అ. క. 1-5) ఈ ఛందోదర్పణము తాతంభట్ట కృతము. 'కవి చింతామణి' యందు కేవలము యతిప్రాసలనే చెప్పియుండుటచే ఇందు వివరముగా ఛందో విషయముల ప్రస్తావించి యుండును. ఇది అలభ్యము.

**లక్షణసారసంగ్రహము-1**

'లక్షణసారసంగ్రహము' చిత్రకవి పెద్దన కృతము. (చూ. చిత్రకవి పెద్దన.). మూడాశ్వాసములు గల ప్రసిద్ధ చ్ఛందోగ్రంథము. (కూచిమంచి తిమ్మన కృతమైన 'లక్షణసారసంగ్రహము' దీనికన్న భిన్నము. చూ. లక్షణసారసంగ్రహము-2 ). ప్రథమాశ్వాసమందు అక్షరలక్షణము, గురులఘునిర్ణయము, గణనిర్ణయము, అక్షర దేవతాదికము, కవి-నేతృస్వరూపము, యతిప్రాస

భేదములు, 25 ఛందములలోని కొన్నికొన్ని వృత్తములు, పాదగోపనాదులు చెప్పబడినవి. ద్వితీయాశ్వాసమున అర్ధసమ-విషమ వృత్తములు, షట్ప్రత్యయములు, ఉద్ధురమాలావృత్తములు, ఆర్యా-గీతిభేదములు, జాత్యుపజాతులు, వైతాళీయ భేదములు, ఉదాహరణ కావ్యలక్షణము, లక్ష్యము, యక్షగాన లక్షణము చెప్పబడినవి. తృతీయాశ్వాసమున రేఫ-అకార నిర్ణయము, నాటక లక్షణములు, చిత్ర, బంధ, గర్భకవితా స్వరూపము చెప్పబడినది.

వైతాళీయ భేదములను మొదటిసారిగా చెప్పినవాడు చిత్రకవి పెద్దన. వాటితోబాటు ఛందోగ్రంథములలో రేఫ-అకార నిర్ణయము ప్రారంభించినదియు ఆతడే. రేఫ-అకారములకు యతిప్రాస లంగీకరించకపోవుటచే ఈ నిర్ణయము అవసరమైనది. (తాళ్లపాక పెదతిరుమలయ్య రేఫ-అకార నిర్ణయమును ప్రత్యేక గ్రంథముగా రచించినాడు. మరికొందరు తరువాత రచించినారు కాని ఛందోగ్రంథములందు మొదటిసారిగా ల. సా. సం. లోనే యున్నది.). ఈ గ్రంథమందు నాటకలక్షణము లుండుట ఒక ప్రత్యేకత. అప్పకవీయమందలి ఛందోభాగమున కిది మూలగ్రంథ మనిపించును.

**సులక్షణసారము**

లింగమగుంట తిమ్మన రచించినది 'సులక్షణసారము'. (చూ. లింగమగుంట తిమ్మన.). ఇందు ఎనిమిది ప్రకరణములున్నవి. సంజ్ఞా, షట్ప్రత్యయ, జాత్యుపజాతి, వృత్త, యతి, ప్రాస, అక్షరగుణదోషవిచార, గణవిషయవిచార ప్రకరణములివి. ప్రకరణముల పేర్లే ఆయా ప్రకరణములందు చెప్పబడిన అంశములను సూచించును. ప్రాసప్రకరణమున శబ్దాలంకారప్రాయములైన షడ్విధ ప్రాసలే తప్ప పూర్వలాక్షణికులు చెప్పిన ప్రాసభేదములు చెప్పబడకుండుటకు కారణము మృగ్యము.

వ్యాకరణాంశము లేవియులేని అచ్చమయిన ఛందోగ్రంథమిది. లక్ష్యములనే గాక లక్షణములనుగూడ ప్రాచీన గ్రంథములనుండి ప్రదర్శించుట ఈ గ్రంథమందలి యొక ప్రత్యేకత. దీనివలన సంకలనగ్రంథ లక్షణము కొంత దీనికి కలిగినది. మరియు పలు ఛందోగ్రంథముల ఉనికి తెలిసినది. (ఉత్తమగండ, గోకర్ణ, లక్షణ చూడామణిత్యాద్యనేక చ్ఛందములనుండి లక్ష్యలక్షణములందు చూపబడినవి.).

ఛందోవిద్యార్థులకు ప్రథమ పాఠ్యగ్రంథముగా సులక్షణసారము బహుళప్రచారములోనున్న గ్రంథము.

**కవిజన సంజీవని**

'కవిజన సంజీవని' ముద్దరాజు రామన కృతము (చూ. ముద్దరాజు రామన ). ఇది అసమగ్రముగా లభ్యమయినది. లభ్యమగు నాల్గు 'తరంగ' ములలో ప్రథమ తరంగమున యతిప్రాసలు, ద్వితీయ తరంగమున విభక్తులకు

సంబంధించిన యంశములు చెప్పబడినవి. ఇట్లే తృతీయ, చతుర్థ తరంగములందు సమాసములకు, సంధులకు సంబంధించిన యంశములు కొన్ని యున్నవి. 'నన్నయ తిక్కన యజ్వప్రముఖ నిఖిల కవిసూక్తి మణీజని' గా తానీ కవిజన సంజీవని' రచించినట్లు రామన చెప్పినాడు. అప్పకవి చెప్పిన పలు యతిభేదము లిందున్నవి. అఖండ యతిని అనంతాదులకన్న భిన్నరీతిలో రామన అంగీకరించి చెప్పినాడు. ఇతడు అఖండ యతికి చూపిన లక్ష్యములను కొన్నిటి నప్పకవి దిద్ది అఖండయతిని నివారించినాడు.

**అప్పకవీయము**

'అప్పకవీయము' కాకునూరి అప్పకవి కృతము. (చూ. కాకునూరి అప్పకవి). అప్పకవి ఈ గ్రంథమును 'ఆంధ్ర శబ్దచింతామణి' అని పేర్కొన్నాడు. 'నన్నయగారి ఆంధ్ర శబ్దచింతామణి' కిది పద్యరూపమైన వ్యాఖ్య. మూలగ్రంథము సంస్కృతమునందున్నది. ఇది తెలుగునందున్నది. కాగా దీనికిని మూలగ్రంథము పేరే అప్పకవి పెట్టినను 'అప్పకవీయ' మను పేరనే ఇది సుప్రసిద్ధము.

ఇందు అయిదాశ్వాసములున్నవి. ప్రథమాశ్వాసమున కావ్యస్వరూపాదులు, భాషాష్టక వివరణము, తత్సమాదుల నిరూపణము; ద్వితీయాశ్వాసమున వర్ణములకు సంబంధించిన అంశములు, రేఫ-ఱకార నిర్ణయము, బీజాక్షరాదులు, అక్షర శుభాశుభ ఫలములు; తృతీయాశ్వాసమున యతిప్రాస భేదములు; చతుర్థాశ్వాసమున గణాదివిషయము, షట్ప్రత్యయములు, 26 ఛందములకు చెందిన కొన్నికొన్ని వృత్తములు, ఉద్ధురమాలా వృత్తములు, అర్థసమ-విషమ వృత్తములు, జాత్యుపజాతులు, చాటుకావ్య స్వరూపములు, ఉదాహరణ కావ్య లక్షణము, లక్ష్యము, చిత్ర, బంధ, గర్భ కవితారీతులు; పంచమాశ్వాసమున సంధి విషయములు చెప్పబడినవి.

వ్యాకరణ గ్రంథవ్యాఖ్యగా అప్పకవీయము ఉద్దేశింపబడినది. కాని సంధులవరకే ఆగిపోయినది. మొత్తమెనిమిదాశ్వాసములుగా రచింపబడుటకు ప్రణాళిక వేయబడినట్లు అప్పకవి (పీఠిక-9) చెప్పినను లభించునది మాత్రము ఐదాశ్వాసముల గ్రంథమే. కాగా వ్యాకరణ విషయికముగా నిది అసమగ్రము. కాని ఛందోవిషయికముగా సమగ్రము. మూలగ్రంథమందలి 'ఆద్యోవర్ణః' ఇత్యాది ఛందోవిషయ ప్రస్తావన ఆధారముగా ఛందోవిషయములను సమగ్రముగా నిరూపించినాడు. కొన్ని లోపములున్నను; ఇందున్నంతటి విస్తృతమయిన లక్ష్య, లక్షణ పరిశీలన, శాస్త్రరచనా క్షమత మరి యే గ్రంథమందును మృగ్యము. దాదాపుగా ప్రతి యంశమునకును ప్రాచీన గ్రంథములనుండి నెమకి నెమకి లక్ష్యములు ప్రదర్శింపబడినవి. సాధ్యమయినంతవరకు తాను చెప్పిన అంశములను సకారణముగా, యుక్తియుక్తముగా నిరూపించుటకు అప్పకవి ప్రయత్నించినాడు. పూర్వచ్ఛందోగ్రంథములందలి అనేకాంశముల నిందు సంగ్ర

హించినాడు. దీనికన్న పూర్వార్వాచీన గ్రంథములందు కొన్ని విశిష్టాంశము లున్నను, ఆ గ్రంథములకు దీనిముందు ప్రకాశ మంతగా కలుగలేదు. తెలుగులో దాదాపు మొట్టమొదట ముద్రణ కెక్కి బహుళప్రచారములోనికి వచ్చిన గ్రంథ మిది. ఛందోవిషయములలో దీనికి మిక్కిలి ప్రామాణ్యము కలిగినది. ఛందో విషయికముగా నింతటి సమగ్ర గ్రంథము తెలుగులో మరొకటి లేదనవచ్చును.

**లక్షణశిరోమణి**

'లక్షణ శిరోమణి' పొత్తపి వేంకటరమణకవికృతము (చూ. పొత్తపి వేంకటరమణకవి). ఇందు నాలుగాశ్వాసములున్నవి. మొదటిదానియందు అక్షరములగూర్చి; రెండవదానియందు గణములనుగూర్చి; మూడవదానియందు వృత్తములనుగూర్చి; నాల్గవదానియందు యతి ప్రాసములగూర్చి వివరించబడినది. యతిప్రాసములగూర్చిన అనేకాంశములు ప్రాచీనగ్రంథములందులేని విందున్నవి. ఈ విషయమున అప్పకవీయమునకిది దీటు.

**సర్వలక్షణ శిరోమణి**

'సర్వలక్షణ శిరోమణి' గణపవరపు వేంకటకవి కృతము. (చూ. గణపవరపు వేంకటకవి). ఇది పది ఉల్లాసముల గ్రంథము. కాని 6, 7, 8, 9 ఉల్లాసములుతప్ప మిగిలినవిమాత్రమే లభ్యములు. ఒక్కొక్క ఉల్లాస మొక్కొక్క గ్రంథముగా కన్పించును. పేర్లుకూడ విడివిడిగా నున్నవి. మొదటి ఉల్లాసమున అలంకార శాస్త్రీయాంశములు వివరించబడినవి. రెండవది 'వెంకటేశాంధ్ర నిఘంటువు'. మూడవది 'ఆంధ్రకౌముది' (వ్యాకరణ విషయికము). నాల్గవది ఛందోవిషయముల వివరణము, ఐదవది రేఫ-ఱకారనిర్ణయము. పదవది ద్విరూప కోశము. పై వాటిలో రెండవది, మూడవది మాత్రమే ముద్రితములు.

**లక్షణసార సంగ్రహము-2**

'లక్షణసార సంగ్రహము' కూచిమంచి తిమ్మన ప్రణీతము. (చూ. కూచిమంచి తిమ్మన.) దీనిని 'లక్షణసారసంగ్రహ' మనియే రచయిత పేర్కొన్నాడు. కాని చిత్రకవి పెద్దన రచించిన 'లక్షణసార సంగ్రహము' నుండి దీనిని విభేదింప చేయుటకు 'సర్వ లక్షణసార సంగ్రహ' మన్న వ్యవహారము దీనికి కలిగినది.

ఇది ప్రధానముగా వ్యాకరణ గ్రంథము. ఇందు మూడాశ్వాసము లున్నవి. ప్రథమాశ్వాసమున భాషావిభాగము, వర్ణములు, కళలు, సంధులు, విభక్తులు; ద్వితీయాశ్వాసమున సమాసములు, క్రియలు, విశేషణములు, ప్రాసలు యతులు, కొన్ని శబ్దస్వరూపములు; మూడవ ఆశ్వాసమున రేఫ-ఱకారములు వివరింపబడినవి. ఛందస్సుకు సంబంధించి నంతవరకు యతిప్రాసలే ఇందున్నను, పూర్వ గ్రంథములలో లేని కొన్ని విశేషాంశము లిందున్నవి, మరియు అలక్ష్య

మగు ఎఱ్ఱనగారి రామాయణములోని పద్యములు కొన్ని ఉదాహరింపబడుట విశేషము.

**ఆనంద రంగచ్ఛందము**

'ఆనంద రంగచ్ఛందము' కస్తూరి రంగకవి ప్రణీతము. (చూ.కస్తూరి రంగకవి.) 'లక్షణ చూడామణి' అని దీనికే కవికృతమగు నామాంతరము. 'రంగరాట్ఛంధ' మనియు దీనికే వ్యవహారము. ఇది నాల్గాశ్వాసముల ఛందో గ్రంథము. ప్రథమాశ్వాసమున అక్షరగణ నిర్ణయము, ప్రసిద్ధ వృత్త జాత్యుపజాతులు చెప్పబడినవి. ద్వితీయాశ్వాసమున గణ, వర్ణ దేవతాదికము చెప్పబడినది. తృతీయాశ్వాసమున కొన్ని సంధులు, విభక్తి విశేషములు, షట్ప్రత్యయములు. 26 ఛందములందలి కొన్ని వృత్తములు, ఉద్ధుర మాలావృత్తములు చెప్పబడినవి. జాత్యుపజాతు లనేకములు కేవలము పేర్కొనబడినవికాని లక్ష్య లక్షణ నిరూపణము చేయబడలేదు. శప్రాసము వంటి కొన్ని విశేషాంశము లిందున్నవి. సులక్షణ సారమందువలె పలు ప్రాచీన చ్ఛందోగ్రంథములనుండి లక్ష్య లక్షణము లిందు ప్రదర్శింపబడినవి.

**లక్షణ చూడామణి**

చూ. ఆనంద రంగచ్ఛందము.

**రంగరాట్ఛందము**

చూ. ఆనంద రంగచ్ఛందము.

**సుకవి మనోరంజనము**

'సుకవి మనోరంజనము' కూచిమంచి వేంకటరాయ ప్రణీతము. (చూ. కూచిమంచి వేంకటరాయడు.). ఇది ప్రధానముగా అప్పకవీయమున చెప్పబడిన పలు అంశములను ఖండించుచు పలు విశేషాంశములను ప్రదర్శించును. ఇది నాల్గాశ్వాసముల గ్రంథము. మొదటి ఆశ్వాసమున తెలుగు అక్షరముల సంఖ్యానిర్ణయము, ప్రాసభేదములు వివరింపబడినవి. రెండవ ఆశ్వాసమున స్వర, వ్యంజన యతులు వివరింపబడినవి. మూడవ ఆశ్వాసమున ఉభయయతులు విస్తరింపబడినవి. నాల్గవఆశ్వాసమున రేఫ-అకారనిర్ణయము పలు శబ్దరూపములు నిర్ణయింపబడినవి. తానొక ఛందోగ్రంథమును రచించుచున్నట్లుకాక, పూర్వచ్ఛందోగ్రంథములలోని యంశములయందలి లోపములను తెల్పి వాటిని ఖండించుచు, స్వదృష్ట్యా సరియైన అంశములు చెప్పబడినవి. విమర్శ అంతయు వచనమున సాగుట ఇందలి ప్రత్యేకత. అఖండయతిని సమర్థించుచు భారతాది గ్రంథములనుండి అరువదినాల్గులక్ష్యములు ప్రదర్శింపబడినవి. ప్రధానముగా అప్పకవీయ విమర్శనమేయైనను ఇతర గ్రంథములలోని లోపములుగూడ ఇందు విమర్శింపబడినవి. ఆధునికమైన విమర్శ వ్యాసములధోరణిలో నుండుట ఈ ఛందోగ్రంథ విశిష్టత. చర్చాగ్రంథమగుట దీని ప్రత్యేకత.

## చిత్రకవిత

ఆశు, మధుర, చిత్ర, విస్తరములను నాల్గు విధములయిన కవితల లోనిది చిత్రకవిత. పద్యమును చూడగనే మేధ కతి శ్రమాపాదకమై, ప్రయోక్త నేర్పునకు సూచకమై ఏదో విచిత్ర లక్షణమును భాసింపచేయునది చిత్రకవిత. ఒక పద్యపాదమును, లేదా మొత్తము పద్యమునే మొదటినుండి చివరవరకు, చివరనుండి మొదటికి చదివినను ఒకేవిధముగానున్న పద్య మొక విచిత్ర రచనగా కన్పించును. ఇట్లు రచించుట శ్రమసాధ్యము. కవియొక్క ఈ శ్రమయే, నేర్పే ఒక చమత్కారము కలిగించును. చిత్రమనిపించును. అందుకని ఇది 'చిత్ర కవిత'గా పేర్కొనబడినది.

చిత్రకవితనుగూర్చి మొదట విన్నకోట పెద్దన, ఆ తరువాత చిత్రకవి పెద్దన, అప్పకవి మొదలగు పలుమంది తమ లక్షణగ్రంథములలో వివరించినారు. చిత్రకవిత పలువిధములుగా నుండును.

1. ఏగాక్షరి : పద్యమంతయు ఒకే అక్షరముతో రచింపబడుట.
2. ద్వ్యక్షరి : పద్యమంతయు రెండక్షరములతోనే రచింపబడుట.
3. త్ర్యక్షరి : పద్యమంతయు మూడే అక్షరములతో రచింపబడుట.
4. తలకట్లు : పద్యమందలి అక్షరములన్నియు తలకట్లు (హ్రస్వ అకారములుగల హల్లులు) కలిగియుండుట.
5. గుడులు : పద్యమందలి అక్షరములన్నియు గుడులతో (హ్రస్వే కారముతో) నుండుట.
6. కొమ్ములు : పద్యమందలి అక్షరములన్నియు కొమ్ములతో (హ్రస్వోకారములతో) నుండుట.
7. ఓష్ఠ్యము : పద్యమందన్నియు ఓష్ఠ్యవర్ణములే యుండుట.
8. నిరోష్ఠ్యము : పద్యమం దోష్ఠ్యవర్ణములు లేకుండుట.
9. అక్షరగుణితము : పద్యమందు కొన్ని అక్షరములు వరసగా గుణింతము (క, కా, కి, కీ...ఇత్యాదిగా) గలిగియుండుట.
10. పాదభ్రమకము : పద్యమందలి పాదములు ఒక్కొక్కటి మొదటి నుండి చివరకు, చివరనుండి మొదటికి చదివి నను ఒకేవిధముగా నుండుట.
11. పద్యభ్రమకము : పాదభ్రమకమున పాదమువలె ఇందు పద్య మంతయు నుండును.
12. పాదగోపనము : పద్యపు మొదటి మూడు పాదములలో పద్యపు నాల్గవపాదము నిముడ్చుట.

ఈవిధముగా నింకను పలు 'చిత్ర' రీతులున్నవి. పై వాటిలో రెండు మూడింటికి ఉదాహరణములు :

i. ద్వ్యక్షరి

క. మనమున ననుమానము మా
నను నీనామ మను మను మననమును నేను
మ్మున మాన నన్ను మన్నన
మను మను నానామునీన మానా నూనా.

—పారి. 5-98.

ii. తలకట్లు

క. ఘన శర శశధర భశర
ఘ్న దశ శత నయన హయ మదన హర నర నం
దన కనక వసన దర చం
దన సమ మమరఁగఁ బవన తనయ యశ మరయన్.

—ల. సా. సం. 3-224.

iii. పాదభ్రమకము :

క. ధీర శయనీయ శరధీ
మారవిభానుమత మమత మనుభావి రమా
సార సవన నవసరసా
దారద సమతార హార తామసదరదా!

—పారి. 5-93.

iv. గుణితము :

మ. ప్రవిభా విక్రమ మంత్రశాస్త్ర (విభవార్షః శ్రీధనుఃకాంతి ధై)
ర్య వివేకంబులఁ చిన్నయోబయ నృపాలాగ్రేసరుం బోల్తునే
సవితన్, సాత్యకి, సింధు, సీరి, సురశాస్తన్, సూతు, సేనాని, సైం
ధవ గర్వాపహు, సోము, సౌరగిరి, సంధ్యాతాండవా డంబరున్.

—ప్ర. రా. నా. ప్ర. 1-55.

v. పాదగోపనము :

చ. ఘన హరి భాను జాప్తమతి కంజ భవా యతుల ప్రతాప భా
గ్య నిధి కృపాకరా జనక జాయత శుక్రకచా మహాత్మ పా
వని వటుకేన శూర చయ వర్య సుధీ సరసాద్య హృద్యశా
హనుమ జయప్రభాధిక నయక్రమ పావనచర్య సద్యశా!

—ల. సా. సం. 1-99.

(పద్యము మొదటినుండి ప్రతి మూడవ యక్షరము గ్రహించి కలిపి చదివిన నాల్గవ పాద మేర్పడును.).

ఈవిధముగా చిత్రకవిత విస్తృతమైనది.

బంధకవిత, గర్భకవితయు చిత్రకవితలో చేరినవే. వీటిని గూర్చి విడిగా వ్రాయబడినది.

ఆశు, మధుర, విస్తర కవితలందు చిత్రకవితకు ఛందస్సుతో నున్నట్టి సంబంధము లేదు. ఈ సంబంధము ప్రయోగాత్మకము.

**బంధకవిత :**

బంధ కవిత యనగా కొన్ని బంధములలో పద్య మిముడునట్లు వ్రాయుట. బంధ మనగా నిక్కడ నొక రేఖాచిత్రమని భావింపవలెను. ఉదాహరణమునకు సర్వతోభద్రబంధము చూడవచ్చును. అరువది నాల్గు అరలుగా నొక చిత్రము గీయవలెను. పాదమున కెనిమిదక్షరములు గల పద్యపు నాల్గుపాదములను మొదటి నాల్గు వరుసలలో అరకొక యక్షరముగా వ్రాయవలెను. తరువాతి నాల్గు వరుసలలో వరుసగా పై పద్యము యొక్క 4, 3, 2, 1 వ పాదములు వ్రాయవలెను. ఇట్లు వ్రాయగా ఏవైపునుండి పద్యము చదివినను యతిప్రాసలతో సహా పద్యము చెడకుండ నుండవలెను.

ఉదా :

-: సర్వతోభద్ర బంధము :-

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| వం | దే | స | దా | దా | స | దే | వం |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దా | వ | కం | త | త | కం | వ | దా |
| దా | వ | కం | త | త | కం | వ | దా |
| స | రం | గ | కం | కం | గ | రం | స |
| దే | వ | రం | వ | వ | రం | వ | దే |
| వం | దే | స | దా | దా | స | దే | వం |

పై బంధమందు బద్ధపద్య మిది :

వందే సదా దాసదేవం । దేవరం వవరం వదే।
సరంగకం కంగరంస । దావకం తతకం వదా॥

—అ. క. 4-402.

(ఇది సంస్కృత పద్య మగుటచే యతిప్రాస నియమము లిందులేవు.)

ఈ బంధమున కమరునట్లు పద్యము వ్రాయుట కీ క్రిందిపద్ధతు లవలంబించవలెను. పద్యమందలి ప్రతిపాదము పాదభ్రమకము (మొదటినుండి చివరకు, చివరనుండి మొదటికి చదివిన నొకే తీరుండునట్లు) గా నుండవలెను. మరియు మొదటి పాదపు రెండవ యక్షరము 2 వ పాదమునకు, 3 వ అక్షరము 3 వ పాదమునకు, 4 వ అక్షరము 4 వ పాదమునకు ఆద్యక్షరములు కావలెను. ఇట్లే 2 వ పాదపు 3 వ అక్షరము 3 వ పాదపు 2 వ అక్షరముగా, 4 వ అక్షరము 4 వ పాదపు 4 వ అక్షరముగా నుండవలెను. ఇట్లే 3 వ పాదపు 4 వ అక్షరము 4 వ పాదపు మూడవ అక్షరముగా నుండవలెను. ఇన్ని నియమములతో పద్యము (ఎనిమిదక్షరముల పాదప్రమాణము గలది) వ్రాసినచో 'సర్వతోభద్రబంధ'మున నిముడును. (ఐమూలలుగా తప్ప) ఏ వైపునుండి చదివినను పద్య మీబంధమున చెడదుగాన నిది సర్వతోభద్ర బంధమైనది.

ఈ విధముగనే పద్మ, ఖడ్గ, ఛత్ర, గోమూత్రికా, చక్రాదిబంధము లనేకములు కవినేర్పును బట్టి నిర్మింపబడును. కొన్ని లక్షణగ్రంథములందు ప్రదర్శింపబడినవి. పై ఉదాహృతి సూచనగా మిగిలినవి పరిశీలించుకొనవలెను. గణపవరపు వేంకటకవి రచించిన '(శ్రీ) ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాస' మందు బంధకవిత ఆశ్చర్యకరముగా ప్రదర్శింపబడినది (చూ. గణపవరపు వేంకటకవి).

ఏ బంధమునం దేవిధమైన పద్యము లిముడునన్న ఛందఃపరిశీలన, గణాక్షరాదుల కూర్పు బంధకవిత కావశ్యకము. ఈ కారణముగా ఛందోవిషయమైనది.

## గర్భకవిత

ఒక పద్యమందు మరియొక పద్యము లేదా మరికొన్ని పద్యములు ఇమిడియుండునట్లుగా చేయబడు పద్యరచన గర్భకవిత యనబడును. ఏ పద్యమందేయే విధములైన పద్యము లిముడుట కవకాశమున్నదన్న పరిశీలన గర్భకవితకు ముఖ్యమయినది. ఉదాహరణమునకు 'వసంతతిలక' వృత్తమందు మొదటి యక్షరమును, చివరి రెండక్షరములను విడిచి చదివినచో స్వాగతవృత్తమగును. కాగా వసంతతిలక స్వాగతగర్భ మగుచున్నది. ఇట్లే సరసిజ వృత్తమందు రెండు కందపద్యములు, తొమ్మిదవ ఛందమందలి యొక వృత్తము, 15 వ ఛందమందలి మణిగణ నికరము ఇముడును.

ఉదా :

(శ్రీ) విశ్వేశ ధ్యానవరు సేవా శితులు పొగడుదురు సిరి వరగుటకై
ధీ విద్యా సంభావిత దేవున్ ధృతియుతు హితజన దివస దినకరున్
(శ్రీ) వర్ణింతున్ భావన జీవున్ జితరిపు శశికులశిఖరి మృగపతిన్
భావోదంచ ద్భావిత భావున్ ప్రతిదిన సముదిత బహుతర విభవున్.

—కా. చూ. 6-54.

ఇది సరసిజ వృత్తము (చూ. సరసిజ). ఇందు మొదటి రెండు పాదములు ఒక కందము, చివరి రెండుపాదము లొక కందము. ప్రతిపాదమున మొదటి ఆరక్షరముల వరకు కందపు బేసిపాదములు, మిగిలిన భాగములు సరి పాదములు. ఇక ప్రతి పాదమున మొదటి తొమ్మిది అక్షరములనే గ్రహించి చదివినచో నవమచ్ఛంద మందలి యొక వృత్తము (మ-త-య గణములు. ఈ గణక్రమముతో లాక్షణికులు వృత్తము చెప్పలేదు.) అగును. ఇట్లే ప్రతిపాదమున మొదటి తొమ్మిదక్షరముల వదలి మిగిలిన భాగములను చదివినచో మణిగణనికర వృత్తమగును. ఈ సరసిజ గర్భమందలి పద్యము లిట్లున్నవి :

i. పూర్వార్థకందము :

శ్రీవిశ్వేశత్మావరు
సేవాశ్రితులు వొగడుదురు-సిరి వరగుటకై
ధీవిద్యాసంభావిత
దేవున్ ధృతియుతు హితజన-దివస దినకరున్.

ii. ఉత్తరార్థకందము :

శ్రీవర్ణింతున్ భావన
జీవున్ జితరిపు శశికుల-శిఖరి మృగపతిన్
భావోదంచద్భావిత
భావున్ బ్రతిదిన సముదిత-బహుతర విభవున్.

iii. నవమచ్ఛందోవృత్తము :

శ్రీవిశ్వేశత్మావరుసేవా
ధీ విద్యాసంభావితదేవున్
శ్రీవర్ణింతున్ భావనజీవున్
భావోదంచద్భావితభావున్.

(నవమచ్ఛందోవృత్తముకావున యతిచెల్లింపిందుండదు. చూ. వృత్తములు).

vi. మణిగణనికరము :

శ్రితులు వొగడుదురు-సిరివరగుటకై
ధృతియుతుహితజన-దివస దినకరున్
జితరిపు శశికుల-శిఖరి మృగపతిన్
బ్రతిదిన సముదిత-బహుతర విభవున్.

ఈ గర్భపద్యములందు యతిప్రాసల చెల్లింపులు తప్పకుండునట్లు చూచుకోవలసియుండును.

ఈ గర్భకవితలోనే భారతగర్భరామాయణమును శ్రీ రావిపాటి లక్ష్మి నారాయణగారు రచించినారు. అనగా పద్యము మొత్తము రామాయణార్థముతో నుండగా, ఆ పద్యమం దిమిడిన పద్యము భారతార్థముతో నుండును.

ఉదా :

శ్రీరమణీయమై (సిరుల-జెందివెలుంగును జిష్ణుపీటి) కై
మీరి యయోధనా (గరిమ-మించుచు బృథ్వి నఖండహస్తి) ర
త్నోరి గృహంబెయా (పురియు-నచ్చటిమేడలు వ్యోమమంటు) మేల్
తోరపుఖ్యాతితో (నగరి-దూగుదలన్ హరి నట్టు తోడ) దాక.

ఈ ఉత్పలమాలా పద్యము మొత్తము రామాయణార్థము గలది కాగా, గర్భమందలి గీతపద్యము (కుండలీకరణములలోనిది) భారతార్థము గలది. ఈవిధముగా నిది గీతగర్భోత్పలమాల యగును.

ఇట్లే ఒక కందపద్యమున నాల్గు కందము లిముడునట్లు వ్రాసిన చతుర్విధ కందమగును.

ఉదా :

సుజ్ఞాన యోగతత్త్వ వి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో
నజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుగొల్తు రచలభావన దవులన్.

—కుమా. 12-27.

ఈ కందమందలి రెండవ పాదమందలి రెండవ గణము మొదలుకొని చదివినచో రెండవ కందము, ఆ రెండవ కందమందలి రెండవ పాదపు రెండవ గణము మొదలుకొని చదివినచో మూడవ కందను, ఆ మూడవ కందమునుగూడ నిట్లే చదివినచో నాల్గవ కంద మేర్పడును. (ద్వితీయ కందాదులు చదువునపుడు మొదటి కందపు మొదటి పాదమునుగూడ చివరల కలుపుకొనవలెను. పై కందమందు ఇమిడిన మిగిలిన మూడు కందము లిట్లుండును:

ii. ద్వితీయ కందము :

భవబంధనములఁ ద్రెంచుచు
భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్
శివుగొల్తు రచలభావన
దవులన్ సుజ్ఞాన యోగతత్త్వ విధిజ్ఞుల్.

iii. తృతీయ కందము :

అజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుగొల్తు రచలభావన దవులన్
సుజ్ఞాన యోగతత్త్వ వి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో

iv. చతుర్థ కందము :
శివు గొల్తు రచల భావన
దవులన్ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్
భవబంధనములఁ ద్రెంచుచు
భువిలోనజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్.

ఈ విధముగా గర్భమం దిముడగల పద్యములు ఛందః పరిశీలనవలన, గర్భమందలి పద్యములకు యతిప్రాసలు చెడకుండుట చూచుటవలన గర్భకవిత రూపొందును. ఛందఃపరిశీలన కారణముగా నిది ఛందోవిషయ మయినది.

పై ఉదాహృతు లాధారముగా పెక్కువిధములు లక్ష్యములు చూచుకొనవలెను. గణపవరపు వేంకటకవి రచించిన 'శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము' నందిట్టి గర్భకవిత ఆశ్చర్యాపాదిగా నున్నది. (చూ. గణపవరపు వేంకటకవి).

**ఉదాహరణ కావ్యము :**

'ఉదాహరణ' మనునది యొకానొక చాటు ప్రబంధ విశేషము. ఇది తెలుగు సాహిత్యమునకు మాత్రమే విలక్షణమై వెలసినది. ఉదాహరణమును రూపొందించి మొట్టమొదటిసారిగా తెలుగున, ఆ తరువాత సంస్కృతమున రచించినవాడు పాల్కురికి సోమనాథుడు. ఇప్పటివరకు సంస్కృతమున లభ్యమగు 'ఉదాహరణ'ము లన్నియు తెలుగు కవులు రచించినవే. సోమనాథుని సంస్కృతమందలి ఉదాహరణమును లక్ష్యముగా గొని సంస్కృత లాక్షణికులు- అమృతానందుడు 'అలంకార సంగ్రహము' నందు, విద్యానాథుడు 'ప్రతాపరుద్రీయ' మందు, పెదకోమటి వేమన 'సాహిత్య చింతామణి' యందు, కృష్ణయజ్వ 'అలంకార ముక్తావళి' యందు- కొందరసమగ్రముగా, కొందరు సమగ్రముగా లక్షణములు చెప్పినారు. తెలుగులో వి. పెద్దన ఈ కావ్యలక్షణమును తొలిగా చెప్పినాడు. ఆ తరువాత అనంతుడు, చి. పెద్దన, అప్పకవి చెప్పినారు. చివరి ఇద్దరు లక్ష్యములుగా 'ఉదాహరణ'ముల రచించినారు.

'ఉదాహరణ' స్వరూప మిది :

'ఉదాహరణ' మొత్తము ఇరువదియారు పద్యముల లఘుకావ్యము. మరియు విభక్తుల ప్రాధాన్యము కలది. సంబుద్ధితోపాటు ప్రథమాదులు మొత్తమెనిమిది విభక్తులు ఒక్కొక్క విభక్తి మూడేసి పద్యములతో నుండును. ఈ మూడు పద్యములలో మొదటిది ఏదో ఒకవృత్తము కావలయును. రెండవది ఏదో ఒక రగడభేదము కావలయును. మూడవది పైరగడకు అర్ధరగడ కావలయును. అనగా పైరగడ పాదమందున్న మాత్రాసంఖ్యా గణములలో సగము గణములే అర్ధరగడ పాదమందుండును. ఉదాహరణకు రగడ 16 త్రిమాత్రాగణములు, కలదైనచో, అర్ధరగడ యందెనిమిది త్రిమాత్రాగణములు, రగడ యం దెనిమిదే

యున్నచో అర్ధరగడ యందు నాల్గు, రగడయందు నాల్గే యున్నచో, అర్ధరగడయందు రెండే యుండును (రగడలయందు నాల్గింటికి తక్కువ గణములుండవు. విశేషములకు చూ. రగడలు). ఈ రగడ, అర్ధరగడలు ఎనిమిదేసి పాదములతో నుండును-అనగా, నాల్గు రగడల, లేదా అర్ధరగడల మొత్తము. అందువలన రెండేసి పాదములకే (అది) ప్రాస నియమము. యతి ఆయా రగడలకు నిర్ణయింపబడినట్లే చెల్లును. అర్ధరగడలకు (అది) ప్రాసనియమమే తప్ప యతి నియమముండదు. ఉదాహరణ కావ్యములందు ఈ నాల్గు రగడల, అర్ధరగడల మొత్తముగా ఎనిమిది పాదములతో నున్న రూపకములకు వరుసగా కళిక, ఉత్కళిక అని వ్యవహారము (భిన్న విభక్తులందు భిన్న రగడ భేదముల నుపయోగింపవచ్చును).

ఇక, వృత్తమునందు ఆ వృత్తము ఏ విభక్తికి చెందుచున్నదో, ఆ విభక్త్యంతమునకు ప్రాధాన్యముండును. అనగా, వృత్తమునందెన్ని విభక్త్యంత పదములు (భిన్నభిన్నములు గూడ) ఉన్నను, ఆ వృత్త మే విభక్తికి చెందునో ఆ విభక్త్యంతపదమే ప్రధానమైనదగును (వృత్తమందలి విషయమునుబట్టి ఈ ప్రాధాన్యము). వృత్తమునందు ప్రాధాన్యము వహించిన విభక్త్యంతములతోనే కళికయందు ప్రతిపాదము పూర్తి కావలయును. ఉత్కళికయందు మాత్రము చివరి రెండుపాదములే ఆ విభక్త్యంతములతో పూర్తి కావలయును.

ఉత్కళిక యందు మొదటి ఆరు పాదములు విభక్త్యాభాసతో పూర్తి కావలయునని, అన్ని విభక్తులయందిట్లు కాకున్నను, షష్ఠీవిభక్తి లేదా చతుర్థీ విభక్తి యందైనను ఈ విభక్త్యాభాస యుండవలెనని చి. పెద్దన చెప్పినాడు. కాని లక్ష్యములందు (ఏ ఒకటి రెండింటి యందో తప్ప) సర్వసాధారణముగా ఈ విభక్త్యాభాసము చతుర్థీ విభక్తియందే పాటింపబడినది. విభక్త్యాభాసమనగా విభక్తివలె కన్పించవలెనేగాని విభక్తి కాగూడదు.

ఉదాహరణకు :

'వేసర కిర్వడి చేతుల నల కై
లాసము నెత్తిన............'

ఉదాహృతమందు మొదటిపాదము 'కై'తో పూర్తియగుటచే ఆ పాదము చతుర్థీవిభక్త్యంతముగా నున్నట్లు భాసించునుగాని, అక్కడి 'కై' చతుర్థీవిభక్తి ప్రత్యయము కాదు. 'కైలాస'మన్న పదములోని కొంతభాగము. ఇట్లుండుట విభక్త్యాభాసమగును.

కళిక 'మరియు' అను పదముతోగాని, తదర్థకపదముతోగాని ప్రారంభము కావలయును.

ఇట్లు మూడేసి పద్యములతో నెనిమిది విభక్తుల తరువాత, ఎనిమిది విభక్తులతో నొక వృత్తముండును. ఒకే వృత్తమం దెనిమిది విభక్తులు క్రమావే

శింపబడుటవలన, దీనిని 'సార్వవిభక్తిక' మందురు. సార్వవిభక్తికమునకు కళికోత్కళికల సంయోజనము ఉండదు. ఈ పద్యముతో 'ఉదాహరణ' కావ్యము పూర్తయినట్లే. కావ్యాంతమున (ఇరువది ఆరవదిగా) 'అంకితాంక' పద్యముండును. ఈ పద్యమందు కవి తనపేరు చెప్పుకొని, ఆ ఉదాహరణ కావ్య మెవరికి అంకితము చేయబడినదియు చెప్పును. ఆ కారణముగా నిది 'అంకితాంక' పద్యమైనది.

ఇది 'ఉదాహరణ' కావ్యముయొక్క సామాన్య లక్షణము.

తెలుగు లాక్షణికులు ప్రతి విభక్తి కొక వృత్తముండవలెనని సామాన్యముగా చెప్పినారుకాని వృత్తపాదపరిమాణమును చెప్పలేదు. సంస్కృత లాక్షణికులు 'శక్వర్యాది' ఛందములందలి వృత్తములని, మాలిన్యాది వృత్తములు కావలయునన్నారు. శక్వరీచందము 14 అక్షరముల పాదనియమము గలది. మాలినీవృత్తము 15 అక్షరములది. కాగా 14 అక్షరములకు తక్కువ పరిమాణము గల వృత్తము కాగూడదని ఉద్దేశ్యము. తెలుగు లక్ష్యములందును ఉత్పలమాలాది వృత్తములే యున్నవిగాని అంతకు చిన్నవి లేవు. (శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మాత్రము తమ గోపాలోదాహరణమందు ఒక విభక్తిలో వృత్తమునకు బదులు కందము నుపయోగించినారు.). ఇదిట్లుండగా, 'ఉత్కళికకు బదులు కొందరు ఆర్యను ప్రయోగించవచ్చునందు'రని కృష్ణయజ్వ చెప్పినాడు గాని, ఏ లక్ష్య మిట్లు కనిపించదు.

ఉదాహరణ కావ్యము 'జయతి' పదముచే నుపక్రమింపబడవలెనని (మాలిన్యాదులుండవలెనని) సంస్కృత లాక్షణికులు సోమనాథు నుదాహరణమును లక్షించి చెప్పినారు. తెలుగు కవులు తెలుగు సంప్రదాయము ననుసరించి శ్రీకారముతో ప్రారంభించినారు.

'శుద్ధ-మిశ్ర' భేదములచే ఉదాహరణ కావ్యము ద్వివిధమని కృష్ణయజ్వ చెప్పినాడు. కావ్య మాద్యంత మొకే భాష ఉపయుక్తమైనచో శుద్ధమని, 'భాషాంతరాన్విత'మైనచో మిశ్రము. కాని ఈ భేదములకు లక్ష్యములు కన్పించవు.

తెలుగులో విన్నకోట పెద్దన i. సద్ధళి, ii. పద్ధళి, iii. విద్ధళి, iv. కల్యాణి, v. ఉత్ఫుల్లకము అని ఐదు ఉదాహరణ భేదములు చెప్పినాడు. విభక్తులను తగ్గించుటలలోని మార్పులవలన మొదటి మూడు భేదములు, కళికోత్కళికల తగ్గింపులవలన చివరి రెండుభేదము లేర్పడినవి. (వీటి స్వరూపములకు చూ. 'సద్ధళి' మొ.). ఈ ఐదు భేదములే కాక ఇంక నెన్నో భేదములున్నట్లు వి. పెద్దన చెప్పినాడుగాని వాటి స్వరూపముల వివరించలేదు. వి. పెద్దన తరువాత ఉదాహరణ భేదములను పేర్కొన్నవాడు అప్పకవి. 'కల్యాణి' యన్న భేదము తప్ప మిగిలిన నాల్గింటిని ఆయన చెప్పినాడు. ఉత్ఫుల్లక స్వరూపవిషయమున వి. పెద్దనతో విభేదించినాడు (చూ. ఉత్ఫుల్లకము). 'కవితా

లక్షణసారము'నందు ఉదాహరణ భేదములు 22 కలవని చెప్పబడినది (చూ. శ్రీ రావూరివారి 'తెలుగుభాషలో ఛందోరీతులు', పు. 187). కాని వివరములు తెల్పబడలేదు.

ఈ విధముగా నెన్నో భేదములున్నట్లు చెప్పబడినను, ఐదు భేదములు వివరింపబడినను దేనికిని లక్ష్యములు లభింపవు. ఆధునిక కాలమున పై ఐదు భేదములలో శ్రీ ఆరుద్ర రచించిన 'సద్దలి' ('వాణి' ఆకాశవాణి పత్రిక 16-11-1960), శ్రీ సంపత్కుమార రచించిన 'ఉత్ఫుల్లకము' (ఆంధ్రభూమి దినపత్రిక, 14-1-1961) మాత్రము ఆత్యంత భేదములకు లక్ష్యములుగా కన్పించును.

ఉదాహరణ కావ్యమందలి విభక్తులకు పేర్లు, అధిదేవతలను తెలుగు లాక్షణికు లీ క్రింది విధముగా పేర్కొన్నారు.

| | విభక్తి | విభక్తి పేరు | విభక్త్యధిదేవత |
|---|---|---|---|
| i. | ప్రథమ | వాణి | వీరావళి |
| ii. | ద్వితీయ | ఝుట | కీర్తిమతి |
| iii. | తృతీయ | కీర్తి | సుభగ |
| iv. | చతుర్థి | దేవలాభిని | భోగమాలిని |
| v. | పంచమి | పాణి | కళావతి |
| vi. | షష్ఠి | మోటి | కాంతిమతి |
| vii. | సప్తమి | ఘోటిక | కమల |
| viii. | సంబుద్ధి | సరసావళి | జయవతి |

(అప్పకవి పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తుల పేర్లను వరుసగా-వాణి, లలిత, ఘోణి యని చెప్పినాడు. అయితే ప్రథమకు పంచమికి ఒకే పేరగును. చూ. అప్పక. వావిళ్ల ప్రచురణ 1934.). ఈ దేవతలు వారివారి శక్తికి తగినట్లు ఫల మిత్తురని చెప్పబడినది.

సంస్కృతీయములైన అక్షరచ్ఛందస్సులకు, దేశీయ మాత్రాచ్ఛందస్సులకు నియతముగా, ఒక ప్రత్యేక రీతిలో సమావేశము ఆధారముగా రూపొందినది ఉదాహరణకావ్యము.

## సద్దళి

సద్దళి యనునది ఉదాహరణ కావ్యముయొక్క అవాంతర భేదము లైదింటిలో మొదటిది. ఉదాహరణ కావ్యమందుండవలసిన ప్రథమాది సప్త విభక్తులు+సంబుద్ధి=మొత్త మెనిమిదింటిలో సంబుద్ధి తొలగింపబడి కేవల సప్త విభక్తులు మాత్రమే ఉన్నచో, ఆ కావ్యము 'సద్దళి' యగును. (వివరములకు చూ. ఉదాహరణ కావ్యము.). (ఒక విభక్తిని తొలగించుట యనగా నా విభక్తి యందుండవలసిన వృత్త, కళికోత్కళికలు మూడింటిని తొలగించుట).

**పద్ధళి**

పద్ధళి యననది ఉదాహరణ కావ్యముయొక్క అవాంతర భేదములైదింటిలో రెండవది. ఉదాహరణ కావ్యమందుండవలసిన ప్రథమాది సప్త విభక్తులలో సరి (ద్వితీయ, చతుర్థి, షష్ఠి) విభక్తులు+సంబుద్ధి=మొత్తము నాల్గు విభక్తులే ఉండి మిగిలిన (ప్రథమ, తృతీయ, పంచమ, సప్తమ) విభక్తులు నాల్గు తొలగింపబడినచో, ఆ కావ్యము 'పద్ధళి' యగును. (వివరములకు చూ. ఉదాహరణ కావ్యము.) (విభక్తులను తొలగించుట యనగా, ఆ విభక్తులకు చెందిన వృత్త, కళికోత్కళికల నన్నింటిని తొలగించుట).

**విద్ధళి**

విద్ధళి యననది ఉదాహరణ కావ్యము యొక్క అవాంతర భేదములైదింటిలో మూడవది. ఉదాహరణ కావ్యమందుండవలసిన ప్రథమాది సప్త విభక్తులలో బేసి (ప్రథమ, తృతీయ, పంచమి, సప్తమి) విభక్తులు+సంబుద్ధి=మొత్తమైదు విభక్తులే ఉండి, సరి (ద్వితీయ, చతుర్థి, షష్ఠి) విభక్తులు మూడు తొలగింపబడినచో, ఆ కావ్యము 'విద్ధళి' యగును వివరములకు చూ. ఉదాహరణ కావ్యము. (విభక్తులను తొలగించుట యనగా ఆ విభక్తులకు చెందగల వృత్త, కళికోత్కళిక లన్నింటిని తొలగించుట).

**కల్యాణి**

కల్యాణి యనునది ఉదాహరణ కావ్యముయొక్క అవాంతర భేదములైదింటిలో నాల్గవది. ఉదాహరణ కావ్యమునందలి ప్రతి విభక్తి నుండవలసిన కళికోత్కళికలలో కళికలు మాత్రమే ఉండి ఉత్కళికలు తొలగింపబడినచో నా కావ్యము కల్యాణి యగును (వివరములను చూ. ఉదాహరణ కావ్యము.).

**ఉత్ఫుల్లకము**

ఉత్ఫుల్లక మనునది ఉదాహరణ కావ్యముయొక్క అవాంతర భేదములైదింటిలో చివరిది. ఉదాహరణ కావ్యమందలి ప్రతి విభక్తి యందుండవలసిన కళికోత్కళికలలో ఉత్కళికలు మాత్రమే ఉండి, కళికలు తొలగింపబడినచో, ఆ కావ్యము ఉత్ఫుల్లక మగును (వివరములకు చూ. ఉదాహరణ కావ్యము.).

కళి కోత్కళికలుండి, వృత్తములే తొలగినచో 'ఉత్ఫుల్లక' మగునని అప్పకవి చెప్పినాడు.

**ముత్యాలసరము**

పాదమునకు రెండు సప్తమాత్రా (3+4 లేదా 4+3) గణములు చొప్పున మూడు పాదములు, నాల్గవపాదమున ఒక సప్తమాత్రాగణము+ఒక గురువుగా ఏర్పడినచో, అది 'ముత్యాలసరము' అగును. ఈ పద్యమును రూపొందించినవారు శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు. అప్పారావుగారు దీన్ని

లక్షణము చెప్పుచు మొదటి మూడు పాదములందు పదునాల్గేసి మాత్రలుండు ననియు, నాల్గవ పాదమున ఏడు మొదలు పదునాల్గు మాత్రలవర కుండవచ్చు నన్నారు (వ్యాస చంద్రిక. పు. 24). శ్రీ శ్రీ గారు దీని లక్షణము నిర్ణయించుచు నాల్గవ పాదమున సాధారణముగా 9 మాత్ర లుండునన్నారు. ('గురజాడ' వ్యాస సంకలనము.) అనగా ఒక సప్తమాత్రాగణము+1 గురువు అనియే ఉద్దేశ్యము. శ్రీ శ్రీ గారు చెప్పిన ఈ లక్షణములోనే 'ముత్యాలసరము' అధిక వ్యాప్తిలోనున్నది. దీనికి ప్రాస, యతి నియమమును అప్పారావుగారుగాని శ్రీ శ్రీ గారుగాని ఉండునని చెప్పలేదు. కొందరు మొదటి పాదములకు, కొందరు నాల్గుపాదములకును ప్రాస ఉపయోగించినారు. కొందరు రెండేసి పాదముల అద్యక్షరములు యతి పద్ధతిలో చెల్లించినారు. మొత్తముమీద యతి-ప్రాస లైచ్ఛికము లనవచ్చును

ఉదా :

'ఆగుమాగుము - తెరువరీ ఆ
యాస ఖేద - మ్మపనయింపుము
మా గృహాంగణ - కుసుమ సముదయ
మధువు లియ్యవి - గో.'

—కొడవటిగంటి వెంకటసుబ్బయ్య
(ఆతిథ్యము, చూ. వైతాళికులు.)

ఇందు బేసిపాదములందు ప్రాస, మొదటి రెండు పాదములందు ఆద్యక్షర సమత (చివరి రెంటియందును) పాటింపబడినది

ii. శిలుపొంగిన-జీవగడ్డయి
పాలువారిన-భాగ్యసీమయి
వ్రాలినది యీ-భరతదేశము
భక్తి పాడర-తమ్ముడా!

—రాయప్రోలు.

ఇందు మొదటి మూడు పాదములకు ప్రాస, చివరి రెండింటికి ఆద్యక్షర సమత (యతిమైత్రి) పాటింపబడినది. 4వ పాదములో 12 మాత్రలు నిజమునకు 'ముత్యాలసరము' భామినీ షట్పదియొక్క సగభాగము. అనగా మూడు పాదములు. మూడవ పాదము 7+7 వరకు విరిగి, మిగిలిన (7+1 గ) భాగము నాల్గవ పాదముగా 'ముత్యాలసరము'నందు మారినది. ఈదృష్ట్యా నాల్గవపాదమున 9 మాత్రలకన్న అధికముగా నుండుటకు వీలులేదు. అప్పారావుగారు చెప్పినట్లు 14 మాత్రలు నాల్గవ పాదమున నున్నచో నిది 'హరిణగతి' రగడ యగును. (చూ. హరిణగతిరగడ). కావున 14 మాత్రలకు తక్కువగా ఉండకతప్పదు. ఆ తక్కువ ఎంత అన్నది కవుల స్వేచ్ఛకు వదలబడినది. 7 నుండి 12 మాత్రల వరకు ఉదాహరణములు పలు కవుల ముత్యాలసరములయందు లభించును.

భామినీ షట్పది అర్ధభాగము త్రిపాదిగా నుండగా, అది చతుష్పాదిగా రూపొంది 'ముత్యాలసర'మైనది. నాల్గవ పాదమందలి మాత్రాసంఖ్యయొక్క అనియతి దీని ప్రత్యేకత.

### గేయము

గేయమనగా గానము చేయదగినదని యర్థము. వృత్తజాత్యుపజాతులం దనేకములు గానయోగ్యములే యైనను, మాత్రాసంఖ్యాగణధోరణిలో ఆధునికముగా రచింపబడినవి 'గేయ'ములుగా ప్రసిద్ధములు. ఈ గేయములన్నియు రగడభేదములే. అనగా త్రి, చతుష్పంచ సప్తమాత్రాగణముల కూర్పుగా సాగునవని తాత్పర్యము. ఈ రచనలయందు గానము చేయుటకు వీలుగా మాత్రల తగ్గింపులు, హెచ్చింపులు పలువిధములుగా చేయబడినవి. ఈ కారణముగా నివి ప్రత్యేక రగడలుకాక రగడభేదములైన 'గేయము'లైనవి. వీటియందు యతిప్రాస నియమములు, పాదసంఖ్యానియమము ఐచ్ఛికములు. భిన్నభిన్న రగడరీతులకు చెందిన పాదము కొన్ని కే గేయమున నుండవచ్చును, ఉండకను పోవచ్చును.

ఉదా :

'గోదావరీదేవి గొప్పగుణముల చాన
వాడు పొందే పనుల రాదూ, న్యాయ
మే దారి విడి యెందు పోదూ, అందులో
ఆ దేవి మున్ను సీతారాములొకరొకరి
నేదుకొను నెడబాటు నెరుగూ, పరుల క
ష్టాదులకు మదిలోన మరుగూ.'

—కిన్నెరసాని పాటలు (గోదావరీ సంగమము).

### వచనపద్యము

మాత్రాచ్ఛందోరూపమయిన గేయముల (చూ. గేయము). తరువాతి పరిణామముగా ఆధునిక కాలమున రూపొందిన ఛందస్స్వరూపము 'వచన పద్యము'. దీని వ్యాప్తి విస్తృతముగా జరిగినను ఛందోదృష్ట్యా దీనికొక 'లక్షణము' సరిగా నిర్వచింపబడలేదు. భిన్నభిన్న కవుల భిన్నభిన్న వచన పద్యములను పరిశీలించి శ్రీ సంపత్కుమార వివిధ వ్యాసములలో 'వచన పద్యము'నకు ప్రతిపాదించిన లక్షణము ఇక్కడ ప్రదర్శింపబడుచున్నది.

గద్యము (వచనము) నుండి పద్యమును విభేదింపజేయు ముఖ్య లక్షణమైన పాదవిభజన 'వచనపద్య'మున కున్నది. అందువలన సాంప్రదాయికమయిన వర్ణ, మాత్రా, గణాదిక నియమము లేవియు దీనికి లేకున్నను కేవలము పాదవిభజన మున్నకారణముగా నిది పద్యవిభాగములో చేరుచున్నది. వచన పద్యమున పాద విభజనకు ఒక పద్ధతి లేదా సూత్రమున్నది. 'భావము' ఆధారముగా వచన

పద్యమున పాద విభజన జరుగును. అనగా ఒక భావముయొక్క సమాప్తితో నొకపాదము పూర్తియగును. ఒకప్పుడు భావముతోగాక భావాంశముతోనే పాదము పూర్తికావచ్చును. ఇక్కడ గమనించవలసిన ప్రధానాంశము - ఒక భావము, లేదా భావాంశము కొంతభాగము ఒక పాదమున, మరికొంత భాగ మింకొక పాదమున నుండకూడదు. ద్విపదయందు ఒకేపదము రెండు పాదము లందు వ్యాపించి యుండగూడదన్న నియమమువంటిదిది (చూ. ద్విపద). ఒక భావాంశమును స్థూలముగా ఒక 'భావగణ' మనవచ్చును. కాగా ఒక పాదమున ఒక భావగణముండవచ్చును. ఒకటికి మించిగూడ నుండవచ్చును. ఈ విధముగా చెప్పినచో పాదప్రమాణ మనియతమగును. కాని ఒకపాదము దీర్ఘతర, దీర్ఘత మము కాకుండునట్లు చూడవలెను. అనగా పాదమున నాల్గయిదు భావాంశము లకు మించి యుండరాదు. సాంప్రదాయిక పద్యములందును పాదము దీర్ఘ తరము కాకుండ అక్షరసంఖ్యచే, లేదా గణసంఖ్యచే నియమిత మగుచున్నది. అక్షరప్రధాన పద్యములందు పాద గరిష్ఠప్రమాణము 26 అక్షరములు. ఇంతకు మించిన పాదములుకల ఉద్ధురమాలా వృత్తములున్నను వాటి ప్రయోగము సర్వసామాన్యముకాదు. జాత్యుపజాతులందును నాల్గు మొదలుకొని ఎనిమిది వరకు గణములు పాదప్రమాణము. ఈ విధముగా వచనపద్య పాదముకూడ భావ గణ సంఖ్యచే నియతమగును. భావగణ (భావాంశ) విరహితముగా ఒకేభావము దీర్ఘతరపాదముగా రూపొందుట సామాన్యముగాజరుగదు. కాగా ఒకభావగణము కనిష్ఠపరిమితిగా నాల్గు లేక ఐదు భావగణములు గరిష్ఠపరిమితిగా పాదము రూపొందును (జాత్యుపజాతులందును నాల్గయిదు గణముల పాదపరిమితిగల గీతములు, రగడలే బహువ్యాప్తిగలవి. సీసమువంటివి అపవాదములు.).

వచన పద్యమునకు పాద సంఖ్యాపరిమితిలేదు. మంజరీ ద్విపదయందు వలె మాలికారూపమున సాగవచ్చును. పాదములు అసమములుగా నుండుట ఎక్కువ (అర్ధసమ విషమ పద్యములందుకన్న నధికము). గేయములందువలె యతి, ప్రాస నియమములు లేవు. ఐచ్ఛికములు. అంత్యప్రాస ఐచ్ఛికముగానే అధికముగా ప్రయోగములందు కన్పించును. పై యంశములన్నియు ఈ క్రింది ఉదాహరణమున స్పష్టమగును.

ఉదా :

ప్రాణాలు బిగపట్టుకుని
సాగేరు ప్రయాణీకులు
నాయకుడు తిరిగి వస్తాడనీ
తుపాను శమిస్తుందనీ
నదిపొంగు తగ్గేననీ
ఆశతో అహరహరమూ

దేనికైనా ఉద్ధృతి ఎంతసేపు ?
దానికి వ్యతిరిక్తం తప్పదాపైన.

—మాదిరాజు రంగారావు
(ఆంధ్రపత్రిక పరీధావి ఉగాదిసంచిక. పు. 84).

ఇందులో మొదటిది ఆరుపాదాలు భావాంశములనిబట్టి చివరి రెండు పాదాలు భావమునుబట్టి విభక్తమయినవి. 'ప్రయాణీకులు సాగటం' ప్రధాన భావము. ఆ సాగుట ప్రాణాలుబిగపట్టుకుని. అంతేకాదు. 'ఆశతో అహరహమూ' సాగుచున్నది. అందువలన, 1, 6 పాదములు భావాంశములనుబట్టి ఏర్పడినవి. కాగా, 3, 4, 5 వ పాదాలు ఆరవ పాదములోని 'ఆశ' కు సంబంధించినవి. చివరి రెండు పాదాలు స్పష్టమే.

ఋక్కులలో అర్థవశమున పాదవ్యవస్థ జరుగును. ('తేషాం ఋక్, యత్రార్థవశేన పాదవ్యవస్థా'. జైమినీయ మీమాంససూత్రము. 2-1-35. చూ. 'ఆంధ్రమహాభారతము : ఛందఃశిల్పము'—డా. పాటీంచడ మాధవశర్మ.). అది సూచనగా ఈ వచన పద్యమునకు భావవశమున పాదవ్యవస్థ నిరూపించబడినది.

వచన పద్య సామాన్య స్వరూపమిది. వచన పద్యములన్నియు నిట్లే లేకున్ననూ అవి రూపొందిన సామాన్య సూత్రమిదే.

### పద్య నామకరణము

ఉక్త మొదలగు నిరువదారు ఛందములందు (చూ. ఛందములు), మొత్తము పదమూడుకోట్ల నలుబదిరెండు లక్షల పదునేడువేల యేడువందల ఇరువదియారు సమవృత్తములు నిష్పన్నము లగునని ప్రస్తారము ద్వారా స్పష్టమగును. ఇవిగాక అర్ధసమ విషమ భేదములవలన అనంతముగా వృత్తము లేర్పడు నవకాశమున్నది. కాని లక్షణకర్తలు ఇన్నింటిలో అందరును చెప్పినవి కలుపగా దాదాపు ఆరేడు వందల వృత్తములు మాత్రమే యగును. వీటియందును సంస్కృత కవులు దాదాపు వంద, వందయేబదికన్న మించి ప్రయోగించలేదు. వాటియందును ఏ పాతికో ముప్పదో విరివిగా ప్రయుక్తములు. తెలుగున చూచినచో ఉత్పలమాలా, చంపకమాలా, శార్దూల విక్రీడితా, మత్తేభ విక్రీడితలు మాత్రమే ప్రసిద్ధములు. మత్తకోకిలాదుల ప్రయోగము నున్నది కాని ఉత్పలాదుల దృష్ట్యా ఇవన్నియు విశేష వృత్తములే. జాత్యుపజాతులందును కందము, సీసము, ఆటవెలది, తేటగీతి, ద్విపదలు తప్ప అక్కరాదులు విశేష పద్యములే. తెలుగులో వృత్త జాత్యుపజాతులన్నిటికి 'పద్య' మని సామాన్య వ్యవహారము.

అయితే, వీటిలో ప్రతి పద్యమున కొక పేరున్నది. ఆ పేరువలన ఆ పద్య లక్షణము గుర్తుంచుకో వీలగుచున్నది. ప్రయోక్తలు పద్యములకు పేరు పెట్టగా, ప్రసిద్ధములైన యా పేరులను లాక్షణికులు చాలావరకు స్వీకరించి,

తాము లక్షణము నిరూపించిన మరికొన్ని పద్యములకు తాముగా నామకరణము చేసినారు.

పద్యమునకు నామకరణము యాదృచ్ఛికముగా జరిగినదా? ఏదైన ప్రత్యేకమున్నదా ?—విచారణీయాంశమే. ఈ విచారణ ప్రాచీనకాలము నుండియే సాగుచున్నట్లు కన్పించును. 26 ఛందములలో ఆరవది 'గాయత్రి', ఏడవది 'ఉష్ణిక్'. ఈ ఏడవ ఛందపు పేరును గూర్చి 'నిరుక్తము' నందిట్లున్నది.

"ఉష్ణిక్ ఉత్ స్నాతా భవతి. ఉత్ స్నాతా-గాయత్రీతః చతుర్భి రక్షరైః ఉద్వేష్టితా ఇవ. ఉష్ణీషిణీవా ఇత్యౌపమికమ్. అథవా, ఉష్ణీషిణీ-ఉష్ణీషవతీ ఇవ ఇత్యౌపమికమ్. ఉపమా నిబంధనం నామ.

"గాయత్రి యొక్క పాదత్రయము మీద నాలుగక్షరములు ఉష్ణీషము వలె నుండును గనుక గాయత్ర్యనంతర చ్ఛందమునకు 'ఉష్ణిక్' అని ఔపమిక నామకరణము చేయబడినది. శ్రుతమైన యక్షరబంధము దృష్ట వస్తూపమానమున పేర్కొనబడినది." (ఆం. భా: ఛం., పు. 54, డా. పాటిబండ మాధవశర్మ).

ఇట్లు ఛందపు నామమును గూర్చి సాగిన విచారణమును బట్టి నిరుక్త కాలమునుండే యీ విచారణ యున్నట్లు స్పష్టము. లాక్షణికులు మాత్రమే కాక కవులుగూడ పద్యనామముల గూర్చి ఒక విధముగా విచారణ చేసినారన వచ్చును. పద్యనామము సార్థకమగునట్లా పద్యమును కొందరు ప్రయోగించి చమత్కరించినారు. రతివిలాపమును కుమారసంభవమున 'వియోగినీ' వృత్తము లతో కాళిదాసు వర్ణించుట ఇట్టిదే. సాగరులు భూమిత్రవ్వు విషయమును 'మేదినీ' వృత్తముతో రామా. కల్ప. లో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వర్ణించుటయు నిట్టిదే. ఇట్లే పద్యమందు పద్యనామము సార్థకమగునట్లు విషయము చిత్రించుటయు నిట్టిదే. భరతుడు నాట్యశాస్త్రమున వృత్తములకు లక్ష్యములు వ్రాయు పద్యములందాయా పద్యనామములు సార్థకగుదునట్లు ప్రయోగించినాడు. గజక్రీడా వర్ణన మత్తేభ విక్రీడిత పద్యమున చేయుచు ఆ పేరును సార్థకముగా ఆ పద్యమందే నన్నచోడడు తన కుమారసంభవమున చమత్కరించినాడు (ఆ. 1. ప. 101). ఇట్టి ప్రయోగము ముద్రాలంకారముగా ప్రసిద్ధము.

ఈవిధముగా చూచినచో పద్యనామముగూర్చి కవులు కొన్ని సందర్భ ములలో ప్రాధాన్యమిచ్చినట్లు, ఒకవిధముగా విచారణ చేసినట్లు స్పష్టము. అయితే పద్యమునకు నామకరణముతరువాత ఈ విచారణ జరిగినదిగాని, మొట్ట మొదట నామకరణము చేయునప్పుడే ఈ విచారణ జరిగినదని నిర్ద్వంద్వముగా చెప్పుట కవకాశము కన్పించదు. మరియు పలుపద్యములకు పేర్లు సర్వత్ర ఒకటిగా లేవు. కొన్ని పద్యములకు భిన్నలాక్షణికులు భిన్ననామములు పేర్కొన్నారు. ఒకే వృత్తమును 'కుసుమితలతావేల్లిత'మని పింగళుడు, చిత్రలేఖ యని భరతుడు పేర్కొన్నారు. పింగళుడు 'వసంతతిలక' యన్నదానిని తత్పూర్వ

డైన కాళ్యపుడు 'సింహోన్నత'మని, సైతవుడు 'ఉద్ధర్షిణి' యని పేర్కొన్నారు. క. జ. కర్త 'కాంత' యన్న పద్యమును అనంతుడు 'గీతాలంబన' మన్నాడు. ఈ నామవైవిధ్యము వృత్తములందేకాదు, జాతిపద్యములందు నున్నది. క. జ. కర్త 'ప్రగీతి', 'మేలనగీతి' యన్నవాటిని తరువాతివారు 'పవడగీతి', 'కమలనగీతి' యన్నారు. యతిస్థానభేదమునుబట్టియు నొకే పద్యమునకు భిన్ననామము లేర్పడినవి. 'మణిగణనికరము'న కెనిమిదింట యతి. ఆరింట యతియైనచో 'స్రజ' మగును. ఆటవెలదియందు ప్రాస పాటింపబడినచో 'ప్రగీతి' (పవడగీతి) యగును. ఇట్లు నామవైవిధ్యము పలుచోట్ల కన్పించును.

ఒక పద్యస్వరూపమున కొకరు సూచించిన పేరు తెలియకపోవుట వలనగాని. తెలిసినను ఉన్న పేరు బాగులేదనిపించుటవలనగాని యతిస్థానభేదమును, ప్రాస పాటింపును సూచించుటకుగాని ఈ భిన్న నామకరణము జరుగుట కవకాశమున్నది.

ఇదిట్లుండగా పద్యనామ విషయములో ఔచితీ విషయముగూడ గమనించదగినది. సామాన్యముగా ప్రతి పద్యమందును అందలి అక్షర, మాత్రా విన్యాసము, యతిస్థానమునుబట్టి ఒకానొక విధమైన గతి సిద్ధించును. ఇట్లు సూచితమగు గతులనుబట్టి పద్యములకు నామకరణము జరుగవచ్చును. ద్రుతవిలంబితమను నొకవృత్తమున్నది. ప్రతి పాదమున దీని గణక్రమము న-భ-భ-ర (I I I ∪ I I ∪ I I ∪ I ∪), ఆరింట యతి. కాగా పాదము రెండు భాగములుగా విభక్తమగును. పూర్వభాగమున లఘువుల బాహుళ్యముచే ద్రుతగతియు, ఉత్తరభాగమున గురుల బాహుళ్యముచే విలంబితగతియు నేర్పడుచున్నది (ఆ. మ. భా : ఛం. శి., పుం. 301). ఈ కారణముగా నీ వృత్తము 'ద్రుతవిలంబిత' కావచ్చును. కాని సర్వత్ర ఈ పద్ధతి వలనుపడదు. 'ప్రహేయ' మన్న వృత్తమున గణక్రమము న-న-మ-య. (I I I I I I ∪ ∪ ∪ I ∪ ∪). ఇందును దాదాపుగా 'ద్రుతవిలంబిత' స్థితియే యున్నదికాని ఇది 'ప్రహేయ'మయినది కాగా దీని కిది యాదృచ్ఛికముగా నేర్పడిన పేరు కావచ్చును.

ఇట్లుగాక 'ఉష్ణిక్' విషయమున చెప్పబడినట్లు కొన్ని పద్యములకు ఔపమిక నామము లేర్పడినట్లు తోచును. 'పణవ' మని యొక వృత్తము. పణవ మనగా 'హుడుక్క' యను వాద్యవిశేషము. ఈ పద్యపు గురులఘు విన్యాసము-∪ ∪ ∪ I I I I ∪ ∪ ∪. ఆద్యంతముల గురువులు స్థూలమై నడుమ లఘువులచే సూక్ష్మమైన యాకారముగల ఈ వృత్తము హుడుక్కను పోలినదికాన ఔపమికముగా 'పణవ' మని పేరు వచ్చినది (ఆం. మ. భా: ఛం., పు. 306). కాని ఇదియు నిశ్చితముకాదు. 'జలధరమాల' కిట్టి వర్ణవిన్యాసమే (∪ ∪ ∪ ∪ I I I I ∪ ∪ ∪ ∪) యున్నను, దీని కీ పేరు యాదృచ్ఛికరీతిలో జరిగినది. ఇక్కడ మరొకయంశము. పద్యము పేరును

బట్టి కొంద రా పద్యము నా పేరుకు తగ్గ విషయము చెప్పుట కుపయోగించి నట్లు, మొట్టమొదట ఆ పద్యమున చెప్పబడిన యంశమునుబట్టి ఆ పద్యమున కా పేరు రావచ్చును. ఏ కవియో మొట్టమొదట మేఘమాలను ఒక పద్యమున వర్ణించగా, ఆ పద్యమునకు తత్సూచకముగా 'జలధరమాల' అను పేరు కలిగి యుండవచ్చును. కాని ఇదియు పలుపద్యముల పేర్ల విషయమున కుదరదు. ఉత్సాహము మొదలగు చిత్తవృత్తులను వర్ణించువేళ పద్యపు నడకనుబట్టి 'ఉత్సాహము', 'ఉత్సుకము' మొదలైన పేర్లు కలిగియుండవచ్చును. కాని ఇదియు సర్వత్ర కుదురదు.

తెలుగు జాత్యుపజాతుల పేర్లు చాలావరకు సార్థకముగా ఔపమిక ముగా నున్నవి. ద్విపద, త్రిపదాదుల పేర్లు ఆ పద్యముల పాదసంఖ్యను బట్టి సార్థకములు, ఆటవెలది యందలి నాల్గుపాదములు సమగణములు కలవికావు. బేసి పాదము లోకవిధము. సరి పాదము లింకొకవిధము. దీనివలన పద్యపు గతి గబగబ మారును. నర్తకి అడుగుల కదలికవలె నుండును. కాగా 'ఆటవెలది' ఔపమిక నామము. సీసము భిన్న లక్షణములు గల పద్యముల కలయికచే నేర్పడినది (చూ. సీసములు). కాగా మొదటిది తరువాతిదానికి శీర్షస్థానము. శీర్షమే సీసము. ఇదియు ఔపమికమే. రగడలలో మధుర, విజయమంగళములు తప్ప హయప్రచారేత్యాదు లన్నియు గతి దృష్ట్యా ఏర్పడిన పేరులు. అక్కర లైదింటిలో మొదటిది అన్నిటికన్న పెద్దదిగాన 'మహాక్కర', చివరిది అన్నిటి కన్న చిన్నదిగాన 'అల్పాక్కర'. మధురాక్కరలో ఇముడునదిగాన నాల్గవది అంతరాక్కర. పాదము మధ్యకు చెరిసగముగా విరుగుటచే రెండవది మధ్యా క్కర కాగా 'మధురా'క్కర పేరు యాదృచ్ఛికము కావచ్చును. సమ, విషమ గీతుల పేర్లను యాదృచ్ఛికములే యనిపించును. కందము 'స్కంద'మునకు వికృతియని, మొదట ఆ పద్యము స్కంద (కుమారస్వామి) స్తుతిలో ప్రయుక్త మగుటచే కాబోలు దానికా పేరు కలిగినదని యొక భావన. ఈ రీతిగా వందల కొలది పద్యముల పేర్లలో ఏకొద్ది పద్యముల పేర్లో అన్వర్థములు, ఔపమికములు తప్ప మిగిలిన వన్నియు యాదృచ్ఛిక నామములే యనిపించును. ఉత్పలమాల, చంపకమాల వంటివి పద్య గతినిగాని, ఉపమానమును గాని సూచింపవు. అంద మైన వస్తువుల పేర్లు మాత్రమే. ఈ ధోరణిలో ఒక అందమైన పేరు పెట్టవలెనన్న భావనవలన వచ్చినవి యాదృచ్ఛిక నామము లనుకొనవచ్చును. పద్యముల (ప్రధానముగా వృత్తముల) పేర్లలో పశు, పక్షి, మృగ, వృక్ష, లతా, కాల, ఋతు మొదలగువాటికి సూచకములైన పేర్లు బహుళములుగా నున్నవి. స్త్రీ సూచక నామములు తక్కువేమియు కావు. చిత్తవృత్తులకు, భావములకు సూచనగా కూడ పేర్లున్నవి. అయితే అన్నియు రుచిర సుందరములే కావు, కొన్ని 'భుజంగశిశురుత'ము వంటి పేర్లును నున్నవి.

పద్యముల పేర్లలో నే కొన్నియో తప్ప అన్నింటికి అన్వర్థత కుదు

రదు. కావున పద్య నామములు అన్వర్థములు, ఔపమికనులు, యాదృచ్ఛికము లని భావించి చూచుకొనవలసి యుండును. సరిపడినంతవరకు సరిపడును.

### ఛందోదోషములు

ఛందో విషయికమయిన నియమముల నుల్లంఘించుటలు 'ఛందో దోషములు' అని చెప్పబడును. ఈ ఛందోదోషములు ఎనిమిది విధములుగా కన్పించుచున్నవి.

i. ఛందోభంగము
ii. గణభంగము
iii. వర్ణాధిక్యము
iv. యతిభంగము
v. ప్రాసభంగము
vi. ప్రాసపూర్వాక్షరభంగము
vii. నిషిద్ధగణము
viii. పదచ్ఛేదభంగము

వీటిలో ఛందో, యతి, ప్రాస భంగములను మాత్రమే తెలుగు లాక్షణికులు చెప్పినారు. 'వర్ణాధిక్యము' నమృతానందుడు 'అలంకార సంగ్రహము' నందు చెప్పినాడు. మిగిలినవిగూడ గమనింపదగిన ఛందోదోషములే. ఈ దోషములలో కొన్ని అనిత్యదోషములు. కొన్ని కేవలము తెలుగు పద్యములకు మాత్రమే చెందినవి.

### ఛందోభంగము

ఇరువదియారు ఛందములలో నేదోయొక ఛందమునకు చెందిన పద్యమందలి పాదము(ల)లో, ఆ ఛందమందలి పద్యపాదమందుండవలసిన అక్షరముల సంఖ్యలో హెచ్చుతగ్గులు కలిగినచో 'ఛందోభంగ' దోష మనబడును.

ఈ దోషము ఇరువదియారు ఛందములందు నిష్పన్నములైన సమవృత్తములకు మాత్రమే సంబంధించినది. ఈ దోషము విషమవృత్తములకు చెందదు. ఆ పద్యపాదములందు హెచ్చుతగ్గులుండుట వాటి సహజలక్షణము. చూ. విషమవృత్తములు.

### గణభంగము

ఒక పద్యమునందు, ఆ పద్యపాదమున ఉండవలసిన గణక్రమస్థితిలో (వెనుక ముందులు కలిగినను) ఉండవలసిన గణముకన్న భిన్నగణమున్న 'గణభంగ' దోషమనబడును.

విషమ వృత్తేతర పద్యము లన్నింటియందును ఈ దోషము సంభవించుట కవకాశమున్నది. ఈ దోషములోని రెండవ యంశము 'ఛందోభంగ' దోషమునం దంతర్భవించునట్లు కన్పించునుకాని, ఛందోభంగ దోషము ఇరువది యారు ఛందములందు నిష్పన్నమైన వృత్తములకు మాత్రమే సంబంధించినది కాగా, ఇది జాత్యుపజాతులయందును కలుగుట కవకాశమున్నది కావున నిది ప్రత్యేకముగా పరిగణింపబడినది.

ఉదా :

'రసదాళి చెఱకు రసమునఁ
బిసికిన-శీతగు-డములింత-బిగిసిన పదనున్...'

—ప్ర. రా. నా. ప్ర. 2-73.

ఇది కందపద్య పూర్వార్థము. ఆరవ గణము జగణముగాని, నలము గాని కావలెను (చూ. కందములు.). కాని ఉదాహృత కందపద్యభాగమున ఆరవగణము సగణమైనది.

**వర్ణాధిక్యము**

పద్యపాదమునకు నియతములైన గణములన్నియు నుండగా, పాద మధ్యమందుగాని పాదాంతమందుగాని అక్షరము అధికముగా నున్నచో 'వర్ణా ధిక్య'మను దోషమనబడును.

ఇది సమవృత్తేతర పద్యములకు సంబంధించిన దోషము. సమవృత్తము లందీ దోషమేర్పడినచో 'ఛందోభంగ' దోషమనబడును (చూ. ఛందో భంగము).

ఉదా :

'అలరి బంధువులంద ఱంచు వి-భా-వించి'

—వాశి. రామా. పు. 137.

ఇది 'ద్విపద' పాదము. ద్విపదకు విహితమైన గణక్రమము ఉదా హృత పాదమునందున్నది కాని పాదాంత (సూర్య) గణమునకు వెనుక 'భా' యను నొకయక్షర మధికముగా నున్నది (ద్విపద లక్షణమునకు చూ. ద్విపద).

వర్ణాధిక్యమువలె వర్ణన్యూనతయు దోషమే. కాని వర్ణన్యూనత 'గణ భంగ' దోషమునం దంతర్భవించును. అందువలన ప్రత్యేకముగా నది ఇట పరి గణింపబడదు.

**యతిభంగము**

'యతిభంగ' మను దోషము మూడువిధములుగా కలుగుట కవకాశ మున్నది.

i. యతి చెల్లింపబడవలయునని చెప్పబడిన స్థానమునగాక, ఆ స్థాన మునకు వెనుక ముందులుగా చెల్లించుట.

ii. యతి నసలే చెల్లింపకుండుట.

iii. లాక్షణికమత విరుద్ధముగా యతి చెల్లించుట.

ఈ మూడింటిలో చివరియంశము కొంత వివాదాస్పదమైనది. కొందరు లాక్షణికులు కొన్ని యతిభేదములను చెప్పగా, మరికొందరు చెప్ప లేదు. అందువలన కొందరు లాక్షణికులదృష్ట్యా యతిభంగములయినవి, మరి

కొందరి దృష్ట్యా కాకపోవును. మరియు పూర్వపూర్వ కవుల ప్రయోగము లందలి యతిభంగములను ఉత్తరోత్తర లాక్షణికులు యతిభేదములనుగా నంగీకరించినారు. ఇంకను ఏ లాక్షణికులును చెప్పని కొన్ని యతిచెల్లింపులు కవుల ప్రయోగములం దుండనే యున్నవి (వివరములకు చూ. యతులు). ఈ విధముగా యతిభంగమందలి యీ యంశము అనిత్యదోషమగుచున్నది.

ఉదా :

i. '..., మయసూనుండగు దానవుండు నిజ మా
-యన్ గోపరాజిన్ గుహా...'
—భాగ. ద్వితీ. స్కం. 184.

ఇది మత్తేభవిక్రీడిత పాదము. ఈ పద్యమందు ప్రతి పాదమున పదునాల్గవ యక్షరము యతి చెల్లవలయును (చూ. మత్తేభవిక్రీడితము). కాని ఉదాహృత పాదమున పదమూడవ యక్షరము యతి చెల్లినది.

ii. '...చా, రు క్షేమంకర భావ భావభవ గర్వగ్రావనిర్వాపణా'
—రుక్మాం. 3-244.

ఇది శార్దూల విక్రీడిత పద్యపాదము. ఈ పద్యమందు ప్రతి పాదమున పదుమూడవ యక్షరము యతి చెల్లవలెను (చూ. శార్దూల విక్రీడితము). కాని ఉదాహృత పాదమున యతి చెల్లనేలేదు.

iii. 'ఉదయించె విష్ణుదే-వుండు మహాత్మ'

ఇది ద్విపద పాదము. ఇందు ఉ-వులకు యతి చెల్లింపబడినది. ఈ యతినే లాక్షణికుడు నంగీకరించలేదు. ప్రయోగములుమాత్రము కొన్నియున్నవి.

## ప్రాసభంగము

'ప్రాసభంగ' మను దోషము నాల్గు విధములుగా కలుగుట కవకాశమున్నది.

i. ప్రాసాక్షరము ద్విత్వముగాని, సంయుక్తముగాని యగునపుడు, ప్రాస చెల్లవలసినచోట్లగూడ ద్విత్వమో, సంయుక్తమో చెల్లవలసియుండును (చూ. యతులు). అట్లు చెల్లక, మరొక హల్మాత్ర మిధికముగా చేరుట;

ii. పై జెప్పిన రీతిలో నొక హల్మాత్రము లోపించుట:

iii. ప్రాస మసలే చెల్లకుండుట;

iv. లాక్షణికమత విరుద్ధముగా ప్రాస చెల్లుట.

ఈనాల్గింటిలో చివరి యంశము కొంత వివాదాస్పదమైనది. కొందరు లాక్షణికులు కొన్ని విధములైన ప్రాసభేదములను చెప్పగా మరికొందరు చెప్పలేదు. అందువలన కొందరు లాక్షణికులదృష్ట్యా ప్రాసభంగములయినవి, మరి కొందరి దృష్ట్యా కాకపోవచ్చును. మరియు పూర్వపూర్వ కవుల ప్రయోగము

లందలి ప్రాసభంగములను ఉత్తరోత్తర లాక్షణికులు ప్రాసభేదములుగా నంగీకరించినారు. ఇంకను ఏ లాక్షణికులును చెప్పని ప్రాసభేదములు కొన్నియున్నవి. (వివరములకు చూ. ప్రాసభేదములు.). ఈవిధముగా ప్రాసభంగమునకు సంబంధించిన యంశము అనిత్యదోషమగుచున్నది.

పై నాల్గింటిలో మొదటి, రెండవ యంశములకు సంబంధించిన దోషములు కన్నడమందలి ఛందోనియమములనుబట్టి దోషము కాకపోవును. ఇట్టి ప్రాసచెల్లింపు 'శాంతప్రాస' మనబడును. కాని తెలుగు లాక్షణికు లెవ్వరును ఈ రీతి నంగీకరించలేదు. కావున తెలుగులో నీ యంశములు దోషములుగానే పరిగణించబడును.

ఉదా :

i. 'సర్వజ్ఞ భక్తివిరహితుఁ
డెవ్వడు నుత్కృష్ట జాతుఁడేటికి గొఱయే...'

—శివతత్త్వసారము.

ఇందు ప్రాసాక్షర రేఫ వకార సంయుక్తము. రెండవపాదమున ఆ సంయుక్తమందలి రేఫస్థానమున వకారము వచ్చినది. కాగా మొదట సంయుక్తము కాగా, తరువాత ద్విత్వమైనది.

ii. అప్పుడే యొక వేట లాడిరటంచు
విపరీత కథ చెప్ప విని శాలకుండు.

—వాశి. రామా. పు. 81. (వావిళ్ల 1925)

ఇందు ప్రాసాక్షరము ద్విత్వము. రెండవపాదమున నొక హల్లు లోపించినది.

iii. బహువిధంబుల వారు ప్రార్థింపఁగాను
విదితంబుగా విని విజయరాఘవుఁడు.

—వాశి. రామ. పు. 8.

ఇది ద్విపద. ప్రాస చెల్లింపబడలేదు (తరిగొండ వేంకమాంబ రచించిన ఈ వాశి. రామా. ద్విపదకావ్యము )

iv. తోపకున్నది మహోతుర్యభాగమున
కావలఁ గలిత జగజ్జాలమునకు.

—వాశి. రామా. 4-1104.

ఈ ద్విపదయందు ప-వ లకు ప్రాస చెల్లింపబడినది. ఈ ప్రాసకు ప్రయోగములున్నను లాక్షణికు లెవరు నంగీకరించలేదు.

## ప్రాస పూర్వాక్షర భంగము

ప్రాస పూర్వాక్షరము (మొదటి పాదమున) గురువో, లఘువో

యగుట సహజము. ప్రాస చెల్లింపవలసినచోట్ల గూడ ప్రాసపూర్వాక్షరము (మొదటిదాని ననుసరించి) గురువో, లఘువో కావలయునుగాని మారకూడదు. మారుట 'ప్రాస పూర్వాక్షర భంగ' దోష మనబడును.

ఉదా :

'అది యెట్లనినఁ జిత్తమనఁ బాయకుండుఁ
బోదు ప్రపంచమన్ భూతంబు గాంచి'.

—వాశి. రామా. పు. 69 (వావిళ్ళ. 1925).

ఈ ద్విపదలో మొదటి పాదమున ప్రాస పూర్వాక్షరము లఘువు కాగా, రెండవ పాదమున గురువైనది (తరిగొండ వెంకమాంబ రచించిన వాశిష్ఠ రామాయణము ద్విపదకావ్యమేగాని మంజరీద్విపద కావ్యముకాదు. ద్విపదకు ప్రాస నియమమున్నది; చూ. ద్విపద).

## నిషిద్ధ గణము

ఒక పద్యమందు పాదమునకు విహితమైన గణములకు బదులు, నిషిద్ధ గణములు ప్రయుక్తమైనచో 'నిషిద్ధగణ' దోషమనబడును.

ఉదా :

'అహంక్రి-యాత్మక-మగు శం-ఖంబును'

—కళా. 8-238.

ఇది 'మధురగతి' రగడ పాదము. ఈ రగడలో జగణము నిషిద్ధము. కాని పై ఉదాహరణమున ఆ నిషిద్ధగణము పాదాదియందు ప్రయుక్తమైనది. (విశేషములకు చూ. రగడలు).

## పదచ్ఛేద భంగము

ద్విపద, మంజరీ ద్విపదలయందు ఒక పాదమునుండి మరొక పాదమునకు ఒకేపదము వ్యాపించి యుండగూడదు. పాదాంతమున పదవిచ్ఛేదము జరుగవలెనని లాక్షణికులు చెప్పినారు. అందువలన పదవిచ్ఛేదము జరుగకపోయినచో 'పదచ్ఛేదభంగ' దోషమనబడును (విశేషములకు చూ. ద్విపద).

ఉదా :

'ఈ రీతిఁ బోరాడి యింద్రాది ఘన మ-
యూరంబు మూర్ఛిల్ల నుర్విపై వైచె.

—ఉషా. పూ. భా. 1622, 3.

ఈ ద్విపదయందు 'మయూర' మనుపదము ఉభయ పాదములందు వ్యాపించియున్నది. ఈ దోషము ఎక్కడో ఒకచోట లేని ద్విపదకావ్యము కానరాదు. ఈ దోషము కేవలము ద్విపదలకు సంబంధించినది, ఇతర పదములందు

పాదాంతమున పదవిచ్ఛేదము చెప్పబడలేదు. తెలుగులో పాదాంత పదవిచ్ఛేదము జరుగకుండుటయే ఒక ప్రౌఢిగా భావింపబడినట్లు కన్పించును.

**షట్ప్రత్యయములు**

భిన్న భిన్న చ్ఛందములందు నిష్పన్నములగు వృత్తములు, వాటి స్వరూపము, సంఖ్య మొదలగు నంశములను తెలిసికొనుటకు ఛందశ్శాస్త్రము నందు నారు పద్ధతులు చెప్పబడినవి.

i. ప్రస్తారము　　ii. నష్టము
iii ఉద్దిష్టము　　iv. వృత్తసంఖ్య
v. లగక్రియ　　vi. అధ్వము

వీటిని 'షట్ ప్రత్యయము' లందురు.

ఛందములను గూర్చిన యంశములను తెలుపుటవలన ఇవి 'ప్రత్యయము' లనబడినవి. 'ప్రత్యయ' మనగా జ్ఞానము.

**ప్రస్తారము**

ఏయే ఛందమునందు ఎన్నెన్ని వృత్తములు నిష్పన్నములగునో, ఆయా నిష్పన్నములైన వృత్త పాదములందు గురు లఘు వర్ణక్రమ మెట్లుండునో తెలియుటకు ఉపయోగించు పద్ధతి 'ప్రస్తార' మనబడును. ప్రస్తార పద్ధతి ఈక్రింది విధముగా నుండును.

ఎన్నవ ఛందమును ప్రస్తారింప దలచినచో అన్ని గురువులను (చూ. ఛందములు). ఒకదాని ప్రక్క నొకటిగా నొక వరుసలో వ్రాయవలెను (గురు లఘువులను వ్రాయుటలో వాటి సంకేతములగు ‿, । లను ఉపయోగించవలెను). రెండవ వరుసలో, పైవరుస (మొదటి వరుస) లోని మొదటి గురువు క్రింద మాత్రము లఘువు వ్రాసి, తరువాతి వాటిని పైవరుసలో నున్నట్లే వ్రాయవలెను మరల తరువాతి (మూడవ) వరుసయందు దాని పై వరుస (రెండవ వరుస) లోని మొదటి గురువుక్రింద లఘువును వ్రాసి. తరువాతి వాటిని యథా ప్రకారముగానే వ్రాయవలెను. మరియు, పైవరుసలోని మొదటి గురువుకు ముందు లఘువు, లేక లఘువులు ఉన్నచో నీ వరుసయందు గురువు, లేక గురువులుగా మార్చి వ్రాయవలెను. ఈ విధముగా అన్నియు లఘువులే గల వరుస రూపొందువరకు వరుసలు వ్రాయవలయును. ప్రస్తారమునందు మొదటివరుసలో అన్నియు గురువులే, కాగా చివరి వరుసయందు అన్నియు లఘువులే యుండును. ఈ వరుసల సంఖ్య ఆ ఛందమందు నిష్పన్నమగు వృత్తములసంఖ్యను తెల్పును. మరియు ఒక్కొక్క వరుసలోని గురు లఘు వర్ణక్రమము ఆయావృత్త పాదపు వర్ణక్రమమును తెలియ జేయును ఉదాహరణమునకు నాల్గవ (ప్రతిష్ఠా) ఛందముయొక్క ప్రస్తారము ఈక్రింద చూపబడుచున్నది.

| | |
|---|---|
| U U U U | .........1. |
| \| U U U | .........2. |
| U \| U U | .........3. |
| \| \| U U | .........4. |
| U U \| U | .........5. |
| \| U \| U | .........6. |
| U \| \| U | .........7. |
| \| \| \| U | .........8. |
| U U U \| | .........9. |
| \| U U \| | .........10. |
| U \| U \| | .........11. |
| \| \| U \| | .........12. |
| U U \| \| | .........13. |
| \| U \| \| | .........14. |
| U \| \| \| | .........15. |
| \| \| \| \| | .........16. |

పై ప్రస్తారమువలన తెలియవచ్చు కొన్ని ప్రధానాంశములు :

i. నాల్గవ ఛందమున పదునారు వృత్తము లేర్పడును.

ii. మొత్తము వృత్తములలో మొదటి సగము వృత్తములు గుర్వంత పాదములు, రెండవసగము వృత్తమును లఘ్వంతపాదములు గలవి.

iii. మొదటి వృత్తము సర్వగురుకము, చివరిది సర్వలఘుకము.

**నష్టము**

'ప్రస్తారము'వలన ఒక ఛందమునందు నిష్పన్నములగు వృత్తములు, వాటి పాదపు గురు లఘు వర్ణక్రమము తెలియును (చూ. ప్రస్తారము.). కాని, ఒక ఛందమునందలి ఏదో యొక ప్రత్యేక వృత్తముయొక్క పాదపు గురు లఘు వర్ణక్రమమును తెలిసికొనుటకు ఛందమును ప్రస్తరించకుండగనే తెలిసికొను వీలు కలిగించు పద్ధతి యున్నది. దానిని 'నష్టము' లేక 'నష్టలబ్ధి' యందురు. నష్టమనగా నశించినది- తెలియనిది. దానిని తెలిసికొను పద్ధతి కాన దీని కీ పేరు కలిగినది.

నష్టము పద్ధతి యిట్లుండును :

ఏ ఛందమైనను ఎన్నవ వృత్తపు పాదమందలి గురు లఘు వర్ణక్రమమును తెలుసుకొనవలయునో, ఆ వృత్తపు సంఖ్యను రెండుచే భాగించవలెను. వచ్చిన లబ్ధమును మరల రెండుచే భాగించవలెను. లబ్ధము సరిసంఖ్య కాక బేసి సంఖ్య వచ్చినచో, దాని కొకటి కలిపి సరిసంఖ్యను చేసి భాగించవలెను, ఇట్లు

ఆ వృత్త మెన్నవ ఛందములోనిదో, అన్ని లబ్ధములు వచ్చువరకు భాగించు చుండవలెను. బేసిసంఖ్య వృత్తమునుగూర్చియే తెలుసుకొనవలెను. మొదటనే బేసిసంఖ్యను భాగించవలసివచ్చును. కాన మొదటనే దానిని సరిసంఖ్యగా (ఒకటి చేర్చి) చేసికొని భాగించుట ప్రారంభించవలెను.

ఒకటి చేర్చి బేసిసంఖ్యను సరిసంఖ్యగా మార్చిన వరుస కెదురుగా గురువును, సహజముగా నున్న సరిసంఖ్య యున్న వరుస కెదురుగా లఘువును వ్రాయవలెను. ఇట్లు నిలువు వరుసగా నేర్పడు గురు లఘుక్రమము అడ్డపు వరుసలో వ్రాసినచో, ఆ ఛందమందలి అన్నవ వృత్తపు పాదమందలి గురు లఘు వర్ణ క్రమము తెలియును.

ఉదాహరణమునకు నాల్గవ ఛందమందలి 9వ వృత్తపు పాద గురు లఘు క్రమము నష్టపద్ధతిలో :

i. 2) 9+1−10 —◡
2) 5+1=6 —◡
2) 3+1=4 —◡
2) 2 — ।

4 వ ఛందమున 9 వ వృత్తపు పాద గురు లఘు క్రమము : ◡ ◡ ◡ ।.

నాల్గవ ఛందమందలి 14 వ వృత్తపు పాద లఘు గురు క్రమము నష్టపద్ధతిలో :

ii. 2) 14 — ।
2) 7+1=8 —◡
2) 4 — ।
2) 2 — ।

4 వ ఛందమున 14 వ వృత్తపు పాద గురు లఘు క్రమము : । ◡ । ।.
(పైపాటిని 'ప్రస్తారము'న చూపిన 4 వ ఛందపు ప్రస్తారముతో సరిచూచుకొన వలెను. చూ. ప్రస్తారము).

4వ చందమున ప్రతి వృత్తపాదము నాలుగక్షరములతోనే యుండును గాన నాలుగక్షరములు తెలిసిన తరువాత భాగించనక్కరలేదు

## నష్టలబ్ధి

చూ. నష్టము.

## ఉద్దిష్టము

ఏదో యొక గురులఘు క్రమమును గ్రహించి, అది ఎన్నవ ఛందము లోని ఎన్నవ వృత్తమో తెలుసుకొనుటకు ఉపయోగించు పద్ధతి 'ఉద్దిష్ట' మన బడును. ఉద్దిష్ట మనగా ఉద్దేశింపబడినది యని యర్థము. ఉద్దేశించిన గురు లఘు

క్రమము ఏ ఛందమందలి ఎన్నవ వృత్తమో తెలియుట కుపయోగపడుటచే నిది 'ఉద్దిష్ట' మయినది.

గ్రహించిన గురు లఘు క్రమమునం దెన్ని యక్షరములుండునో, ఆ క్రమముగల పాదము అన్నవ ఛందములోనిదని స్పష్టమే (చూ. ఛందములు). ఇక, ఆ గురులఘు క్రమమును అడ్డువరుసగా వ్రాయవలెను. ఆ తరువాత మొదటి అక్షరము క్రింద 1, రెండవదాని క్రింద 2, మూడవదాని క్రింద 4, నాల్గవదాని క్రింద 8-ఇట్లు రెట్టించుచు అంకెలను కూడి దానికి ఒకటి కలిపినచో నేర్పడునది ఆ (గురు లఘు క్రమము పాదమునగల) వృత్తసంఖ్య యగును.

ఉదాహరణమునకు । ∪ । । అను గురు లఘు క్రమము ఏ ఛందమందలి ఎన్నవ వృత్తమో 'ఉద్దిష్ట' పద్ధతిలో :

। ∪ । । అను క్రమములో నాలుగక్షరము లున్నవిగాన, ఇది నాలుగవ ఛందములోని వృత్తపాద (గురులఘుక్రమ) మని స్పష్టము. ఇక నా వృత్త మెన్నవదో తెలియుట కీ క్రిందివిధముగా చూడవలెను.

| । | ∪ | । | । |
|---|---|---|---|
| 1 | 2 | 4 | 8 |

లఘువుల క్రింది అంకెల మొత్తము :- $1+4+8=13$. దీనికి ఒకటి చేర్చగా 14 అగును. కాగా పై గురులఘుక్రమము 4 వ ఛందమందలి 14 వృత్తమునకు చెందినదని తెలియును (చూ. ప్రస్తారము, నష్టము).

## వృత్తసంఖ్య

ఏ ఛందమందు ఎన్ని వృత్తములు నిష్పన్నము లగునన్నది తెలుసుకొనుటకు 'ప్రస్తార' పద్ధతి నుపయోగింపవచ్చును (చూ ప్రస్తారము). కాని, దానికన్న సులభమయిన పద్ధతి మరొకటి యున్నది. ఆ పద్ధతి 'వృత్తసంఖ్య'. ఒక ఛందమందేర్పడు వృత్తముల మొత్తమును (మాత్రము) తెలుపును గాన నిది 'వృత్తసంఖ్య' యనబడినది.

ఎన్నవ ఛందమందలి వృత్తముల మొత్తము సంఖ్యను తెలియవలెనో అన్నిగురువు లొకదానిప్రక్క నొకటిగా నొకవరుసలో వ్రాయవలెను. ఒకొక్క గురువు క్రింద వరుసగా ఒకటి మొదలుకొని రెట్టింపుగా నంకెలు వ్రాయవలెను. మొదటి గురువు క్రింద 1, రెండవదాని క్రింద 2, మూడవదాని క్రింద 4- అను విధముగా వ్రాయవలెను. చివరి గురువు క్రింద వ్రాసిన సంఖ్యను రెట్టించగా వచ్చిన సంఖ్య ఆ ఛందమందు నిష్పన్నమగు వృత్తముల మొత్తము సంఖ్యను తెలుపును.

ఉదాహరణమునకు నాల్గవ ఛందమందు నిష్పన్నమగు వృత్తముల మొత్తము సంఖ్య 'వృత్తసంఖ్య' పద్ధతిలో :-

$$\smile \smile \smile \smile$$

1 2 4 8.   $8 \times 2 = 16.$

నాల్గవ ఛందమున 16 వృత్తము లేర్పడును (చూ. ప్రస్తారము).

దీనినే మరొకవిధముగా లెక్క వేయవచ్చును. ఛంద మెన్నవదో అన్నిమార్లు రెండును గుణించినచో, ఆ ఛందమందు నిష్పన్నమగు వృత్తముల మొత్తముసంఖ్య తెలియును. పై ఉదాహరణమునే ఈ క్రిందివిధముగా చూడవచ్చును. నాల్గవ ఛందముగాన, 2 ను నాల్గుమార్లు గుణించవలెను.

$$2 \times 2 \times 2 \times 2 = 2^4 = 16.$$

## లగక్రియ

ఒక ప్రత్యేక చ్ఛందమున నిష్పన్నములగు వృత్తములలో లఘువు (గురువు) ల స్థితినిగూర్చి తెలిసికొనుటకు ఉపయోగించు పద్ధతి 'లగక్రియ' అనబడును (పేరులోని ల, గ అనునవి లఘు గురువులకు సూచకములు). ఈ తెలిసికొనుట రెండు విధములుగా నుండును.

i. ఒక ప్రత్యేక చ్ఛందమునందు ఒకటినుండి ఎన్నేసి లఘువులుగల వృత్తములు ఎన్నెన్ని ఉండునో యని తెలిసికొనుట ఈ తెలిసికొనుటకు ఉపయోగించునది 'మేరు చక్రము' (చూ. మేరు చక్రము).

ii. ఒక ప్రత్యేక చ్ఛందములో ఒకటినుండి ఎన్నేసి లఘువులు గల వృత్తము లేయే సంఖ్యలవి యని తెలిసికొనుట. ఈ తెలిసికొనుటకు ఉపయోగించునది 'శకట చక్రము' (చూ. శకట చక్రము).

లగక్రియనే 'లఘుగురుక్రియ' అనియు నందురు.

## లఘుగురుక్రియ

చూ. లగక్రియ.

## మేరుచక్రము

ఒక ప్రత్యేకచ్ఛందమునందు నిష్పన్నమగు వృత్తములలో ఒకటి నుండి ఎన్నేసి లఘువులుగల వృత్తము లెన్నెన్ని యుండునో తెలియుటకు 'మేరుచక్రము' ఉపయోగించును.

నాల్గవ ఛందమువరకు 'మేరుచక్రము' ఇట్లుండును.

| 1 1

1 2 | 1

1 3 3 1

1 4 6 4 | 1 |

1 5 10 | 10 5 1

ఈ చక్రమును వేయు పద్ధతి :

మొదటి వరుసలో (నొకదానిప్రక్క నొకటిగా) రెండు గడులను వ్రాయవలెను. ఆ తరువాత ఒక్కొక్క వరుస కొక్కొక్క గడిగా పెంచుచు పైన చూపిన విధముగా వ్రాయవలెను. వరుససంఖ్యకన్న గడుల సంఖ్య ఒకటి యెక్కువగా నుండును. అనగా రెండవ వరుసలో మూడు, మూడవ వరుసలో నాల్గు...ఈవిధముగా నుండును. ఎన్నవ ఛందమునుగూర్చి తెలిసికొనవలసి యున్నచో అన్ని వరుసలుగా నిట్లు గడులు వ్రాయవలెను. ఒక్కొక్క వరుస ఒక్కొక ఛందమునకు గుర్తు అనగా మొదటి వరుస ఒకటవ ఛందమునకు, రెండవ వరుస రెండవ ఛందమునకు, నాల్గవ వరుస నాల్గవ ఛందమునకు...ఈ విధముగా గమనించవలెను. ఛందపు సంఖ్యకన్న ఆ వరుసలో గడుల సంఖ్య ఒకటి అధికముగా నుండును (పైన వేసిన చక్రము ఐదవ ఛందమువరకున్నది. నాల్గవ వరుస నాల్గవ ఛందమునకు గుర్తుకాగా, ఆ వరుసలో నైదుగడులున్నవి).

ఇక, మొదటివరుస మొదటి గడిలో 1, చివరిగడిలో గూడ (మొదటి వరుసలో రెండే గడులుండును.) 1 అంకెలు వేయవలెను. ఇట్లే ప్రతి వరుసలోని మొదటి చివరి గడులలో 1 యే వేయవలెను. ఇక, రెండవ వరుసలోని రెండవ గడిలో పై వరుసలోని ఒకటవ, రెండవగడులలోని అంకెల కూడిక మొత్తమును వేయవలెను. మూడవ వరుసలోని రెండవ గడిలో పై (రెండవ) వరుసలోని ఒకటవ, రెండవ గడులలోని అంకెల కూడిక మొత్తమును, మూడవ గడిలో పై (రెండవ) వరుసలోని రెండవ, మూడవగడులలోని అంకెల కూడిక మొత్తమును వేయవలెను. నాల్గవ వరుసలోని రెండవ గడిలో పై (మూడవ) వరుసలోని ఒకటవ, రెండవ గడులలోని అంకెల కూడిక మొత్తమును, మూడవ గడిలో పై (మూడవ) వరుసలోని రెండవ, మూడవ గడులలోని అంకెల కూడిక మొత్తమును, నాల్గవ గడిలో పై (మూడవ) వరుసలోని మూడవ, నాల్గవ గడులలోని అంకెల కూడిక మొత్తమును వేయవలెను. ఇట్లే ప్రతి వరుసలోని నడిమి గడులలో (వరుసలోని మొదటి చివరి గడులలో నెప్పుడును 1 యే యుండును). పై వరుసలో మొదటినుండి రెండేసి గడులలోని అంకెల కూడికల మొత్తములను వేయుచు నెంతవకైనను (ఛందము లిరువదియారు కాన, ఇరువదియారు వరుసలవరకు) వరుసలు పెంచుచు పోవచ్చును. పైవరుసలోని రెండేసి గడులనగా మొదటిసారి లెక్కించిన రెండు గడులలోని రెండవ గడి, తరువాత లెక్కించు రెండు గడులలో మొదటిదగుచుండును (చూ. పైన చూపిన చక్రము).

ఇక, ప్రతి వరుసయందలి మొదటి గడిలోని సంఖ్య, ఆ ఛందమందలి అన్నియు గురువులు (లఘువు లసలే లేని) వృత్తముల సంఖ్యను, చివరి గడిలోని సంఖ్య, (ఆ ఛందమందలి అన్నియు లఘువులు (గురువులసలే లేని) వృత్తముల సంఖ్యను తెలియజేయును. వరుసలోని రెండవ గడులందలి సంఖ్య, ఆ ఛందమందలి వృత్తములలో ఒకే లఘువుగల వృత్తముల సంఖ్యను మూడవ గడిలో

నిది రెండు లఘువులు గల వృత్తముల సంఖ్యను, నాల్గవ గడిలోనిది మూడు లఘువులు గల వృత్తముల సంఖ్యను.........సూచించుచుండును రెండు లఘువులుగల వృత్తములనగా, పరిశేషన్యాయమున ఆ వృత్తములందుండవలసిన మిగిలిన యక్షరములన్నియు గురువులుగా నుండుననుకొనవలెను. కాగా గడుల లోని సంఖ్యలు లఘుస్థితిని సూచించినట్లే గురుస్థితిని గూడ సూచించును. మూడవ వరుస రెండవ గడిలోని సంఖ్య ఆ (మూడవ) ఛందమునందు ఒకే లఘువుగల వృత్తముల సంఖ్యను సూచించుననుటకు బదులు రెండు గురువులు గల వృత్తముల సంఖ్యను సూచించుననియు చెప్పవచ్చును. మొదటి గడి తరు వాతి గడినుండి లఘువుల సంఖ్యాస్థితిని లెక్కించినట్లు, చివరిగడి వెనుక గడినుండి గురువుల సంఖ్యాస్థితిని లెక్కించుచు రావచ్చును. ఈ రెండు విధములకు వీలుండుటవలననే ఇది 'లగక్రియ' యైనది.

పై చక్రము ఐదవ ఛందమువరకు వేయబడినది. నాలుగవ వరుస నాల్గవ ఛందమునకు సూచకము. ఆ వరుసనుబట్టి నాల్గవ ఛందములోని పదునారు వృత్తములలో(వరుసలోని గడులందలి యంకెల కూడిక మొత్తము ఆ ఛందమందు నిష్పన్నమైన వృత్తముల మొత్తము సంఖ్య యగును). ఒక లఘువుకూడ లేని (అన్నియు గురువులే గల) పాదములతోడి వృత్త మొకటియని, ఒక లఘువు గలవి నాలుగని, రెండు లఘువులు గలవి ఆరని, మూడు లఘువులు గలవి నాలు గని, అన్నియు లఘువులే (గురువు లసలే లేనిది) ఒకటి యని తెలియును.

ఇట్లే ఈ చక్రమున వరుసలను పెంచి, గడులలో నంకెలువేసి ఎన్నవ ఛందము వరకైనను చూచుకొనవచ్చును.

ఈ చక్రము పర్వతాకృతిని స్ఫురింపచేయుటచే 'మేరుచక్ర' మని చెప్పబడినది. ఇక్కడ చక్రమనగా వలయాకృతి యనిగాక రేఖాచిత్రమని భావించవలసియుండును.

ఈ చక్రమువలన పాదమునందు అన్నేసి లఘువులుగల వృత్తముల మొత్తముసంఖ్య తెలియునుగాని, ఎన్నెన్నవ వృత్తపు పాదములందు అన్నన్ని లఘువు లుండునన్నది తెలియదు. అది తెలియుటకు 'శకట చక్రము' వేయ వలెను (చూ. శకట చక్రము).

ఈ చక్రమువలన తెలిసిన యంశములను ప్రస్తారములతో సరిచూచు కొనవచ్చును (చూ. ప్రస్తారము).

**శకట చక్రము**

ఒక ప్రత్యేకచ్ఛందమునందు నిష్పన్నమైన వృత్తములలో ఒకటి నుండి ఎన్నేసి లఘువులు పాదములందుగల వృత్తములు ఎన్నెన్నవవని తెలియు టకు 'శకట చక్రము' ఉపయోగించును.

నాల్గవ ఛందమువరకు శకట చక్ర మిట్లుండును :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | | | | |
| 2 | 3 | 5 | 9 | | |
| 4 | 7 | 13 | 6 | 11 | 10 |
| 8 | 15 | 14 | 12 | | |
| 16 | | | | | |

ఈ చక్రము వేయు పద్ధతి :

ఎన్నవ ఛందములోని వృత్తములనుగూర్చి తెలిసికొనవలసియుండునో, అన్నిటికన్న నొకటి యధికముగా నిలువువరుసలో గడులు వ్రాయవలెను. (అనగా నాల్గవ ఛందపు విషయము లుద్దిష్టములైనచో నిలువుగా-నొకదానిక్రింద నొకటిగా-ఐదు గడులు వ్రాయవలెను). ఒకటి, రెండు, నాల్గు, ఎనిమిది... ఇత్యాదిగా రెట్టించుచు పైగడినుండి క్రిందిగడివరకు నంకెలు వేయవలెను (క్రింది గడిలోని సంఖ్య వృత్తముల మొత్తము సంఖ్యను తెలుపును). ఆ తరువాత, పైనుండి రెండవగడికి ప్రక్కన అవసరమునుబట్టి, అడ్డపు వరుసగా ఒక్కొక్క గడి పెంచుకొనుచుండవలెను. అడ్డపు వరుసలో మొదటి గడిలో నున్న సంఖ్యను రెట్టించగా వచ్చినదానినుండి ఒకటి తగ్గించి, ఆ వరుసలోని రెండవగడిలో వేయవలెను. మరల తరువాతి (మూడవ) గడిలో దాని వెనుకగడిలోని సంఖ్యను రెట్టించి, ఒకటి తగ్గించివేయవలెను. అయితే ఇట్లు రెట్టింపగా వచ్చు సంఖ్య (ఒకటి తగ్గించగా నేర్పడినదియు) నిలువు వరుసలోని అట్టడుగు గడియందలి సంఖ్యను (అనగా తెలిసికొనవలసిన ఛందమందలి మొత్తము వృత్తముల సంఖ్యను) మించకుండ చూచుకొనవలెను. మించునట్లున్నచో రెట్టించరాదు. అక్కడి కా వరుస నాపవలెను. ఇట్లే నిలువ వరుసలో మూడవగడి ప్రక్కనగూడ అడ్డపు వరుసగా గడులను పెంచవలెను. ఈ గడులయందున పైన చెప్పిన రీతి లోనే సంఖ్యలు వేయవలెను. అట్లు వేసినతరువాత, పై వరుస (రెండవ వరుస) లోని రెండవ గడియందలి అంకెను రెట్టించి ఒకటి తగ్గించకుండగనే ఈ (మూడవ) వరుసలో మరొకటి పెంచి వేయవలెను. ఈ వేయబడిన సంఖ్యను మరల రెట్టించి ఒకటి తగ్గించి మరొక గడిలో వేయవలెను. ఈ విధముగా పై వరుసలోని సంఖ్యలన్నియు పూర్తియగుదాక వేయవలెను. ఈ వేయునప్పుడు గూడ, వేయబడు సంఖ్య ఆ ఛందపు మొత్తము వృత్తముల సంఖ్యను మించకుండ చూచుకొనుచునే యుండవలెను. పై వరుసలోని ఒకసంఖ్యను రెట్టించగా మొత్తము వృత్తముల సంఖ్యను మించునట్లు కన్పించినచో దానిని వదిలి తరువాతిదానిని రెట్టించవలెను. ఇట్లు నిలువు వరుసలోని అట్టడుగు గడిదాక (అట్టడుగు గడికి మాత్రము అడ్డపువరుసలో గడులేర్పడవు. ఆ గడియందలిది ఛందపు మొత్తము వృత్తముల సంఖ్య. దానిని రెట్టించ వీలులేదు). అడ్డపు వరుసలుగా

గడులు వ్రాయుచు, సూచించినవిధముగా సంఖ్యలు వేయుచు పోవలెను. (నిలువు వరుసలో పైగడికి, అట్టడుగుగడికి అడ్డపువరుసగా గడులేర్పడవు.).

మొదటి అడ్డపు వరుస గడి (అనగా నిలువు వరుసలలో మొదటిగడి) లోని సంఖ్య పాదమునందన్నియు గురువులే (లఘువు లసలే లేని) వృత్తసంఖ్యను తెలుపును. రెండవ అడ్డపు వరుసలోని గడులందలి సంఖ్యలు పాదమున కొక్క లఘువు (పరిశేష న్యాయమున మిగిలిన అక్షరములు గురువులు) గల వృత్తము లేవేవో తెలుపును. మూడవ అడ్డపు వరుస గడులలోనివి, పాదమునకు రెండేసి లఘువులుగల వృత్తములను, నాల్గవ అడ్డపు వరుసలోని గడులందలివి, పాదమునకు మూడేసి లఘువులుగల వృత్తములను సూచించును. ఇట్లే ప్రతి అడ్డపు వరుస ఒకొక్కొక్క లఘువు యొక్క పెరుగుదలను సూచించును. చివరి అడ్డపు వరుస గడి (నిలువు వరుసలోని అట్టడుగు గడి) లోని సంఖ్య అన్నియు లఘువులే (గురువు లసలే లేని) పాదముగల వృత్తమును సూచించును. పైనించి క్రింది వరుసలకు వచ్చుచు లఘువులుగల వృత్తములు గమనింపబడిన వనగా, క్రింది నుండి మీదికి వెళ్ళినచో (పైవిధముగనే) గురువులుగల వృత్తములును గమనింప బడుననవచ్చును. ఇట్లు రెండు విధములుగా వీలుండుట వలననే ఇది 'లగక్రియ' యైనది.

పై చక్రము నాల్గవ ఛందమువరకు వేయబడినది. దానినిబట్టి మొదటి వృత్తము లఘువు లసలే లేనిదని, 2-3-5-9 వ వృత్తములు పాదమునందొక్క లఘువు కలవియని, 4-7-13-6-11-10 వ వృత్తములు పాదమునందు రెండు లఘువులు గలవియని, 8-15-14-12 వ వృత్తములు పాదమునకు మూడు లఘువులు గలవియని, 16 వ వృత్తము పాదమునందన్నియు లఘువులే గలది యని తెలియును.

పై విధముగనే శకటచక్రమును విస్తరించి ఎన్నవ ఛందమువరకైన వేయవచ్చును.

ఈ చక్రము బండియొక్క ఆకృతిని స్ఫురింపచేయుటవలన 'శకట చక్రమ'ని చెప్పబడినది. ఇక్కడ చక్రమనగా వలయాకృతి యనిగాక రేఖా చిత్రమని భావించవలసియుండును.

ఈ చక్రమువలన పాదమున కెన్నెన్ని లఘువులు గల వృత్తము లేవేవో తెలియుటయేకాక, ఆయా వరుసలలోని గడుల సంఖ్యనుబట్టి యెన్నో గూడ తెలియును. మేరుచక్రమునందు అన్నన్ని లఘువులుగల వృత్తముల మొత్తము సంఖ్య మాత్రమే తెలియను (చూ. మేరుచక్రము).

ఈ చక్రమువలన తెలియు నంశములను ప్రస్తారముతో సరిచూచు కొనవచ్చును (చూ. ప్రస్తారము).

శకట చక్రమును అనంతుడు 'సగణలగక్రియాంక చక్ర'మన్నాడు.

**నగణలగక్రియాంక చక్రము**

చూ. శకటచక్రము.

**అధ్వము**

ఒక ప్రత్యేకచ్ఛందమును ప్రస్తరించుటకు ఎన్ని అంగుళముల పొడవు, వెడల్పుగల స్థలము అవసరమో తెల్పుటకు ఉపయోగించు పద్ధతి 'అధ్వము' అనబడును. ఒక ఛందము సాగుటకు ఎంత వెడల్పు-పొడవుగల మార్గ మవసరమో దీనివలన తెలియును గాన నిది 'అధ్వ' మయినది . 'అధ్వ' మనగా మార్గము.

ఎన్నవ ఛందమును ప్రస్తరించవలెనో, ఆ ఛందముయొక్క సంఖ్యను రెట్టించి, ఒకటి తగ్గించగా మిగిలిన సంఖ్య ఎంతో, అన్ని అంగుళముల వెడల్పు, మరియు ఆ ఛందమందు నిష్పన్నమగు వృత్తముల మొత్తము సంఖ్యను రెట్టించి, ఒకటి తగ్గించగా మిగిలిన సంఖ్య ఎంతో, అన్ని అంగుళముల పొడవు గల స్థలము ఆ ఛందమును ప్రస్తరించుటకు కావలయునని తెలియును.

ఉదాహరణమునకు నాల్గవ ఛందముయొక్క ప్రస్తారమునకు కావలసిన స్థలము తెలిసికొనుటకు :-

ఛందపు సంఖ్య = 4, వృత్తసంఖ్య = 16
వెడల్పు = 4 × 2 ⟶ 8 − 1 ⟶ 7 అంగుళములు)
పొడవు = 16 × 2 ⟶ 32 − 1 ⟶ 31 అంగుళములు.

ఈ 'అధ్వము'నకే, 'అధ్వయోగము', 'అధ్వభాగము' అని నామాంతరములు.

# ఉపయుక్త గ్రంథ-వ్యాససూచి


అనంతుని ఛందము -అనంతుడు
అప్పకవీయము -అప్పకవి
ఆంధ్రమహాభారతము : ఛందఃశిల్పము -డా. పాటిబండ మాధవశర్మ
కవిజనాశ్రయము -భీమన
కన్నడ ఛందోవికాస -డా. డి. ఎస్. కర్కి
కావ్యాలంకార చూడామణి -విన్నకోట పెద్దన
గురజాడ -శ్రీశ్రీ
జనాశ్రయి -జనాశ్రయుడు
తెలుగు ఛందోవికాసము -కోవెల సంపత్కుమారాచార్య
తెలుగులో ఛందోరీతులు -డా. గిడుగు సీతాపతి
తెలుగు భాషలో ఛందోరీతులు -రావూరి దొరసామిశర్మ
నాట్యశాస్త్రము -(అను.) డా. పి. ఎస్. ఆర్. అప్పారావు
పింగళచ్ఛందము -పింగళుడు
రంగరాట్ఛందము -కస్తూరి రంగకవి
లక్షణసార సంగ్రహము -చిత్రకవి పెద్దన
లక్షణసార సంగ్రహము -కూచిమంచి తిమ్మన
వృత్తరత్నాకరము -కేదారభట్టు
సుకవి మనోరంజనము -కూచిమంచి వేంకటరాయడు
సులక్షణసారము -లింగమగుంట తిమ్మన


**వ్యాసములు**


కవిజనాశ్రయము : భీమన ఛందము (ముళ్లపూడి తిమ్మరాజు అభినందన గ్రంథము-1) -రావూరి దొరసామి శర్మ
నన్నయ భారతములోని యతులు (ఆంధ్రపత్రిక, క్రోధన (1925) ఉగాది సంచిక) -డా. చిలుకూరి నారాయణరావు
వచన పద్యము (భారతి, జూన్ 1965) -సంపత్కుమార

# ఛందఃపదసూచి